ప్రథమ ముద్రణ
1989
ద్వితీయ ముద్రణ
1993

ప్రతులు : 1000
© అబ్బూరి ట్రస్ట్
ముఖచిత్రం : చంద్ర
వెల : ~~U. S. Dollars : 10~~ Rs. 30/-

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
విజయవాడ, హైదరాబాదు, తిరుపతి, అనంతపురం,
గుంటూరు, హన్మకొండ, విశాఖపట్నం, కాకినాడ.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
1-1-517/బి/1, న్యూ బాకారం
గాంధీనగర్, హైద్రాబాద్ - 500 380.
ఫోన్లు : 611413, 600547.

ఆంధ్రప్రభ వారపత్రికలో
17-9-1986 నుంచి 21-10-1987
వరకు ధారావాహికంగా
ప్రచురితమైన వ్యాస పరంపర
యథాతథంగా సంకలితం.

అంకితము

## రాచకొండ విశ్వనాథశాస్త్రికి

ఏ జన్మాంతర బాంధవమ్మొ నవసాహిత్య ప్రపంచమ్ము నన్
తేజోమూర్తులమై చరించితిమి, అంతేచాలు, ఈలోన నా
యీజీవప్రద గాథలందు భవదీయేచ్ఛాకృతిన్ నిల్పితిన్
రోజుల్మారిన కాలమందు కవిమిత్రుల్ నిన్ను శ్లాఘింపగన్.

# సూచిక

# హెచ్చరిక

**అసాధారణమైన,** అవశ్యపఠనీయం అనదగిన ఒక పుస్తకాన్ని మీరు ఇప్పుడు చదవడం ప్రారంభించబోతున్నారు. ఔనా? సంతోషం, సంతోషం, ముమ్మాటికీ సంతోషం. కాకపోతే ఒక హెచ్చరిక కూడా! పుస్తక పఠనానికి సంబంధించి, పఠన ప్రక్రియలో పాటించవలసిన నియమ నిష్ఠాదికాలకు సంబంధించి అగ్రశ్రేణి, ప్రపంచ సాహితీవేత్తలలో ఒకరైన ప్రముఖ ఇటాలియన్ మహారచయిత కాల్వినో అత్యంత రసవత్తరంగా సూచించినట్లు "కవన కుతూహలం" అనే ఈ పుస్తకాన్ని మీరు ఆఘ్రాణించ బోయేముందు, లేక ఆస్వాదించ బోయేముందు ఏకాంతం, ఏకాగ్రత అవసరం కనుక, పుస్తకం చేత పట్టుకున్న తర్వాత మీ మనస్సులో ఇతరత్రా మరేవిధమైన ఆలోచనలకు ఎంత మాత్రం అవకాశం ఇవ్వకూడదు. మీరు, మీ పుస్తకం తప్ప మరో ప్రపంచం లేదు. ఉండదు, ఉండకూడదు. ఇబ్బంది కాకపోతే, గది తలుపులు, కిటికీలు మూసివేయడం మంచిది. ఊపిరి ఆడదేమో అంటారా? "కవన కుతూహలం" ఇచ్చే కొత్త ఊపిరి, కొత్త ఉత్సాహం చాలు. పఠన విన్యాసంలో నిమగ్నం కాబోయేముందు, ఒక విధంగా ఇది మీ చుట్టూరా ఒక పంజరం లేక రక్షా కవచం ఏర్పరచుకోవడమే. పుస్తకం చేతపట్టుకుని, మీరు కూర్చున్న గదిలో మీకెదురుగా గోడమీద గడియారం గాని, క్యాలెండర్లు, కన్ను చెదరగొట్టే ఇతర చిత్రాలు, కళాఖండాలుగాని, మీ ప్రక్కన మీరు పుస్తకాలు పెట్టుకునే టేబిల్ మీద సమకాలీన సాహిత్య గ్రంథాలు, కవితా సంకలనాలు, కరపత్రాలు, సాహిత్య సిద్ధాంత రాద్ధాంత రాక్షస గ్రంథాలు గాని ఏవైనా ఉంటే,

వెంటనే వాటిని చేతులతో తాకకుండా క్షణాలమీద అక్కడినుంచి తొలగించడం చాలా చాలా ఆవసరం. ఆధునికాంధ్ర కవిత్వశరీరంలో జ్వరతీవ్రత ఎంత భయంకరంగా ఉన్నదో ప్రత్యక్షంగా మీరు చూస్తున్నదే కనుక, సాహిత్య కర్మాగారాలనుంచి వెలువడుతున్న కవిత్వం అనే రాకాసిపొగ ఎంత బాధాకరంగా ఉన్నదో అనుభవజ్ఞులు ఉద్ఘోషిస్తున్నదే కనుక, ముందు జాగ్రత్త కోసం సవినయంగా ఈ శుద్ధి కార్యక్రమం సూచిస్తున్నాను. పుస్తక పఠనానికి ఉపక్రమించేముందు ఇతరేతర సాహిత్య వాసనలేవి మిమ్మల్ని ముట్టడించకుండా కట్టుదిట్టం చేయాలన్నదే నా తాపత్రయం. మీ గదిలో లేక ప్రక్క గదిలో రేడియో గాని, టి.వి. గాని అల్లరి చేస్తుంటే తక్షణం వాటిని వాగ్బంధనం చేయడం కూడా మరీ మరీ ముఖ్యం. పఠనాధ్యాయంలో ఇది తొలిఘట్టం. రెండవ ఘట్టం పఠనభంగిమ. పుస్తకధారణ ఎలా చెయ్యాలో ఏ భంగిమలో చదవాలో అన్నది ఇందులో ప్రధానాంశం. మహానుభావుడు కాల్వినో. విశ్వవిఖ్యాతుడు ఇటాలో కాల్వినో- అతడు సూచించిన పఠన పూజాది కాలనే ఇక్కడ అన్వయిస్తున్నాను. "కవన కుతూహలం" కేవలం కాల క్షేపార్థం వ్రాసిన గ్రంథం కాదు. అసలు కవిత్వం అంటే? కవిత్వం అంటే కవిత్వమే. కవిత్వం కవిత్వంగా ఉండడమే కవిత్వం. వచన కవిత్వం సంగతి అంటారా? వచన కవిత్వం అనే మాట తప్పు, తప్పు, శుద్ధతప్పు. వచన కవిత్వం కాదు, అది ముక్త కవిత. సాంప్రదాయ శృంఖలాలను ఛేదించుకుని, కవిత్వ లక్షణం, కవిత్వ ప్రయోజనం దెబ్బతినకుండా, కొత్త కంఠంతో, కొత్త భాషలో, కొత్తరూపంలో, కొత్త పంథాలో, కొత్తసంవిధానంలో కవిత్వానికి కొత్తఊపిరి పోయడమే ముక్త కవిత అంటే. ఒక విధంగా అది పునః సృష్టి. గద్యానికీ, పద్యానికీ మధ్యఉన్న సరిహద్దు రేఖను సైతం లక్ష్యపెట్టకుండా ఇష్టారాజ్యంగా విరుచుకు పడడమే, ప్రస్తుతం జరుగుతున్న అక్షర హింసకు ప్రధాన

హేతువు. సాంప్రదాయ కవిత ఇక చెల్లదు. ముక్త కవితకూడా చెల్లకుండా చేస్తే ఎలా? అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు ప్రముఖ కవి, విమర్శకుడు, పండితుడు మాత్రమేకాదు- ఆదునికాంధ్ర సాహిత్య చరిత్రలో ఒకటి, రెండు దశాబ్దాలకు పూర్వం సాహితీ ప్రియులను విశేషంగా ఆకర్షించిన మహోజ్వల ఘట్టానికి ప్రతినిదులైన సాహితీ స్రష్ట లెందరికో ఆయన సుపరిచితుడు శ్రీశ్రీ, శిష్లా, జలసూత్రం, విశ్వనాథ, రాయప్రోలు, కృష్ణ శాస్త్రి, రామకృష్ణారావుగారు, ఆరుద్ర, దాశరథి, తిలక్, బైరాగి, ఏల్చూరి, కుందుర్తి, రామదాసు, రాజశేఖర్, నగ్నముని ఇత్యాదిప్రముఖులెందరితోనో అత్యంత సన్నిహితంగా మెలిగిన విశిష్టవ్యక్తి ఆయన. తెరమరుగున దాగిన సాహితీవృత్తాంతాలనూ, ఆయా కవి ప్రముఖుల జీవితాలలో రసవత్తర సన్నివేశాలను, వచోవైభవ స్మృతి విశేషాలను అనితర సాధ్యమైన రీతిలో గ్రంథస్థం చేశారు. "కవన కుతూహలం" ఘనత అదే. పుస్తక ప్రాశస్త్యాన్ని వివరించాను కనుక పఠనాంకంలో ఇంతకుముందే సూచించిన రెండవ ఘట్టానికి సంబంధించిన ప్రత్యేకాంశాలను విపులీకరిస్తాను. అసలు పుస్తకం మీరు ఎలా పట్టుకుంటారు? ఏ భంగిమలో చదువుతారు? సోఫాలో గాని, కుర్చీలోగాని, సరాసరి నేలమీదగాని కూర్చొని చదువుతారా? లేదా నిల్చుని, లేక పడుకుని చదువుతారా? పుస్తకధారణ సమయంలో కాళ్ళు ముడుచుకోవటంగాని, కాళ్ళుచాపడంగాని, లేక కాలుమీద కాలువేసుకోవటం గాని అలవాటైతే ఫరవాలేదు. అకాండ తాండవ ప్రసక్తిమాత్రం వద్దు. భంగిమ ఏదైనా ఏకాగ్రతకు భంగం వాటిల్లకుండా జాగ్రత్త పడడం ముఖ్యం. మీకు యోగవిద్యలో నమ్మకం, ప్రవేశం ఉన్న పక్షంలో శీర్షాసనం, సర్వాంగాసనం వగైరా భంగిమలను చేపట్టడంలో అభ్యంతరం లేదు. కాకపోతే పుస్తకధారణ ఒక జటిల సమస్య కావచ్చు కనుక, యోగ ప్రక్రియలో పరమోత్కృష్టమైన పద్మాసనం అన్నివిధాలా శ్రేయస్కరమని నా అభిప్రాయం. శుద్ధి కార్యక్రమంలో మనస్సుతో పాటు

శరీరాన్ని కూడా శుచిగా శుభ్రంగా ఉంచుకోవడం ముఖ్యం కనుక, ఉదయం కావచ్చు; మధ్యాహ్నం, సాయంత్రం, లేక అర్ధరాత్రి కావచ్చు- ఏ వేళలోనైనా స్నానాదికాలు నిర్వర్తించుకొని, నిష్ఠాగరిష్ఠులై, పఠనవ్రత దీక్షాబద్ధులై వాగ్దేవి పాదపీఠం ముందు వినమ్రులై పద్మాసనంలో కూర్చొని, పరిశుభ్రమైన చేతులతో పుస్తకాన్ని పట్టుకుని భక్తిప్రపత్తులతో ఒకసారి కళ్ళకద్దుకొని, ఆపైన పఠన కార్యక్రమంలో నిలువెల్లా నిమగ్నం కావడం శుభస్కరం, సర్వవిధాలా ఉత్తమం. ఇది మా గురువుగారు రచించిన గ్రంథం కనుక, ఎక్కడా హద్దుమీరకుండా నా పరిధిలో నేను పుస్తకంలో ఉన్న విషయాన్ని ఉన్నది ఉన్నట్టు పాఠక మహాశయులకు విశదం చేశాను. సమకాలీన కవితా బాధితులకు కొంతవరకైనా ఇది ఉపశాంతి కలిగిస్తుందనడంలో సందేహం లేదు. మీ చుట్టూరా ఉన్న కవితా వాతావరణం ఎంత నిరాశాజనకంగా ఉన్నా, కవితా ప్రపంచమే విచ్ఛిన్నమై పోతున్నా, సాహిత్య శిరోవేదన ఎంత దుర్భరంగా ఉన్నా "కవన కుతూహలం" ప్రక్కన ఉంటే చాలు, భయం నాస్తి అనడంలో ఎంతమాత్రం అతిశయోక్తిలేదు. ఇక ఆలస్యం దేనికి? ఉపక్రమించడమే. "కవన కుతూహలం"తో ఉర్రూతలూగడమే.

**అజంతా**

ఇతరకర్మఫలాని యదృచ్ఛయా
విలిఖితాని సహే చతురానన!
అరసికాయ కవిత్వ నివేదనం
శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ!

# శ్రీరంగం శ్రీనివాసరావు

శ్రీరంగం శ్రీనివాసరావుని యాభయి అయిదు సంవత్సరాల క్రితం వాల్తేరులో మా యింటికొచ్చినపుడు మొదటిసారి చూశాను. అదే మా చిరకాల స్నేహ ప్రారంభం. అతను ఆఖరిసారిగా హైదరాబాదు కొచ్చినప్పుడు నేను ఢిల్లీ నుంచి వచ్చేశానని తెలిసి టెలిఫోను చేశాడు. కుశలప్రశ్న లయింతరువాత "ఇంకా ఎన్నాళ్ళు?" అన్నాను. అతనితో కనిపించినప్పుడల్లా ఆ రోజుల్లో నేనలా అనటం అలవాటు. జవాబుగా "ఈసారి భీమునిపట్నంలో కలుసుకోవటం తప్పదు. నమ్ము" అన్నాడు. అతని కంఠస్వరంలో విషాదం వ్యక్తమయింది.

ఆ రోజుల్లో రాజకీయాల ఊబిలోనించి ఎలా బయటపడాలో శ్రీశ్రీకి తెలియదు. బాధపడేవాడు. మేమంతా ఆప్యాయంగా కలిసి తిరిగే విశాఖ, మదరాసు, తెనాలి, హైదరాబాదు రోజుల్లో అతనెన్నో కలలు గనేవాడు. కవిత్వం గురించి, కవిత్వం కోసం ప్రత్యేకంగా "ధ్వని" అనే పత్రిక నిర్వహించాలని విశ్వప్రయత్నం చేశాడు. యుద్ధపు రోజులు. తగినంత ధనసహాయం లభించింది కాదు. ఆ పత్రిక ముఖపత్రం మీద చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి చేతుల ఛాయాచిత్రం ముద్రించాలని సంకల్పించాడు. అప్పుడు నేను బెజవాడలో ఉంటంచేత ఆ బాధ్యత నా మీద వేశాడు. వైద్యం నిమిత్తం బెజవాడ వచ్చిన శాస్త్రిగారి దగ్గరికి పోయి ఛాయాచిత్రాలు తీయించాను. అప్పుడు నాతోపాటు నీలంరాజు వెంకటశేషయ్యగారూ, మల్లాది ఫణిభూషణరావూ వచ్చారు. తర్వాత వెంకటశాస్త్రిగారిని స్వయంగా చూడాలనీ, శాస్త్రిగారు మళ్ళీ బెజవాడ వస్తే తనూ వస్తాననీ శ్రీశ్రీ రాశాడు. అలానే కొన్నాళ్ళకు వెంకటశాస్త్రిగారు

బెజవాడకు మళ్ళీ రావటమూ, శ్రీశ్రీని పిలిపించి బందరు కాలవ పక్కన ఉన్న ఆయన వసతిగృహానికి తీసుకుపోటమూ జరిగింది.

వెంకటశాస్త్రి గారంటే శ్రీశ్రీకి అపార గౌరవభక్తు లుండేవి. శాస్త్రిగారితో పరిచయమయిన తరువాత శ్రీశ్రీ కొంచెం తడబడుతూ "కవిత్వం మీద తమ అభిప్రాయమేవి" టన్నాడు. అప్పటికే వయో వృద్ధులూ, అస్వస్థులూ అయిన శాస్త్రిగారు మందహాసం చేసి "నేను కవినేనా?" అని అడిగారు. తనలా అడగటంతో ఏమన్నా పొరపాటు చేశానా అని సందేహిస్తూ "మీరుకాకపోతే ఈ ఆంధ్రదేశంలో మరెవ్వరండీ కవి?" అన్నాడు శ్రీశ్రీ గట్టిగా. శాస్త్రిగారు నవ్వారు. "కవిత్వం అంటే ఏదికాదో చెప్పటం సులభం కానీ, ఏది కవిత్వమో చెప్పటం కష్టం.... మన కవిత్వానికి లక్షణం కంఠవశం కాగల రచన. మననం చేసుకోవ టానికి అనువయిన పద సంచయనం చెయ్యాలి. కర్ణపేయంగా ఉండాలి. రసనాగ్ర నర్తకి! అంతవరకూ నేను సాధించాను." శాస్త్రిగారు తనలో తాను నవ్వుకుంటూ పడకకుర్చీమీద వెనక్కి తల పెట్టారు. అకస్మాత్తుగా ముందుకు వంగి "అయితే అంతమాత్రాన అది కవిత్వం అయిపోదు...." శాస్త్రిగారెవర్నో లోపలనుంచి పిలిచారు. మేము లేచాం. శ్రీశ్రీని చూస్తూ శాస్త్రిగారన్నారు—"నువ్వు చెప్పు కవిత్వం అంటే ఏఁవిటో....అంత సులభఁవటయ్యా? అసలు నిర్ణయించేవారే లేరే ఈ దేశంలో - నీకు నేనూ నాకు నువ్వూ తప్ప.... అంచేతనే కాబోలు మనం అనువాదాలూ, అనుసరణలతో ప్రారంభించాం....పోయిరండి" అన్నారు.

ఆనాటి శాస్త్రిగారి నిర్వచనాన్ని శ్రీశ్రీ నాతో జీవితాంతం దాకా ప్రస్తావించేవాడు. ఈనాటి 'ప్రయోగాత్మక' కవితతో కంఠవశం కాగల లక్షణం లోపించిందని శ్రీశ్రీకి తెలుసు. అంచేతనే అలాంటి కవిత్వానికి భవిష్యత్తు సంకోచప్రదమనేవాడు. అంతేకాదు, ఇతర భాషల్లోంచి కవిత్వాన్ని అనువదించటం కూడా తెలుగు సాహిత్యాభ్యుదయానికి ముఖ్యాంశం అని అంటూ "శాస్త్రిగారూ అలా అన్నారే!" అనేవాడు.

# బోదురుకప్ప

గాలి లేని రాత్రిపూట ఏదోపాట ....
— దట్టపుటాకుల కత్తిరింపు బొమ్మలకి
జిలుగు మలామాలు సింగారిస్తున్నాడు చంద్రుడు.
ఓ పాట; ప్రతిధ్వనిలో అకస్మాత్తుగా, వడిగా,
పూడ్చబడి, అల్లక్కడ, ఆ బోలెడు బురద కింద
— ఆగింది దా! అక్కడే ఉంది, అదృశ్యంగా ....
— బోదురుకప్ప! -అదుగో నీడలో! నా దగ్గరా జడుపు?
నీ నమ్మకమైన కసాయిని కానూ నేను!
చూడండతణ్ణి, క్షౌరమైన కవిని, రెక్కైనా లేదు,
బురదకి పుట్టిన కోకిల .... దారుణం!
— పాడుతున్నాడే అరే! దారుణం!! ఏం?
ఎందుకని దారుణం?
బాగా చూశారా అతని ప్రకాశించే నేత్రాల్ని?....
ఊహుఁ! నిష్క్రమించాడు, చల్లబడి, తన రాతి కిందికి
గుడ్‌నైట్ - మీరు విన్న బోదురు కప్పని నేనే.

అనువాదం : శ్రీశ్రీ

ట్రిస్టాన్ కోర్బియేర్ (1845 - 1875)
(T.S. Eliot ప్రోద్బలించిన కవి. ఔను, జననం
ఫ్రాన్సులోనే. ఔను—క్షయ రోగంతోనే మరణం.)
TRISTAN CORBIERE

(Original metre - inverted sonnet i.e sestet first and then octet)

1 9 poet de tondu (క్షౌరమైన కవి)

1 10 rossingnol de la boue

- nightingale of the mud - బురదకి పుట్టిన కోకిల.

# బెల్లంకొండ రామదాసు

ఓ రోజు అతని సెలవు రోజున నేను సమయానికి గదికి రాలేక పోయాను. అతనే రోజంతా ఏకగ్రీవంగా కాలక్షేపం చెయ్యవలసివచ్చింది. నేను పొద్దుపోయి గదికొచ్చాను. బాగా చీకటి పడింది. మా గది మేడమీద ఉంది. ముందు వరండా. మెట్లెక్కి వరండాలోకి కాలు పెట్టాను. గది గుమ్మం దగ్గర తలుపు కానుకొని రామదాసు చీకట్లో కూచుని ఉన్నాడు. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. నాకు భయం వేసింది. లోపలికి అడుగు పెట్టలేకపోయాను. కాస్సేపు ఆగి "రామదాసూ!" అని పిలిచాను. తలెత్తి చూశాడు. కళ్ళు తుడుచుకుంటున్నాడు. నా మనస్సు నా మనస్స యింది. "ఏమిటీ గొడవ?" అన్నాను. అతను మాట్లాడ్లేదు. నేను లోపలికి పోయి దీపం వేశాను. వెలుతురు కనిపించగానే ముఖం గుమ్మం వేపుకు తిప్పాడు. నేను గుమ్మం దాటి వరండాలోకివచ్చి నిలబడ్డాను. రామదాసు కూచున్నవాడు అకస్మాత్తుగా లేచి నా దగ్గరకొచ్చి నా చెవి దగ్గర మెల్లిగా అన్నాడు: "వరద రాజేశ్వరరావు, నువ్వు భయపడ్డావా? .... ఇవాళ నాకు ఆత్మప్రబోధం అయింది. నిజంగా ఏడుపొచ్చి ఏడ్చాను.... ఒంటరితనం, ఒంటరితనం — బతుకంతా ఒంటరితనం — నాకు విరక్తి పుట్టింది ఈ ప్రపంచంమీద—బతుకంతా కన్నీళ్ళమయం. కన్నీళ్ళలోనే మన తాపోఫశమనం. బుద్ధుడికూడా ఇదే అనుభవం అయి ఉంటుంది. నిజం, వరద రాజేశ్వరరావు! మనం సుఖం, ఆనందం అంటామే—అవన్నీ దుఃఖంలో నించీ, బాధలో నించీ వచ్చేవే. చెబుతున్నాను విను" అన్నాడు. ఊరుకోక, నేను ఆలోచిస్తున్నా నన్నాను. అంతే. అతని సహజ ధోరణిలో ఒక పెద్ద నవ్వు నవ్వేశాడు. నలభై మూడేళ్ళ కిందటి మాట.

అతని కవిత్వం చదువుతున్నప్పుడల్లా నాకా దృశ్యం ఇప్పటికీ గుర్తుకొస్తుంది.

నేను 'ఆంధ్రప్రభ' లో ఉద్యోగం మానేసిన కొన్నాళ్ళకు రామదాసు అదే పత్రిక సంపాదక వర్గంలో చేరాడు. అప్పుడు ప్రపంచ యుద్ధం ప్రచండంగా సాగుతోంది. నేను ట్రిప్లికేనులో బిగ్ స్ట్రీటు కానుకున్న వీథిలో ఓ మేడలో ఓ గదిలో ఉండేవాణ్ణి. ఆ ఇంటి పేరు రుక్మా విల్లా. చాలా పాతది. ఆ ఇంటాయన ముదలియారు. అనాది నుంచీ నాలాంటి తెలుగు బ్రహ్మచార్లే ఆ ఇంట్లో గదుల్లో అద్దె కుండేవారట. అందులో ఆ రోజుల్లో ఆయనకు గుర్తున్న పేర్లలో రాయప్రోలు సుబ్బారావు, బసవరాజు అప్పారావు, గంటి సూర్యనారాయణ శాస్త్రి ప్రభృతుల పేర్లు చెబుతుండేవాడు. నిజం నాకు తెలియదు కనక విని గర్వించేవాణ్ణి.

ఓ రోజున రామదాసు 'ఆంధ్రప్రభ' కార్యాలయం వెనుక ఎలియట్సు రోడ్డులో కనిపించాడు. నా గదిలో వచ్చి నాతోపాటు ఉంటానన్నాడు. సరే నన్నాను. నేను మరో ఉద్యోగంలో చేరటానికింకా వ్యవధి ఉంది కనక విచ్చలవిడిగా రోజులు గడిపేవాణ్ణి. మాంబళంలో చాలామంది స్నేహితు లుండటంచేత వాళ్ళతో సాయంకాలాలు గడిపి, తెల్లవారగానే రుక్మా విల్లా కొచ్చేవాణ్ణి. ఆ సమయంలో రామదాసు ఉద్యోగానికి తయారవుతుండేవాడు. తన విరామ దినంనాడు రోజు రోజల్లా తనతో గడపాలనేవాడు. అప్పుడు ట్రిప్లికేను వదిలేవాళ్ళం కాదు. సాహిత్య చర్చలూ, కావ్య పఠనమూ చేసేవాళ్ళం.

రామదాసు సామాన్యంగా ఎవరితోనూ వ్యక్తిగతంగా స్నేహం చేసేవాడు కాదు, ఏ కొద్దిమందితోనో తప్ప. ఎవరికన్నా నేను పరిచయం చేస్తే—అందులో శ్రీశ్రీ, రుక్మిణీనాథశాస్త్రిలాంటి వారుండేవారు—వారిని దూరం నుంచే అభిమానించేవాడు. అతని కౌమార దశలో ఏల్చూరి సుబ్రహ్మణ్యం, కుందుర్తి ఆంజనేయులు, అనిసెట్టి సుబ్బారావూ సన్నిహితులుగా ఉండేవారు.

# తాగు తాగు చెల్లెలా!

తాగు తాగు చెల్లెలా చల్లని కన్నీళ్ళు!
తాగు తాగు చెల్లెలా మెల్లని కన్నీళ్ళు!
నా నోట పాట ఆరిపోకమును పె
నా తోట పూలు రాలిపోక మును పె
నా ఎడద పడవ మునిగిపోక మును పె
నా కనుల నీడ కరిగిపోక మును పె
తాగు తాగు చెల్లెలా చల్లని కన్నీళ్ళు
తాగు తాగు చెల్లెలా మెల్లని కన్నీళ్ళు
ఇట తిరిగిన వెన్నో విషాద వసంత చక్రాలు
ఇట కరగిన వెన్నో కల్యాణ కర్పూర దీపాలు
ఇట నడచిన వెన్నో మానవాన్వ పాన్థ మలిన పాదాలు
వెర్రిగా వీచినవి మారుతాలు ఏడ్చినవి రుతాలు
కదిలినవి సైన్యాలు మెదలినవి దైన్యాలు
మూల్గినవి లోకాలు కాలినవి కాలాలు
జరిగినవి హవనాలు సవనాలు కవనాలు
ఇది విధి వేశ్య నిదురించు విధుర శయ్య
ఇట లేదు జీవి! ఇట లేదు పూవు!
ఇది మహాభయద చరమ శ్మశాన స్థలి
ఇట లేదు జీవి! ఇట లేదు పూవు!
తాగు తాగు చెల్లెలా చల్లని కన్నీళ్ళు
తాగు తాగు చెల్లెలా మెల్లని కన్నీళ్ళు
నా నోట పాట ఆరిపోక మును పె

నా నీడ నినువీడి కరిగిపోక మునుపె
నా ఎడద పడవ మునిగిపోక మునుపె
పాడు పాడు చెల్లెలా పచ్చని ఒక పాట!
పాడు పాడు చెల్లెలా పల్చని ఒక పాట!

## త్రిపుట

జీవితంలో మూడు పేజీలు

తొలిపేజీ-

నిన్న :

నిరుడు మనం కలుసుకున్న రోజుల్లో
నింగి నిశ్చలంగా ఉండేది
నిప్పు మండుతూ ఉండేది
నీతి నిండుగా ఉండేది
కాలం కళ్ళ గంత కట్టలేదు
జీవితం హాలాహలం భుజించలేదు
గాలి చల్లగా వీచేది
పైరు పచ్చగా ఉండేది
శాంతి వివస్త్రగా వీధి వెంట
నడిచింది లేదు
కాంతి కట్టుబట్ట విప్పి
శూలనాట్యం సలిపింది లేదు
ఉక్కపోసిన గదిలో
కూచుని చిక్కుల

జడలల్లింది లేదు
మనసు చెట్టుకు
ఉరితాడు కట్టి
మనిషిని ఉరితీసింది లేదు
వేశ్యమాత పోలి
పుక్కిట తాంబూలం లగించి
గడపలో ఆసనం సేవించి
పాపాల జపమాల
తిప్పింది లేదు
స్మృతి విస్మృతుల మధ్య
గల అవధ్య రథ్య
ముళ్ళ తీగల కంచె పట్టుకుని
ఖైదీలా నిల్చింది లేదు
వాసన కొట్టే
మాసిన అంగోస్త్రం కట్టుకుని
మాయ మాటల
విస్తళ్ళ కింద వడ్డించింది లేదు
మల్లెపందిరి కింద
ఉల్లి పొరలాంటి
చీర కట్టి కనులార్చె
కామిని కని

కర్తవ్యం తోచక
మునిలా ముడుచుకుంది లేదు
అరవిచ్చిన కనుల

గులాబీల చాటున
చితికత్తులు తళుకుమన్నది లేదు
అమ్మని మారుపేరు పెట్టి
తనివితీర తిట్టుకుంది లేదు
అప్పుడు ఆకాశం పచ్చని పరుపు
అప్పుడు బతుకంతా ఎఱ్ఱని ఎరుపు
నిరుడు మనం కలుసుకున్న రోజుల్లో
నింగి నిశ్చలంగా ఉండేది
నిప్పు మండుతూ ఉండేది
నీతి నిండుగా ఉండేది
గాలి హాయిగా వీచేది
పైరు పచ్చగా ఉండేది
పచ్చని సాయం వెచ్చని పాటపాడేది
ఆలయంలో పాట హాయిగా వచ్చేది
కాలం కళ్ళ గంత కట్టలేదు
జీవితం హాలాహలం భుజించలేదు
గగనం గాజుకన్ను కాలేదు
ఎదలో భయం లేదు
కథలో రయం లేదు
అంతా హాయిగా ఉండేది
అవని గడ్డిపూవులా కన్నుగీటేది
రోజులు చల్లగా గడిచాయి
గాజులు మెల్లగా మ్రోగాయి
కీలుగుఱ్ఱం
ఊహలోనే ఊరు చేరింది.

ఇంకా జ్ఞాపకం నాకు
నీ కంఠం మైదానంలా
పరుచుకొని
పరిమళించిన పాట
పచ్చని పచ్చిక తివాశీపై
నిదురించిన నిండురాత్రి—
ఇంకా జ్ఞాపకం నాకు
మనం ఊగిన
ఊహల ఊయల
ఇంకా జ్ఞాపకం నాకు
నీ మాసిన అరకన్నుల విరసిన విరజాజి జాలి
నీ పైట తొలగించిన చిన్నారి చిరుగాలి
నీ అదరిన
ఉరోజాల గులాబీల గుత్తి
ఇంకా జ్ఞాపకం నాకు
విధి దించిన తెరచప్పుడు
ఇంకా జ్ఞాపకం నాకు
నీ కిచ్చి నే తప్పిన
వాగ్దానాల వరుస
ఇంకా జ్ఞాపకం నాకు-
పానానికి
వివశగానానికి
వశుణ్ణి కానన్నాను
నీ జ్ఞాపకాన్ని

వడగాల్పుల వాడనివ్వనన్నాను
జీవితం వేరు వేరు
గోరీల్లో పూడ్చింది మనల్ని

**నేడు :**

నేడు మనం కలుసుకున్న క్షణంలో
రణం, భయం, భ్రాంతి దాగి ఉంది
అశాంతి అంబరం నిండా మూగి ఉంది
ఆకాశం అలసిన వేశ్యలాగ
వెల్లకిలా పడుకుంది
భయం హయంలాగ
పరుగెత్తుతోంది
పాపం పట్టుపరుపులా
పరుచుకుంది.

కాలం కనుపించని గోడ
నీవు నన్ను గుర్తించవు
నేను నిన్ను గుర్తించను
నీవు నన్ను పిలుద్దామనుకుంటావు
నా పేరు జ్ఞాపకం రాదు
నేను నిన్ను పిలుద్దామనుకుంటాను
నీ పేరు జ్ఞాపకం రాదు
నీ గొంతు మారింది
నీ రూపు మారింది
పూర్వం నీ గొంతు విన్నాను

అది ఎంతో సన్నని నూలుపోగు
ఇప్పుడు వింటున్నాను
ఎన్నో గొంతులు నీ గొంతులో గొంతు
కూచున్నాయి
అదివరకు నీ ముఖం చూచాను
సుఖం ఉండేది
ఇప్పుడు నీ ముఖం చూస్తున్నాను
ఎన్నో ముఖాలు అద్దిన
సుఖాల మృత్యుముద్రలు
భద్రంగా కూచున్నాయి
అదివరకు నీ జుట్టు తాకాను
సన్నని సంగీతంలా సాగేది
ఇప్పుడు నీ జుట్టు చూస్తాను
సమస్యలా చిక్కుపడింది
పగిలిన పడవల్లా జడలు కట్టింది
అదివరకు నీ చూపులు చూచాను
అవి ఏమీ ఎరుగని పావురాళ్ళు
ఎగిరేవి

ఇప్పుడు నీ చూపులు చూస్తున్నాను
నన్ను చూస్తూ నన్ను చూడవు
నిన్ను సమూహం
నన్ను సంగ్రామం
ఆక్రమించుకుంది
నీవు నన్ను గుర్తించవు

నేను నిన్ను గుర్తించను
నిన్ను చూడాలనుకుంటాను
కళ్ళలో గుడ్డి ముళ్ళు మొలిచాయి
నిన్ను స్పృశించాలి
చేతులు కనిపించవు
నీవు నా పక్కనే ఉన్నావు
మనమధ్య మైలురాళ్ళకు అందని దూరం ఉంది
నదిలో రెండు శవాలు
అలా కలిశాం.

రేపు :

రేపు మనం కలుసుకోం బహుశా
బహుశా ఏమిటి?
బహుశా నిశ్చయంగా!
నేను వెడుతున్నాను
నిరుత్తరంగా నిల్చున్న నింగిలోకి
నిశ్చల నిశ్శబ్దంలోకి
నిరాశలోకి, నిరీహలోకి
నిప్పులేని తప్పులోకి
పాడుబడిన గుడిలోకి
నిశీధం పైట చెరుగులోకి
నీవు వెడతావు
గుడిసెలోకి
నులకమంచం వాల్చుకుంటావు

గుడ్డిదీపం వెలిగిస్తావు
రిక్షా ఆగింది
గంట మోగింది
బేరం కుదిరింది
నీ గొంతు గుడ్లగూబ వినిపిస్తూనే ఉంది
ఆవులిస్తావు
కళ్ళు మూస్తావు
వళ్ళు విరుచుకుంటావు
నమస్తే.

బెల్లంకొండ రామదాసు 1954

# దేవరకొండ బాలగంగాధర తిలక్

**1962** ప్రాంతం. అమెరికా నుంచి తిరిగి వచ్చేశాను. చైనాతో యుద్ధం ఆరంభమైన రోజులు. హైదరాబాదు పోయి అక్కణ్ణించి విజయవాడ వెళ్ళాను మిత్రులను చూడటానికి. నేనూ రామదాసూ విజయవాడ పూర్వపరిచిత ప్రదేశాల్లో నడుస్తున్నాము. హఠాత్తుగా నాకు రైల్వే స్టేషను గుర్తుకొచ్చింది. రామదాసుతో, అక్కడికి పోదాం పద, అజంతాకు అక్కణ్ణించే ఫోను చేద్దామన్నాను.

రైల్వే స్టేషననగానే ఎన్ని జ్ఞాపకాలు? వెంకటచలం గారితో అక్కడ ఎన్ని గంటలు గడిపానో - ఆయన మాట్లాడుతుంటే వింటూ. చింతా దీక్షితులు, నండూరి సుబ్బారావు - అలా ఎందర్నో రైలెక్కించటానికి పోయి అక్కణ్ణే కాలక్షేపం చేసేవాళ్ళము. అలాగే మల్లాది రామకృష్ణశాస్త్రిగారితో పాటు రెండు మూడేళ్ళు రోజూ స్టేషనులోనే సాయంవాహ్యాళి. ఆ రోజుల్లో విజయవాడ స్టేషను మాకు సాంస్కృతిక కేంద్రం.

నేనూ రామదాసూ ప్లాటుఫారం మీద నడవటం ప్రారంభించాము. సాయం సమయం. కవిత్వం గురించి చర్చిస్తున్నాము. హఠాత్తుగా ఒక వ్యక్తి దాసును పేరుతో పిలిచాడు. ఆకర్షవంతమయిన విగ్రహం. మా వయస్సు. నన్నతనికి దాసు పరిచయం చేశాడు. అతడు మహదాశ్చర్యంతో, పరమానందంతో కరచాలనం చేశాడు. అతన్ని అదే చూడటం. అంతకుముందు మా ఇద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచేవి. ముఖ పరిచయం లేదు. అతనే దేవరకొండ బాలగంగాధర తిలక్. అతను తణుకు పోతున్నాడు. మేం తటస్థపడగానే మాతోపాటు మా గొడవల్లో పడిపోయాడు. నేటి కవ్వితం భవిష్యత్తెలా ఉంటుంది అని మా బాధ. శ్రీశ్రీ గురించి నన్ను చెప్పమన్నాడు తిలక్. నేను తటపటా

యిస్తున్నాను. దాసు నవ్వుతూ మీరే చెప్పండి అన్నాడు. తిలక్ మందహాసంతో—

అతని శైలి శైలూషి
ప్రజా శ్రేయోభిలాషి!

అన్నాడు. రామదాసు పూర్తి చేశాడు—

అబ్బూరి అతని గురువు
శీతచ్ఛాయా తరువు!

నాకూ తెలుసు, బాగా చెప్పావన్నాడు తిలక్.

ఆ రోజుల్లో తిలక్‌కీ నాకూ, కొంచెంగా రామదాసుకూ అవినాభావ సంబంధం ఒకటుండేది. నేను యం. యన్. రాయ్‌గారి ప్రత్యక్ష శిష్యుణ్ణి. తిలక్ ఏకలవ్యుడు. దాసుకి రాయ్‌గారంటే గౌరవం. మా ముగ్గురికీ అభ్యుదయ కవిత్వం అన్నమాట ఎబ్బెట్టుగా తోచింది. కవిత్వం ఉంటే చాలు, అది 'అభ్యుదయ'మా కాదా మాకు పట్టింపు లేదు. అభ్యుదయ కవులకు 'అభ్యుదయమే' ప్రధానంకాని 'కవిత్వం' ప్రధానంగా తోచటం లేదన్నాడు తిలక్. కవితా స్వరూపం మన తరంలో మారుతున్న సూచనలున్నాయికనుక మనమీదా వాటి ప్రాబల్యం ఉంటుంది. తత్కారణంగా ప్రస్తుతం ప్రచారంలోకి వస్తున్న ప్రక్రియలకు చిరస్థాయి ఉండదేమోనని అతని అనుమానం. నేనూ, దాసూ తిలక్‌తో ఏకీభవించాము. ఎనిమిది తొమ్మిదివందల సంవత్సరాల తెలుగువాఙ్మయం యేం మారినట్లు! స్వచ్ఛంద కవిత్వానికి లక్ష్యమేకాని లక్షణం లేదనుకునేవారిపట్ల మనసానుభూతి చెప్పవలసి ఉంటుంది. వ్యవహారిక భాషకు వ్యాకరణం ఉండదూ?

ఇవన్నీ తిలక్ ప్రాసంగిక వచనాలు. మేం ముగ్గురం కాలాన్ని మరిచిపోయి రాత్రల్లా స్టేషన్లో గడిపాము. మర్నాడు పొద్దున అతను

తణుకు వెళ్ళాడు. వెళుతున్నప్పుడు నన్ను చూస్తూ 'మీరు ఢిల్లీలో ఉంటారు. ఇక్కడ ఎవరన్నా చచ్చినా ఆ వార్త మీకందదు. మళ్ళీ కలుస్తామో లేదో. జ్ఞాపకం ఉంచుకోండి' అన్నాడు.

అలానే అతని మరణవార్త ఓ వారపత్రికలో చదవాల్సొచ్చింది. ఇప్పటికీ ఆనాటి వీడ్కోలు జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా కళ్ళు చెమ్మగిలుతాయి.

* * *

తిలక్‌ని నా దృష్టికి మొదటిసారిగా తెచ్చినవాడు పాలగుమ్మి పద్మరాజు. తిలక్ అంటే పద్మరాజుకెంతో అభిమానం. ఉత్తరోత్తరా మంచి కవిత్వం రాయగల శక్తి కలవాడని విశ్వసించేవాడు. ఆ రోజుల్లో తిలక్ నాలాగే సాంప్రదాయక ఛందస్సులో పద్యాలు రాసేవాడు. అతని రచనల్లో కృష్ణశాస్త్రి, విశ్వనాథ ప్రభావం నాక్కనిపించేది. అయినా పద్యాలల్లడంలో చాతుర్యం సాధించాడనే భావం నాక్కలిగింది. తరవాత మాత్రా ఛందస్సుని అతనితోపాటు కొందరం మే మాశ్రయించాము.

తిలక్ ఏ ప్రక్రియ పట్టినా తత్ప్రయోగంలో సత్వర ప్రావీణ్యాన్ని ప్రదర్శించేవాడు. అతను కవిత్వాన్ని ఆరాధించాడు. నేటి సాహిత్యంలో ప్రవేశించిన వాదాలూ, నినాదాలూ అతను కూలంకషంగా పరిశీలించాడే తప్ప వేటినీ ఆమోదించలేదు, స్వీకరించనూ లేదు. అయినా కొంతమంది అతన్ని "మావాడే" నని అతని మరణానంతరం బేషరతుగా తమలో కలిపేసుకున్నారు. అతను చైనామీద రాసిన గీతాలు అతని పద్య సంకలనంలో చోటు చేసుకోలేకపోయినాయి. అతని పద్యాలూ అంతే! పద్య రచన "సామాజిక స్పృహ" లేని వాళ్ళూ, "సాహిత్య ప్రయోజనం" తెలీని వాళ్ళూ రాస్తారు కాబోలు!

తిలక్ స్వయంకృషితో, స్వయం ప్రతిభతో ప్రపంచ సాహిత్యాన్ని అధ్యయనం చేసినవాడు. అతనలా చెయ్యడానికి కారకుడు పాలగుమ్మి పద్మరాజు. పద్మరాజు బహుముఖంగా అతన్ని సాహిత్య వ్యవసాయంలో ప్రోత్సహించినవాడు. పద్మరాజు తమ్ముడూ, ప్రసిద్ధ సంగీత విద్వాంసుడూ అయిన విశ్వనాథం తిలక్‌కు పాఠశాలలో సహాధ్యాయి. విశ్వనాథను ఆరాధిస్తూనే పాలగుమ్మి విశ్వనాథంతో ఒకసారి అన్నాడట: "విశ్వనాథ ఎంత వెనక్కి చూస్తే అంత వెనక్కి వేదకాలం పోతోంది" అని. అంత మాత్రాన దేనినీ అతను ద్వేషించలేదు. పైపెచ్చు 'తన దైన అనుభూతి తనది కాన' అన్న విశ్వనాథ సూక్తితో ఏకీభవించాడు.

తిలక్ ఎక్కువగా VERSE LIBRE రాశాడు. "వచనకవిత్వం" అన్న సమాసం అర్థ రహితం అని మాలో కొంతమంది భావించేవాళ్ళము. ఒకసారి అతనికో ఉత్తరం రాస్తూ 'వచన కవిత్వం మిల్లు ఖద్దరు లాంటి' దని ప్రస్తావించాను. ప్రత్యుత్తరం రాస్తూ అంత చక్కని పదం తనకి తట్టనేలేదని రాశాడు!

ఒకసారి ఢిల్లీలో పద్మరాజు మా యింటికి వచ్చినప్పుడు తిలక్ పద్యాల్ని కొన్ని రాసుకొచ్చి ఇచ్చాడు. ఇన్నాళ్ళదాకా నా దగ్గర ఉన్నాయి.

"చేదు నిజమటంచు శ్రీశ్రీ వచించెను
తీయనంచు నొకడు తిరిగి పలికె
నిజము లేదు నీడయే తప్పించి
నలుపు తెలుపు మధ్య తలుపు నిజము!"

అదో పద్యం. మా నాట్యగోష్ఠి ఉద్యమం కోసం ఈడిపస్‌ని తెలుగులో అనువదింప ప్రారంభించాడు. అతను పూర్తిచేస్తే మా నాన్న గారు ఆ నాటకాన్ని స్వయంగా ప్రయోగించి ఉండేవారు. ఢిల్లీలో కూడా

ప్రదర్శించేవారు. ఆ సందర్భంలో తిలక్‌ను ఢిల్లీ పిలిపించి ఉండేవాణ్ణి. అయితే అనువాదాన్ని కొంచెం మొదలుపెట్టి హఠాత్తుగా గభాలున తలుపు తెరుచుకొని వెళ్ళిపోయాడు.

## భరతవాక్యం

సుందర స్వప్నాల స్వర్గాల మేడమెట్ల నుండి
వాస్తవికతా శిథిల బధిర రుధిర కూపానికి
హఠాత్ పతితుడనైన నాకు తెలుసు
ఆల్పమని నీవు అల్లిన గొలుసు.
మానవుడై నీవు చాచిన ప్రేమైక హస్తాన్ని
దానవుడై వాడు నరికిన చరిత్ర సమస్తాన్ని
పొంచి చూచిన నాకు తెలుసు
వంచిత మని మానవ మనస్సు.
నీ నిరంతర తపస్సు ప్రసరించిన
        విద్యుదావేశ తంత్రులు తగిలి రగిలి
నీ పాత తాటి యాకుల ఇల్లు
        తగులబడి బూడిద మిగిలి
నిలువ నీడలేని నిన్నూ నాకు తెలుసు
నీ మీదకే గురిపెట్టబడింది విధి ధనుస్సు.
కాదు ఇది నీ దేవీ పూజాపీఠ
        మమర్చిన శుభ గృహాంగణము
పెద్దపులులు కొండ చిలువ లెలుగులు

తిరుగు మహారణ్యము
ఒంటరిగాడవని నాకు తెలుసు
అందుకే వీళ్ళ కింత అలుసు.
స్వార్థం ద్వేషం క్రౌర్యం వినా జీవితం లేదసలు
నాగరికత బండరాతి కొన తగిలి
చిల్లుపడింది నీ నొసలు
గాయం మానదని నాకు తెలుసు
గేయం ఇక ఎవ్వరూ వినరని నాకు తెలుసు.
ఇంతవరకు సత్య శాంతి సౌందర్య
సంగీత గీత మాలపించావని
ఇపుడింక వ్యథా చిహ్నితమైన
నీ కనుల కింద నలుపు చార చెరగదని
నీలాంటివాణ్ణి నాకు తెలుసు
నిద్రలోనే కలలకి సొగసు —

## శవం

ఈశవం చాలా దుర్మార్గపు శవంలా ఉంది
ఇది సరిగ్గా యుద్ధ విరమణ రేఖ మీద వచ్చింది
మనందరికీ చచ్చే చావు వచ్చింది
మంచులో నాని నాని మాడి మాడి రూపం పోయింది.
మంచులో తడిసిన యూనిఫారమ్ని
నక్కలు ముక్కలు చేశాయి
మరెవ్వరి దీ

సోల్జరు శవం
డెమోక్రసీదా? సోషలిస్టు కేంపుదా?
ఇంపీరియలిస్టుదా?
వీడి పెళ్ళాంకి వీడి ఆనమాలు తెలుస్తుంది
వీడి పెళ్ళామెవరో ఎలా తెలుస్తుంది?
వీణ్ణి ఏ సైనిక గౌరవాలతో, ఏ దేశ నినాదాలతో
తగలెయ్యాలో, పాతిపెట్టాలో ఎలా తెలుస్తుంది?
ఒకటే మార్గం ఉంది
అన్ని దేశాలలో ఏడుస్తూన్న
కొత్త కొత్త విధవల్ని తీసుకురండి
ఐడెంటిఫికేషన్ పెరేడ్ పెట్టిస్తాను
యు యన్ ఓ పీస్ కమీషన్ చైర్మన్ గారూ!
భయపడకండి!....
ఇదేం కష్టం కాదు వినండి
ఇదంతా తద్విధవల కన్నీటితో తడై బురదై
పోతుందని భయపడకండి!
నెత్తురు వరదల్ని చూసిన మనకి
కన్నీటి వాన లెక్కా? జమా?
బాల్చీలు సిద్ధం చేయిస్తాను నేను
విధవల్ని వరుసలో నిలబెట్టండి మీరు!
ఒకవేళ వీడొక పెళ్ళికాని
బ్రహ్మచారైతే ఎలాగ?
చచ్చాంరా బాబూ!

బాలగంగాధర తిలక్
1954

# పాలగుమ్మి పద్మరాజు

చలియా వెన్నెల వెల్లువారిన క్షపా
సౌందర్యమా నిండుటా
కలియా రానికవోష్ణ బాలమసృణా
ర్కస్పర్శకై కోర్కెయా
నిలువెల్లన్ పులకించు ప్రాకృతకలా
నిర్వేదమా మ్యావుమ్యా
వుల మా వెంపుడు పిల్లి రేయి కొన కూ
ర్పుల్ నేర్పునా మ్రోతలోన్....

ఈ పద్యం చదువుతున్నది ఓ పధ్నాలుగేళ్ళ కుర్రవాడు. అతని వెనక ఆ యీడువాడే మరో కుర్రాడు నిలబడి ఉన్నాడు. పద్యాన్ని వింటున్నది కడియం గ్రామంలో సొంత భవంతిలో చిన్న తివాసీ మీద కూచున్న శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు. కుర్రవాళ్ళిద్దరూ కొవ్వూరు నుంచి శాస్త్రిగారి దర్శనార్థం వచ్చారు అతి ప్రయాసపడి.

కుర్రవాళ్ళిద్దరూ శాస్త్రిగారింటి మొగసాలలో అడుగుపెట్టారో లేదో లోపల మరెవ్వరో పద్యాలు చదువుతున్నారు. మధ్య ఆపి శాస్త్రిగారు 'ఏవయ్యా! ప్రపంచంలో ఎన్నో వృత్తులుండగా అవన్నీ మానేసి కవిత్వాన్ని ఎందుకు చేపట్టావయ్యా? ఇహ ఇది మాని మరేదన్నా వృత్తి చూసుకో'మంటూ సెలవిచ్చారు. బయట వరండాలో నిలిచి వింటున్న కుర్రవాళ్ళిద్దరికీ ముచ్చెమటలు పోసినాయి. లోపల పద్యాలు చదువుతున్న మనిషి తలవంచుకుని వెళ్ళిపోయాడు. తరువాత శాస్త్రిగారు ఆ

పద్నాలుగేళ్ళ కుర్రవాడు చదివిన పద్యం విని 'నువ్వు కవిత్వం చెప్ప గలవు, నీకు సామర్థ్యం ఉంది పో' అన్నారుట. ఆ కుర్రవాడి పేరు పద్మరాజు, ఇంటి పేరు పాలగుమ్మి. అతనితోపాటు వచ్చిన కుర్ర వాడు చాగంటి కామేశ్వరరావు. ఇద్దరూ రాజేశ్వర కవులమని చెప్పు కుంటూ పద్యాలు రాసేవారు.

పద్మరాజు దాదాపు బాల్యదశలోనే కవితాభ్యాసం చేశాడు. తర వాత కవిత్వంమీద ఎంత మోజు ఉండేదో అంత తక్కువ రాశాడు. వచనంలో కథాప్రక్రియను అవలంబించి అందులో అపార ప్రావీణ్యం, ప్రతిష్ఠా ఆర్జించాడు, విశ్వవిఖ్యాతి పొందాడు.

యుద్ధారంభంలో ఓసారి మా నాన్నగారి ఆదేశం ప్రకారం ముల కుట్ల వెంకటశాస్త్రిగారిని చూడటానికి రాజమండ్రి పోవలసి వచ్చింది. నన్ను స్టేషన్లో ఉండమనీ, తాను సామర్లకోటనుంచి కారులోవచ్చి కలుసు కుంటాననీ శాస్త్రి కబురు చేశాడు. నేను వెయిటింగ్ రూమ్‌లో కూచు న్నాను. నాక్కొంచెం దూరంగా మరో పడక్కుర్చీలో మరో వ్యక్తి- వయ స్సులో నాకన్నా పెద్దవాడు-కూచుని ఉన్నాడు. కొంతసేపటికి మేం ఇద్దరమే ఉండటంవల్ల ఒకరినొకరం క్రీగంటితో చూసుకోవటం ప్రారం భించాము. అతను మాటవరసకయినా పలకరించలేదు. నేనంతకన్నాను. ఇంతలో దూకుడుగా శాస్త్రి వచ్చాడు. వస్తూనే - "వరదా! దారిలో కారు చెడి ఆలస్యం అయింది, పద" అంటూ పక్కకి తిరిగి తన్ను చూసి నవ్వు తున్న మరోవ్యక్తికి నన్ను చూపిస్తూ "రామకృష్ణారావు కొడుకు - వరద నెరగవూ?ఎరక్కుండా ఇంతసేపూ ఏంచేస్తున్నావు" అని నవ్వాడు. అతను పాలగుమ్మి పద్మరాజనీ, కవిత్వం చెబుతాడనీ, మా నాన్నకు తెలుసనీ అన్నాడు. ముగ్గురం బయల్దేరాం, కారెక్కాం. శాస్త్రి ఓ సిగరెట్టు వెలి గించి నా వంక చూస్తూ "పద్మరాజు మీద ఓ రెండు పంక్తులు చెప్పు

—ఓ బీరు కొనిపెడతా"నన్నాడు. "బీరు నేను తాగ"నన్నాను. పద్మరాజు "నా కిద్దువుగానిలే" అన్నాడు. తడబడుతూ

వీడెవరి పా.ప.రా
ఊయేల ఊపరా
చనుబాలె చేపరా....

పక్కనించి నా వీపు తట్టి పద్మరాజు

ంకన్న కోరేను
మ ంకింక బీరేను....

అంటూ నవ్వటం మొదలు పెట్టాడు. పద్మరాజుతో పరిచయం అలా ప్రారంభమయింది. మా నాన్నగారికి పద్మరాజు, శ్రీశ్రీ సాహిత్య వ్యవసాయంలో సన్నిహితులు- అంతేవాసుల్లాంటివారు. అయితే విధి వశాత్తూ, ృత్తిరీత్యా మా నాన్నగారికి దూరంగా మదరాసులోనో, భీమవరంలోనో ఉండిపోయారు. లేకపోతే తెలుగు సాహిత్య చరిత్ర మరో విధంగా ఉండేదని ఒకసారి పద్మరాజు నాతో అన్నాడు. *

# ఎర్రజీర

అందం ఒక అందని పండే
అయితే అది చెప్పేటందుకు
ఎందు కిన్ని మాటలు?
వందల కొద్దీ పాటలు?
అందం ఒక ఆకలి వంటిది
అంత ప్రాతిపదికమయినదిన్నీ
పువ్వు దొరికితే వాసన చూడు
జవ్వనినయితే ముద్దు పెట్టుకో
అంతకుమించిన ఆదర్శాలూ
వంతలు చింతలు వైహాయసాలూ
గాలిలేని ఆకాశాలూ
గాలించి గాలించి పట్టుకున్న
ఊపిరి లేని మాంసం లేని
ఊర్వశి నా ప్రేయసి అంటే
అందానికి అందని దాన్నీ
డెందానికి పొందని దాన్నీ
గొప్పగా
చెప్పుతున్నావన్న మాట

ఊహ ఊహకి అడుగున ఉండే
మోహపు చీకటిలో నిండే
అందం అన్నా
ఆకలి అన్నా,
ఊహల గాలిపడగలు లేచి
మేఘాలపై పల్టీలు కొడితే
లోతులందని పాతాళానికి
లోపల నిండేదేమిటి?
రేగి రేగిన విరహాగ్ని కీలల్లో
కాగి కాగిన మధుస్రవంతులు
తాగి మత్తెక్కిపోయిన మనిషికి
చివరకి
కౌగిలిలో మిగిలేదేమిటి?
ప్రేమానికి ప్రాప్తా?
కామానికి తృప్తా?
మనిషికి పుట్టుకతో పుట్టిన
చదువూ జ్ఞానం ఉంటే
'ఆనందో బ్రహ్మయటన్న ప్రాజదువు'
అందం ఆకలి అంతా అదే
కామానికి కేంద్రం ఉంటే అక్కడే
ప్రేమానికి కేంద్రం ఉంటే - ఎక్కడ?
నాలో ఒక చీకటి గదిలో - ఏ
మూలో నకనకలాడే
చిన్న కదలిక ఏమిటో తెలుసా?

ఇన్నాళ్ళూ చూశాక?
దారిని పోయే
వారిని చూసి - "ఏయ్!
అమ్మాయీ!
రమ్మ"ని పిలిచే
ఎవని కన్నులలోనిదో ఎఱ్ఱ జీర,
తెల్లని కంటికి లోపల
నల్లన పాపకి దాపల
చిర్రున పాతిన
ఎఱ్ఱ జీర.

—పాలగుమ్మి పద్మరాజు
15-5-1955

# రాయప్రోలు రాజశేఖర్

**1945** శీతాకాలం. మొజంజాహి మార్కెట్‌కు ఎదురుగా బాచిలర్స్ క్వార్టర్సులో ఉంటున్నాను. మదరాసునుంచి నా పిలుపుమీద వచ్చి శ్రీశ్రీ కూడా అక్కడే మకాం వేశాడు. ఓ సాయంకాలం నాంపల్లిలో ఉన్న మొహమ్మద్ ఖాసింఖాన్‌ని చూడడానికి పోయాం. ఆ ప్రాంతాల్లోనే కురుగంటి సీతారామయ్యగారూ, అడివి బాపిరాజు గారూ ఉండేవారు. అందర్నీ కలుద్దామనుకున్నాము. కుదరలేదు. ఎంచేతనంటే, ఖాసింఖాన్ శ్రీశ్రీతో అతన్ని చూడటానికి ఎవరో మేమున్న గదికి వస్తానన్నాడనీ, వెనక్కి వెళ్ళిపొమ్మనీ చెప్పాడు. మేమిద్దరమూ నా గది కొచ్చేశాము. ఆ వచ్చేదెవరో నేను సరిగా కనుక్కోలేకపోయాను.

తీరా అతను గదిలో ప్రవేశించే సమయానికి నేను పనిమీద బయటకు వెళ్ళవలసి వచ్చింది, అతను నా వంకచూసి నవ్వాడు. పొట్టిగా, సన్నగా కళ్ళద్దాలూ, గిరజాల్లాంటి జుట్టూ - అంతే గుర్తు. గబగబా మెట్లు దిగి కిందికి వచ్చేశాను. పైన బాల్కనీనుంచి శ్రీశ్రీ గట్టిగా అరుస్తున్నాడు.

"మళ్ళీ ఎప్పుడు తిరిగి వస్తావు? మేమిక్కడే ఉంటాం. అతనెవరో తెలుసా? రాయప్రోలు సుబ్బారావుగారి పెద్దబ్బాయి." అంతే విన్నాను.

నేను తిరిగి వచ్చేటప్పటికి అతను లేడు. శ్రీశ్రీ ఒక్కడే నా కోసం నిరీక్షిస్తున్నాడు. శ్రీశ్రీ అతన్ని మెచ్చుకుంటూ ఇంగ్లీషులో చక్కని పద్యాలు రాస్తాడని చెప్పాడు.

ఆ తరువాత మరో నాలుగేళ్ళకి మళ్ళీ హైదరాబాదులో తటస్థపడ్డాడు. ఎర్రమంజిల్‌లో అప్పుడు సమాచార శాఖ ఉండేది. అక్కడ

అధికారి బినోదరావును కలుసుకుని పంజగుట్ట రోడ్డుమీదకు వస్తున్నాను ఎదురుగుండా మరో స్నేహితుడుతో కలిసి అతను నిలబడి ఉన్నాడు. నన్ను చూడటంతోటే మందహాసంచేసి 'నీకోసమే నిరీక్షిస్తున్నాను, పద' అన్నాడు. దారిలో భాస్కరభట్ల కృష్ణారావుని పోగు చేసుకుని ఆబీద్‌లో జాన్సు దగ్గర స్థిరపడ్డాము. అంతే. మరో ఆరేళ్ళు మా సాయంకాలాలు అక్కడే ప్రారంభమయాయి, బాగా పొద్దుపోయేదాకా.

అజంతా, ఏల్చూరీ మాతోపాటు సమావేశమయేవారు. మా సాహిత్య గోష్ఠులూ, కవితా వ్యాసంగమూ అక్కడే! ఊళ్ళోకి వచ్చి నప్పుడల్లా బెల్లంకొండ రామదాసూ, శ్రీశ్రీ, ఆరుద్రా, మాచిరాజు దేవీ ప్రసాదూ, బైరాగీ మాతోనే నిరంతర కాలక్షేపం. అందరిమధ్యా కవి త్వంలో విన్నాణిగా అతను వ్యవహరించేవాడు. అందరికీ ఆమోద యోగ్యంగా ఉండేది. అతను తరవాత దక్కను రేడియోలో చేరి, ఆలిం డియా రేడియోలో ప్రవేశించి, రేడియో నిర్దిష్ట స్థానాన్ని మొదటిసారీ ఆఖరిసారీ నాకు తెలిసినంతవరకు నిర్దేశించిం దతనే!

ఆ రోజుల్లో వాత్రేరు నుంచి మా నాన్నగారు వస్తూ పోతుండే వారు. ఆయనా మాతో కాలక్షేపం చేసి మా కవితా వ్యాసంగాన్ని సమీక్షి స్తుండేవారు. ఓ రోజున మా నాన్నగారిని పట్టుకుని రేడియోకోసం రానేదాకా వదల్లేదు. దశాబ్దాల తరవాత మళ్ళీ మా నాన్నగారు కలం పట్టడం - ఆయనే తన గీతంలో ఒకచోట—

**వరద వారు కావేరీ**
**సరిత్తీర వృక్షరాజ**
**శేఖరమ్ముల నీడలలో**
**మంజుల మంజీరమ్ములు**

మధుర రుతము సేయుచుండ
కనిపించిన మధుమూర్తీ
కవితా కల్పనాలతా!
మరల నేడు నా హృదిలో
మరులు కొల్ప దలిచావా?

నన్నూ అతన్నీ పేర్కొనడం జరిగింది. మా నాన్నగారికి అతను అత్యంత ప్రేమపాత్రుడయాడు.

మేము 'కవిత' ప్రారంభానికి ప్రయత్నిస్తున్నప్పుడు అతనిచేత బలవంతంమీద మొదటిసారిగా తెలుగులో కవిత్వం రాయించాను. తరువాత ఒకటో రెండో రాసి ఊరుకున్నాడు. నా సమక్షమే తన ఇన్స్పిరేషన్ అనేవాడు. విధివశాత్తు మేమంతా తలో దిక్కు వెళ్ళిపోయాము.

అయితే కవిత్వంలోనికి బైరాగిని దించిన పాపంకూడా నాదే. కవిత్వాన్ని నమ్మకుండా ఆరాధించినవాడు బైరాగి. కవిత్వాన్ని నమ్మి ఆరాధించలేకపోయా డతను. అంచాతనే వాళ్ళిద్దరికీ జీవితాంతం అదో రకమైన భావబంధం ఉండేదని నా అనుమానం.

అతని పేరు చాలామందికి తెలియదు తెలుగు సాహిత్య ప్రపంచంలో, వాళ్ళ కర్మ! అతని పేరు రాయప్రోలు రాజశేఖర్. *

## నివాళి

కెరటాల తర్కం గిరుల సన్యాసం
వృక్షాల కథనం ఆకాశ మథనం
మోదాల స్వేదం ఖేదాల హ్లాదం
జనన మరణాల క్రౌంచమిథునం
సప్త సముద్రాలు నిక్షిప్త
గుప్తవేద నిర్వేదాల
అనంతకోటి అవతారాల
అనేక సాక్షాత్కారాలు
అన్నిటినీ అన్ని వేళలలో
శిశువీక్షణతో పల్కరించి
సృజన వాంఛతో స్వీకరించి
కావ్యాకృతి నిగూఢ పరిణామం
జలవల్మీకంలో ధ్యానస్థం చేసి
కలలలో పొదిగి
పోషించిన నీకు
అలలన్నీ పడగలెత్తి
పట్టుతున్నవి గొడుగు
తారలన్నీ కన్నులెత్తి
పలుకుతున్నవి సంకేతం

ప్రాక్తన జీమూత గీతాలు
చెట్లై పుట్టలై వాగులై వాడలై
వెలసిన నీ ఇల్లు, నీ 'వేల్సు' వదిలి
ఆకాశ సౌధాల అరణ్యంలో
ప్రవాసివై కలల కన్ను మూశావు
అబ్ధిఘోషలో
శబ్దతరంగమై
నీటివంటి నువ్వు
నీపైనే వర్షిస్తూ
గాలినంటి వెళిపోయావు
చెట్టువంటి నువ్వు
గూళ్ళు కట్టి రెక్కలకు
రాత్రివేళ వెళిపోయావు

డిలన్ థామస్ స్మృతికి అంకితం
—రాజశేఖర్
1954

# శిష్లా ఉమా మహేశ్వరరావు

ఆంధ్ర విశ్వవిద్యాలయం వాల్తేరులో ఏర్పడ్డ మొదటి మూడు నాలుగు సంవత్సరాలూ సెలవుల్లో బెజవాడ, గుంటూరు పోతుండేవాణ్ణి. బెజవాడలో గుడిపాటి వెంకటచలం గారింట్లో మకాం. గుంటూరులో మా తాతగారింట్లో. అక్కడ కొన్నాళ్ళు కాలక్షేపం. ఓ సంవత్సరం గుంటూరులో మా మేనత్త కొడుకు వాడపల్లి లక్ష్మీనరసింహారావు-అతను లక్నోలో లా చదువుతూ సెలవులకి ఇంటికొచ్చాడు - నన్ను తనతో తన స్నేహితులతో పాటు సాయంకాలం షికారుకు తీసుకుపోతూండేవాడు. ఒక రోజున అమరావతి రోడ్డుమీద పోతున్నాము. కొంత దూరం నడిచిన తరవాత అరండల్ పేట సరిహద్దుపైన రోడ్డు కానుకుని పెద్ద వటవృక్షం. దానికి దరిదాపున పెద్ద భవంతి.

అందులో కుడివేపున పెద్దగది. మా బావా, స్నేహితులూ అక్కడ ఆగి గది తలుపు తట్టారు. తలుపు తెరుచుకుని లోపల్నించి మంచి యవ్వనంలో ఉన్న ఓ పెద్ద విగ్రహం వాకిట్లోకి వచ్చి, ఏం మాట్లాడకుండా నవ్వటం మొదలు పెట్టాడు. ఓ నిమిషం అయిన తర వాత అతను మా బావతో- "మీరు లోపలికి వస్తారా, నన్ను బయటికి రమ్మంటారా? ఏదోటి ఏడవండోయ్!" అన్నాడు. అతను లాల్చీ, పైజ మాలో ఉన్నాడు. మా బావా, అతని స్నేహితులిద్దరూ, నేనూ గదిలో ప్రవేశించాము. ఆ గదిలో ఓ మూల ఓ చాప, ఆ చాపమీద మాసిపోయిన దిండూ, గోడకి మేకులమీద వేళ్లాడుతున్న లాల్చీలూ, తువాళ్ళూ. గదినిండా తెల్ల కాగితాలు ఈగల్లా గాలి కెగురుతున్నాయి. అంద

కన్నా వెనక నిలబడిన నేను అలా ఎగురుతున్న ఓ కాగితంకేసి చూశాను. పద్యాల్లా ఆ కాగితంమీద ఎవరి దస్తూరిలోనో ఉన్నాయి. ఇంతలోకి మా బావ నన్నతనికి పరిచయం చేస్తూ "మా మామయ్య కొడుకు వరద. వీడూ కవిత్వం రాస్తాడుట!" అని నవ్వుతూ అన్నాడు. అంతే. అమాంతం అతను నేలమీద సాష్టాంగపడి నాకు నమస్కరించాడు. లేచి "మహాకవిని చూసినట్టే లెక్క. రామకృష్ణారావు గారిని చదివాను: వాళ్ళబ్బాయిని చూశా" నన్నాడతను.

అతని పేరు శిష్ట్లా ఉమామహేశ్వరరావనీ, మా బావకు సహాధ్యాయి అనీ, అప్పుడు బెనారస్ విశ్వవిద్యాలయంలో చదువు ముగించుకుని వచ్చాడనీ, మేధావంతుడనీ విన్నాను. ఎందువల్లనో అతణ్ణి చూసీచూట్టంతో అదో రకం వ్యక్తిగా కనిపించాడు. అతని వాలకంలోనే ఏదో విశేషం ఉన్నట్టు తోచింది. అతని గదిలోనే ఓ గంట సేపు అందరూ నేలమీద కూర్చుని అవీ ఇవీ మాట్లాడారు. మధ్య మధ్య మా బావ ఉమా మహేశ్వరరావు కవిత్వం రాస్తాడని అంటున్నాడు. అయితే, అతని పేరు నేను చదువుకున్న సాహిత్యంలో ఎక్కడా తటస్థపడలేదు. ఊరుకోక "శ్రీరంగం శ్రీనివాసరావు పేరు విన్నారా?" అని ఉమామహేశ్వరరావుకేసి చూస్తూ అడిగాను. నా వంక తీక్షణంగా చూసి - "అతనెవ"రన్నాడు. నాకోపం వచ్చింది. అయినా "విశాఖపట్నం. కవిత్వం బ్రహ్మాండంగా రాస్తాడు" అన్నానో లేదో అతను మొహం అటుపెట్టి "రాయనీ" అంటూ మళ్ళీ అందరి ధోరణిలో పడ్డాడు.

నా కాశ్చర్యం వేసింది - మా నాన్నగారి పేరు విని నా ముందు సాష్టాంగపడ్డవాడు కవిత్వం అంటే కించిత్తు ఆసక్తి చూపించడేం అని. కాస్సేపయిన తరువాత అందరం లేచాం. బయటికివస్తూ గాలికెగురుతున్న కాగితాలకేసి మళ్ళీ చూశాను. అలాచూస్తున్న నన్నుచూసి "అదంతా నా కవిత్వం-చదవాలనుందా?" అని రెండు కాగితాలు తీసి చూపించాడు.

కవిత్వంలాగే ఉంది. అందులో ఒక కాగితాన్ని తిరిగి చూసుకొని నాకిచ్చేసి ఉంచుకోమన్నాడు.

మర్రోజున బ్రాడీ పేట మొదట్లో ఉన్న అమంచర్ల శేషాచలపతి గారింటి ముందు తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు కనిపించారు. ఆ రోజుల్లో నేనంటే ఆయనకి అభిమానం. ఎదురుగా ఉన్న హోటల్లోకి తీసుకుపోయి కాఫీ ఇప్పించి అవీ ఇవీ మాట్లాడుతూ "మీరంతా శ్రీనివాస రావూ, శ్రీనివాసరావు అంటారు. మా ఉమామహేశ్వరరావు పోలిక్కి రాడు. అతను అద్భుతంగా కొత్త పద్ధతిలో కవిత్వం చెప్పబోతు న్నాడు" అని సభాపతి ధోరణిలో చెప్పారు. శాస్త్రిగారికి వ్యక్తిగతంగా అనేక అభిమానాలు. ఏ అభిమానంతో అలా మాట్లాడుతున్నారో నాకర్థం కాలేదు.

గుంటూరులో నేనున్న పది రోజుల్లోనూ మరోసారి ఉమామహే శ్వరరావును యాదృచ్ఛికంగా కలుసుకోవటం జరిగింది. వేదుల సత్య నారాయణగారితో కలిసి వెళ్ళాను. ఆ రోజుల్లో వేదుల మా మేనమామకు సంస్కృతం చెప్పేవాడు. అప్పుడే మొదటిసారిగా ఉమామహేశ్వర రావు తన కవిత్వాన్ని పాడి వినిపించటం చూశాను. అతను బాగా పాడగలడనే అభిప్రాయం కలిగింది నాకు. సత్యాగ్రహులమీద పోలీసుల లాఠీ దౌర్జన్యంమీద రాస్తున్న ఓ గేయాన్ని వేదులకి వినిపించాడు.

"మారో మారో మారో
ఒకటీ, రెండూ, మూడూ...."

ఇలా సాగుతుంది. అతను పాడుతుంటే ఉత్తేజితులై వేదుల తెగ మెచ్చుకున్నారు. నాది మరీ బాల్యం కనక మరింత తన్మయుణ్ణయిపోయిన మాట వాస్తవం. ఉమామహేశ్వరరావు సామాన్య కవి కాదని నాకనిపిం చింది. తన గదిలో అంతకుపూర్వం నాకిచ్చిన కాగితం మీద రాసిన పద్యం పాడాడు. నా కర్థం కాలేదు. వేదులకీ అనుకుంటాను. ఆయన కనుబొమలు ముకుళించారు. పాడే తీరు అద్భుతం.

ఇంటి కొచ్చిన తరవాత ఆ కాగితం ముక్క చూశాను. పద్యంలా వుంది. ఛందస్సు అర్థం కాలేదు. అంతా అయోమయంగా వుంది.

నేను విశాఖపట్నం చేరీ చేరగానే శ్రీనివాసరావుని కలిసి గుంటూరు వ్యవహారం పూసగుచ్చినట్లు చెప్పాను. నేను పట్టుకొచ్చిన 'పద్యం' చూపించాను. అతనికీ ఆశ్చర్యం వేసింది. అతణ్ణి ఒకసారి చూడాలని అన్నాడు. అలాగేనని చెప్పి మా బావకు ఉత్తరం రాశాను. ఓ నెల రోజుల తరవాత ఉమామహేశ్వరరావు కలకత్తా పోతున్నాడనీ, వాల్తేరు స్టేషనులో కలవమనీ మా బావ ఉత్తరం రాశాడు. నిర్ణీత సమయానికి నేనూ, శ్రీనివాసరావూ స్టేషనుకి వెళ్ళాము. కలకత్తా మెయిలు ఆగగానే వెతికి గుర్తు పట్టి ఉమామహేశ్వరరావుని దించాను. శ్రీనివాసరావుని పరిచయం చేశాను. ఉమామహేశ్వరరావుకి ఓ పాడలవాటుంది. అందర్నీ 'ఒరే' అనేవాడు. శ్రీనివాసరావుని చూసి "నీ గురించి విన్నానురా – మనం త్వరగా కలవాలి" అన్నాడు. "కవిత్వం యాంత్రికంగా వుంటోంది. దాన్ని తాంత్రికంగా నడిపిస్తాను. కుండలాలనూ, శ్రీ చక్రాలనూ పరిశోధిస్తున్నాను. నాలో మిమ్మల్నందర్నీ చేర్చుకుంటానులే – భయపడకు" అన్నాడు.

నేను జేబులోంచి అతను లోగడ ఇచ్చిన కాగితం ముక్క తీసి చదివి వినిపించు అన్నాను. స్టేషను గడియారం చూస్తూ పాడాడు. ఒక్కొక్కప్పుడు అమ్మవారంత గొంతు—దూరంగా వున్న ప్రయాణీకులు మా వంక చూస్తున్నారు.

"దాగుడు మూత పడవీ మనస్సంచారములు
కత్తెర పెట్టినన్ తెగవు. ఎక్కడ కేగుచుంటిరని
పోవునపు డడిగిన నవి పక పక నవ్వు. అక్కడ
ఏమి చేసితిరన సిగ్గుచే లోనికి
జొత్తురు. వెంటనె యుప్పెన వచ్చినట్లు మహ

ర్నవమి పిల్లలవలె అల్లరి చేతురు...."

రైలు కదిలిపోయింది. శ్రీనివాసరావుకి అతని వైఖరి రుచించ లేదని తెలిసిపోయింది. అయితే, ఉమామహేశ్వరరావుని గురించి ఇంకా తెలుసుకోవాలనే కుతూహలం శ్రీనివాసరావుకి పట్టుకుందని తెలుసు కున్నాను. మా నాన్నగారి అభిప్రాయం కనుక్కోమన్నాడు శ్రీనివాసరావు. నేను చెప్పినదరంతా విని, నేను చూపించిన 'పద్యం' చదివి "కవిత్వంలో వీడివి రౌడీ వేషంలా ఉందిరా!" అన్నారు నవ్వుతూ మా నాన్నగారు.

* * *

యుద్ధ కాలంలో విశ్వవిద్యాలయాన్ని వాల్తేరునుంచి గుంటూరు తరలించటంతో మా కుటుంబం అక్కడికే వచ్చింది. అప్పుడు రాజ కీయాల్లో ఎమ్. ఎన్. రాయ్‌గారి అనుచరుణ్ణిగా ఉండేవాణ్ణి.

మా ఇంటి పక్కనే జంధ్యాల వారిల్లు. జంధ్యాల వెంకటప్పయ్య శాస్త్రిగారు వెల్కం ప్రెస్సు నిర్వహిస్తుండేవారు. నేను తోచనప్పుడు వెంకటప్పయ్యశాస్త్రిగారి ప్రెస్సుకు వెళ్ళి ఆయనతో మాట్లాడుతుండేవాణ్ణి. అక్కడే శిష్టా ఉమామహేశ్వరరావు 'శాంతిని' అనే పత్రికను అచ్చే యించేవాడు కాని, నన్ను గుర్తుపట్టలేదు. అప్పుడతను - కవిత్వంలో ఏదో ఎవరికీ అర్థంకాని 'ప్రాహ్లాద' కవిత్వం అంటూ ఓ ఉద్యమాన్ని లేవదీయటానికి ప్రయత్నించాడు. యుద్ధ సంక్షోభంలో నే నంతగా ఉమా మహేశ్వరరావు ప్రయత్నాన్ని పట్టించుకోలేదు. ఎన్నాళ్ళో కాలేదు. అతను అన్నీ మానేసి సైన్యంలో చేరాడు. నేను గుంటూరు వదిలి మదరాసు వెళ్ళిపోయాను.

నేను మదరాసులో మకాం పెట్టిన మరుసటి సంవత్సరం. నేనూ, బెల్లకొండ రామదాసూ కలిసి తిరువళ్ళిక్కేణిలో ఓ గదిలో ఉండే వాళ్ళం.

ఒక రాత్రి స్నేహితులతో పోయి మర్నాడు పొద్దునే గది కొచ్చాను గది తలుపులు బార్లగా తీసి ఉన్నాయి. గడపకి ముందుగా ఒకతను అర్ధనగ్నంగా తలకింద మిలటరీ సంచి పెట్టుకుని నేలమీద పడుకుని ఉన్నాడు. లోపలికి అతణ్ణి దాటుకుపోవటం కష్టం. అతనెవరో గుర్తు పట్టలేని స్థితిలో ఉన్నాను. గదిలోంచి సారా వాసన!

ఏం చెయ్యాలో తోచక వరండాలో పచార్లు చేస్తుండగా రామదాసు వచ్చాడు నవ్వుతూ.

"ఉమాయ్ రాత్రొచ్చాడు. ఇక్కడే ఉంటా నన్నాడు. సరే అన్నాను" అన్నాడు.

అలా మా దగ్గర నెలరోజులున్నాడు. అతనితో మేం వేగలేక పోయాము. మదరాసులో ఆంధ్ర పత్రిక సంపాదక వర్గంలో ఉమా మహేశ్వరరావు చేరాడు. అతను, ఆ పత్రికాధిపతి శివలెంక శంభు ప్రసాద్‌గారూ సహాధ్యాయులని విన్నాము. పొద్దున ఆలస్యంగా లేచి, ఏ రాత్రి పన్నెండు గంటలకో వచ్చేవాడు. నేనూ, రామదాసూ గాఢ నిద్రలో ఉండగా లేపేవాడు. ఒకంతట ఉమాయ్‌కి నిద్రపట్టేది కాదు. ఏదో మాట్లాడమనేవాడు. చిత్తుగా తాగిన మైకంతో ఉండేవాడు గది అంతా వాసన, వరండా అంతా వాసన.

వరండాలో మా ఇంటాయన మొదలియారు పడుకుని ఉండే వాడు. ఆయనది యమగురక. ఆ గురకకుతోడు ఉమాయ్ వాగుడు, వాసన, మాకు దుర్భరంగా ఉండేది. ఈ విషయంమీద ఓ రోజు నేనూ రామదాసూ ఘర్షణకూడా పడ్డాము. ఉమాయ్‌ని ఎలా సంస్కరించాలో మాకు బోధపడలేదు. వయస్సులో అతనికన్నా చిన్నవాళ్ళం. అతనికీ, మాకూ సాహిత్యమే ఒక లంకెలా ఉండేది. అదే మా బలహీనత అని గుర్తించాము. ఓ రోజున ఉమాయ్‌తో వేరేగది చూసుకోమని చెప్పాము. సరే నన్నాడు కాని, ఆ ప్రయత్నం చేస్తున్నట్లు మాకు తోచలేదు.

రాత్రిళ్ళు తొందరగా ఇంటికి రావటం మొదలు పెట్టాడు. రావటంతోటే మాతో కవిత్వం మీద చర్చ ప్రారంభించేవాడు. తను ఎలాంటి వినూత్న ప్రయోగాలు చేస్తున్నాడో సోదాహరణంగా చెప్పేవాడు. రాత్రి పన్నెండయ్యేది. అప్పుడు తన గేయాలను పాడేవాడు. మాకు నిద్ర వస్తోందనీ, మర్నాడు ఉద్యోగానికి పోవాలనీ చెప్పినా వినేవాడుకాదు. మేం నిద్ర నటించేవాళ్ళం. అతడు పాడుతూనే ఉండేవాడు. మేం నిద్ర నటించినా ధ్యాస అంతా అతని పాటమీదే ఉండేది:

"నా పేరు లీల!
ఆ ఊరి గోల పడలేక పారుగూ రొచ్చాను!"

మేం నిద్రలోనే ఉండేవాళ్ళం. అతను పాట ముగించి నిద్రపోయేవాడు. పొద్దున్నే లేచి నేనూ, రామదాసూ ఎవరి మానాన వాళ్ళం వెళ్ళిపోయే వాళ్ళం. మళ్ళీరాత్రిదాకా ఉమాయ్ కనిపించేవాడు కాదు.

ఆ రోజుల్లో అతను కవిత్వం రాయటం పూర్తిగా మానేశాడు. ఓ నవయుగానికి తనో ద్రష్ట ననుకునేవాడు. ఆ విషయాన్ని ఎక్కువగా ఎవరూ పట్టించుకోలేదని కొంచెం కోపంగా కూడా ఉండే దతనికి. ముఖ్యంగా శ్రీరంగం శ్రీనివాసరావుని అలాంటి సందర్భాల్లో ప్రస్తావించటం అతనికి కొంచెం కష్టంగా ఉండేదని మేము గ్రహించేవాళ్ళం. దానికో కారణం ఉంది. 1933 మార్చిలో అభినవాంధ్ర కవి పండిత సభ బరంపురంలో జరిగింది. ఆ సభలో మొదటిసారి ఉమామహేశ్వరరావు కవిగా యావదాంధ్రానికి పరిచయ మయాడు. అతను రాసిన 'మారో మారో మారో' అనే గేయాన్ని ఆ సభా సమక్షంలో - ఉమామహేశ్వర రావే పాడాడని నాకనిపించేది - శివశంకరశాస్త్రిగారు చదివారని తరవాత శ్రీశ్రీ రాశాడు. అప్పటికి శ్రీ శ్రీ 'మరో ప్రపంచం' రాయలేదు. మిత్రులందరూ ఆ పాటను విన్న తరవాతనే శ్రీశ్రీ తత్రోద్బలం మీద

'మరో ప్రపంచం' రాశాడని అనేవారు. అందులో నిజం లేకపోలేదని నాకు తెలుసు. శ్రీశ్రీకి తెలుసు. మా మదరాసు రోజుల్లో శ్రీశ్రీ సుత రామూ అందుకు ఒప్పుకొనేవాడు కాదు. శ్రీశ్రీకి నేను నచ్చచెప్పచూశాను. రెండు గీతాలూ వేరు, ఎత్తుబడిలోనేకదా నీ అనుకరణ, ఆ మాత్రం ఒప్పుకుంటే తప్పులే దన్నాను. అతను వినలేదు. తరవాత ఎన్నాళ్ళకో విన్నాడు. ఇప్పుడు ఉమామహేశ్వరరావు గీతం పూర్తి పాఠం దొర కటం దుర్లభం.

మదరాసులో డేవిడ్ కఫే అనే మధుశాల ఉండేది. ఓసారి నేనూ, శ్రీశ్రీ, మల్లాది రామకృష్ణశాస్త్రిగారితో కలిసి అందులోకి పోయాము. అదే సమయంలో దారిన పోతున్న ఉమామహేశ్వరరావు మమ్మల్ని అనుసరిం చాడు. తీరా మేం బల్లదగ్గర కూర్చోగానే ఎదుట ప్రత్యక్షమయ్యాడు. అవీ ఇవీ మాట్లాడుతూ కాలక్షేపం చేస్తున్నాము. కొంచెం తలకెక్కితే ఉమామహేశ్వరరావు సంస్కృతంలో పలకరించటం రివాజు. మేం పట్టించుకునేవాళ్ళం కాదు. ఆ రోజున శ్రీనివాసరావుకు ఒళ్ళు మండి పోయినంత కోపం వచ్చింది. "మా అమ్మనంటావురా?...." అని లేచాడు. ఇద్దరూ ఒకరిచొక్కా ఒకరు పట్టుకున్నారు. శాస్త్రిగారు కిమ్మనకుండా కూచున్నారు. నేను కలగజేసుకోబోతుంటే కనుసైగ చేసి ఊరుకోమ న్నారు. ఇంతలోకి అక్కడి బేరర్సువచ్చి వాళ్ళను విడదీశారు. అంత టితో వాళ్ళిద్దరూ ఆగలేదు. ఒకళ్ళనొకళ్ళు నోరారా ఆడిపోసుకున్నారు. అప్పుడే ఉమామహేశ్వరరావు "నిన్ను చంపేదాకా నిద్రపోనురా!" అని బల్లగుద్ది అరిచాడు. అప్పుడు శాస్త్రిగారు ఆపేయమన్నారు.

ఆ తరవాత కొన్నేళ్ళకి ఉమామహేశ్వరరావు అన్నంతపనీ చెయ్యటానికి ప్రయత్నించాడట. శ్రీశ్రీని గుంటూరు దగ్గర పొలాల్లో గడ్డివాముకు కటి కాల్చెయ్య పోయాడు. అదో పెద్ద కథ. శ్రీశ్రీ నాకు

ఆ కథ చెబుతున్నప్పుడు అతని కళ్ళల్లో వెనకటి భయం కనిపిస్తుండేది. అతణ్ణి కాల్చటానికి ప్రయత్నిస్తునప్పుడు "మారో మారో మారో" అని ఉమా మహేశ్వరరావు పాడాడట!

ఇంతకీ నేనూ, రామదాసూ మేం తీసుకున్న గదిని వదిలేసి వెళ్ళిపోయాం. ఉమాయ్ అందులోనే కొన్నాళ్ళున్నాడు. ఇంటి యజమాని మొదలియారుతో దెబ్బలాట పెట్టుకుని ఉమాయ్‌కూడా ఖాళీ చేశాడు. వెంటనే ఆంధ్రపత్రికలో ఉద్యోగం కూడా పోయింది.

* * *

ఉమామహేశ్వరరావు విచిత్రమైన వ్యక్తి. మనిషి శుభ్రత పాటించేవాడు. మాటాడినంత సేపూ బాగానే వున్నట్లుండి హఠాత్తుగా మారిపోయేవాడు. అక్కడే అందరికీ అతనంటే బాధాకరంగా వుండటం. అంతే కాక వ్యక్తిగత జీవితంలో కొన్ని అవాంఛనీయ లక్షణాలు అందరికీ అర్థం అయే రకంగా ప్రవర్తించేవాడు.

'వెర్స్ లిబ్ర్' అనే ప్రక్రియ తెలుగులో అతనితోనే ఆరంభం. అందులో పరిపూర్ణ ప్రావీణ్యం సంపాయించకుండా ప్రయోగాలు చెయ్యటం ప్రారంభించాడు. ఆంగ్ల సాహిత్యంలో అతనికి దొరికినంత ప్రవేశం తెలుగులో దొరక్కపోవటంవల్ల అతనికి తగిన పేరు రాలేదు. భాషమీద అతనికున్న అధికారం అత్యల్పం. దానికిలోడు సంక్లిష్టమయిన భావ శబలత. అయితే, ఒక నవీన మార్గాన్ని తెలుగు సాహిత్యంలో నిర్దేశిస్తున్న అహంభావాన్ని తన సంభాషణల్లో ప్రస్ఫుటం చేసేవాడు. అతను నవీన మార్గదర్శిగానే వుండిపోయాడు. ఆ మార్గాన పయనించలేకపోయాడు. అలాంటి మార్గాన పయనించి కొంతవరకు కృతకృత్యుడయినవాడు శ్రీరంగం శ్రీనివాసరావని మనందరికీ తెలుసు.

శిష్టా ఉమామహేశ్వరరావుని వినూత్న మార్గదర్శిగా ప్రచారం చేసేందుకు శివశంకరశాస్త్రి ప్రభృతులు చాలా దోహదం చేయటం జరిగింది. విశ్వనాథ సత్యనారాయణగారిచేత కూడా యోగ్యతాపత్రం ఇప్పించే ప్రయత్నమూ జరిగింది. వారి ఆశయాల కనుగుణంగా ఉమా మహేశ్వరరావు కవిత్వంలో పురోగమించలేకపోయాడు. దానికి తోడు అనతికాలంలోనే కవిత్వానికి స్వస్తి పలికాడు.

అంతమాత్రాన ఉమామహేశ్వరరావుకి తెలుగు సాహిత్యంలో సముచిత స్థానం లేకపోలేదు. అతను రాసిన ఒకటి, రెండు గీతాలు కలకాలం చెప్పుకోదగ్గవి. అందులో 'జ్ఞాపకాలు' అన్న గీతం 'వెర్స్ లిబ్' లో తలమానికంలాంటిది. అది చదువుతున్నప్పుడల్లా 'ఎజ్రా పౌండ్' గుర్తుకు రాకమానదు. అతడు ఎనిమిదో శతాబ్దంలోని చైనా కవి రిహాకు రాసిన పాటల్ని ఆంగ్లంలో తర్జుమా చేశాడు. అందులో ముఖ్యంగా-నదీ వ్యాపారి భార్య - ఉత్తరం - అనే గేయం, ఉమామహేశ్వర రావు 'జ్ఞాపకాలు' చదువుతుంటే, గుర్తుకు రాక మానదు. ఉమా మహేశ్వరరావు నాతోనూ, రామదాసుతోనూ కలిసి వున్న రోజుల్లో ఈ గేయాన్ని తరచు పాడుతుండేవాడు. గుండె కదిలి కరిగిపోయేది. అమాంతం ఒళ్ళు కంపించేది. ఇప్పటికీ ఆ పాటా, అతని గానమాధుర్యమూ నాకు స్ఫురణకు వస్తుంటాయి.

# జ్ఞాపకాలు

నా పేరు లీల।
ఆ ఊరి గోల పడలేక నేను పొరుగూ రా
చ్చాను। అందాలవాడే అడవిలో ముం
చాడు। అందరిని తలచుకొని అల్లాడుచున్నాను
ఏకాకినై నేను దూరాన ఉన్నాను. దారినే
పోయే అమ్మలక్కలు జేరి ముండ్ల చూపులు
చూచి అడుగుతూ పోతారు.
ఏకాకినై నడిజామువరకూ మేలుకొని
మృత్యువును నేను బ్రతిమాలుకొన్నాను।
అమ్మమ్మ జ్ఞాపకం, అమ్మ జ్ఞాపకం, చెల్లెలు
జ్ఞాపకం, నాన్న జ్ఞాపకం, అన్నలే జ్ఞాపకం.
తమ్ములే జ్ఞాపకం, అందరిలో నువ్వే ఆఖరి
జ్ఞాపకం। రావేల। రావేల రాత్రి వచ్చింది।
మధురమా మగవాడా నా ప్రేమ నిజమోయి।
ప్రాభాతమా వేళ జ్ఞాపకాలొచ్చాయి!
తలిచి తలిచీ నిన్ను జ్ఞాపకాలొచ్చాయి।
పవళింపు సమయాన జ్ఞాపకాలొచ్చాయి।
తలనొప్పి తీర్చుతూ నీవు తలగడగ రావోయి।
చలికాలమొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి।
చైత్రమాస మొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి।
వర్షాకాల మొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి।

పిలుపులకు పలకనందులకై ఈ ఘడియ
ఈ క్షణము జ్ఞాపకాలొచ్చాయి! రావేల
మగవాడ! ఒడ్డుపొడుగూవాడ!
ఏకాకినై నేను ఏ దారి పోయినా పిలుపు
పిలుపుకు పలికే జ్ఞాపకాలొచ్చాయి! ఏకా
కినై నే ఏమి పని జేసినా తలపు తలపుకు
త్రవ్వి జ్ఞాపకాలొచ్చాయి! మరో పిల్లను
నీవు మరులు గొల్పావో, వేరో
పిల్లకు నీవు ఉరులు వేశావో, రావోయి
రావోయి త్వరత్వరగ రావోయి, నా కన్ను
చెదిరింది పురుషులను జూస్తూ!
బుల్ బులుల హాయికై కిలకిలల జోలకై
పరితపించే మనస! కన్నీళ్ళ హృదయమా!
బుల్ బులుల మన్నా కిలకిలల మన్నా
ముత్తైదు ముద్దుటుయ్యాలకే కద్దు!
బులుబులు బులాహాయీ యీ
హాయమ్మ నెవ్వరూ పురిగొల్పినా వారు?
పురిగొల్పినా వాడు పురుషుడే కాడు! మగ
పిల్లవాడవో ఆడపిల్లవో నీవు, మగవాడివై
నీవు మాయదారి వవకుండ, ఆడపిల్లవై నీవు
అధ్వాన్నమవకుండ ఎన్నెమ్మయే వచ్చి
పురుడు పోసింది! కొత్తెమ్మయే వచ్చి ఉగ్గు

కలిపింది। పోతరాజే వచ్చి చేద వేశాడు।
కొత్తెమ్మయే వచ్చి చాట పరిచింది।
బులు బులు బులు బులా హాయీ। యీ।
హాయమ్మ నెవ్వరో చంకెత్తి కెళ్ళారు। నా
చన్నులో పాలు చేపుతున్నాయే। ఉయ్యా
లలో పిల్ల ఉబుసులే లేవు। నా చన్నులో
పాలు జున్ను లెత్తాయే!
హాయమ్మ కెవ్వరూ హాయన్న వారూ।
నీలాల సంద్రములో నిప్పచ్చరము నేలపై
రాయినై యాహల్యనైనాను శ్రీరామ
చంద్రమూర్తీ। రామ రామ। నా పేరు లీల।

—శిల్ప

# కుందుర్తి ఆంజనేయులు

విశ్వనాథ సత్యనారాయణగారు ఢిల్లీ వచ్చినప్పుడల్లా ఆయనతో ఎక్కడో అక్కడ కొంతసేపు కాలక్షేపం చేసేవాడిని. నా చిన్నతనం నుంచీ ఆయన నన్నెరుగును. నేను మూడో ఫారంలో ఉండగానే ఆయనచేత మా పాఠశాల విద్యార్థి సంఘం సమక్షాన మాట్లాడించాను. ఆయనచేత పద్యాలు చదివించాను. అది ఆయనకి చివరిదాకా గుర్తు. నా మీద ప్రత్యేకాభిమానం. ఆధునిక కవుల్లో అగ్రశ్రేణి వారందరిదీ ఒక ఎత్తు, ఆయనదో ఎత్తు. శ్రీశ్రీ తర్వాత ఒక కొత్త బాణీ అనుసరించాలనుకున్న వాళ్ళం కొంతమంది వుండేవాళ్ళం. మమ్మల్నందరినీ బహిరంగంగా మెచ్చుకునే గుణం ఆయన దగ్గర వుండేది. తతిమ్మా వాళ్ళు చాటుగా అభినందించి, పదిమందిలోనూ మమ్మల్ని ప్రస్తావించేవారు కాదు. అది వేరే కథ!

అలా ఒకసారి జ్ఞానపీఠ సన్మానానికి విశ్వనాథవారు ఢిల్లీ వచ్చారు. నాక్కబురు పెట్టారు. వెళ్ళి చూశాను. ఆయన చుట్టూ కొంత మంది తెలుగువారు చేరి వుండడం చూశాను. వాళ్ళలో కొంతమంది విశ్వనాథవారి సన్మానానికి ఫలానా ఆయన కారకుడనీ, ఫలానా ముఖ్యమంత్రి కారకుడనీ ఆయనతోనే చెబుతున్నారు. ఆయనేం మాట్లాడలేదు. ఢిల్లీలోని సంగీత నాటక కళా అకాడమీ విశ్వనాథ వారి చేత ఇంటర్వ్యూ చేయించి రికార్డు చెయ్యవలసి వుంది.

నేను, విశ్వనాథా నా కారులో బయలుదేరాం. దారిలో నేనడిగాను. 'మన తెలుగు వాళ్ళకి సంస్కారం దేవుడెరుగు, ఆత్మాభిమానమన్నా లేదేమండీ!' అంటూ "జ్ఞానపీఠం బహుమానాన్ని మీకెవరో ఇప్పించడమేమిటండీ? అలా చెప్పుకోవడానికన్నా వాళ్ళకి సిగ్గు లేదా" అన్నాను.

ఆయన నొచ్చుకున్నారు. "నన్నేం మాట్లాడమంటావు? నోరు మూసుకోని ఊరుకోవడమే మంచిది. లేకపోతే బజారున పడాలిసొస్తుంది. ఇప్పుడనిపిస్తోంది, ఇంతగా ఎందుకు రాశానా? మీ నాన్నలాగ అప్పుడే వూరుకుంటే పోయేది. ఇంతకీ ఏది నిలుస్తుందో తెలీదు" అంటూ కారు లోంచి ఆకాశం వంక చూస్తున్నారు.

కలగజేసుకుని "మీరు దానికి చింతించనవసరం లేదు. మీ అనుభూతి మీది. ప్రేరణవల్ల రాశారు. ఇహ ప్రపంచం కర్మ. మీరా విషయం ఆలోచించకండి. నన్నయ మహాభారతం రాస్తున్నప్పుడు ఆలోచించి వుండడు అని నేననుకుంటున్నాను. మీ శిష్యులు మీ రచనల సంగతి చూసుకోగలరు" అన్నాను.

ఆయన నవ్వుతూ "నాకు శిష్యులెవరయ్యా ? శిష్యులమని చెప్పుకుంటూ నాలా రాయలేక మరో మార్గాన్ని ఆశ్రయించి, నన్నే గురుపీఠం మీద పెడతారు. ఇదో కొత్త రకం గౌరవం!" అన్నారు.

కుందుర్తి ఆంజనేయులు నిజంగా విశ్వనాథ శిష్యుడు. విశ్వనాథ అంటే అతనికి విపరీతమైన గౌరవ భక్తులుండటం నాకు తెలుసు. అయితే విద్యార్థి దశలో ఆఖరి ఘట్టంలో రాజకీయ వాసనకు ఆ రోజుల్లో అందరిలాగే అతనూ లొంగిపోయాడు. అందులోనూ కమ్యూనిష్టు వ్యవహారం. తరవాత దాన్ని మార్క్సిస్టు వ్యవహారంగా మార్చాడు. అతనితో పాటు అనిసెట్టి సుబ్బారావు, బెల్లంకొండ రామదాసూ, ఏల్చూరి సుబ్రహ్మణ్యమూ కలిసి కొత్తరకంగా రాసేవారు. కొత్తరకం అంటే ఏమంత కొత్తరకం కాదు. అంతకుముందే శ్రీనివాసరావూ, ఉమామహేశ్వరరావూ వెర్స్‌లిబ్రెకి దారి చూపించారు. ఈ ఇద్దరిలో శ్రీనివాసరావుది ఒక రకమైన సాంప్రదాయిక మార్గమే. మాత్రా ఛందస్సునే స్వీకరించాడు ఎక్కువగా.

ఆంజనేయులు ప్రారంభంలో విశ్వనాథనే అనుసరించి, అనుక రించి రాయడం జరిగింది. తరవాత వామపక్షాల ప్రోద్బలం వల్ల అభ్యుదయ కవిత్వంలో కాలు పెట్టాడు. అయితే గురువుగారికున్న ప్రతిభకన్నా ఆయన చాదస్తం అతన్ని పట్టుకుంది. తను రాసేది 'వచన కవిత్వ' మన్నాడు. అందులో ప్రజల కర్థమయ్యేటట్లు రచన సాగాలన్నాడు. అంతటితో ఊరుకోలేదు. ప్రజల భాషలోనే రాయా లన్నాడు.

అతని సిద్ధాంతాలన్నింటికీ నేను విముఖుణ్ణి. 'వచన కవిత్వ' మనే ప్రక్రియకే నేను విముఖుణ్ణి. అధిక సంఖ్యాకులు ప్రజల్లో నిరక్షరాస్యులుగా వున్న రోజున ప్రజలకోసం మనం ఏం రాయగలమని నా అనుమానం. కవిత్వం ప్రజాయత్తమెలా అవుతుందో నా కిప్పటికీ అర్థం కాదు. అయితే కవిత్వం అంటే ఏమిటో ముందు మనకు అర్థం కావాలి.

హైదరాబాద్‌లో నేను ఢిల్లీనుంచి వచ్చినప్పుడల్లా అతన్ని కలు స్తుండే వాణ్ణి. ఓసారిఆంజనేయులూ, నేనూ వూళ్ళో తిరగడానికి పోయాము. దారిలో అతడన్నాడు: "మీరంతా రాయటం మానేశారు. మొత్తం నా నెత్తిమీద రుద్దారు. నేనొక్కణ్ణే రాయవలసి వస్తోంది. అసలు మనం వాడుతున్న ప్రక్రియకు భవిష్యత్తుందా లేదా?" అని. "భవిష్యత్తు లేదు. మన ప్రక్రియ చిరస్థాయి కాలేదు. ఆ లక్షణం దానికి లేదు" అన్నాను. 'నేను నీతో ఏకీభవించను. దాన్ని సాధించి సార్థకంచేసి తీరుతా'నన్నాడు. నేనన్నానూ 'ఆంజనేయులూ, నీకు ప్రతిభ వుంది. భాషమీద అధికారం సంపాదించావు కూడాను. అది వ్యర్థం చేసుకోకు. నీ అంతట నీ సంగతి చూసుకొని కవిత్వం రాసుకో'మని చెప్పాను.

అతను చివరంటా వినలేదు. ఏదయినా భారతం, భాగవతం లాంటి కావ్యాలు 'వచన కవిత'లో వస్తే అది నిలబడిపోతుందని వూహించేవాడు.

వచన కవితా, మార్క్సిజం, ప్రజలూ వగైరా అంటబెట్టుకొని ఆంజనేయులు తన ప్రతిభను వ్యర్థం చేసుకున్నాడని నమ్మే వాళ్ళలో నేనొకణ్ణి. అంతేకాదు, అతనికి తెలిసి కూడా కావాలని 'వచన కవిత' రాసిన ప్రతివాణ్ణీ బుజం తట్టి ప్రోత్సహించాడు. ఓసారి నాతో అతనే అన్నాడు : "వరదా! మన వెనకటి తరం సంస్కృతం చదువుకున్నారు. తెలుగు స్వాయత్తం చేసుకున్నారు. ఆంగ్ల భాష చదువుకున్నారు. మనం సంస్కృతం చదువుకుందామని తలపోశాము. కలిసిరాలేదు. తెలుగూ, ఇంగ్లీషూ నేర్చుకొన్నాము. తెలుగు మీద ఒకింత అధికారం సంపాయించాము. మరి ఈ తరం చూడూ?"

ఆంజనేయులికి అప్పుడప్పుడు సాంప్రదాయక ఛందస్సులో రాయాలని తపన వుండేది. నలుగురూ ఏమనుకుంటారో అని రాయలేదు. కాల్పనిక కవిత్వం లేదా భావ కవిత్వం అంటే లేని ఎలర్జీని తెచ్చిపెట్టుకున్నాడు. గురువు విశ్వనాథ షష్టిపూర్తికి ఎంత 'వచన కవిత' రాసినా ఆంజనేయులికి తృప్తి కలగలేదు.

నీవాంధ్రాఖిల నీవృతాదృతుడవై
నీలో కవిత్వాపగల్
ప్రోవుల్పడ్డ రసాత్మవై మృదులతా
ముగ్ధంబులున్ తీక్ష్ణతా
భావ ప్రౌఢములైన నీ పలుకులా
స్వాదించి భావించి, నీ
ఈ వైదగ్ధ్యములోన నొక్కఋవుగా
నీ కావ్యముప్పొంగితిన్
—అంటూ రాయక మానలేదు.

నాకోసారి, 1955 లో గుంటూరునుంచి ఉత్తరంలో "You will perhaps be pleased to read the following which I had composed in the train during my return. You take them for what they are worth" అని రాస్తూ

వస్తూ చెప్పిన మాట మ
రిస్తే దిగులొచ్చి నను వరిస్తది నేస్తం!
కాస్త న. బి. తోటి పనిచే
యిస్తూ నీ వల్ల కొంది యేమిటి నేస్తం?
మొదట కొంచెముండి పిదప హెచ్చును ఛాయ
సాయమందు జాలి సాగినట్లు
పెండ్లినాటి వరద పెట్టిన బండుతో
పంట వలతి విరగబండినట్లు.
ఏసునాథు నమ్మి యెవ్వడు చెడినాడు?
ముందు జాగు కొంచెముంది గాని?
ఆసులోని కండె యాడిన విధమేల?
పూర్తియైన చీరెపోగు చూడు!

ఇలా అతనిలో తానై కోరి తెచ్చుకున్న ఘర్షణ కొట్టొచ్చినట్లు కనిపించేది నాకు. అతను సతీవియోగం వల్ల రాసిన 'హంస ఎగిరి పోయింది' అనే ఖండిక చదివిన తరవాత, ఆంజనేయులు ఎంత ప్రతిభా సంపన్నుడో, అమాయకుడో అర్థమవుతుంది. ఈ ఖండకావ్యంలోనే మనిషికీ, కవిత్వానికి కావలసింది మానవత్వం కాని, కేవలం మార్క్సిజం కాదని రుజువు చేశాడు. మరోసారి గురుపాదుల అడుగుజాడల్లో నడిచాడు.

# జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి

గుంటూరులో మొదటిసారిగా శిష్టా ఉమామహేశ్వరరావుని చూసిన అయిదారోజులకి మళ్ళీ బెజవాడలోదిగి వెంకటచలం గారింట్లో వున్నాను. అప్పుడు వెంకటచలం గారింట్లో కృష్ణశాస్త్రి, చింతా దీక్షితులు గారూ వున్నారు. సాయంకాలం స్నానం చేసి నేనూ, వెంకటచలం గారబ్బాయి సంతీ బజారు పోదామని బయల్దేరాము. మేడ దిగి కిందికి వచ్చాము.

అరుబయట కృష్ణశాస్త్రి కుర్చీలో కూచుని వున్నారు. పక్కన దీక్షితులుగారు మంచంమీద కూచుని వున్నారు. వాళ్ళిద్దరి వెనకాల వెంకటచలంగారు నిలబడి నవ్వుతున్నారు. ఆ ముగ్గురికీ ఎదురుగా ఓ కుర్చీ బల్లమీద కూచున్న ఇరవయ్యేళ్ళ వయస్సుగల యువకుడు పద్యాలు చదవటం, అందరూ నవ్వటం చూశాను. నన్ను చూసి వెంకటచలంగారు అక్కడ పద్యాలు చదువుతున్న యువకుడికి ఫలానా అని పరిచయం చేశారు. నేనూ అక్కణ్ణే మంచంమీద కూచున్నాను. విశ్వనాథ సత్యనారాయణగారి పద్యధోరణిని వ్యంగ్యంగా అనుకరిస్తూ అతను రాసిన పద్యాలు విని, అందరూ నవ్వుతూ అతన్ని మెచ్చుకున్నారు. పద్యం కూడా అత్యంత మధురంగా చదివాడతను.

అతని పేరు జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి. అప్పుడు చిట్టిగూడూరు సంస్కృత పాఠశాలలో విద్యార్థిగా వుంటున్నాడు. పద్యాలు చదవటం పూర్తికాగానే వచ్చి నా పక్కనే కూర్చున్నాడు. అంతే- మొదటి పరిచయంతోనే జీవితాంత స్నేహితులమైనాము. నాకన్నా పెద్దవాడు, శ్రీశ్రీ కన్న కొంచెం చిన్నవాడు. వాలకం పల్లెటూరు. నిలబడి నోరు

విప్పితే ఎవర్నయినా క్షుటిలో ఆకర్షించేవాడు. అప్పటికే చక్కటి సంభాషణాచాతుర్యాన్ని సంపాయించినవాడు. అందరూ లేచారు. అతను మాత్రం నాతోనే వుండి 'అలా వూళ్ళోకి పోదాం వస్తావా?' అంటూ మా నాన్నగారు కోడి రామమూర్తిగారి మీద వ్రాసిన గేయాన్ని చదవటం ప్రారంభించాడు. కృష్ణశాస్త్రిగారు వెనక్కి తిరిగి 'ఏది, మళ్ళీ మొదలు పెట్టు' అన్నారు. చదివాడు. 'నీ యశఃపారి జాతమ్ముల మాల' అనే పంక్తిని రెండు, మూడు సార్లు చదివాడు. శాస్త్రిగారు 'బాగుంది—నువ్వు చదివే పద్ధతి బాగుంది' అంటూ వెళ్ళిపోయారు. రుక్మిణీనాథశాస్త్రి నావంక తిరిగి, 'ఇలా పదసమ్మేళనం చేయగల కళాదృష్టి, శక్తి అబ్బూరి రామకృష్ణారావు గారికే పరిమితం' అన్నాడు. ఎందువల్లనో తరవాత ఏళ్ళ తరబడి ఎప్పుడు మేము కలుసుకున్నా అదే పంక్తి చదివి తనలో తాను మెచ్చుకుంటూ వుండేవాడు.

వెంకటచలంగారింటి నుంచి వూళ్ళోకి పోయాము. అలా అలా తిరుగుతూ ఒక హోటల్లో కాఫీ తాగిన తరువాత ఇంటికి పోదామన్నాను. 'సినిమా చూద్దాం' అన్నాడు. 'సరే' నన్నాను. దారి అంతటా బందరు సాహిత్య విశేషాలనూ, కృష్ణా పత్రిక సంగతీ చెపుతూ పోయాడు. మధ్య మధ్య మా నాన్నగారి పద్యాలూ, విశ్వనాథ సత్యనారాయణ పద్యాలూ పాడేవాడు. అతనికో చక్కని బాణీ పద్యం పఠనంలో వుండేది.

ఏం సినిమా వేస్తున్నారో తెలియకుండా అతను టిక్కెట్లు కొన్నాడు. ఇద్దరం వెళ్ళి బెంచి తరగతిలో కూర్చున్నాము. అప్పటికే మేము ఆలస్యంగా వెళ్ళాము. ద్రౌపదీ మానసంరక్షణమో, వస్త్రాపహరణమో - కౌరవుల నిండు సభ, ద్రౌపది ప్రవేశిస్తుంది. అవిడ చేలాంచలాన్ని దుశ్శాసనుడు పట్టుకొని వుంటాడు. ద్రౌపది పాడటం ప్రారంభించింది—"సహింతురా, సహింతురా, రాజరాజాధిరాజుల్ సహింతురా.." అంటూ. రుక్మిణీనాథశాస్త్రి నా ప్రక్కన కూర్చొని "రమింతురా,

రమింతురా, రాజరాజాధిరాజుల్...." అని చిరునవ్వుతో పాడటం మొదలు పెట్టాడు. నేను గట్టిగా నవ్వేశాను. మా చుట్టుప్రక్కల వాళ్ళు విసుక్కుంటున్నారు. అప్పటికీ రుక్మిణీనాథశాస్త్రి వూరుకోలేదు. పాటనంతటినీ అలాగే మధ్య మధ్య విరిచి హాస్యాస్పదం చేస్తున్నాడు. నాకు తప్ప మరెవ్వరికీ వినిపించకూడదని అతని ఆశయం. అయితే మా పక్కనున్న ప్రేక్షకుల్లో పాండవ పక్షపాతం కలవాళ్ళు ఎక్కువగా వుండి ముందుగా రుక్మిణీనాథశాస్త్రిని మందలించారు. శాస్త్రి వూరుకోలేదు. కొంచెం విసుగ్గా "మీకేంబాధా?" అన్నాడు. పాండవ పక్షపాతి 'నోర్మూయ్' అన్నాడు. నాకు కోపం వచ్చింది. "నువ్వే నోర్మూసుకో" అన్నాను. అప్పుడు వాళ్ళందరూ ఏకమై గోల చేశారు. శాస్త్రితో 'పోదాం పద' అన్నాను. శాస్త్రి వూరుకోక "ద్రౌపది వీళ్ళపెళ్ళాం కాబోలు!" నన్నాడు. అంతే అందరూ కలిసి మా ఇద్దర్నీ బలవంతాన గెంటేశారు బయటికి. నాకు ఉక్రోషం. శాస్త్రి నవ్వుతున్నాడు. 'పద పోదాం' ఈ వెధవలకి సాహిత్యం మజా ఏం తెలుసు? అన్నాడు. ఇద్దరం ఇంటివేపు బయలుదేరాం. ఇంటికి రాగానే వెంకటచలంగారికి కథ అంతా చెప్పాను. ఆయన దీక్షితులుగారిని కేకేసి మా ఇద్దర్నీ చూపించాడు.

ఆయన నవ్వుతూ 'ఈ దేశంలో పబ్లిగ్గా ఎగతాళి చెయ్యరాదని ఇప్పటికయినా తెలుసుకున్నావా?' అని శాస్త్రితో చెప్పి, అతన్ని కూడా అక్కడ్ణే భోంచెయ్యమని చెప్పారు. భోజనానంతరం తన విడిదికి వెళ్ళిపోయాడు శాస్త్రి.

మర్నాడు తిరిగి బందరు పోవలసినవాడు పోలేదు. నాకోసమని మరో రెండురోజులు నాతోపాటే బెజవాడలో వున్నాడు. అతనికి తెలుగు దేశంలో ఆ మూలనుంచి ఈ మూలవరకు సాహిత్య వ్యవసాయంలో ఎలాంటి కృషి జరుగుతున్నదో ఆమూలాగ్రం తెలుసు. చాలా మందివి

ఆధునిక కవుల పద్యాలు కంఠతః వచ్చు. అందరి చాటువులూ చదివే వాడు. అందులోనూ బందరులో వున్న, వుంటున్న కవులూ, కథకులూ, సాహిత్యవేత్తలంటే అతనికి మరింత అభిమానం. మా నాన్నగారిని బందరు జాబితాలో వేసేసుకునేవాడు. మా నాన్నగారి గురించి మల్లాది రామకృష్ణశాస్త్రిగారి ద్వారా తెలుసుకున్నానని చెప్పాడు. నేను విశాఖ పట్నం విశేషాలను వివరంగా చెప్పాను. శ్రీరంగం శ్రీనివాసరావు గురించి ప్రత్యేకంగా చెప్పాను. గుంటూరులో నేను చూసిన శిష్లాఉమామహేశ్వర రావు గురించి చెప్పాను. అతనంటే తనకు సరిగా అర్థం కాలేదనీ, అతని కవిత్వం పూర్తిగా చదవలేదనీ చెప్పాడు. శివశంకరశాస్త్రిగారు మాత్రం అతన్ని కీర్తిస్తూ 'అతనే ముందు ముందు రాబోయే కవి' అని అన్నారని చెప్పాను. ఇలా మేము మాట్లాడుకుంటున్నప్పుడు - వెంకటచలంగారు వచ్చి ఆగిపోయారు. "మీరు సభాపతిగారి గురించి మాట్లాడుతున్నారా?" అని అడిగారు. అవునన్నాను. ఆయన శాస్త్రిని చూసి "ఓ పద్యంలో శివశంకరశాస్త్రి—'నీవు స్త్రీ జాతియందు జనించు కతన' అన్నాడు. అదేంజాతిఅయ్యా, విన్నావా?" అంటూ నవ్వటం మొదలుపెట్టారు. రుక్మిణీనాథశాస్త్రి "మీరీపద్యం వినండి, అబ్బూరి రామకృష్ణరావుగారు బందరులో చెప్పారుట!

చాల సామ్యంబు కలదట సాహితీ స
భాధిపతికిని మనరానసభాపతికిని
అర్థమెరుగని శబ్దమ్ము లతడు మోయు
తావి యెరుగని గంధమీతడు వహించు!"

వెంకటచలంగారు నవ్వాపుకోలేక లోపలికి వెళ్ళిపోయారు.

ఇద్దరం ఒకసారే ఓ రోజున స్టేషనుకు వెళ్ళాం. అతను బందరు పోవాలి. నేను వాల్తేరు పోవాలి. అతనిచేత విశ్వనాథ సత్యనారాయణ

గారి శైలికి హేళనగా రాసిన పద్యాల్ని అతని చేత్తో రాయించుకున్నాను. "అచ్చు వేయించమంటావా?" అన్నాడు. 'తప్పక' అన్నాను. "పేరేం పెట్టమంటావు" అని అడిగితే, "అర్థంలేని పద్యాలు" అన్నాను. తరవాత అలాగే వేశాడు. కాని ఒక శార్దూల పద్యంలో చివర 'పాషాణ పాక ప్రభూ' అని సంబోధన ఉంటుంది. అది దొరకటం లేదు. ఆ పద్యాల్లో నాకు నచ్చిందీ, ఇప్పటికీ కంఠతః వచ్చేది:

ఓసి లవిత్ర భ్రూ కుటిల
యుగ్మిక! నీ పువు టెండ వెన్నెలల్
మాసెను, పోతు తుమ్మెదలు
రాచెను, నిష్కృత న్యక్కృతిత్రపా
పేశలముల్ గిరాం నిదులు,
భీక్షణ ధీ పరిణద్ధ మూర్తికల్
శ్రీ సఖముల్, మహస్సులు వి
జేత రహః కిరణక్షపాగతీ!

ఈ పద్యాలు ఓ సంవత్సరం తరువాతనో, ఆపైనో అనుకుంటాను కృష్ణాపత్రికలో అచ్చయినాయి.

* * *

ఆ తరవాత మరో మూడు సంవత్సరాల దాకా రుక్మిణీనాథశాస్త్రిని చూశ్శేదు. ఉత్తరాలూ లేవు. అటూ ఇటూ పోయే స్నేహితులముఖంగా వార్తలు పంపించుకునేవాళ్ళం. అప్పుడు మేము విశాఖపట్నంలో చాత్రాతి వారి వీథిలో ఉంటున్నాము.

ఓ మధ్యాహ్నం పూట - ఆవేళ కాలేజీకి పోకుండా ఇంట్లోనే ఉన్నాను - ఓ కుర్రాడు మా ఇల్లు వెతుక్కుంటూ వచ్చి ఓ చీటి ఇచ్చాడు.

"వరదా! ఓసారి రాగలవా, రా. ప్రేమతో జ. రుక్మిణీనాథశాస్త్రి" అని ఆ చీటీలో ఉంది. నేను వెంటనే పరుగెత్తుకు వెళ్ళాను. టర్నర్స్ చౌల్ట్రీలో వెనకవేపు గదుల్లో ఒకదాంట్లో ఉన్నాడు. నేను వెళ్ళేటప్పటికి చాపమీద పడుకుని ఉన్నాడు. నన్ను చూసి లేచి బయటికివచ్చి నేలమీద కూచున్నాడు. నేను దగ్గరకు పోబోయాను. దూరంగా కూచోమన్నాడు. మొహంలో నేను వెనుకచూసిన తేజస్సులేదు. చిలిపి చూపులేదు. దిగులుగా ఉన్నాడు.

"నాకు క్షయ" అన్నాడు.

నిజంగా నాకు భయం, ఓ రకమైన ఏడుపూ వచ్చినాయి. నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"నేను వైద్యానికి వచ్చాను. ఇక్కడికి రావటంతోటే నిన్ను చూడాలనిపించి కబురు పెట్టాను" అన్నాడు.

ఆరోజు మరో విషయంమీద మాట్లాడలేకపోయాము. విశాఖపట్నంలో ఉన్నంత కాలం ప్రతి రోజూ ఏదో సమయంలో అతన్ని చూస్తూ ఉండేవాణ్ణి. అప్పటికి శ్రీనివాసరావు విశాఖపట్నం వదిలేసి పోయాడు. వైద్యం కొంచెం అలవాటయాక సాహిత్యం గురించి మాట్లాడుకునేవాళ్ళం.

"ఏమన్నా రాయాలనిపిస్తోంది వరదా!" అనేవాడు, కొన్ని రాశాడని నా జ్ఞాపకం. రాసిందల్లా అచ్చువేయించాలని అతనెప్పుడూ అనుకునేవాడు కాదు. తనుకూడా ఇంగ్లీషు భాషా మథనం చెయ్యాలనే తపనతో ఉండేవాడు.

అలా నాలుగైదు సంవత్సరాల తరవాత మదరాసులో మళ్ళీ కలుసుకున్నాం. అతను ఆంధ్రపత్రికలో ఉద్యోగం చేసేవాడు. ఆ రోజుల్లో మైలాపురం లజ్‌లో కాన్నాళ్ళున్నాడు. అప్పటికి మా అందరికీ సాహిత్యం తప్ప మరో ఆసక్తికరమయిన విషయం ఉండేది కాదు.

అందరమూ ఏదో రాస్తూనే ఉండేవాళ్ళం. అచ్చువేయించాలని ఎవరికీ ధ్యాస ఉండేదికాదు. మాలో మేమే చదువుకుని ఆనందించేవాళ్ళం. అలా రుక్మిణీనాథశాస్త్రి రాసినవి చాలా పోయినాయి. అతనికి మాత్రం చాలా కంఠతః వచ్చేవి. ఓసారి అతనిమీద నేను "రుక్కుటేశ్వరశతకం" అంటూ ఓ ముప్పయి పద్యాలు కూర్చాను. శతక మంజరి తీసుకొని అందులో వివిధ శతకాల్లో పంక్తులు ఒక వృత్తంలోకి వచ్చేట్టు చూసి, శాస్త్రికి అన్వయించి "రుక్కుటేశ్వరా!" అని తగిలించేవాణ్ణి. వాటిని ఆ రోజుల్లో ఓ ప్రయోగం క్రింద అందరూ మెచ్చుకునేవారు. ఆ పద్యాలన్నీ శ్రీనివాసరావు కిచ్చాను. అతనెక్కడో పారేశాడు. ఆ పద్యాల్లో సొంతంగా ఆశువుగా ఒకటే పద్యం చెప్పాను.

ఓ రోజు లజ్ కార్నర్‌లో నేనూ, మల్లాది రామకృష్ణశాస్త్రి గారూ, శ్రీనివాసరావూ, సముద్రాల రాఘవాచార్యులు గారూ నిలబడి ఉన్నాం. ఎదురుగుండా మా ముందున్న ట్రాంలో ఎక్కటానికి రుక్మిణీనాథశాస్త్రి దూకుడుగా వస్తున్నాడు. మమ్మల్ని చూసి మా వేపుకు బయల్దేరాడు. ఆ రోజుల్లో అలా అందరం కలిస్తే కాఫీ తాగేవాళ్ళం ఎక్కడన్నా పక్క హోటల్లో. రుక్మిణీనాథశాస్త్రి అప్పుడు "వైదికుల పరిభాష" అనే విషయంమీద ఓ పెద్ద పుస్తకం రాస్తానంటుండేవాడు. అతనికి తోచిన పదజాలాన్ని మాకు సాభినయంగా వినిపిస్తుండేవాడు. శ్రీనివాసరావు నా భుజంతట్టి శాస్త్రిమీద పద్యం చెప్పమన్నాడు. తటపటాయిస్తూ నేను పద్యం చెప్పాను:

'దూకుడు దూకుడై నడక
  దుందుడు కొప్పగచూపు, నోట వై
దీకుల పల్కువేట, కర
  దీపముగా సిగెరెట్టు దాల్చి మా

ఈ కవిమూక జేరితివి
ఇంతటితో సరిపెట్టి మమ్ము కా
ఫీ కయి కొంప పీకకు శ
పింపకు చంపకు రుక్కుటేశ్వరా!"

శాస్త్రి నవ్వేశాడు. 'నాకు అర్జంటు పనుంది, ఆఫీసుకు పోవాలి, తరువాత కలుద్దామ'ని వెళ్ళిపోయాడు. తరవాత ఎన్నేళ్ళకో శ్రీశ్రీ, ఆరుద్ర కలిసి రుక్కుటేశ్వర శతకాన్ని ప్రారంభించి, కొన్ని అచ్చు వేశారు. అందులో మొదటి పద్యం:

'వచియించె "వరద" లోగడ
రచింతునని రుక్కుటేశ్వర శతకమును, మే
మచలిత ధైర్యమ్మున నా
మ చౌర్య మొనరించినాము మన్నించు జరూ!'

ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే - ఆ రోజుల్లో సునిశితమైన హాస్యస్ఫూర్తికి రుక్మిణీనాథశాస్త్రి మా అందరికీ ఒకరకంగా ఇన్స్పిరేషన్‌గా ఉండేవాడు. అతనికి మా నాన్నగారంటే విపరీతమైన గౌరవముండేది. ఓ సారి మా నాన్నగారు మదరాసులో స్నేహితుల ఇంట్లో దిగారు.

శాస్త్రి టెలిఫోను చేసి "నేను రుక్మిణీనాథశాస్త్రిని" అన్నారుట.

మా నాన్నగారు నేనూ 'రుక్మిణీనాథుణ్ణే' అని జవాబిచ్చారు.

ఫోను అవతల మనిషి పొరపాటు చేస్తున్నాడేమో ననుకొని "అబ్బూరి రామకృష్ణారావు గారు కావాలండీ" అన్నాట్ట.

అవతలనుంచి మా నాన్న పద్యం చదివారు:

'నన్ను నైతము రుక్మిణీనాథుడండ్రు
అస్మదర్ధాంగి రుక్మిణి యగుటవలన
సహృదయుల మాట నీలాటి సామ్యమునకు
కొదువ యుండదు వెదకిన కొలది మనకు'

ఇలాంటి సన్నివేశాలు బోలెడు చెప్పేవాడు శాస్త్రి. అవన్నీ అతను రాతలో పెడితే ఎంత బాగుండేదోనని అతన్ని తలుచుకున్నప్పుడల్లా నేను బాధపడుతూంటాను.

అతను అన్నిట్లోనూ వేలు పెట్టాడు. కొన్నాళ్ళు అభ్యుదయ కవులతో తిరిగాడు. తరవాత మదరాసులో అతి వాస్తవిక ధోరణిని అనుసరించాడు శ్రీశ్రీతో పాటు. అయితే మొదట్నుంచీ ఇంగ్లీషు రాక పోయెనే అనే బాధ అతనిలో ఉండేది. పైకిమాత్రం పొక్కనిచ్చేవాడు కాదు. ఏమన్నా కొత్తగా రాస్తే చదివి వినిపించేవాడు. ఎలా ఉందని అడిగేవాడు.

తమిళంలో 'విడుదలై' అనే పత్రిక ఉండేది. మౌంటురోడ్డులో ఓ రోజున ఇద్దరం నడుస్తుంటే ఆ పత్రికను ఓ కుర్రాడు 'విడుదలై, విడుదలై' అని అరుస్తూ అమ్ముతున్నాడు.

శాస్త్రి నావంకచూసి 'మనం ఇంత చక్కని పదాన్ని వాడుకో లేకపోయాం, సంస్కృత పదాలను వాడుతున్నాం' అన్నాడు. ఆ తరవాత "విడుదలో, విడుదలో" అంటూ ఓ గేయం రాశాడు. తెలుగంటే అంత మమకారం ఉండేది.

ఎన్నికల్లో శ్రీశ్రీకి మతిపోయినప్పుడు చాలా బాధపడ్డవాళ్ళల్లో శాస్త్రి ముఖ్యుడు. నాకు మదరాసు నుంచి అతని పరిస్థితి గురించి వారానికి రెండుసార్లయినా రాసేవాడు. శ్రీశ్రీమీద నేను రాసిన పద్యం అప్పుడు 'స్వతంత్ర'లో అచ్చయింది. అదిచూసి "దారితప్పిన పిల్ల" అనే సుదీర్ఘ కావ్యఖండాన్ని రాస్తున్నానని నాకు చెప్పాడు. అదేమయిందో తెలీదు. ఆలాగే 'మైల నిఘంటువు' అనే ఆసక్తికరమయిన పల్లీ పట్ట ణాల పేర్లు 'అశ్లీల' పదాలకు పర్యాయంగా సమకూర్చాడు. అదెక్కడ అంతర్ధానమయిందో!

అతను అతివాస్తవిక ధోరణిలో ఉన్న రోజుల్లో 'లింగతాడనం' అనే లఘుకావ్యం రాశాడు. చెప్పుకోదగ్గ ఖండకావ్యం. దాన్ని శ్రీరంగం నారాయణబాబుకు అంకితం చేశాడు. అంకితం చేస్తూ ఇలా రాశాడు: "బాబూ! నీ చేతిలో పెడుతున్నాను. మరేం చేస్తావో?" ఈ కావ్యంలోని పంక్తులు శ్రీశ్రీకి కంఠతః వచ్చేవి. ఇదీ ఎక్కడికిపోయిందో తెలీదు.

రుక్మిణీనాథశాస్త్రికి సాహిత్యంమీద, ముఖ్యంగా కవిత్వంమీద ఉన్న అభిరుచివైనం ఆ రోజుల్లో మరెవ్వరికీ లేదంటే అతిశయోక్తికాదు. చెళ్ళపిళ్ళవారి మాట వాడాలంటే, అతనంత 'పిస్నాణి'ని మనం చూడం.

# బైరాగి

నలభై ఏళ్ళకు పైన, మా నాన్నగారు నాట్యగోష్ఠి ఉద్యమానికి అనుబంధంగా "నటాలి" అనే నాటక సంస్థను ప్రారంభించారు. యుద్ధం ముమ్మరంగా సాగుతున్న రోజులు. మా నాన్నగారితో పాటు మేమంద రమూ ఎమ్.ఎన్. రాయ్‌గారి నాయకత్వం కింద అప్పుడు జరుగుతున్న ప్రపంచ యుద్ధాన్ని ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంగా పరిగణించి, అందులో పాల్గొనటానికి యథాశక్తిని నిర్ణయించాము. యుద్ధంలో ఫాసిస్టు వ్యతిరేక శక్తులు విజయం సాధించిన పక్షంలో, భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చి తీరుతుందని ఎమ్.ఎన్. రాయ్‌గారు ప్రవచించారు. ఆయన అనుచరుల్లో కొందరు— "అయ్యా, యుద్ధాన్ని మనం బలపరిస్తే ప్రజల్లో మన పలుకుబడి పోతుందేమో?" అన్న భయాన్ని వ్యక్తం చేశారు. రాయ్‌గారన్నారూ, "మీకు దేశ స్వాతంత్ర్యం కావాలా, తాత్కాలికంగా ప్రజల్లో పలుకుబడి కావాలా అన్నది తేల్చుకోండి" అని. అప్పుడందరూ యుద్ధ ప్రయత్నంలో పాల్గొనటానికి తీర్మానించారు.

తెలుగు దేశంలో చాలామంది మేధావులూ, యువ రచయితలూ రాయ్‌గారి అనుచరులయి, వివిధ రంగాల్లో యుద్ధ ప్రయత్నానికి దోహదం చేశారు. మా నాన్నగారు కాక, ములుకుట్ల వేంకటశాస్త్రి, పాలగుమ్మి పద్మరాజు, త్రిపురనేని గోపీచందు, జి.వి. కృష్ణారావు, పి.వి. సుబ్బారావు, బాలగంగాధర తిలక్ ప్రభృతులుండేవారు. ఆ కోవలో చివరన నిల్చున్న వాడు ఆలూరి బైరాగి. ఎంచేతనంటే, అప్పటికి అతను తెలుగులో రచయిత కాలేదు.

ఆ రోజుల్లో నేనూ "నటాలి"లో పనిచేస్తుండేవాణ్ణి. నాతో పాటు శ్రీరంగం శ్రీనివాసరావూ, శ్రీరంగం నారాయణబాబూ పనిచేసేవాళ్ళు. శ్రీరంగం శ్రీనివాసరావుని మా నాన్నగారు స్వయాన పట్టుకొచ్చారు. నారాయణబాబు దొడ్డివాకిలిని ప్రవేశించాడు. అది వేరేకథ. మదరాసు నుంచి నటాలిని మొదట్లో చీరాల తరలించారు. చీరాల నుంచి తెనాలికి మార్చారు మా నాన్నగారు. నటాలిలో నలభై మంది నటీనటులూ, సాంకేతిక నిపుణులూ ఉండేవారు. తెనాలిలో ముందుగా ముత్తంశెట్టిపాలెంలో ఒక పెద్దమేడలో ఉండేవాళ్ళము. ఆ తరువాత నాజరుపేటలో మరో పెద్ద ఇల్లు తీసుకుని అందులో ప్రవేశించాము. మాకు నాటక ప్రదర్శనలు లేని రోజున తెనాలిలో ఉండేవాణ్ణి. సాయంకాలం కాగానే "సూతాశ్రమం"లో చేరేవాళ్ళము. అందులో గోపీచందూ, ఆయన తమ్ముడు గోకుల్చంద్ ఉండేవారు. గోపీచందుతో కలిసి ఆ పక్కనే ఉన్న రత్నాటాకీస్ ముందర బల్లలమీద కూచునేవాళ్ళము. అక్కడికి ప్రతిరోజూ సమావేశమయ్యే వారిలో పి.వి. సుబ్బారావు, సూరీ, బైరాగీ, నేనూ ఉండేవాళ్ళము.

మొదటి పరిచయంతోటే బైరాగి నాకు సన్నిహితుడయినాడు. ఆ రోజుల్లో అతను తెలుగు సాహిత్యం కొంచెం కొంచెం అధ్యయనం చెయ్యటం ప్రారంభించాడు. ముఖ్యంగా ఆధునిక సాహిత్యం. అందులోను కథలూ, నవల్లూ - అవన్నీ రత్నాటాకీసు సమావేశంలో దీర్ఘంగా చర్చిస్తుండేవాళ్ళము. గోపీచందు కూడా ఆ చర్చల్లో పాల్గొని తన కథల గురించీ, నవలల గురించీ విపులంగా చెబుతుండేవాడు. ఇవన్నీ వింటున్న బైరాగికి ఎవరి రాతలమీదా ప్రత్యేకాభిమానం లేదని మాకు తెలిసేది. మేమంతా మాట్లాడుకుంటే మధ్య కలుగజేసుకుని ఓ వితండ వాదాన్ని లేవదీసేవాడు. దాంతో గోపీచందుకి విసుగొచ్చేది. కోపం కూడా తెచ్చుకునేవాడు.

షికారుకు బయలుదేరి రాజకీయాలను చర్చించేవాళ్ళము. అందరమూ విడిపోతున్నప్పుడు నాతో పాటు బైరాగి వచ్చేవాడు. మేమిద్దరం మళ్ళీ కొంచెం సాహిత్యం గురించి మాట్లాడుకునేవాళ్ళము. నేను బైరాగికి చెప్పాను- ఊరికే అన్ని పుస్తకాలూ చదవకు, ఏమన్నా రాయటం ప్రారంభించూ అని. అతను మాట్లాడేవాడు కాదు. ఇలా కొన్నాళ్ళయింతరవాత ఓ రోజున బైరాగి రత్నా టాకీసు గోష్ఠిలో కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగార్ని విమర్శించాడు. బైరాగి అంటాడూ, మనమంతా వర్ణాశ్రమ వ్యవస్థను సమూలంగా విచ్ఛేదించాలని తీర్మానిస్తుంటే, కవిరాజుగారు ప్రతి కులంలోనూ మరో వర్ణాశ్రమ ధర్మాన్ని ప్రవేశపెట్టేందుకు ప్రయత్నిస్తున్నారని. దాంతో పి.వి. సుబ్బారావుకి కోపం వచ్చింది. ఇద్దరూ చెడామడా వాదించుకున్నారు. మేం వింటూ మాట్లాళ్ళేదు. తరవాత ఇంటికి పోతున్నప్పుడు 'నాకు రాయాల్నుందిరా ఇప్పుడు' అన్నాడు. 'రాయ్ ఆలస్యం చెయ్యక' అన్నాను నవ్వుతూ. 'అదోకోరిక' అన్నాడు.

ఓ రోజున గోపీచందు కొత్త నవల రాయటానికి ప్రారంభించాడు. బైరాగి లాంటి అసమర్థుడు అందులో నాయకుడుగా ఉంటాడన్నాడు. నే నన్నానూ, 'అసమర్థుడి జీవనయాత్ర అని నేనూ ఆత్మకథ రాద్దామనుకుంటున్నాను' అని. గోపీచందు ఆ శీర్షికను తనువాడుకుంటానన్నాడు. నవ్వుతూ నేను చెప్పాను, అందులో బైరాగి నాయకుడు కాకపోయిన పక్షంలో మీరీ శీర్షికను వాడుకోవచ్చునని. బైరాగికి ఇదంతా విని వుక్రోషం వచ్చింది. సమావేశం అయిపోగానే మామూలుగా మేమిద్దరమూ నడుస్తున్నాము మా ఇంటివేపు. నాకో నవల రాయాలనుంది, అందులో మన మేధావుల్నందర్నీ బట్టబయలు చెయ్యాల్నుంది అంటూ బైరాగి ఆవేశంతో మాటాడుతున్నాడు. బైరాగితో చెప్పాను: 'అందరి మీదా నీది పైచేయి కావాలంటే కవిత్వం రాయి. అంతేకాని, అందరిలాగా నవల్లో, కథలూ తల పెట్టక' అని.

మళ్ళీ బైరాగి రత్నాటాకీసువేపు రాలేదు. మూడు, నాలుగు రోజు లయింది. అతనికి ఒంట్లో బాగులేదేమోననుకున్నాము. ఓ రాత్రి మత్తం జెట్టిపాలెంలో మా ఇంటికొచ్చాడు. అప్పుడా ఇంట్లో విద్యుచ్ఛక్తి లేదు. కొత్తగా కట్టిన పూర్తికాని మేడ మెట్లమీద 'వరదా, వరదా' అని అరుస్తు న్నాడు. నేను కిందికొచ్చాను. 'కాస్సేపు బయటకిరా' అన్నాడు. మేడ వెలుపలికి వచ్చాం. "నేను రాశాను. నువ్వు చదివిచెప్పు" అన్నాడు. చేతిలో రెండు కాగితాలు. మళ్ళీ లోపలికి పోయాము. లాంతరు పెట్టుకుని అతను చదవటం, నేను వినటం. విన్న తరవాత అద్భుతంగా వుందన్నాను. అందులో రెండే పంక్తులు నాకిప్పటికీ గుర్తు.

నగనగమ్మున పన్నగమ్ము
నదీ నదమ్ముల విప్రదవమ్ము....
చిరపరిచిత పాంథులారా! పతితజీవ బంధులారా!

అదే బైరాగి తొలి ప్రయత్నం. అదెక్కడా అచ్చు వెయ్యలేదు. తరవాత మేమంతా విడిపోయాము. మిత్రుడు కృష్ణానందం బైరాగి 'నూతిలో గొంతుకలు', నా 'అందాక' రెండో ముద్రణ అచ్చేయిస్తున్న ప్పుడు 'నూతిలో గొంతుకలు' పుస్తకానికి నన్ను తొలిపలుకు రాయ మన్నాడు బైరాగి. మా నాన్నగారి చాటువులలో రెండు పంక్తులను ఉల్లేఖిస్తూ మన రచనలకు ఉపోద్ఘాతాలనవసరం అని రాశాను. అయినా తన పుస్తకంలో నే నన్నది ఒప్పుకుంటూ క్లుప్తంగా పరిచయం రాసుకున్నాడు.

మళ్ళీ అతన్ని చూడలేదు. మా 'కవిత'కు అతని పద్యాలకోసం రాశాను. అపుడు తెనాలిలో వున్నాడు. ఒకేసారి నలుగురం మాలాంటి వాళ్ళం 'కవిత'లో కలిశాం. మా అందరికీ ఆనందదాయకంగా వుండేది.

ఆఖరిసారిగా అతన్ని ఒకేసారి హఠాత్తుగా ఢిల్లీలో కలిశాను. వేమూరి ఆంజనేయశర్మగారతన్ని ఢిల్లీ పిలిపించారు. ఏదన్నా ఉద్యోగం వెతుకుదామనే ఉద్దేశంతో, మా ఇంటికొచ్చాడు. 'ఒరేయి వరదా, మనం ఇంకెన్నాళ్ళని బతకటం - ఇక్కడే వుందామని వొచ్చాను. ఇది నా ఆఖరి ఉద్యోగం' అన్నాడు గుమ్మంలో కాలు పెడుతూ. డిసెంబర్ చలి. ఓ కోటు వేసుకున్నాడు. జవహర్లాలు నెహ్రూ మార్గ్‌లో ఓ పాత కొంపలో శర్మగారతనికో గది ఇప్పించారు. చలికి తట్టుకోలేకపోయాడు. అతనున్న కొద్ది రోజులూ నాతోనూ, రాజశేఖరుతోనూ గడిపాడు.... 'వెళ్ళిపోతాను, నన్ను రైలెక్కించి పుణ్యం కట్టుకో' మన్నాడు. అతనే, "రైలునించి దిగటం సులభం, ఎలా దిగామో తెలీదు. మళ్ళీ ఎక్కటమే బాధ" అన్నాడు నవ్వుతూ. ఆ నవ్వే నాకిప్పటికీ జ్ఞాపకం.

# కొంపెల్ల జనార్దనరావు

**మూడో** ఫారం చదువుతున్నాను. అప్పుడు విశాఖపట్నంలో కురుపాం మార్కెట్టుకు ఎదురుగా ఉన్న ఇంట్లో ఉండేవాళ్ళము. మా ఇంటి కుడివేపున చివరగా శంకర్‌విలాస్ హోటలు ఉండేది. ఆ రోజుల్లో అది ప్రసిద్ధమైంది. దాని ప్రక్కగా మొసలికంటి వారి వీథి. ఆ వీథి టౌను హాలుదాకా పోయేది. అందులో దాదాపు చివరి సందులో పురి పండా అప్పలస్వామి గారుండేవారు. నేను మధ్యాహ్నం పూట భోజనం చేసి తిరిగి ఇంటినుంచి స్కూలుకి అప్పలస్వామిగా రింటిమీదుగా పోయే వాణ్ణి. అప్పలస్వామిగారి వీథి కెదురుగా పోయేరోడ్డు చంగల్రావు పేట మీదుగా మా స్కూలుదాకా పోయేది.

మామూలుగా ఓ రోజున అలాగే అప్పలస్వామిగారి ఇంటి కెళ్ళాను.

నన్నాయన చూడ్డంతోటే నవ్వుతూ "నీకు కబురు పెడదామను కుంటున్నాను, నువ్వే వచ్చావు" అన్నారు.

"నాతో ఏమన్నా పని పడిందా?" అన్నాను.

"అవును. మదరాసునుంచి జనార్దనరావు వచ్చాడు. నిన్ను చూడా ల్ననుకుంటున్నాడు. కాసేపు ఉండగలవా – లేకపోతే సాయంకాలం ఖాదీ భాండారుకు రాగలవా?" అన్నారు.

"ఓ గంటపాటు ఉండగలను" అన్నాను. అన్నానోలేదో శ్రీరంగం శ్రీనివాసరావూ, అతనితోపాటు మరో ఆయనా వచ్చారు. ఆయన అంత లావూ లేడు అంత సన్నగానూ లేడు. అంత ఎరుపూ కాదు, అంత చామనచాయా కాదు. బాగా ఎదిగిన జుట్టు, సన్నని మీసం, చక్కని

నుదురూ, నాసిక. ముతక ఖద్దరు బట్టలు. అవి అంత పరిశుభ్రంగా ఉన్నట్టు తోచలేదు.

వాళ్ళిద్దరూ కూచున్న తరవాత అప్పలస్వామిగారు నన్నతనికి పరిచయం చేశారు.

అతను లేచి నిలబడి నా తల నిమురుతూ "నీ గురించి విన్నాను. నా పేరు కొంపెల్ల జనార్దనరావు. నువ్వు రాసిన పద్యాలేమన్నా ఉంటే కావాలి. పట్టుకుపోతాను" అన్నాడు.

శ్రీనివాసరావు నాతో అన్నాడూ, "జనార్దనరావు పత్రిక పెట్టాడు. అది కేవలం సాహిత్య పత్రిక. నీ పద్యాలు అందులో వేస్తానంటున్నాడు. ఏఁవన్నా కొత్తవి రాశావా?" అని.

అప్పలస్వామిగారు అందుకొని - "నేను చెబుతాను - ఆ పద్యాలిచ్చెయి" అన్నారు.

'ఆ పద్యా' లంటే నేను మా చెల్లెలు సుజాతమీద రాసిన పద్యాలు. మేము వాల్తేరు వచ్చిన సంవత్సరానికే ఆ అమ్మాయి దివంగతురాలయింది. మా అందరికీ అల్లారు ముద్దుబిడ్డ. ఎంచేతనో ఆ పద్యాల్ని అందరూ మెచ్చుకునేవారు. ఎక్కడా అచ్చవలేదు. ఎక్కడకు పోయినా నాచేత ఆ పద్యాల్నే చదివించేవారు. ఓసారి విజయనగరంలో అఖిలాంధ్ర విద్యార్థి సమావేశ సందర్భంలో ప్రముఖాంధ్ర కవులంతా వచ్చారు. కిళాంబి రంగాచార్యులుగారింట్లో వారందరికీ విందు ఏర్పాటయింది. అక్కడ అందరూ పద్యాలు చదివారు. నన్నూ చదవమని బలవంతం చేశారు. అందరిలోనూ పసికందును, ఆ పద్యాల్ని చదివాను. అందరూ చప్పట్లు కొట్టారు.

సమావేశంలో ఉన్న కృష్ణశాస్త్రిగారు పద్యాల్ని నా చేత రాయించుకుని, తన సహజ మధుర కంఠంతో వాటిని మళ్ళీ చదివారు. అందరి కళ్ళూ చెమ్మగిలటం గమనించాను. అమాంతం నేనూ ఏడ్చాను.

రంగాచార్యులుగారు నన్నోదార్చటం ఇప్పటికీ నాకు గుర్తు. ఆ పద్యాల్ని వినే, స్నేహితుడు రాచకొండ విశ్వనాథశాస్త్రి నాకు పరమాప్తుడైనాడు. ఆ పద్యాలు అతనికి ఇప్పటికీ లీలగా గుర్తు. ముందస్తుగా నన్నాకాశాని కెగరేసింది విశ్వనాథశాస్త్రి!

జనార్ధనరావు "బాబూ" ఆ పద్యాలు చదవగలవా?" అని అడిగాడు. నేను తటపటాయిస్తూ చదవటం మొదలుపెట్టాను. మధ్యలో అకస్మాత్తుగా పంక్తులు మర్చిపోయాను. జనార్ధనరావు భుజమ్మీద చేయివేసి "ఫరవా లేదులే, రాసి పట్రా!" అన్నాడు. సరేనన్నాను.

మర్నాడు పొద్దున శ్రీనివాసరావూ, జనార్ధనారావూ మా ఇంటి కొచ్చారు - మానాన్నగారిని కలుసుకోవటానికి. జనార్ధనరావు నేలమీద దృష్టిపెట్టి మా నాన్నగారితో మాట్లాడుతున్నాడు. కవిత్వం, దాని భవిష్యత్తు - అలాంటిదేదో అంతగా గుర్తులేదు.

మా మాన్నగారంతా విని శ్రీనివాసరావుతో, "నా సంగతి నీకు తెలుసుకదా, జనార్ధనరావుగారికి నచ్చచెప్పు" అని లేచారు.

అంటే జనార్ధనరావు పత్రిక్కి తనవల్ల ఎలాంటి ఉపయోగం లేదని చెప్పటం. అప్పటికి మా నాన్నగారు కవిత్వం రాయటం మానేశారు. ఆయన అముద్రిత పద్యాలలో ఆఖరివి కవితా సమితి వార్షిక సంచిక వైశాఖిలో పడ్డవి. ఆ తరవాత చాలా సంవత్సరాలదాకా ఆయన రాయలేదు.

శ్రీనివాసరావూ, జనార్ధనరావూ సెలవు తీసుకుని బయల్దేరారు. వాళ్ళ వెనక నేనూ నడిచాను.

జనార్ధనరావు శ్రీనివాసరావు వంకచూస్తూ, "రామకృష్ణారావు గారిచేత నువ్వే రాయించాలి" అని మెల్లగా అన్నాడు.

శ్రీనివాసరావు నా వంక తిరిగి "వరదా, నాన్నగారెందుకు రాయటం మానేశారూ?" అన్నాడు. నాకు తెలియదన్నాను.

జనార్ధనరావు శ్రీనివాసరావుతో- "నువ్వాయన్ని ఎందుకు రాయటం లేదో కనుక్కొని ఓ వ్యాసం నాకు రాసి పంపించాలి. అది చాలా ఆసక్తి కరంగా ఉంటుంది" అన్నాడు.

శ్రీనివాసరావు సరేనన్నాడు. "నేను ఆయన్ని ఈ సందర్భంగా అడిగాను. ఆయన నన్నెదురు ప్రశ్న వేశారు- 'నేనెందుకు రాయాలో నువ్వుచెప్పు. ఆ తరవాత నీ ప్రశ్నకు సమాధానమిస్తా'నన్నారు" అని.

జనార్ధనరావు నవ్వాడు. జనార్ధనరావు మొహం చూస్తేనే తప్ప అతను నవ్వుతాడని తెలీదు. అంత నిశ్శబ్దంగా నవ్వుతాడు.

"మనం అలా ఓ శీర్షిక పెడదాం, అందరిచాతా రాయిద్దాం—చివరిని రామకృష్ణారావుగారిచేత రాయిద్దాం" అన్నాడు.

శ్రీశ్రీ "చూద్దాం" అన్నాడు.

మొసలికంటివారి వీధిలో వాళ్ళని సాగనంపి నే నింటికి వచ్చేశాను.

ఆ సాయంకాలం మళ్ళీ ఖాదీ భాండారంలో జనార్ధనరావు కనిపించాడు. వచ్చిన గొడవ, అతనితో మాట్లాడినంతసేపూ సాహిత్యం గురించే మాట్లాడేవాడు. ఆ రోజులలో అలాంటి వాళ్ళని నేనిద్దర్ని చూశాను. ఒకాయన ఇన్సూరెన్సు ఏజెంటు. ఆయన సాముద్రికం కూడా చూస్తాడు. మా ఇంటికొచ్చేవాడు. ఆయన నిరంతరం భీమా వ్యవహారం గురించే మాట్లాడేవాడు. మరో విషయం అతని ముఖతః నేను వినలేదు. మరో ఆయన మారిస్‌గారని క్రైస్తవుడుండేవారు. ఆయన పేరొందిన డాక్టరు. చాలా మంచివారు. ఆయన నన్ను కారులో ఎక్కించుకుని ఊరంతా తిప్పేవారు. ఆయన క్రీస్తూ, అతని బోధనలు గురించి తప్ప మరేవిషయం మాట్లాడేవాడుకాడు. ఎవరన్నా వైద్యానికొచ్చినా అంతే జనార్ధనరావూ నా కలాగే అనిపించాడు.

అంతేకాదు. తన పత్రిక ఎలా నడుస్తుందా, ఎలా బ్రతుకుతుందా అనే ధ్యాస అతనికి ఇరవయి నాలుగు గంటలూ ఉన్నట్టు కనిపించేవాడు. చందాల్ని ముఖతః అడగటం అతనికి మొహమాటం. కాని చందాలు వసూలు చెయ్యాలి. ఎలాగో తెలిసేదికాదు. చెన్నపట్నం చేరుకున్న తర వాత ఆదియప్ప మొదలివీథి, పరశువాకం నుంచి ఉత్తరాలు రాసేవాడు మిత్రులందరికీ.

ఇలాంటి మరో మహావ్యక్తిని ఒకర్నే చూశాను. ఆయన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఆయన 'ప్రబుద్ధాంధ్ర' అనే పత్రిక నడిపేవాడు. సాలుచందా రూపాయి. ఆయన ప్రత్యేకత హిందీ భాషా వ్యతిరేకత. అంచేత కొంతమంది జాతీయవాదులు చందాలు కట్టేందుకు సందేహించే వారు. ఆయన ఒకసారి విశాఖపట్నం వచ్చి పురిపండా అప్పలస్వామి గారింట్లో దిగారు. నేనంటే ఆయనకి అవ్యాజానురాగం. ఆయనకో నిర్ణీత కార్యక్రమం ఉండేది. విశాఖపట్నంలో రెండు రోజులున్నారంటే కనీసం పదిమంది చందాదార్లను చేర్పించాలి. రోజు కయిదుగురు. అలా అయిదు చందాలు దొరక్కపోతే ఆయన అభోజనం కూచునేవారు. మిత్రులం దరూ పరిగెత్తుకెళ్ళి చందాలు పోగుచేసేవారు. ఆయనకా రోజున చందా దార్లు నలుగురే దొరికారు. భోజనం మానేశారు. ఆయన తనతోపాటు నన్నూ తీసుకుపోయేవారు చందాదార్లకోసం.

* * *

జనార్ధనరావు చిన్నప్పట్నించీ ఉత్తరాలు రాయటం అలవాటు చేసుకున్నాడు. తన మనస్సును విప్పుకోవాలంటే ఉత్తరాలే ముఖ్య సాధ నాలని అభిలషించి ఉంటాడని నా అనుమానం. నా ప్రథమ పరిచయం అయిన తరువాత అతను మద్రాసు తిరిగి వెళ్ళిపోయాడు. నాకో కార్డు ముక్క రాశాడు. శ్రీనివాసరావుకీ రాశాడు. తన వెంట తీసుకుపోయిన నా పద్యాలూ, తురగా వెంకట రామయ్యగారి పద్యాలూ ఎక్కణ్ణో

వదిలేశా ననీ, ఎంత వెదికినా దొరకటంలేదనీ, తిరిగి రాసి పంపించమనీ ఉత్తరాలు. శ్రీనివాసరావుతో చెప్పాను. అతడు మళ్ళీ వస్తానన్నాడుగా, అప్పు డతనికి స్వయంగా ఇస్తానన్నాడు. వెంకటరామయ్య గారు తన పద్యాల పట్ల అంత అశ్రద్ధ చేశాడు కనక, తిరిగి రాయటం దుర్లభం అన్నాడు.

జనార్దనరావుది సాంప్రదాయకమైన పండిత కుటుంబం. తూర్పు గోదావరి జిల్లాలోని గంగలకుర్రు స్వగ్రామం. 1906 లో జననం. కాకినాడలో, జాతీయ పాఠశాలలో విద్యాభ్యాసం చేశాడు. స్వయంకృషితో కొంచెం ఆంగ్ల భాషాధ్యయనం చేశాడు. అతనికి కౌమార దశ నుంచీ ఆంగ్లేయ కాల్పనిక కవులనూ, వారి జీవితాలనూ ఆదర్శంగా ఊహించే వాడని నే ననుకునేవాణ్ణి. ప్రసిద్ధ కాంగ్రెసు నాయకులైన బులుసు సాంబ మూర్తిగారు జనార్దనరావుకి దగ్గరి బంధువూ, శ్రేయోభిలాషీని. ఆయన ప్రోద్బలం మీదనే 'భారతి'లో ఉప సంపాదకుడుగా ఉద్యోగం చేశాడు. ఉద్యోగం చేస్తూనే "ఉదయిని" అనే ఆదర్శవంతమైన సాహిత్య పత్రికను నిర్వహించాలని కలలు కని, చివరికి పత్రికను ప్రారంభించాడు. మొదటి సంచిక రావటంతోటే, ఆనాటి గూడవల్లి రామబ్రహ్మం గారి 'ప్రజా మిత్ర'లో వేలూరి శివరామశాస్త్రి గారు "చెణుకులు" అనే శీర్షిక కింద "ఉదయిని" లోని రచనల్ని తూర్పార పట్టటం జరిగింది. ఆ రోజుల్లో సాహిత్య వర్గాల్లో అదో సంచలనం! ముందుగా అలా రాసింది శివరామ శాస్త్రిగారని తెలియదు. తరవాత తెలిసేటప్పటికి జనార్దనరావు కొంచెం నిరుత్సాహపడ్డాడు.

ఆ మరుసటి సంవత్సరం చివర్లో జనార్దనరావు మళ్ళీ విశాఖపట్నం వచ్చాడు. అతను మాట్లాడినంత సేపూ పత్రికను గురించి తప్ప మరో సంగతి మాట్లాడగా నే వినలేదు. పత్రికానిర్వహణంలో తను పడుతున్న బాధలూ, ముఖ్యంగా ఆర్థిక హీనత అతన్ని వదిలేవి కావు. అందరూ

ప్రోత్సహించేవాళ్ళే, డబ్బెక్కణ్ణించి వస్తుంది? తరవాత తను తలపోసిన అగ్ర రచయితలు అతన్ని పలకరించటమే కాని, అతను కోరిన విధంగా సకాలానికి రచనలు పంపేవారు కారు. అదో బాధ. ఇన్ని తలపైన భారంగా పెట్టుకొని, తనో కలకాలం నిలిచే కవిత్వం రాయాలని తపన! దానికి తోడు లోన అగోచరంగా ప్రారంభమైన క్షయ! తరవాత తరవాత అతన్ని తలచుకొన్నప్పుడల్లా థామస్ మాన్ నవల్లోని పాత్ర ఇతనేనా అని అనిపించేవాడు కొన్ని సందర్భాల్లో! జనార్దనరావు కలల్ని పూర్తిగా నమ్మి హతాశుడయినవాడు శ్రీనివాసరావు.

జనార్దనరావు పత్రిక ప్రారంభించే ముందుగా ఓ మిత్రుడికి రాసిన ఉత్తరంలో కొన్ని భాగాలు ఉల్లేఖిస్తాను :

"....నేను మహా పెసిమిస్టిక్‌గా ఉన్నాననుకున్నావా ఏమిటి? నేను సాధారణంగా ఉత్తరం రాస్తే కడుపు నిండేటట్టుగా రాసుకుంటాను. అటు వంటిది అలా రాసుకోలేక పోవటానికి చిల్లరు లేవో అడ్డు వచ్చాయి. ఆ ఉత్తరం చూసి నాకు నిర్వేదం పుట్టింధి. నీకు రాసిన వెంటనే శ్రీశ్రీకి రాశాను. అందులో ఒక విషయం అవసరమయింది. దాని మీద ఇన్ని మాటలు, భావాలు పొయ్యటానికి భేషుగ్గా రాశాను! ప్రసరించింది మనస్సు. అప్పటికి ఆఫీసు అయిపోయింది. ఖాళీగా వుంది. కొంత మనస్సు తెరిపిగా వుంది. నీ ఉత్తరం కూడా అప్పుడే మొదలుపెట్టినా బాగుండునేమో! నాకు ఆఫీసు కొన్ని విధాల విసుగు కలిగిస్తూ వుంది. ఆ వాతావరణం అనుకున్నంత బాగాలేదు. కాదు, అనుకున్నంత కాదు. అంతా బాగాలే దంటే బాగుంటుంది. అయితే, ఇటువంటివి మనస్సు కలత పెట్టినప్పుడు, ధార్మికంగా నిలతొక్కుకుంటూ వుంటాను. ఇలాంటివి లేకపోతే, ప్రయ త్నానికి ఖర్చు పడనక్కరలేదు. లేకపోతే, ఆ ఫిలాసఫికల్ టెంపరమెంట్

బాగా కల్టివేట్ కానేకాదు అని ఒక అభిప్రాయం లేవజూస్తుందేమో! ఇంత కంటే గొప్ప అనుభూతులు దానిని పెంపొందించేవే వుంటాయి. అయితే నా జీవితం పట్ల నాకేమీ అసంతృప్తి పీడించి వేయడం లేదు. కాని విశ్వాత్మ సమేళ స్వరాలు ఆస్వాదించు కోవడానికి నా ప్రసారం అణు వణువునా నివృత్తి మాహాత్మ్యం అలవరించుకోవటానికి వైకల్యం మీటే భౌతిక చలనాలు ఒక్కొక్కప్పుడు, నేను సింహాసనం దిగినప్పుడు కలత పెడతాయి.

"సతత నూతన మృదువిలాస ప్రభాత
తావక మనోజ్ఞలాస్య సందర్శనమున
నాదు భావాలు మధురగానమ్ము సలిపె
ప్రకృతి ఆనంద తన్మయత్వమున మునిగి...."

అనుకున్నప్పుడు

'ఏది చూచిన యెద గుబాళింపు వలపు'

అనుకున్నప్పుడు ఈ లేశాల భాగధేయం ఏదో తెలుసుకుంటాను - అనుభవిస్తానని.

నా మనస్సు నిత్యశాంతి ఇంకా అలవరించుకోలేదు. నా శరీరం లాగే మనస్సు కూడా ఒక జడత్వం వదలలేకపోయింది ఇప్పటికీ. కాని నా వ్యోమయాత్ర వున్నతి పరిణామం చూచుకుంటే - అది ఒక పెద్ద ధన్యత! ఒక్కొక్కప్పుడు పిచ్చిరాతలు రాస్తుంటాను కాబోలు. కాని ఒక్కొక్కప్పుడు దేవతలా రాస్తాను. అలా ఆలోచిస్తాను! ఏ మను కున్నానో! నాకు తెలుసు.... ఈ మధ్య నాకు ఒళ్ళు బాగాలేదు. దాని వల్ల మనస్సులో నవీనత లేకుండా వుంది. ప్రశాంతంగా వుంటున్నప్పుడు ఈ అల్లరి అడ్డుపడుతూ వుంటుంది. అందుచేత నా సాధన తేటలు

నిలవడం లేదు. ఈ మధ్య నా మనస్సు చాలా సూక్ష్మమైన ఆంతరికానుభూతులు పరిణమించుకుంటూ వుంది. 'ఏ నొక మహాత్ముడ' నౌతున్నాను. కాని ఈ సమయంలో నా మహత్త్వానికి నిలచే రాత రాయలేకుండా వున్నాను. చూశావా మళ్ళీ? ఇదీ స్థితి."

ఇలా ఎన్నెన్ని వుత్తరాలు ఎంత మందికి రాశాడో. ఆయుష్షు అల్పం. ఆశయా లనంతం.

జనార్దనరావు నా పద్యాలు పట్టుకుపోయాడు. తరవాత ఎన్నాళ్ళకో ప్రూఫులు పంపాడు. రచయిత లందరికి పంపేవాడు. తిరిగి పంపేశాను. ఉదయిని రాలేదు. అదే ఆఖరు సంచిక అని నాకు తెలీదు. అచ్చయి ముద్రణాలయంలోనే కనుమూసింది. ఉదయినికి జనార్దనరావు మరణ వార్త కూడా తెలీదు!

# గిడుగు రామమూర్తి పంతులు

ఇప్పటికి సరిగ్గా యాభై మూడేళ్ళ కిందటి మాట. విజయ నగరంలో "ఆంధ్ర భారతీ తీర్థ" అనే సంస్థను బుర్రా శేషగిరిరావు గారు రూపొందించారు. దానికి ఇంగ్లీషులో "ఆంధ్ర రిసెర్చి యూనివర్సిటీ" అనే పేరు పెట్టారు. ఆ సంస్థకి జయపుర సంస్థానాధీశ్వరులయిన శ్రీ విక్రమ దేవ వర్మగారు ఛాన్సలరుగానూ, బుర్రా శేషగిరిరావుగారు వైస్ ఛాన్సలరు గానూ వ్యవహరించేవారు.

ఆ సంస్థ స్నాతకోత్సవం ఆ సంవత్సరం విశాఖపట్నంలో నిర్వహించారు. శ్రీ విక్రమదేవ వర్మగారి ఔదార్యంవల్ల తెలుగు నేల నాలుగు చెరగులా స్థిరపడిన పండితులను, కవులనూ పిలిచారు. ఆ సమావేశం మిసెస్ ఎ. వి. ఎన్. కాలేజి సైన్సు గాలరీ హాల్లో జరిగింది. ఆ వేడుకల్ని చూడటానికి పురిపండా అప్పలస్వామి, శ్రీరంగం శ్రీనివాసరావూ, తురగా వెంకటరామయ్య ప్రభృతులు సమావేశానికి హాజరయ్యారు. వెడుతూ నన్నూ తీసుకుపోయారు. మొదటిరోజు దిగ్గజాల్లాంటి పండితులు ఉపన్యాసం చేశారు. రెండో రోజున బిరుద ప్రదానం జరిగింది. బిరుద ప్రదానానికి ముందుగా కావ్య పఠనం జరిగింది. ఆ సందర్భంలోనే గుర్రం జాషువా గారు "మడమ తిప్పని తెలుగు వీరుడ నేను" అనే మకుటం (నాకు గుర్తు) గల అయిదారు సీస పద్యాలు చక్కగా చదివారు. ఆయనకు తరువాత "కవితా విశారద" అనే బిరుదిచ్చింది భారతీ తీర్థ.

ఆ రోజుల్లో నేను "తపోభంగం" అనే నాటకం రాశాను. అముద్రితంగా వుండేది. వ్రాత ప్రతిని నన్ను పట్టమ్మని అప్పలస్వామిగారు

ఆదేశించారు. బుర్రా శేషగిరిరావు గారికి చీటీ పంపించారు శ్రీశ్రీ, పురిపండా కలిసి నాచేత నా నాటకాన్ని సమావేశంలో చదివించమని. విక్రమ దేవ వర్మగా రా చీటీ చూసి మందహాసంతో నా పేరును పిలి చారు. నేను వేదిక ఎక్కి నా నాటకాన్ని ఒక అరగంట లోపున తడుము కోకుండా చదివేశాను. రతీ మన్మధుల కథ అది. అందులో రెండు పాటలు. నాటకమంతా శిష్ట వ్యావహారికంలో ఉంది. నేను చదువుతున్నప్పుడు ఎదురుగుండా ఒకాయన తెలుగు మాష్టారులా తలపాగా కోటూ వేసుకొని కూచున్నారు. చెవికి సీనారేకుతో చేసిన గొట్టాన్ని పెట్టుకొని చదువుతోంది వింటున్నారు. నేను చదవటం అయిపోయిం తరువాత విక్రమదేవవర్మగారు నా రచన గురించి మాట్లాడుతూ "ఇంత చిన్న వయసులో రతీమన్మథుల గురించి రాయటం ఎలా సంభవమయింది?" అని విచారణ చేస్తూ- "రవి గాంచని చోట కవిగాంచును కదా!" అన్నారు. ప్రేక్షకుల్లో ముందుగా కూచున్న తెలుగు మాష్టారి లాంటి పండితుణ్ణి వేదికమీదికి ఆహ్వానించారు. అప్పుడాయన పేరు నాకు తెలిసింది. ఆయనే గిడుగు రామమూర్తి పంతులు!

ఆయన గంభీర స్వరంతో-ఆయన కళ్ళు ఎర్రగా తేజోవంతంగా ఉండేవి - "నేను తలపెట్టిన ఉద్యమం సఫలమయింది. ఈ చిరంజీవి రచన విన్నారు కదా! ఎంత సహజంగా వ్యావహారిక భాషని వాడి చూపించాడు! మీరందరూ గ్రాంథిక వాదులు. నా లాంటి వారి సభలో వేళ్ళ మీద లెక్కించవలసినవారు. మీరు నా కీ రోజున చేస్తున్న మర్యాద నా పాండిత్య కృషికికాక, నా ఉద్యమాన్ని గుర్తించడం వల్లనేనని అను కుంటున్నాను. ఎందుకంటే, ఈ గౌరవాన్ని అతి వినయంగా తిరస్కరిం చాలని వచ్చాను. ఈ చిరంజీవి నాటకం చదివిన తరవాత స్వీకరించటానికి నిర్ణయించుకున్నాను" అన్నారు కరతాళ ధ్వనుల మధ్య. శ్రీశ్రీ, పురిపండా ఇద్దరూ నన్నభినందించారు. ఆ రోజున పంతులు గారికి "మహోపాధ్యాయ"

బిరుదు ప్రదానం జరిగింది- తెలుగునాట పేరెన్నికగన్న పండిత ప్రకాండుల సమక్షంలో!

ఆ రోజు నుంచి నేను గిడుగు రామమూర్తి గారికి సన్నిహితుణ్ణయిపోయాను. మర్నాడు పొద్దున్నే పురిపండా అప్పలస్వామిగారు పంతులుగారు విడిది చేసిన ఇంటికి తీసుకుపోయారు. ఆ రోజులలో బంధువులైన కవిపురపు వారింట్లో దిగేవారు. కవిపురపు వారిల్లు చెంగలావుపేటలో ఉండేది. కవిపురపు వారబ్బాయి నాకు స్కూల్లో సహాధ్యాయి.

నా నాటకం వ్రాత ప్రతిని పంతులుగారికిచ్చాను. పంక్తి పంక్తి జాగ్రత్తగా చదివి వాక్యాంతంలోని క్రియా రూపాలను సరిసమానం చేశారు. ఆయన దగ్గర నేర్చుకున్న మొదటి పాఠం అది. తరవాత ఆయన విశాఖపట్నం వచ్చినప్పుడల్లా నన్ను పిలిపించి పసిపిల్లాణ్ణి ఎత్తినట్లు నన్ను కావిలించుకొని ఎత్తేసేవారు అంత వార్ధక్యంలోనూ. ఆయన కవితా సమితి వార్షికోత్సవంలో చేసిన ప్రసంగం విన్న తరవాత నేను పరీక్షలో వ్యాకరణ ప్రశ్నలను ముట్టుకునేవాణ్ణి కాదు. ఇంటర్మీడియట్‌లో ఒక స్వర్ణ పతకం తెలుగుకు ఉండేది. అప్పుడు దివాకర్ల వెంకటావధాని గారు మాకు తెలుగు చెప్పేవారు. నన్నా స్వర్ణపతకాన్ని సంపాయించమనీ, తనకి నా మీద విశ్వాసం ఉందనీ, తనకీ, కళాశాలకీ పేరు వస్తుందనీ చెప్పారు. "వ్యాకరణాన్ని నేను వదిలేస్తాను కనక పూర్తిగా ప్రశ్నా పత్రానికి జవాబు రాయడం కష్టం" అని చెప్పి తప్పించుకున్నాను. పంతులు గారికి నేను చేసిన వాగ్దాన ఫలితం అది. ఆయనంటే అంత భక్తి!

పంతులుగారు బహిరంగ సభలో మాట్లాడుతుంటే యావన్మందీ సావధానంగా వినేవారు. వారి కవితా సమితి ప్రసంగం చరిత్రాత్మకం! ఒక వెయ్యిమంది ప్రేక్షకులు - టౌనుహాలు నిండిపోయింది. ఆయన

తెలుగు వ్యాకరణం మీద ఉపన్యాసం చేస్తున్నారు. రెండు గంటలు అందరూ ఏదో సంగీత కచేరీలో కూచున్నట్టు కూచున్నారు. అదీ పంతులు గారి వాక్పటిమ!

ఆయన ఆధునిక సాహిత్యంలో ఆసక్తి చూపించేవారు. ఆ రోజుల్లో అందరూ గ్రాంథికంలో రాసినా, ప్రఖ్యాత కవులందరూ ఆయనకి రథం పట్టినవారే!

ఒక రోజున విప్పర్తి వారి వీథిలో ఉన్న పింగళి లక్ష్మీకాంతం గారింటికి పంతులుగారు సీతాపతి సహాయంతో వచ్చారు. నేనా సమయంలో అక్కడ ఉన్నాను. లక్ష్మీకాంతంగారు లేరు. నన్నాయన ప్రేమపురస్సరంగా కుశల ప్రశ్న వేసిం తరువాత ఆయన్ని అడిగాను- "ఏమండీ! మేము పద్యాలు రాస్తున్నాము. అదికూడా వ్యావహారిక భాషలోనే రాయవలసి వస్తే రాయప్రోలు సుబ్బారావు గారికీ, విశ్వనాథ సత్యనారాయణ గారికీ వీరందరికీ అలానని ఎందుకు చెప్పలేదూ?" అని.

పంతులుగారన్నారు- "అది కాదు నాయనా! వ్యావహారికమంటే ముందుగా మనం విజ్ఞాన వ్యాప్తి కోసం కృషి చెయ్యవలసిన అవసరం ఉంది. కవిత్వం కాదు. ఎందులోనన్నా రాసుకో. నాకభ్యంతరం లేదు. చదివినవాళ్ళు చదువుతారు. లేకపోతే లేదు. ఇతర సాధనాలకు మాత్రం వ్యావహారికం తప్పదు. సాహిత్యంలో కథలకీ, నాటకాలకీ వ్యావహారికమే ఉండాలని నా ఆశయం" అని.

పంతులు గారికి "ఉషస్సు" అనే పత్రిక మొదటి సంచిక ఇచ్చాను. ఆ సంచికలో మొదట నా "తపోభంగం" నాటికను అచ్చేశారు.

# సెట్టి లక్ష్మీనరసింహం

**కోటకూ,** హార్బరుకూ పోయే దారిలో మెయిన్ రోడ్డు నానుకుని విశాఖపట్నంలో కన్యకా పరమేశ్వరీ దేవాలయం ఉంది. స్థానాపతి సత్యనారాయణశాస్త్రిగారు ఆ దేవాలయంలో పూజారి. శాస్త్రిగారింట్లో ఉంటూ ఆయన దగ్గర సంస్కృతమూ, తెలుగూ అధ్యయనం చేస్తుండేవాణ్ణి. అప్పటికింకా నేను స్కూల్‌లో చేరలేదు. శాస్త్రిగారి భార్య రుక్మిణమ్మగారు విద్వాంసురాలూ, కవయిత్రీని. ఆవిడ పద్య సంకలనానికి మా నాన్నగారు పరిచయ వాక్యాలు రాశారు. ఆ రోజుల్లో శాస్త్రిగారింట్లో ఉదయంపూట అమరం, బాల రామాయణం చదివించేవారు. మధ్యాహ్నం మనుచరిత్ర. అన్నీ కంఠస్థం చెయ్యాలిసొచ్చేది. శాస్త్రి గారూ కవితా సమితి సభ్యులే.

కన్యకాపరమేశ్వరీ దేవాలయానికి దగ్గరగానే కురుపాం మార్కెట్టుంది. ఆ మార్కెట్టు లోపల ఎడమవైపు చివరన ఒక గదిలో 'స్వసంఘం' ఉండేది. అందులో ఒక చిన్న గ్రంథాలయం. శాస్త్రిగారు ఇంట్లో లేనప్పుడు నేను తరుచూ ఆ గ్రంథాలయానికి పోయేవాణ్ణి. అక్కడికి అప్పుడప్పుడు సాహిత్య క్షేత్రంలో వ్యవసాయంచేసే ప్రముఖులు వచ్చిపోతుండేవారు. ఒక రోజున నేనక్కడికి వెళ్ళేటప్పటికి అక్కడ ఒక నిండు విగ్రహం లాంగు కోటు, చలువచేసిన పట్టంచు ఉత్తరీయంతో ఓ కుర్చీమీద కూర్చుని ఏదో పత్రిక చదువుతుండటం చూశాను. నేనూ లోపలికిపోయి ఓమూల మరో పత్రిక తీసి చదువుతూ కూచున్నాను. ఆయన మందహాసంతో కళ్ళజోడు చేత్తో తీసుకొని "నీ పేరేమిటి బాబూ?"అన్నారు.

నేను చెప్పాను. 'అబ్బూరివారబ్బాయివా? ఇలా ఎలా వచ్చా' వన్నారు. నేను శాస్త్రిగారింట్లో తెలుగూ, సంస్కృతమూ చదుకుంటున్నానన్నాను. ఆయన నవ్వి, ఓ బీరువాలోంచి 'వసుచరిత్రం' తీసి ఓ పద్యం చూపించి "ఇది చదివి అర్థం చెప్పగలవా?" అన్నారు. నేను ప్రయత్నం చేశాను. ఆయన సంతోషించారు. ఇంతలో శాస్త్రిగారు వచ్చారు. ఆయన సెట్టి లక్ష్మీనరసింహంగారని చెప్పారు. అప్పుడు నే నాయనకు నమస్కారం చేశాను. సెట్టి లక్ష్మీనరసింహంగారు సెట్టి మేష్టారుగా విశాఖలో ప్రసిద్ధి. ఆయన్ని అన్ని వర్గాలవారూ గౌరవభావంతో చూసేవారు. నే నాయన్ను చూసినప్పుడు ఉద్యోగంలోనించి తప్పుకుని ఉన్నారు. ఆయన విశాఖ పట్నం హైస్కూల్లో హెడ్మాస్టరుగా ఉండేవారు. ఆ పదవిలో ఉండగా "శృంగార పంచకం" అనే పేర తన వినోదం కోసం రాసిన 'బూతు' పద్యాల సంకలనం వెలువరించారు. పుదుచ్చేరి నుంచి "కామ గ్రంథమాల" నాలుగవ గ్రంథంగా 1922 లో యన్. చిన్నయ్య ప్రచురించారు. వెల రూపాయి పావలా. ఆ పుస్తంంలోనే ఆయన రాసిన "శ్రీకృష్ణ శతకం" కూడా ఉంది. తెలుగులో ప్రచారంలో ఉన్న "బూతు" సామెతల నాధారం చేసుకుని శ్రీకృష్ణ చరిత్రను వర్ణించారు. నా చిన్నతనంలో ఆ శతకం బహుళ ప్రచారంలో ఉండేది. మా స్నేహితులందరికీ అందులోని పద్యాలు కంఠతః వచ్చేవి. అందులో. ముఖ్యంగా ఓ పద్యం-

నీదు బొడ్డు తమ్మిని విరించియుంట నీ
బొడ్డు కోయ....

బ్రహ్మగారి కేమన్నా అపాయకరమవుతుందేమో ననుకుని బొడ్డు కోస్తూ మరేదోచూసి నటుల "జంకె దాది యబ్జనాభ!" చదివి చదివి నవ్వుకునేవాళ్ళం. ఈ పద్యాల పుస్తకం ప్రచురణ కాగానే అధికారులు సెట్టి మేష్టార్ని పదవినుంచి తొలగిస్తా మన్నారు. సెట్టి మేష్టారు

స్వయంగా తన ఉద్యోగానికి రాజీనామా చేశారు. మద్రాసు వెళ్ళిపోయి లా డిగ్రీ సంపాయించి విశాఖలో న్యాయవాద వృత్తి చేపట్టారు.

విశాఖపట్నంలో కాలేజి ప్రిన్సిపాలయిన పి.టి. శ్రీనివాసయ్యంగారితోపాటు గురజాడ అప్పారావు పంతులు, గిడుగు రామమూర్తి ప్రారంభించిన వ్యావహారికోద్యమంలో అగ్రగామిగా నిలిచారు. ఆ నలుగురి శ్రమాఫలమే ఈనాటి వ్యావహారిక భాషా ప్రాముఖ్యం.

సెట్టి మేష్టార్ని తరవాత చాలాసారులు కలుసుకున్నాను. ఆయనా కవితా సమితి సభ్యుడే. నన్ను వసుచరిత్ర క్షుణ్ణంగా చదవమని ప్రోత్సహించేవారు. పద్య నిర్మాణంలోని సౌందర్యాన్ని చూడాలంటే వసుచరిత్రలోనే చూడాలని ఆయన అనేవారు. ఆయన నవలా రూపంలో రాసిన మృచ్ఛకటిక "వసంతసేన" అనే పేరుతో అచ్చయింది. దాని ప్రతిని నాకు బహూకరించారు. ఇప్పుడది ఎక్కడా లభించదు. తిరిగి ముద్రిస్తే బాగుంటుంది. సెట్టి మేష్టారు వీర వ్యావహారికవాది. అయితే అదేం చిత్రమో, కవిత్వం గ్రాంథికంలోనే ఉండాలని నాతో అన్నారు. ఎందుకని నే నడిగాను. ఆయన అన్నారు:-'గద్య ప్రయోజనం వేరు. ప్రజలకీ, వచనానికీ ప్రాణస్నేహం. కవిత్వం ప్రయోజనం వేరు. కవిత్వం ఆనందించాలంటే ఒక రకమైన సంస్కారం, ఏకాగ్రతా, భాషా ప్రావీణ్యం కనీసం ఉండి ఉండాలి' అని. అ రోజుల్లో నాకది నిజమే ననిపించేది. తరవాత తరవాత శ్రీశ్రీ అందుకు అంగీకరించ లేదు. కొన్నాళ్ళు శ్రీశ్రీతో కూడా తగాదా పెట్టుకున్నాను ఈ విషయంలో. సంస్కృత భూయిష్టమైన శిష్ట వ్యావహారికంలో రాసినా, గ్రాంథికంలో రాసినా కవిత్వం నాకొకలాగే కనిపిస్తుందని నే ననేవాణ్ణి.

సెట్టి మేష్టారికి కవిత్వంమీద అలా కొన్ని నిశ్చితాభిప్రాయా లుండేవి. కవిత్వానికి మరో లక్షణం ఆయన ముఖతః విన్నాను. చదవ గానే అర్థం కావాలనేవా రాయన. ఆయనా, మాడుగుల రాజావారైన విక్రమదేవవర్మ గారూ స్నేహితులు. సర్వేపల్లి రాధాకృష్ణగారి సహా యంతో మాడుగుల రాజావారు జయపురం సంస్థానాధీశ్వరులయ్యారు. శ్రీ విక్రమ దేవవర్మ మహారాజావారు సెట్టి మేష్టార్ని ఆంతరంగిక కార్యదర్శిగా నియమించుకున్నారు. ఆ రోజుల్లోనే ఆయన సంస్కారానికీ, పాండిత్యానికీ ప్రతీకగా ప్రభాస శాపవిమోచనము అనే బృహత్కావ్యాన్ని రాసి మహారాజా వారికి అంకితం చేశారు.

సెట్టి మేష్టారు వందలాది చాటువులు శృంగార పద్యాలు రాశారు. అవి ఇప్పటికీ ఆనోటా ఈ నోటా వింటుంటాము. ఓ చాటువు వినండి:

**"ముప్పది యేండ్లు 'నాకు'. ఐదు**
**మూ డవ యేడుది మాదు చెల్లి. మే**
**మిప్పుడు పూటకూళ్ళ నుతి**
**కెక్కినవారము. దబ్బకాయ యో**
**చెప్పుడు నిమ్మకాయొ తమ**
**చిత్తము వచ్చిన నుండు. రాత్రికిం**
**దప్పక రండనున్ నవ వి**
**తంతు వొకర్తుక బాటసారులన్!"**

# జాషువ

"భారతీ తీర్థ" స్నాతకోత్సవంలో పాల్గొనేందుకు గుర్రం జాషువా గారు విశాఖపట్నం వచ్చారు. మొదటి రోజున తెలుగుదేశంలో దిగ్గజాల్లాంటి పండితులు ఉపన్యాసాలు చేశారు. స్నాతకోత్సవం మిసెస్ ఎ.వి.యన్. కళాశాల సైన్సు గాలరీలో జరిగింది. ఆ ఉత్సవానికి పురిపండా అప్పలస్వామీ, తురగా వెంకట రామయ్యగార్లతోపాటు నేనూ వెళ్ళాను. నేను సెకండు ఫారం చదువుతున్నాను. పన్నెండున్నర గంటలదాకా ఉపన్యాసాల కార్యక్రమం అయింది. తాతా సుబ్బరాయ శాస్త్రీ, ఆదిభట్ల నారాయణదాసూ, కాశీభట్ల సుబ్బయశాస్త్రీ, కావ్యకంఠ గణపతిమునీ, కాశీ కృష్ణాచార్య ప్రభృతులు ప్రసంగించారు. అధ్యక్ష స్థానంలో ఉన్న విక్రమదేవవర్మ గారు సమావేశానికి వచ్చిన వారి నందరినీ భోజనానికి ఆహ్వానించారు.

ఆ హాలు పక్కగా ఉన్న బాటనీ లేబొరేటరీ భవంతి పక్కన భోజనా లేర్పాటయినాయి. వెనకవేపు పండితులందరూ శాలువాలు తీసి భోజనానికి కూర్చున్నారు. అప్పలస్వామిగారూ, వెంకటరామయ్యగారూ బుర్రా శేషగిరిరావుతోపాటు మరో పంక్తిలో చేరారు. నాకెక్కడా చోటు దొరకలేదు. నేను ముందు వరండాలోకి వచ్చాను. అక్కడ సందడి లేదు. ఏం చేయాలో తోచక అలాగే నిలబడి పోయాను. మరో అయిదు నిమిషాలకు సమావేశ నిర్వాహకుల్లో ఒకరు ఒకాయన్ని వెంట బెట్టుకొని అక్కడ విడిగా కూచోబెట్టి లోపలికిపోయి ఓ విస్తరీ, చెంబూ తెచ్చిపెట్టారు. ఆయన నల్లగా పొడుగ్గా బొద్దు మీసాలతో నవ్వీనవ్వని మొహంతో అక్కడ చతికిలపడ్డాడు. అక్కడ మరోపంక్తి ప్రారంభిసా

రనుకొని నేనలా చూస్తూ ఉండిపోయాను. మరెవ్వరా ప్రాంతాలకు వచ్చి ఆయన పక్కన కూచోలేదు. నేను చూసి చూసి ఆయన ప్రక్కన చతికిల పడ్డాను. ఆయనకు చెంబులో నీళ్ళు పోసే ఆయన నన్ను చూసి నాకో విస్తరీ, గ్లాసూ తెచ్చి ఇచ్చారు. తరువాత మరెవ్వరో అన్నం, కూరలు వగైరా వడ్డించారు. మేం తినటం ప్రారంభించాం. పక్కన కూచున్న ఆయనెవరో నాకు తెలీదు. ఆ వరండా అంతటికీ మేమిద్దరమే ఉన్నాము భోజనానికి. ఓ రెండు నిమిషాలయిం తరువాత ఆయన నన్ను పలకరించాడు- "ఎవరబ్బాయివి నాయనా?" అని. నేను చెప్పాను. ఆయన ఆశ్చర్యపడ్డట్టు చూసి "ఇక్కడికి వచ్చి కూర్చున్నావేం?" అన్నాడు. "ఇంకెక్కడా చోటు లేదండీ!" అన్నాను. ఆయన నవ్వి ఊరుకున్నాడు.

మర్నాడు మధ్యాహ్నం ఆయనే - నా పక్కన కూచుని భోజనం చేసిన పెద్ద మనిషే - సభలో పద్యాలు చదువుతున్నాడు. అందరూ సావధానంగా వింటున్నారు. ఆయన పద్యాలు చదివే బాణీని అందరూ మెచ్చుకుంటున్నారు. కరతాళ ధ్వనుల మధ్య ఆయన పద్య పఠనం అయిపోయింది. ఆయనే జాషువా! అప్పుడు తెలిసింది. అప్పటికి నేనాయన రాసిన ధ్రువ విజయాన్ని మాత్రం చదివాను. ఆయన తెలుగు ప్రశస్తి కీర్తిస్తూ ఆ రోజున చదివిన పద్యాలకు మరింత ముగ్ధుణ్ణయినవాణ్ణి నేను.

ఇంటికి పోయినప్పుడు మా నాన్నగారికి జాషువా గారు పద్యాలు చాలా బాగా చదివారని చెప్పాను. ఆ వేళే వచ్చిన పోలేపెద్ది సుబ్బారావు- ఆయన్ని పొట్టిసుబ్బారావని కూడా పిలిచేవాళ్ళం- మా నాన్నకూ, గుడిపాటి వెంకటచలానికీ సన్నిహిత స్నేహితుడు, నా మాటలు విని మా నాన్నతో "అప్పన్నా, బావ ఇతనిచేత కూడా రంగు వేయించా అనుకున్నాడురా" అన్నాడు. బావ అంటే ప్రసిద్ధ నట్టుడు

పల్లమర్రి సుందరరామయ్య మా నాన్నగారి సహాధ్యాయి. అప్పుడాయన 'శ్రీరామ విలాస సభ' యాజమాన్యం కింద నాటకాలు వేసేవారు. జాషువా గారిని సభలోకి ఆహ్వానించి, ఓ మంచిపాత్ర పోషించమని కోరుదామనుకున్నారట. ఆ రోజుల్లో ఆయన పద్య పఠనానికి సుందర రామయ్యగారు కూడా ముగ్ధులై అలా నిర్ణయించారన్నమాట!

ఆ సాయంకాలం బిరుద ప్రదానం జరిగిన సమావేశానికి నేనూ పోయాను. జాషువా గారికి కవితా విశారద అనే బిరుదు భారతీ తీర్థ ప్రదానం చేసింది. సమావేశానంతరం జాషువా గారు నన్ను గుర్తించి పిలిచారు. నా తల నిమురుతూ "నిన్న నువ్వు నా ప్రక్కన కూచున్నందు వల్ల నేను భోంచేయగలిగాను. నాలుక్కాలాల పాటు బతికి, నువ్వుకూడా కవిత్వం చెప్పు నాయనా!" అన్నారు.

తరువాత నాకర్థం అయింది. ఆయన హరిజనుడని వేరే భోజ నానికి కూచోపెట్టారు. అది తెలీక నేను ఆయన పక్కన కూచుని భోంచేశాను. ఆ సంగతి తెలిసి నేను గర్వపడ్డాను. మా నాన్నగారు ఇది విని 'భలే మంచిపని చేశావురా!' అన్నారు.

అదేం చిత్రమో, మొదట్నుంచీ శ్రీరంగం శ్రీనివాసరావుకి జాషువా గారి కవిత్వం అంటే పడేదికాదు. ఆ రోజుల్లో ఆధునిక కవిత్వం మీద ఎంత మోజున్నా, నేను జాషువాగారి పద్యాలు వరసగా చదివేవాణ్ణి. ఆయన పద్యాలు చాలావరకు భారతిలో అచ్చవుతూ ఉండేవి. ఇంటర్మీడి యటులో ఆయన 'ఫిరదౌసి' మాకు పాఠ్య పుస్తకమయింది. అంత చక్కని గాథాపద్యం తెలుగులో చాలా అరుదు. అంతకు పూర్వం, రాయ ప్రోలు సుబ్బారావుగారూ, మా నాన్నగారూ, ఆ ప్రక్రియలో సఫలీకృతు లయ్యారు. ఇప్పుడు జాషువాగారి చేతుల్లో మరో ప్రయోగం ఫలవంత మయింది. 'ఫిరదౌసి' కొన్నేళ్ళదాకా నాకు ఆమూలాగ్రం కంఠతః వచ్చేది.

ఆయన అంటే మా నాన్నగారికీ అభిమానం ఉండేది. ఆయన రాసిన "శ్మశానవాటి"లో ఒక పద్యం మా నాన్నగారెప్పుడూ కవిత్వం మీద మిత్రులు చర్చిస్తున్నప్పుడు ఉదహరిస్తుండేవారు.

**ఎన్నొ యేండ్లు గడిచి పోయినవిగా**
**నీ యీ శ్మశానస్థలిన్**
**గన్నుల్మోడ్చిన మంద భాగ్యు డొకడై**
**నన్ లేచి రాఁడక్కటా.**
**యెన్నాళ్ళీ చలనంబులేని శయనం?**
**జే తల్లు లల్లాడిరో!**
**కన్నీటం బడి క్రాగి పోయినవి ని**
**క్కం బిందు పాషాణముల్!**

జాషువా గారిని ఎన్నాళ్ళకో కాని నేను చూడ్డం పళ్ళేదు. యుద్ధ కాలంలో మదరాసులోనో, గుంటూరులోనో యాదృచ్ఛికంగా కలిశాను. నా అంతట నేనే పరిచయం చేసుకున్నాను. ఆయనకు నేను గుర్తు రావటమే కాక, "నా ఆశయం నెరవేర్చావయ్యా! నువ్వు కవిత్వం చెబుతున్నావని విన్నానులే" అన్నారు.

ఆయన మరణవార్త నేను ఢిల్లీలో విన్నాను. ఒక క్షణం నా బాల్యం గుర్తుకొచ్చింది. ఆయన పద్యం అప్రయత్నంగా పైకి చదివాను:

**ఇట నస్పృశ్యత సంచరించుటకుఁ దా**
**వే లేదు, విశ్వంభరా**
**నటనంబుల్ గబళించి, గర్భమున వి**
**న్యస్తంబు గావించి, యు**

త్కూటపుం బెబ్బులితోడ మేఁక నొక ప్ర
క్కం జేర్చి జోకొట్టి యూ
ఱట కల్పించు నభేద భావమును ధ
ర్మం బిందు గారాడెడిన్.

# విశ్వనాథ సత్యనారాయణ

మరీ చిన్నతనంలో ఓసారి గుంటూరులో మా మేనత్త బియ్యం బాగు చేసుకుంటున్నప్పుడు నేను పక్కనే కూచున్నాను. చేటలో బియ్యాన్ని అటూ ఇటూ చెరుగుతున్నప్పుడు ఆవిడ ఓ పద్యం అతి నాజూగ్గా చదవటం విన్నాను. ఆ పద్యం నా కిప్పుడు కంఠతః రాదు. దాని పాఠం మళ్ళీ దొరకనూ లేదు. ఆ పద్యార్థం ఇలా ఉంటుంది: "నా కనుల ఎట్టయెదుటన నా పుత్రుని కంఠం ఉత్తరించి, నేను దయాంబుధిని కాదా యటంచు నన్నడిగె, ఓ ప్రభూ! అవునంటి నే నొదిగి యొదిగి. మళ్ళీ కుటుంబాన్నంతా నాశనం చేసి అదేప్రశ్న అడగటం, ఓ ప్రభూ! అవునంటి నే నొదిగి యొదిగి అని జవాబు చెప్పటం."

ఈ పద్యం ఆవిడ చదువుతుంటే హృదయ విదారకంగా ఉండేది. అందులో కొన్ని పంక్తులు నాకు చాలా కాలం జ్ఞాపకం ఉండేవి. ఎవరా పద్యాన్ని రాశారో నాకు తెలీదు. కొన్నేళ్ళకు ఓ రోజున మా ఇంటి కొకాయన వచ్చారు. సన్నగా పొడుగ్గా అచ్చం తెలుగు వేషంలో బ్రాహ్మణీకం ఉట్టిపడే పిలకతో మా నాన్నగారితో మాట్లాడుతున్నారు. మాటవరసకి ఓ పద్యం చదివి వినిపించారు. ఆయన పద్యం చదివిన వైనం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఆయన వెళ్ళిపోయిం తరవాత మా నాన్నగార్నడిగాను, ఆయనెవరని. నా వంకచూసి నవ్వుతూ 'అత్తయ్య చదివిన పద్యం రాసింది ఈయనే. పేరు విశ్వనాథ సత్యనారాయణ' అని చెప్పారు. ఆనాటి నుంచీ ఆయన అంటే ఓ విధమైన గౌరవం ఏర్పడింది. ఆయన్ని మళ్ళీ ఓసారి చూసి ఆయన చేత పద్యాలు చదివించి వినాలనే కోరిక నాలో దినదిన ప్రవర్ధమానమవుతూ వచ్చింది.

అకస్మాత్తుగా ఆయన విశాఖపట్నం వచ్చారు. నేనప్పుడు హైస్కూల్లో చదువుతున్నాను. అప్పటికి రెండేళ్ళుగా మా స్కూల్లో 'హైస్కూలు లిటరరీ యూనియన్' అనే సంఘాన్ని మిత్రుడు అనంత పద్మనాభరావు సహకారంతో నిర్వహించేవాణ్ణి. సత్యనారాయణ గారిని మా స్కూల్లో ప్రసంగించమని కోరాను. ఆయన వెంటనే అంగీకరించారు- అయితే ఒక షరతుమీద.

"గంటకన్న ఎక్కువ మీతో కాలక్షేపం చెయ్యలేను - నేను మరో చోటికి వెళ్ళవలసిన పనుంది" అన్నారు. నేనందుకు ఒప్పుకుని తగిన ఏర్పాట్లు చేశాను. ఆయన మా సభకు వచ్చారు. నవ్వుతూ 'ఏం మాట్లాడమంటా'వన్నారు. "పద్యాలు చదవండి" అన్నాను. ఆయన తెలుగు చరిత్ర గురించి నాలుగు ముక్కలు ప్రస్తావించి, పద్యాలు చదవటం ప్రారంభించారు. కథ అందరికీ అర్థం అవుతోంది.

**ఓయి నృపాల! యీ బుడుత**
**యొక్కడు నాదు కులంబు తేప నీ**
**వో అతి ధర్మరాజువయ**
**యో! ఇది ఏమిటయా! గతాసువై**
**యీయనుగేగెఁ బో తినుట**
**కేమిఁక నున్నది నాకు నేమినే**
**డే యిదె! వీని వెంటబడి**
**యేగెద కోడలి కేమి కావలెన్?**

ఈ పద్యాన్ని వయో వృద్ధురాలయిన ఓ స్త్రీ కంఠస్వరాన్ని అనుకరిస్తూ, రుద్ధ కంఠంతో చదివారు. ఓ పక్కన కూచున్న మా మేష్టార్లూ విద్యార్థులూ అలా ఆయన వంక చూస్తున్నారు. ప్రతివ్యక్తి కళ్ళు చెమ్మ

గిల్లటం చూశాను. నా సంగతి సరేసరి! ఆయన పద్యాలు చదువుతూనే ఉన్నారు.

నట శివ సాయం సంధ్యా
చ్ఛటాఘటా నూపురమణి సంభవ కాంతి
స్ఫుట 'చిట చిట చిట' నినదో
ద్భట కనకము విజయవాటి వర్షము కురిసెన్

ఆయన చదివే ధోరణికి వర్షం కురుస్తున్న భావన మా కందరికీ స్ఫురించింది. ఇది ఆఖరి పద్యం అని తెలియదు. ఆయన నా వంక చూశారు.

"చాలా?" అన్నారు.

ఆయన బయల్దేరారు. నేను వెనక నడిచాను. విద్యార్థులలానే కూచున్నారు. పద్యాలు విన్న తరువాత వాళ్ళందరూ తమ చుట్టూవున్న లోకాన్ని మరిచిపోవడం నేను గమనించాను. స్కూలు షెడ్డు బయటి కొచ్చి ఆయన్ని పెట్టె బండీలో ఎక్కించాను. బండీలో కూచుని "బాగుందా?" అన్నారు.

ఏమనాలో తోచక "బలే ఏడిపించారండీ!" అన్నాను.

ఆయన నవ్వుతూ, 'అదా ఆఖరికి?' అన్నారు. బండి కదిలింది.

తరువాత మరో రెండేళ్ళ కనుకుంటాను- నేను ఇంటర్మీడియటులో ఉన్నాను. ఆయన విశాఖపట్నం వచ్చారు. మళ్ళీ నేను పట్టుకున్నాను, మా కళాశాలకు తప్పక వచ్చి ఉపన్యసించాలని. ఈసారి కూడా ఆయన ఓ గంటకన్నా మీతో కాలక్షేపం చెయ్యలేననీ, అదీ, పన్నెండు గంటల కయితే వచ్చి ఒంటిగంట కల్లా వెళ్ళిపోతానని అన్నారు. నేను ఒప్పుకున్నాను. ఆరోజు పన్నెండు గంటలకి మాకు దివాకర్ల వెంకటావధాని గారి పీరియడు. ఆయన చేత పాఠం తప్పించి, సత్యనారాయణ గారి

ఉపన్యాసం ఏర్పాటు చేశాను. నేను కళాశాల విద్యార్థి సంఘానికి కార్య దర్శిని. అనుకున్న ప్రకారం ఆయన వచ్చారు. అవధానిగారి పక్కన కుర్చీలో కూచున్నారు. నేను గాలరీలోకి వెళ్ళి కూచున్నాను. ఆయన లేచి నాకోసం చూస్తున్నారు. గుర్తుపట్టలేక అవధానిగారి వంక చూసి 'అబ్బూరి జూనియర్' అన్నారు. విని నేను లేచి నిల్చున్నాను. ఆయన చిరునవ్వు నవ్వుతూ 'ఏడిపించమంటావా? నవ్వించమంటావా?' అన్నారు. ఓ క్షణం ఆలోచించి 'మాధవవర్మ' అన్నాను. రెండేళ్ళ క్రితం హైస్కూల్లో ఆయన చదివిన పద్యాలు 'మాధవవర్మ' గురించి రాసినవి.

మాధవవర్మ పల్లవ వంశీయుడైన మహారాజు. ఆయనకు బెజవాడ రాజధానిగా ఉండేది. ఆయన ధార్మిక దృష్టికీ, న్యాయదక్షతకూ పరవశులై దేవతలు బెజవాడలో కనకవర్షం కురిపించారని ఓ శాసనంలో కథని ఆధారం చేసుకొని సత్యనారాయణగారు రాసిన ఖండకావ్యం.

సత్యనారాయణగారు తన సహజ శైలిలో పద్యాలు చదివారు. హైస్కూల్లో అనుభవమే తిరిగీ ప్రసన్నమయింది. మాధవవర్మ పూర్తి కాగానే ఆయన నా వంక చూశారు.

'ఇంకా కొంచెం టైముందండీ' అన్నాను. సరేనని నాలుగైదు గీత పద్యాలు చదివారు. అవే- నేను మా మేనత్త చదవగా విన్నవి. ఆ పద్యాలూ అందరిలో ఒక్కసారి అంతరాంతరాల్లో సంచలనం కలిగించేట్టుగా చదివారు.

మళ్ళీ నాకు నా బాల్యం గుర్తుకొచ్చి, ఆయన పద్యాలు నా మనస్సులో ఆయన కవితా ప్రతిభ ఎలా చెరగరాని ముద్ర వేసిందో ఊహించుకోవటం మొదలు పెట్టాను. ఆ పద్యాల పాఠం ఇప్పటికీ నాకు దొరకలేదు.

మళ్ళీ కొన్నాళ్ళదాకా సత్యనారాయణగారిని సన్నిహితంగా కలుసుకోవటం తటస్థించలేదు. ఒకటి రెండుసార్లు ఆయన విశాఖపట్నం వచ్చారుకానీ, ఆయన మా ఇంటికొచ్చినప్పుడు నేను లేకపోవటం, కాలేజీలో ఉండటం వల్ల చూడ్డం వీలుపడింది కాదు.

యుద్ధకాలంలో మేము గుంటూరుకి వలస వచ్చాము. నేను గుంటూరు నుంచి బెజవాడ వస్తూండేవాణ్ణి వారానికోసారి కాలక్షేపానికి. ఆ రోజుల్లో మల్లాది రామకృష్ణశాస్త్రిగారు బెజవాడలో ఉంటూండేవారు. లక్ష్మీటాకీసు ఎదురుగా కృత్తివెంటి వారింట్లో ఓ గది తీసుకుని మద్దిపట్ల సూరి ఉండేవాడు. శాస్త్రిగారూ ఆ గదిలోనే ఉంటూ వచ్చారు. నేను బెజవాడకు వచ్చినప్పుడల్లా శాస్త్రిగారితోనూ, మల్లాది ఫణిభూషణరావు తోనూ కాలక్షేపం చేసేవాణ్ణి. వాళ్ళతోపాటు నేనూ సూరి గదిలోనే ఉండే వాణ్ణి. సాయంకాలం కాగానే గవర్నరుపేటలోని బజరంగ్‌చౌకుకు పోయి అక్కడ హోటల్లో కాఫీ తాగి ఎదురుగా ఉన్న క్వాలిటీ పబ్లిషర్సు దుకాణంలో కూచుని మాట్లాడుకుంటూ ఉండేవాళ్ళం. ఆ రోజుల్లో సత్యనారాయణగారు బెజవాడ కళాశాలలో పనిచేసేవారు. సాయంకాలం కాగానే ఆయనా, ఆయనతోపాటు వెంకటేశ్వర్లు, మరో స్నేహితుడితో కలిసి బజరంగ్‌చౌక్ మీదుగా వాహ్యాళి కొచ్చేవారు. రోడ్డంతా తమదే అయినట్టు ఆ ముగ్గురూ - అందరికీ పిలకలుండేవి - దారిలో మరెవరైనా స్నేహితులు కనిపిస్తే వారూ-వరసగా రోడ్డుకడ్డంగా నడిచేవారు. మేము కాఫీతాగి బయటకి రావటమూ, వారాదారిని పోవటమూ సర్వసామా న్యంగా ఒకే సమయంలో జరిగేవి.

ఓ రోజున హోటల్నించి బయటపడి పుస్తకాల దుకాణంలో కూచున్నాము - నేనూ, శాస్త్రిగారూ, ఫణిభూషణరావూను. క్వాలిటీ పబ్లిషర్సు యజమానులైన కంభంమెట్టు సత్యనారాయణరావుగారు ఓ పుస్తకాన్ని శాస్త్రిగారికి చూపిస్తున్నారు. ఆ పుస్తకం పేరు 'తెలుగు

నాడు': దాసు శ్రీరాములుగారు రాసిన విశిష్ట కావ్యఖండం. శాస్త్రి గారేదో చెప్పబోతుండగా దుకాణానికి ఎదురుగా ఓ మూల పోతున్న సత్యనారాయణగారు మమ్మల్ని చూసి దగ్గరికి వొచ్చారు. శాస్త్రిగారు పలకరించారు. నేనూ పలకరించాను. సత్యనారాయణగారు కుశల ప్రశ్న లేస్తూ శాస్త్రిగారి చేతిలో పుస్తకాన్ని చూసి దుకాణంలోకి వచ్చి కూచు న్నారు. ఆయనతో వచ్చిన వెంకటేశ్వర్లుగారు బయటే నిలబడి ఉన్నారు. దుకాణం రోడ్డు కానుకునే ఉంటుంది. సత్యనారాయణగారు వెంకటేశ్వర్లుగారితో 'ఇది మన పుస్తకమేనోయి' అన్నారు. వెంకటేశ్వర్లు గారు పుస్తకాన్ని శాస్త్రిగారి చేతుల్లోంచి తీసుకోబోతూ-

మెలిఁబెట్టి విడిచిన మీసాలపై గొప్ప
నిమ్మకాయలు రెండు నిలుప వచ్చుఁ
దేటగాఁ దెల్లగా తెగఁ గాలు లంకాకు
పొగచుట్ట జుంజురుఁ బోల్పవచ్చు
నడి వీథి రెడ్డి గా లిడి రచ్చ దీర్చుచో
సివిలు జడ్జీలని చెప్ప వచ్చు
అనదుగాఁ బొసగించి నొసటఁ బెట్టిన బొట్టు
లొక్కమా "ఉప్పు"ని యూదవచ్చు
వడివడిగఁ జిన్ననాడైన వడుగునాడు
తడఁబడుచుఁ జెప్పికొన్నట్టి తప్పు సంధ్య
ముక్క నొక నాల్గు నిముసాల ముగియవచ్చు
బళిర! యనవచ్చు లౌకిక బ్రాహ్మణులను!

అని చదివారు - అందరూ శ్రద్ధతో వింటున్నాము. వెంటనే సత్యనారాయణగారు-

జ్ఞానాధిక్యము, శాంతి, యర్థిజనరక్షాదీక్ష భూపాలకా
స్థాన ప్రాపిత వైభవంబు, పటుమంత్రప్రజ్ఞయున్ సంతతా
క్షీణం బుగ్గునఁ బెట్టుతల్లియె నియోగి బ్రాహ్మణ శ్రేణికిన్
మానంబే నగ మాటలే కవచముల్ మర్యాదలే భాగ్యముల్

సహజ ధోరణిలో చదివారు - వెంకటేశ్వర్లు గారూరుకోలేదు.

చదివిరా! ఋగ్యజుస్సామముల్ భూర్భువ
స్సువ రాదిలోకముల్ సుతులు ముట్టు
మెదపిరా! పెదవి గుంఫిత మృదు స్తుతిపాఠ
సల్లాపముల నల్ల రాళ్ళు గఱఁగు
తలచిరా! క్షేత్ర యాత్రలు సేతు కాశికా
గంగోత్తరలకు మూఁ డంగ లీడు
నిలిచిరా! సత్కర్మ నియతిన్మహాధ్వర
కాండంబు పౌండరీకంబు దట్టు
పరచిరా! పంచపాళి దర్భాసనములు
ముక్క మూతల సరిపుత్తు రొక్కజాము
ఐరి! యీ పాటి పరిపాటి దెలుఁగు నాఁటి
వైదికునితోటి యేమేటి వచ్చు సాటి?

అంటూ చదివారు. శాస్త్రిగారేం మాట్లాళ్ళేదు. సత్యనారాయణ గారు దాసు శ్రీరామ పండితుణ్ణి పొగిడారు. ఆయన చేతిలో పద్యం నలిగినట్లు మరెవ్వరి దగ్గరా నలగలేదన్నారు. ఆయన పాండిత్యానికి తమ గురువులు వెంకటశాస్త్రి గారే ముగ్ధులయారన్నారు. అంటూ నా వంక చూసి "మీ నాన్న గురజాడ అప్పారావు గురించి రాశారు కానీ, దాసు శ్రీరాములు గారి మీద ఒక ముక్క రాయలేదు. ఏదో పొరపాటు

జరిగి ఉంటుంది - విను - శ్రీరాములు గారూ, అప్పారావుగారూ ఎంతో విశ్లేషణతో తెలుగు సంసారాన్ని కూలంకషంగా పరిశీలించారు. దురదృష్ట వశాత్తూ శ్రీరాములుగారు ఆంధ్రవీథి రెండోభాగం రాయలేదు. రాస్తే కన్యాశుల్కం, తెలుగునాడూ చిరస్థాయిగా ఉండవలసిన రచనలు. అవి సమకాలికం కూడాను" అన్నారు.

అప్పుడు శాస్త్రిగారందుకుని "మీరు చెప్పినదాంట్లో ఎంతో సత్యం ఉంది. తెలుగు సంసారంలో విభిన్న శాఖలనూ, వర్ణాలనూ ఇద్దరూ పరిశీలించి మన సమాజం ఎలా విచ్ఛిన్నమయిందో పరోక్షంగా చిత్రించారు" అన్నారు.

వెంకటేశ్వర్లు గారన్నారూ "తెలుగునాడులో పద్యాలన్నీ ఒకప్పుడు నాకూ మా అన్న గారికి కంఠస్థం- ఇప్పటికీ చదవగలం చాలా వరకు" అన్నారు.

శాస్త్రిగారు "బాగానే వుంది కానీ, కవిత్వంలో ఈ వైదీకుల - నియోగుల గొడవ ఏమిటో నాకిప్పటికీ అర్థంకా"దన్నారు. సత్యనారాయణ గారు నవ్వారు. "అదో చమత్కారం. పోటీపడి రాస్తామనే కదా - అంతే కాదు.

తొలినియోగులే కవులెల్ల తెలుగునాట
నేటికిని వారె సాహితీ నేతలైరి"

అని చెప్పారు. ఆ పద్యం ఆశువుగా చెప్పారో పూర్వరచనో నాకు తెలీదు. తతిమ్మా రెండు పంక్తులూ నాకు గుర్తులేవు. తరువాత సత్యనారాయణ గారి భక్తుడొకాయన అలాంటి పద్యాన్ని మరొకటి చదివారు. కొప్పరపు సోదరకవుల పుత్రులు బెజవాడలో అవధానం చెయ్యగా సత్యనారాయణ గారు ఆశీర్వదిస్తూ చెప్పిన పద్యం:

తొలి నియోగులు సిసలైన తెలుగుకవులు
తెలియ పలనాడు చిక్కని తెలుగు గడ్డ
ఆశుకవనంబులో మీయింటి ఆడుబిడ్డ
ఏను దీవనలిత్తు నెన్నెని మీకు!

*   *   *

మదరాసు నుంచి నేను విశాఖపట్నం పోతున్నాను. అదే రైల్లో సత్యనారాయణగారు బెజవాడ పోతున్నారు. స్టేషన్లో ఇద్దరం కలిశాం. ఉదయం. ఆయనా మా పెట్టెలోనే ఎక్కారు. రైలు కదిలింది. సత్యనారాయణగారు పై బెర్తుమీద కాస్సేపు పడుకుని విశ్రాంతి తీసుకుంటానన్నారు. క్రితం రాత్రి సరిగా నిద్రపోలేదుట. నేను ఒక్కణ్ణీ కింద కూచున్నాను. ఆరోజు యేదో పండగ అనుకుంటాను. బండిలో మామూలు జనసమ్మర్దం లేదు. నా కెదురుగుండా ఇద్దరు వ్యక్తులు దినపత్రిక చదువుకుంటున్నారు. ఒకాయన మధ్య వయసులో ఉన్నాడు. మరొాహతను మరీ యవ్వనం. రైలు వేగం పుంజుకుని పోతోంది. ఓసారి పైకి చూశాను. సత్యనారాయణగారు మాంచి నిద్రలో ఉన్నట్టు కనిపించారు. నాకు నిమిషం ఓ యుగంలా ఉంది. తోచటంలేదు. రైల్లో వూపుకి నేను చదవలేను. నెల్లూరులో రుక్మిణీనాథశాస్త్రి రైలెక్కుతానని నాతో చెప్పాడు. అంచాత నెల్లూరు స్టేషను కోసం వెయ్యి కళ్ళతో కాచుకూర్చున్నాను.

ఇంతలో నా కెదురుగా కూచున్న వ్యక్తులు హఠాత్తుగా సాహిత్య చర్చలో పడ్డారు. పెద్దాయన ఆధునిక కవిత్వ ధోరణుల గురించి మాటాడుతున్నాడు. తెలుగు పద్యం విశిష్టత రకరకాలుగా చెబుతున్నాడు. తెలుగు పద్యాన్ని శిల్ప నైపుణ్యంతో శ్రవణ యోగ్యమూ, రసప్లావితమూ చేసినవారిలో రాయప్రోలూ, అబ్బూరీ అగ్రేసరులన్నాడు. నేను వాళ్ళవంక చూడకుండా వింటున్నాను. ఆ తరవాత విశ్వనాథ సత్య

నారాయణ వీళ్ళదారిలో కొంత అనుసరించి వెనక్కుపోయి పాత సంప్రదాయాన్నే ఆశ్రయించాడన్నాడాయన. శిల్పానికి తగినంత ప్రాధాన్యం ఇవ్వటం లేదు విశ్వనాథ-అన్నాడు. వాళ్ళు గమనించకుండా నేను పైకి చూశాను. సత్యనారాయణగారు అటునుంచి ఇటు వొత్తిగిలారు. ఆయన వీళ్ళ మాటలు వింటున్నారేమో ననుకున్నాను.

ఇంతలో నెల్లూరు వొచ్చింది. నేను బండి గుమ్మం దగ్గరకు పోయి నిలుచున్నాను. దూకుడుగా రుక్మిణీనాథశాస్త్రి వస్తున్నాడు. నేను 'శాస్త్రీ' అని కేకేశాను, వచ్చి మా పెట్టెలో ఎక్కాడు. గుమ్మం దగ్గర చెవిలో చెప్పాను: "ఓ ఇద్దరు సాహిత్య చర్చ చేస్తున్నారు. ఎరగనట్టు విను, నువ్వు మన వ్యవహారం మాట్లాడక" అని. శాస్త్రివచ్చి నా పక్కనే కూర్చున్నాడు, అవతలివాళ్ళు వినేట్టు గట్టిగా - "ఇదెక్కడి తెలుగు జనం? టిక్కట్టున్న వాణ్ణి టిక్కట్టు లేనివాళ్ళు లోపలికి రానివ్వరు! స్టేషను లోపలికి రావటానికి ఎంత చచ్చాననుకున్నావు" అంటూ.

రైలు కదిలింది. మా ఎదురుగా కూచున్నవాళ్ళు మాట్లాడటం మొదలు పెట్టారు. పెద్దాయన అన్నాడు, "ఏమన్నా అనవోయి, విశ్వనాథ ఉన్నాడే-మహా ఘటికుడు, వాడి తస్సాదియ్యా, ఏం రాస్తాడయ్యా-కొన్ని పద్యాలు అమోఘం....ఈ పద్యం విను....

ఒక యెన్నో పుట్టుకలకు ముందరైన మ
ప్రారబ్ధ మీరీతి బరిణమించె
నానా విచిత్ర జన్మకృతాస్మదఘరాశి
అయి అయి నేటి కిట్లయ్యె దుదకు
పితృదత్తమగు నాస్తి హతమయ్యె నా యందు
ఆయ నిచ్చిన భార్య యట్లె పోయె
నా తండ్రి చేసిన నానా మహాపుణ్య

కర్మ లీ గతి గంగ గలసిపోయె
మిగిలినది యొక్కడే నాకు మేరువంత
బరువు నా గుండెలో మధ్య భాగమందు
అంతె పేరున కంతె భార్యాస్థిగాని
నా శరీరాస్థి నిజము కృష్ణార్పణమ్ము...."

శాస్త్రి వాళ్ళిద్దరి వంకా, ముఖ్యంగా పద్యం చదివి నాయన వంకా కనురెప్ప వాల్చకుండా చూస్తున్నాడు ఆశ్చర్య సంభ్రమాలతో. నేనూ చకితుణ్ణయినాను. ఎంచాతనంటే, ఆ పద్యం నాకూ ఎంతో నచ్చిన పద్యం. నేను పైకిచూశాను. సత్యనారాయణగారు మేల్కొని ఉన్నారు. కింద మాకెదురుగా కూచున్న వాళ్ళ వంక చూస్తున్నారు. శాస్త్రికి పైన సత్యనారాయణగారున్నట్లు తెలీదు. ఇంతలో ఏదో స్టేషను వచ్చి రైలాగింది. వాళ్ళిద్దరూ దిగిపోయారు. శాస్త్రి వాళ్ళ వెనకాల పోబోయి ఆగిపోయాడు. రైలు కదిలింది.

"వాళ్ళెవరో కనుక్కుంటే బాగుండేది" అన్నాడు శాస్త్రి.

"అనవసరం" అన్నాను. శాస్త్రి ఊరుకున్నాడు. ఏదో ఆలోచిస్తున్నాడు. నేనన్నాను - "ఈ పద్యం మంచి పద్యం. ఇలాంటివి సత్యనారాయణగారు మరికొన్ని రాశారు. అవన్నీ నాలుగు కాలాలపాటు నిలిచేవే."

"ముందుగా సత్యనారాయణగారు ఈ త్రిశతి రాస్తున్నప్పుడు చాదస్తప్మనిషిలా గున్నాడే అనుకునేవాణ్ణి. రెండోసారి చదివినప్పుడు గుండె పిండేసినట్లయింది. ఇప్పుడీ పద్యంతో ఆయనతో కవిగా పోల్చ దగ్గవాళ్ళ వేళ్ళమీద లెక్కించవలసిందే."

గుర్తుకొచ్చి, సత్యనారాయణగారు కూడా ప్రయాణం చేస్తున్నట్లు శాస్త్రికి చెప్పాను. ఆయన్ని చూపించాను. శాస్త్రి లేచి నమస్కరించాడు. సత్యనారాయణగారు కిందికొచ్చారు.

కింద జరుగుతున్నదంతా వింటున్నారా అని అడిగాను. ఆయన నవ్వుతూ, "వినకేం-నాకు దుఃఖంకూడా వొచ్చింది. నన్ను మెచ్చుకునే వాళ్ళు ఈ దేశంలో ఉన్నారు - ఒక్క తిట్టేవాళ్ళేకాక - అని తెలిసింది" అన్నారు.

"మీరు మరీని - మిమ్మల్ని తిట్టే అధికారం యెవరికుందండీ? ఆ రోజులు మరచిపొండి" అన్నాడు శాస్త్రి.

"ఇప్పుడు విన్నారుగా-ఇలా దేశంలో ఎంతమంది మీరెవరో తెలియకుండా మీ కవిత్వాన్ని మెచ్చుకునే వాళ్లున్నారో! నాకు మాత్రం నమ్మకం ఉంది - మీరురాసిన పద్యాల్లో చాలావరకు నిలుస్తయని."

"అది కాదయ్యా! నేను చచ్చిపోయిం తరవాత ఎలా ఏడిస్తేనాకేం లాభం? ఆ దృష్టితో నేను రాయటం లేదు. నా ఆనందం కోసం నేను రాస్తున్నాను. నా అనుభూతి నాది. కవిత్వం చెప్పటం నా ధర్మం. అంతే కాదు, విధ్యుక్త ధర్మం అని భావించేవాళ్ళల్లో నేను మొదటివాణ్ణి. ఎందుకంటే, నా సంస్కారం పూర్వజన్మ సుకృతం కనుక. నీకు నచ్చితే చదువు. లేకపోతే మానేయి. ఎవరి కవిత్వాన్ని అయినా ఆనందించాలంటే ఆ కవికున్న సంస్కారంలో కొంత పాలన్నా ఆ చదివేవాడి కుండాలి. అది లేనప్పుడు ఆ కవిత్వం జోలికి పోకూడదు.... ఆ నా పద్యం విన్నావు కదా! నా ట్రాజెడీ-నా గుండె పగిలి ధారాపాతమయిన నెత్తుటితో విరచితాలయిన పంక్తులవి-వింటున్నావా శాస్త్రీ! సహృదయతా, సానుభూతీ లేనివాడెలా గ్రహించగల డిలాంటిపద్యాన్ని?" అన్నారు సత్యనారాయణగారు. అందరం కాసేపు మౌనంగా కూచున్నాము. గుర్తుకొచ్చి, "శాస్త్రీ, నువ్వు భోంచేసి బయల్దేరావా?" అన్నాను.

సత్యనారాయణగారు నవ్వుతూ నా భుజంతట్టి "మదరాసులో దబ్బిస్తానన్న ఆసామీ ఇడ్లీ పొట్లం ఇచ్చాడు. పైనుంది, విప్పండి" అన్నారు.

*    *    *

ఆ రోజుల్లో మేమంతా నిరుద్యోగ పర్వంలో ఉండేవాళ్ళము. దానికి తోడు మదరాసు మహానగరం. నేనూ, శ్రీరంగం శ్రీనివాసరావూ, నారాయణబాబూ (దీర్ఘ నిరుద్యోగి) మరి కొందరూ, మాతోపాటు అడపా తడపా చాలామంది లబ్ధ ప్రతిష్ఠులయిన వాళ్ళూ కలిసి తిరుగుతుండే వాళ్ళము. అందులో శ్రీనివాస శిరోమణీ, మొక్కపాటి నరసింహశాస్త్రి ప్రభృతు లుండేవారు. ఎక్కువగా తెలుగు వాఙ్మయంగురించీ, మధ్య మధ్య రాజకీయాల గురించీ మాట్లాడుకునేవాళ్ళము.

అప్పుడే శ్రీనివాసరావు 'సిరి సిరి మువ్వ శతకం' ప్రారంభిస్తున్నాడు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి వేమన శతకం అప్పటికే కాకినాడలో ప్రారంభమయింది. శాస్త్రిగారి పద్యాలు ఆ నోటా ఆ నోటాపడి చాలా మందికి అందుబాటులో ఉండేవి. మా నాన్నగారి చాటువుల్నీ, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారివీ — జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ఎక్కడపడితే అక్కడ మాటవరసకి చదివి ప్రచారం చేసేవాడు.

ఓసారి మేమంతా శాంథోమ్ బీచ్‌లో కలిసి కూచున్నప్పుడు, అందరి చాటువుల్నీ ఒక సంపుటంగా అచ్చేయిస్తే ఎలా ఉంటుందని సూచన చేశాను. అందరూ మెచ్చుకున్నారు. శ్రీనివాస శిరోమణిగారన్నారూ, ఆధునికుల్లో పేరుపొందిన ఇతర కవుల దగ్గర్నుంచి కూడా చాటువుల్ని సేకరిస్తే బాగుంటుందని. మొక్కపాటి నరసింహశాస్త్రిగారు నవ్వుతూ "కొన్ని మాంచి బూతుపద్యాలు కూడా దొరుకుతాయి. అవీ వీటితో చేర్చి వెయ్యాలి, పుస్తకం అమ్ముడుపోతుంది" అన్నారు. "బూతు పద్యాలు వేస్తే ప్రభుత్వం (అప్పుడు మనదేశం విదేశ పాలనలో ఉండేది) ఓ పట్టాన ఊరుకోదు. నన్నో, అచ్చేసిన వాణ్ణో జైలుకు పంపిస్తుందికదా!" అన్నాను. అందరూ నవ్వేశారు. కాని చాటువుల సంపుటాన్ని తయారు చెయ్యాలనే నా సంకల్పం మాత్రం నన్ను పీడిస్తూనే ఉండేది. సంకలనం ప్రారంభించాను.

ఓ రోజున నేనూ, శ్రీనివాసరావూ, బెజవాడ నుంచి వచ్చిన కపిల గోపాలరావూ, నళినీ రంజనకుమారూ మౌంటురోడ్డులో ఉడిపి హోటల్లో కాఫీ తాగి బయటికొస్తున్నాము. సాయంకాలం ఆరుగంటలవుతోంది, కుడివేపునుంచి సత్యనారాయణగారు మెల్లిగా నడిచి వస్తున్నారు. అందరం నమస్కరించి పలకరించాము. ఆయనా ఎంతో సంతోషించారు మమ్మల్ని చూసేటప్పటికి. ఒక్కొక్కరినే విడిగా కుశల ప్రశ్నలు వేశారు. ఆయన తిరువలిక్కేణిలో ఏదో పనిమీద పోయివస్తున్నా నన్నారు. అందరం రాయపేట కభిముఖంగా నడుస్తున్నాము. మిడ్‌లాండ్ థియేటరుకు సమీపంగా ఉన్న కాంగ్రెసు గ్రౌండ్సులోకి పోయి కూచున్నాము. లోకాభిరామాయణం మాట్లాడి మాట్లాడి సత్యనారాయణగారి కార్యక్రమం అడిగాము. దారిలో భోంచేసి మైలాపూరు పోతానన్నారు. నళినీ, కపిల గోపాలరావూ సత్యనారాయణగారిని తమతో కలిసి భోంచెయ్యమన్నారు. శ్రీనివాసరావు ఇంటికి పోతానన్నాడు. నేను వాళ్ళతోపాటు భోంచేస్తా నన్నాను. మంచి హోటలెక్కడుందని గోపాలరావు నన్నడిగాడు. మేం కూచున్న చోటికి చాలా సమీపంలోనే శ్రోత్రియ తమిళ బ్రాహ్మణుల భోజనశాల ఉందనీ, అక్కడ భోజనం చాలా అద్భుతంగా ఉంటుందనీ చెప్పాను. అయితే కొంచెం ఆగిపోవాలన్నాను.

మళ్ళీ మాటాడటం ప్రారంభించారు. నేను సత్యనారాయణగారితో ఆధునిక కవుల చాటు పద్యాల్ని ఓ సంపుటంగా వెయ్యాలనుందని ప్రస్తావించాను.

'గుడ్ ఐడియా' అన్నారు. కాని సాదరంగా 'డబ్బు సంపాయించావా?' అన్నారు.

'ముందు సంకలనం, అచ్చు సంగతి తరవాత' అన్నాను నేను. చాటువు లెలాంటివి సంపాయిస్తున్నావని అడిగారు. శ్రీనివాసరావుని తన పద్యాల్ని చదవమన్నాను నేను మా నాన్నగారివి చదివాను. నళిని కృష్ణశాస్త్రివి రెండు పద్యాలు వినిపించాడు.

శ్రీనివాసరావుని సత్యనారాయణగారడిగారు—"ఇలా ఎన్ని పద్యాలు చెప్పారు మీరు?" అంటూ.

"ఓ పదేనండి—ఓ వందన్నా రాయాలి" అన్నాడు.

సత్యనారాయణగారితో—"మీరు రాసినవి కావాలండీ" అన్నాను.

"నావి అయిదారు వందలుంటాయి, రాయాలి. ఆ తరవాత నీ ఓపిక" అన్నారు నవ్వుతూ.

నళిని అడిగాడు సత్యనారాయణగారిని ఓ పద్యమో రెండో చదవమనీ, భోజనానికి పోదామనీ. సత్యనారాయణగారు చదివారు :

"అతని భార్య పుట్టింటికి నరిగె వాడు
వంట చేసికొంచుండె దా నొంటరిగను
అంతసేపున్నదే 'కూరలమ్మి' లోన
నెన్ని కూరలు కొన్నాడొ యేమొ కాని...."

అందరూ నవ్వారు. నేను రాసుకుంటా నన్నాను. సత్యనారాయణగారు- "తొందరపడకు, నేను పంపిస్తానుగా?" అన్నారు.

అందరం లేచాము. శ్రీనివాసరావు తన దారిని వెళ్ళిపోయాడు. మేం నలుగురం భోజనశాల ప్రవేశించాము. కాళ్ళు కడుక్కుని వరసగా పీటలమీద కూచున్నాము. అరవ బ్రాహ్మలు విస్తళ్ళు పరిచి వడ్డించారు. సత్యనారాయణగారి కటూ ఇటూ గోపాలరావూ, నళినీ కూచున్నారు. నళిని పక్కన నేను.

ఒహ బ్రాహ్మడు చేత్తో సాంబారు బక్కెట్టు—బంగారంలా మెరుస్తోంది—మరో బ్రాహ్మడు చేత్తో నేతిగిన్నె పట్టుకొని నిలబడ్డారు. నేతి బ్రాహ్మడు ఫిడేలు తీగ మోగించినట్లు చటుక్కున మెరుపులా నేయి వడ్డించేసి పోతున్నాడు. విస్తరి కో చుక్కన్నా పడివుంటుంది. అలా వడ్డించేందుకు ఎంతయినా నేర్పు కావాలి. సత్యనారాయణగారు నేతి వాసన చూసి, ఆయన్ని వెనక్కి పిలిచి కాస్త మరింత నెయ్యి వడ్డించమన్నారు.

ఆ బ్రాహ్మడు సత్యనారాయణగారిని క్రీగంటచూస్తూ 'ఎస్ట్రాసార్' అన్నాడు. ఆగలేదు.

సత్యనారాయణగారికి ఉక్రోషం వొచ్చింది. నళిని గట్టిగా 'ఫరవా ఇల్లే, పోడుంగో', అంటుంటే సత్యనారాయణగారతన్ని వారించి భోజనంలో 'నెయ్యికి తప్ప మరేదానికి ఎస్ట్రాలేదా?' అని అడిగారు. సాంబారు బ్రాహ్మడు లేదన్నాడు. సత్యనారాయణగారు తల వంచుకొని, సరే సాంబారు పొయ్యి అన్నారు. ఆ బ్రాహ్మడు పోస్తున్నాడు. సత్యనారాయణగారు విస్తట్లో అన్నాన్ని కుదురు చేసుకొని సాంబారును తాగేస్తున్నారు. పంక్తిలో ఉన్న వాళ్ళంతా ఆయన వంకా, ఆయన పక్క కూచున్న మా వంకా విస్తుపోయి చూస్తున్నారు. అందరిలోనూ మేమే తెలుగువాళ్ళం. బక్కెటు ఖాళీ అయిపోయింది. సత్యనారాయణగారు సాంబారు బ్రాహ్మడికేసి చూసి, 'అలా చూస్తావేం పట్టా-ఎస్ట్రాలేదుగా?' అన్నారు. అంతలోకి మరో అరవ ఆసామీ వచ్చి సత్యనారాయణగారికి దండం పెట్టి 'ఇంతటితో ఆపేసి మమ్మల్ని క్షమించండి. కావాలంటే నెయ్యి వడ్డించమంటాను' అన్నాడు. సత్యనారాయణగారతనికేసి చూసి నవ్వి, మరెప్పుడూ అలా ప్రవర్తించటం మర్యాదకాదనీ, డబ్బు పుచ్చుకునేటప్పుడు ముందుగా ఆ విషయం చెప్పడం మంచిదనీ మందలించారు. ప్రశాంతంగా భోంచేసి బయటపడ్డాము. వీథిలోకి వచ్చింతరవాత సత్యనారాయణగారు - 'వంటబాగుంది కాని మూడ్ చెడిపోయిం'దన్నారు.

'అగస్త్యుడు సముద్రాన్ని ఔపోసన పట్టేసినట్టు, మీరు సాంబారుని అరచేతిలో పట్టేశారు, అరవ బ్రాహ్మడు మీ పాదాక్రాంతుడయ్యాడు —పంతమంటే మీదేనండీ' అన్నాడు కపిల గోపాలరావు. అందరం నవ్వుకున్నాము.

కొన్నేళ్ళ తరవాత సత్యనారాయణగా రోసారి హైదరాబాదు వచ్చారు. అప్పుడు భాషానిలయం పక్కసందులో డాక్టరు పిశుపాటి వెంకటరమణయ్యగారింట్లో దిగారు. వారిని చూడ్డానికి వెళ్ళాను. ఆ సంవత్సరమే 'విశ్వనాథ పంచశతి' అచ్చయింది. మాట సందర్భంలో పంచశతి గురించి చెబుతూ 'కేవలం పంతంవల్ల పద్యాల సంఖ్యాబలం పెరిగింది' అన్నాను. 'నువ్వేమన్నా అను. నాకోపద్ధతి ఉంది, ప్రయోజనం ఉంది. అంతే' అన్నారు.

ఆయన దగ్గర్నించి వస్తున్నప్పుడు పంచశతి మనసులో కదలగానే మదరాసులో అరవ బ్రాహ్మల భోజనశాల గుర్తుకొచ్చేది.

* * *

నా కనుల యెట్ట యెదుటన నా జనకుని
నా జనని కుత్తుకలను కోసి నన్నడిగె న
తండు 'నే దయాంబుధిని కాదా' యటంచు
ఓ ప్రభూ! యగునంటి నే నొౌదిగి యుండి

నా కనుల యెట్ట యెదుటన నా లతాంగి
ప్రాణములు నిల్వనందీసి యడిగె నను న
తండు 'నే దయాంబుధిని కాదా' యటంచు
ఓ ప్రభూ! యగు నంటి నే నొదిగి యొదిగి

నా కనుల యెట్టయెదుట నా యనుంగు
తనుజు కుత్తుక నులిమి తా నను నడిగె న
తండు 'నే దయాంబుధిని కాదా' యటంచు
ఓ ప్రభూ! నీవ యంటి నే నొదిగిపోయి.

మరీ చిన్నతనంలో, మా మేనత్తగారి నోట విన్న పద్యాల పూర్తి పాఠం ఇది. ఇన్నేళ్ళకు, ఏభై ఆరు సంవత్సరాల తరవాత ఈ పద్యాల్ని మళ్ళీ చూడటం సంభవ మయింది. ఆంధ్రప్రభలో నా వ్యాసాలను చదువుతున్న ఏల్చూరి మురళీధరరావు ఈ పద్యాల్ని రాసి పంపించాడు. నే నన్నా, విశ్వనాథ సత్యనారాయణగారన్నా మురళీధరరావుకి అభిమానం. మురళీధరరావు తండ్రి ప్రసిద్ధుడయిన మా సహకవి ఏల్చూరి సుబ్రహ్మణ్యం. నాకూ, మురళికీ అదో అవినాభావ సంబంధం కూడా.
Acc. No. 16707
మురళి ప్రస్తుతం ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకుడుగా పని చేస్తున్నాడు. వర్ధమాన సాహిత్యవేత్త. విశ్వనాథ సత్యనారాయణగారు ఈ పద్యాల్ని 1918 లో రాశారని మురళి ఉదాహరించాడు. ఎక్కడ అచ్చయిందో నాకు గుర్తు లేదు. అచ్చులో నే నింతవరకూ చూడనూ లేదు. ఓ ఇరవై సంవత్సరాల దాకా ఈ పద్యాలు నాకు కంఠప్రాయంగా ఉండేవి. అవి అచ్చయిన వెంటనే వాటి కంత చక్కని ప్రచారం ఎలా సంభవించిందో నా కర్థం అయేది కాదు. దాని గురించి నే నెక్కువగా ఆలోచించిందీ లేదు. అయితే, ఈ పద్యాలు మాత్రం నా మనస్సును అంత చిన్న వయస్సులోనే వికలం చేయటం నాకు గుర్తుంది. భగవంతుడనే అగోచర ధ్యేయాన్ని నేను శంకించటం ప్రారంభించాను. సత్యనారాయణగారు అతి సామాన్యమైన, సార్వజనీనమైన లోక వృత్తాన్ని మానవ హృదయం విహ్వలించేట్టు తన పద్యాల్లో దర్శనం చేయించారు. సత్యనారాయణగారి కవిత్వం అలా నా శైశవంలో,నా కౌమారంలో పెద్ద మార్పు తెచ్చింది.

30-200
894.8134
VAR

మా నాన్నగారి నడిగాను, ఇంత అన్యాయం చేసింతరువాత దయాంబుధి నని అడగటానికి దైవాని కెలా ధైర్యం కలిగి ఉంటుందని. మా నాన్న నవ్వేశారు. మా మేనత్త నడిగాను. ఆవిడ అందీ— 'నాయనా, భగవంతు డెప్పటికైనా దయార్ద్ర హృదయుడే. మనం ఎప్పటి కయినా

పోవలసినవారమే — అంచేత, ఆయన తొందరగా తీసుకుపోయారు. కనక—అందువల్ల బతికి ఉన్న వారంతా, నాదని అనుకునే వాళ్ళు రాగ బంధాలతో దుఃఖపడతారు. ఆ దుఃఖం అనశ్వరం, మరణం ప్రకృతి. కనక, మరణాన్ని సత్వరదర్శనం చేయించిన వాడు దయాసాగరుడే కదా!' అంటూ, సత్యనారాయణగారి పద్యాలకి మా మేనత్త అంత దీర్ఘ వ్యాఖ్యానం చేసింది. నాకు మాత్రం అర్థం కాకపోవటం వల్లనో, మరే కారణంవల్లనో దేవుడి మీద భక్తి, విశ్వాసం పోయాయి.

ఈ పద్యాలు విన్న రెండేళ్ళకు మా చెల్లెలు వాత్రేరులో పోయింది. మా నాన్న గారు ఎంతో వ్యయం చేసి వైద్య సదుపాయం చేసినా, ఆ అమ్మాయి బతకలేదు. ఆఖరి రోజుల్లో మాకు తోడుగా మా మేనత్త వాత్రేరు వచ్చింది. ఆ అమ్మాయి మృత్యువును చూసింది. నేను పట్టలేక ఆవిణ్ణి అడిగాను - 'దేవుడింకా దయాంబుధేనా' అని. ఆవిడ కంటనీరు పెట్టుకొని మాట్లాడలేదు. మా చెల్లెలు మరణం మీద అప్పుడే దుఃఖానికి ఉపశమనంగా పద్యాలు రాశాను. ఆ పద్యాలు విన్న తరవాతనే రాచకొండ విశ్వనాథశాస్త్రి నాకు పరమాప్తు డయినాడు. ఆ పద్యాల్ని ఓ సారి సత్యనారాయణగారికి వినిపించాను. ఆయన పద్యాలు చదివింతరవాత దైవం మీద విరక్తి పుట్టి, మాకు సంభవమైన విషాద సంఘటనల వల్ల నాలో పూర్తిగా మార్పు వచ్చిందని చెప్పాను. సత్యనారాయణగారు నొచ్చుకొన్నారు. తనకి దైవం మీద విపరీత విశ్వాసం ఉందనీ, తను రాసిన పద్యాలు దైవానుకూలమైనవే ననీ చెప్పారు. అయినా, నా విరక్తిలో మార్పు రాలేదు. అంతేకాక, సత్యనారాయణగారు నేను రాసిన పద్యాల్ని మెచ్చుకున్నారు, ఆ తరవాత ప్రతి సాహిత్య సమావేశంలోనూ పురిపండా అప్పలస్వామీ, శ్రీరంగం శ్రీనివాసరావూ నా చేత ఆ పద్యాల్ని చదివించేవారు. అప్పటి నా వయస్సు పదకొండూ, పన్నెండు సంవత్సరాలు. కాలక్రమాన ఆ పద్యాలు నాలోనించి అదృశ్యమైనాయి. నేను

ఇంటర్మీడియట్‌లోకి వచ్చిన సంవత్సరమే కళాశాల పత్రికలో అవి అచ్చయినాయి. అందులో ఒక పద్యం లీలగా గుర్తు:

నాన్నగారి వేదాంతమ్ము నెన్నిసార్లు
వినుచు నోపిక పట్టగలనని తలచి
స్వామి గుడివాకిలిం జేరి ప్రార్థనమ్ము
చేసినా నొక మారు నా చెల్లికొరకు;
.... కేలు విసరి పొమ్మను నింత జాలిపడడు

.... .... .... .... .... .... ....

సత్యనారాయణగారలా నాలాంటి వాళ్ళని అంత చిన్న వయసులోనే తన కవిత్వంతో సమ్మోహితుల్ని చేశారు. నా తరంలోని కవులు చాలా మంది ఈనాటికీ ఆయన్ని గౌరవిస్తారు. ఆయన పద్యాలు కొన్ని భావనాశబలత వల్లనూ, ఆవేశశుద్ధి చేతనూ సార్వలౌకికానుభవ వస్తుగుణం వల్లనూ ఎంతో మందికి ఎన్నో ప్రాంతాలలో వాచోవిధేయాల్లా ఉండటం నేను చూశాను. కవిత్వానికి ఇదే మూల లక్షణమని ఓసారి చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారి ముఖతః నేను విన్నాను. ఆ లక్షణాన్నే మరో విధంగా మరో సన్నివేశంలో సుప్రసిద్ధాధునిక ఆంగ్లేయకవి డబ్ల్యు. హెచ్. అడెన్ ముఖతః హార్వర్డులో విన్నాను.

సత్యనారాయణ గారు కవిత్వంలో ఎన్నో రూప కల్పనలు చేశారు. పద్యాన్ని వశం చేసుకున్నారు. తెలుగు జీవితాన్ని ఆమూలం విశ్లేషించి చూశారు. అందుకు ప్రతీకగా రామాయణ కల్పవృక్షం రాశారు. అయినా ఆయన రాసిన ఖండకృతుల్లో చాలావరకు కలకాలం నిలుస్తాయని నేను విశ్వసిస్తాను. అంతేకాదు, ప్రపంచ సాహిత్యంలో చేరదగ్గవి. రామాయణ కల్పవృక్షం మొత్తం నేను చదవలేకపోయాను.

ఓసారి చాలా ఏళ్ళక్రితం సత్యనారాయణగారిని ఢిల్లీలో అజ్మల్ ఖాన్ రోడ్డులో యాదృచ్ఛికంగా కలిశాను. మాటమీద మాట - నేనన్నాను- "రామాయణ కల్పవృక్షంమీద అంత కాలవ్యయం చేశారు - ఓ ప్రభూ, అంధభిక్షువులాంటి ఖండికలు రాస్తే మా తరం ధన్యమయేదీ - ముందు తరాలూ పరవశించేవీ" అని. సత్యనారాయణ గారు నవ్వి నా భుజాన్ని తట్టుతూ "నా కల్పవృక్షం వేరే కథ - ఇంతకీ ఓ సంగతి మరిచిపోకు వరద రాజేశ్వరరావు! మనిద్దరం సమకాలికులం!" అన్నారు. తరవాత దారిలో ఒంటరిగా నడుస్తున్నప్పుడు కాని ఆయన అన్న మాటల్లోని అంతరార్థం గ్రాహ్యం కాలేదు.

# దువ్వూరి రామిరెడ్డి

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నేను చదువుతున్నప్పుడు దువ్వూ రామిరెడ్డిగారోసారి వాల్తేరు వచ్చారు. ఎందుకొచ్చారో నాకిప్పుడు గుర్తుకురి రావటంలేదు. మా నాన్నగారప్పుడు విశ్వవిద్యాలయ గ్రంథాలయాధి కారిగా ఉండేవారు. ఆయనతో పనిబడి ఆయన కూచునే గదిలోకి వెళ్ళాను. ఆయనతో మాటాడుతుండగా ఒకాయన నవ్వుతూ గదిలోకి ప్రవేశించాడు. అంత లావూగాక, సన్నంగాక, కొంచెం కోలమొహం, మీసాలు, ధోవతిమీద షర్టూ, షర్టుమీదకోటూ, ఇదీ ఆయన వేషం. ఆయన్ని చూడగానే నేను మా నాన్నగారితో వెళ్ళిపోతానన్నాను. ఆ వచ్చి నాయన మా నాన్నగారితో 'మీ అబ్బాయా' అన్నారు. అవునని నవ్వుతూ, బాగా గుర్తుపట్టారే అన్నారు మా నాన్నగారు. ఆయన్ని చూపిస్తూ, "దువ్వూరి రామిరెడ్డిగారు" అంటూ నాకు పరిచయం చేశారు. ఆయన్ని చూస్తున్నప్పుడే నా మనస్సులో—

గాలి యడుగుల నెవరికోసరము
ఓ మోహశీలా!
కదలి వచ్చితి వీ నిశీథమున.

అనే పంక్తులు లీలామాత్రంగా ప్రత్యక్షమయ్యాయి. మా విద్యార్థి దశలో మా సమకాలిక కవుల రచనల్లోని అలాంటి పంక్తులు మేం జ్ఞాపకం పెట్టుకోవటమేకాక, వాటిమీద మాకు ఒక రకంగా అజ్ఞాతవ్యామోహం ఉంటూండేది. అప్పటికే భారతిలో ఆయన ప్రచురించిన ఉమర్ ఖయాము

రుబాయీల అనువాద పద్యాల నన్నింటినీ చదివేశాను. ఆ పద్యాలమీద నాకెంతో అభిమానం. అంచేత దువ్వూరి రామిరెడ్డిగారంటే ఏం మాట్లాడాలో తోచక రెండు చేతులతో నమస్కారం చేశాను. సామాన్యంగా నేనెవరికీ నమస్కారం చేసినవాణ్ణికాదు. అప్పటివరకు ఒక్క తాతా సుబ్బరాయశాస్త్రిగారికే నమస్కారం చేశాను. రామిరెడ్డిగారికి నేనలా నమస్కారం చెయ్యటం నా మట్టుకు నాకే ఆశ్చర్యం వేసింది. ఆయన ఒకటో రెండో ప్రశ్నలు వేశారు, నా చదువుగురించి. ఆ తరవాత నేను గదిలోనించి బయటికొచ్చేశాను. అయితే ఆయన్ని కలిసి మాట్లాడాలనే కుతూహలం ఉంది. ఏంచెయ్యాలో తోచలేదు. గ్రంథాలయం ముఖద్వారం దగ్గిర నిలబడి నిరీక్షిస్తున్నాను ఏదో నెపంతో. రామిరెడ్డిగారు చాలా సేపటికి అలా వచ్చారు. నన్ను చూసి మందహాసం చేశారు. నేను ఆయనతో నడుస్తూ "మీ రెన్నాళ్ళుంటా" రన్నాను. ఆ రోజు సాయంకాలం వెళిపోతున్నా నన్నారు. అంతే—ఆయనతో మాట్లాడే అవకాశం కుదరలేదు.

1943 వ సంవత్సర ప్రాంత మనుకుంటాను. మదరాసులో నేను ఉన్న రోజులు. అప్పుడు చెన్నపురి ఆంధ్ర మహాసభ ఉండేది తెలుగు వాళ్ళ సాంస్కృతిక సంస్థగా. ఆ తరవాత కొంతమంది యువకులు ఆ సభతో అభిప్రాయభేదంవల్ల "ఆంధ్ర విజ్ఞాన సమితి" అనే మరో సంస్థను నిర్వహించేవారు. ఆ సంస్థ రాయపేటలో రోడ్డు కానుకున్న మేడలో పైభాగం మీద ఉండేది.

ఒకరోజు నార్ల వెంకటేశ్వరరావుగారిని చూడటానికి ఆంధ్రప్రభ కార్యాలయానికి వెళ్ళాను. సాయంకాలం. నేను వెళ్ళగానే ఆయన లేచి నిలబడ్డారు నవ్వుతూ. "ఓ సమావేశానికి పోవాలి, మీరూ రండి, కలిసి

మాట్లాడుకుంటూ పోదాం" అన్నారు. ఇద్దరం కిందకి దిగి ట్రాంలో కూచున్నాము. ఆ సాయంకాలం ఆంధ్ర విజ్ఞాన సమితిలో దువ్వూరి రామిరెడ్డిగారి ఉపన్యాసం. నార్ల ఆ సమావేశానికి అధ్యక్షులు. సమితి సభావరణలోకి అడుగు పెట్టామో లేదో రామిరెడ్డిగారూ వచ్చారు. నార్ల నన్ను పరిచయం చేయబోతుండగా రామిరెడ్డిగారు నా భుజం మీద చెయ్యివేసి - తెలుసు. వార్తేరులో చాలాకాలం కింద చూశాను అన్నారు. నార్లతో ఏదో మాట్లాడుతూ, మళ్ళీ నావంక తిరిగి "నువ్వుకూడా కవిత్వం రాస్తున్నావని విని సంతోషించాను. మా సంప్రదాయం కాస్త నిలబెట్టు!" అన్నారు.

ఆ తరువాత ఆయన ఉపన్యాసం అయిపోయింది. ఉమర్ ఖయాం మీద మాట్లాడారు. నార్ల సముచితంగా అధ్యక్షోపన్యాసం చేశారు. మేడ మీంచి దిగాము. నార్ల రామిరెడ్డిగారిదగ్గరా, నిర్వాహకులదగ్గరా సెలవు తీసుకుని వెళ్ళిపోయారు. రామిరెడ్డిగారు నా వంక చూసి, నాతో వస్తావా, కొంతదూరం నడుద్దాం అన్నారు. ఎదురుగుండా ట్రాంలు నడుస్తున్నాయి. ఆయనకి నడవాలని ఉంది. సరేనన్నాను. నడుస్తున్నాము. మెల్లిగా సాహిత్య చర్చలో పడ్డాము. రామిరెడ్డిగారు మాట్లాడుతుంటే ఏదో పరమ రహస్యం చెవిలో చెబుతున్నట్టుండేది. మాట మెత్తన. వినయ సంపన్న మైన మనస్సు.

ఆయన అన్నారు "కవిత్వానికి కేవలం భాషమీద అధికారం సంపాయించటమే చాలదు, భావనాశబలత పుష్కలంగా ఉండటమే చాలదు, ఛందస్సులో అనితరసాధ్యమైన ప్రావీణ్యం సంపాయించడమూ చాలదు. ఈ మూడూ సమస్థాయిలో ఉన్నప్పుడు ఛందోరూప కల్పనలో సౌందర్య సిద్ధిని ఆపాదించాలి. అప్పుడు శ్రవణయోగ్యమైన హృదయ స్పందన కారణమైన కవిత్వం ఆవిర్భవిస్తుంది...." అని.

నే నడిగాను: ఛంద స్సౌందర్యాన్ని నిర్ణయించే దెవరు?

రామిరెడ్డిగారన్నారు: "సౌందర్యాన్ని ఉపాసించేవాడే నిర్ణయించుకుంటాడు. మనకు మొదట్నుంచీ రసాస్వాదన వైయక్తికమే. ఆదే అలంకారికులూ అన్నారు. పూర్వకవులు కవిత్రయం నుంచీ ప్రబంధకవుల దాకా, కథాక్రమమూ, ధారా పద్యానికి ముడిపెట్టి పద్యశిల్పాన్ని మరిచిపోయారు. దానిని పునరుద్ధరించింది ఆధునికుల్లో రాయప్రోలూ, అబ్బూరీ అని నా అభిప్రాయం. ఒక మాట చెబుతాను విను. పూర్వ కాలంలో మన వాళ్ళు చేనేతలో బహుళ ప్రావీణ్యం సంపాయించారు, అంతమాత్రంచాతనే వారికి విశ్వవిఖ్యాతి రాలేదు. నేతలో వారు రూపొందించిన అలంకార ప్రజ్ఞ వల్ల విదేశాల్లో ప్రఖ్యాతి చేకూరింది. అలాగే కవిత్వంలో కూడా పద్య కల్పనలో సుందర పటిష్ఠత చేకూరితే కవిత్వం అజరామరం అవుతుంది. నేనూ అలాంటి లక్ష్యాన్నే నా పద్య రచనలో అనుసరించాను. కృతకృత్యుణ్ణయానో లేదో తెలియదు." ఇలా మాట్లాడుతూ లజ్‌కార్నర్ దాకా నడిచాం. ఆయన చటుక్కున సంభాషణ ఆపి, "నిన్ను చాలా దూరం తీసుకొచ్చాను, వెళ్ళు" అన్నారు.

ఆయన ఆశించినట్టు ఆయన పద్య నిర్మాణంలో సౌందర్యాన్ని సాధించారు. ఆయన ఉమర్ ఖయాము అనువాద పద్యాలు తెలుగునాట నాలుగు కాలాలపాటు ఉండగలవని నా విశ్వాసం. ఒకప్పుడు ఢిల్లీలో నేనో అంతర్జాతీయ ప్రచురణ సంస్థలో పనిచేసేవాణ్ణి. లండను లోని ప్రఖ్యాత ప్రచురణ సంస్థవారు ఉమర్ ఖయాం రుబాయీలను ప్రత్యేకంగా మరో పారసీక భాషావేత్త చేతనూ, సుప్రసిద్ధ ఆంగ్లకవి రాబర్టు గ్రేవ్స్ చేతనూ అనువాదం చేయించి అచ్చువేశారు. ఫిట్జురాల్డ్ అనువాదం పారసీక భాషాజ్ఞానం లేకపోవటం చేత దోషభూయిష్ఠంగా

ఉందనీ, ఈ అనువాదం మూలానికి ప్రతిబింబంగా ఉంటుందనీ, ఆ పుస్తక విక్రయం మీద నా అభిప్రాయాన్ని అడిగారు. ఎన్ని అనువాదాలు వచ్చినా, ఫిట్జురాల్డ్ అనువాదమే బహుజన సమ్మతం కావటం వల్ల ఆ పుస్తకమే నిలుస్తుందని రాశాను. అలా రాస్తూ తెలుగులో రామిరెడ్డిగారి అనువాదాన్ని ఉదహరించాను. ఎంతో వ్యయ ప్రయాసలకు లోనయి ప్రచురితమైన ఆ ఆంగ్లానువాదం అమ్ముడుపోక విపరీత నష్టానికి గురి కావలసివొచ్చింది. తెలుగులో రామిరెడ్డిగారి పుస్తకం తరవాత ఇప్పటికీ అనువాదాలు వస్తున్నాయంటే అది నాకర్థంకాని వ్యవహారం.

# బలిజేపల్లి లక్ష్మీకాంతము

బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు నే నెరిగున్నప్పటికే లోకప్రసిద్ధుడు. ఆయన సహజంగా నటుడేకాక బహుళప్రచారంలో ఉన్న హరిశ్చంద్ర నాటకకర్త. 1912 సంవత్సరంలో అనుకుంటాను "సత్యహరిశ్చంద్రీయం" అచ్చు అయింది. అప్పుడు గుంటూరులో బెస్టు కంపెనీ ఉండేది. హరిప్రసాదరావుగారూ, కోపల్లె హనుమంతరావుగారూ, లక్ష్మీకాంతంగారూ ఆ నాటక సంస్థకు మూలస్తంభాల్లా ఉండేవారు.

లక్ష్మీకాంతం గారికి మా నాన్నగారంటే ఎనలేని గౌరవం. వయసులో ఆయన మా నాన్నగారికన్నా పదహారేళ్ళు పెద్ద. అయినా కవిత్వంలో మా నాన్నకే ఆయన అగ్రపీఠం వేసేవారు. నా చిన్నతనంలో మా యింటికి తరచూ వచ్చేవారు. అందర్నీ ఆప్యాయంగా పలకరించేవారు. మా మాతామహుల ఊరు ఇటికంపాడు. గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలో ఉండేది. మా మాతామహులక్కడ కరణీకం చేసేవారు. ఆయనపేరు వడ్లమూడి కృష్ణయ్య పంతులుగారు. లక్ష్మీకాంతంగారి జన్మస్థలం కూడా ఇటికంపాడే అవటం వల్ల మా కుటుంబానికి మరింత సన్నిహితులుగా ఉండేవారు.

రెండో ప్రపంచ యుద్ధ సమయంలో మా కుటుంబం తిరిగి మదరాసు వలస వెళ్ళింది. అప్పుడే మా నాన్నగారు నటాలి సంస్థను ప్రారంభించి నిర్వహించేవారు. నేనూ, శ్రీరంగం శ్రీనివాసరావూ, మావిళ్ళపల్లి వేణుగోపాలరావూ అందులో ఉద్యోగం చేసేవాళ్ళము. ఆ రోజుల్లో లక్ష్మీకాంతంగారు కూడా సినిమాల్లో నటించేందుకు మదరాసు వచ్చేశారు. ఆయనకి సినిమాల్లోకన్నా నాటకాల్లో వేషాలు వెయ్యాలని

కుతూహలంగా ఉండేది. మా నాన్నగారు నాటకసంస్థను నెలకొల్పారని తెలియగానే మా ఇంటికొచ్చారు. తీరిక చిక్కినప్పుడల్లా మా నాటకాల్లో వేషంవేస్తా నన్నారు. అప్పుడు మా నాన్నగారు "కన్యాశుల్కం" మదరాసులో ప్రదర్శించేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు. అందులో అగ్నిహోత్రావధాన్లు పాత్రను లక్ష్మీకాంతంగారి కిచ్చారు. ఆ సందర్భంగా మేమంతా రోజూ సాయంకాలం పూట పిఠాపుర నగరంలో మా ఇంట్లో కలుసుకునేవాళ్ళం. రిహార్సల్సు కాగానే ఆయన్ని బస్సుదాకా దించి వచ్చేవాళ్ళము.

ఒకసారి ఆయన పనిమీద కాకినాడ వెళ్ళవలసి వచ్చింది. అప్పట్లో కన్యాశుల్కంలో మధురవాణి పాత్రకు పనికివచ్చే నటికోసం మా నాన్నగారు అన్వేషిస్తున్నారు. ఆ అమ్మాయి మా నటాలిలో తప్ప మరెక్కడా వేషం కట్టకూడదు. అలా వెతకటంలో కాకినాడ నుంచి ములుకుట్ల వెంకటశాస్త్రి గారు రాజమండ్రిలో ఓ అమ్మాయి ఉందనీ, చూస్తే బావుంటుందనీ కబురు చేశారు. ఆ రోజుల్లో ఆ అమ్మాయి సంపన్న కుటుంబంలోనించి వచ్చి, పోలీసు సబ్ ఇన్స్పెక్టరుగా పనిచేస్తున్న ఓ పెద్ద మనిషి పోషణలో ఉండేది. ఆయనకి ఆ అమ్మాయిని రంగస్థలం మీదా, తద్వారా వెండితెర మీదా రాణింప చెయ్యాలనే మహా తపన ఉండేది. శాస్త్రిగారూ, ఆయనా స్నేహితులు. శాస్త్రిగారా అమ్మాయిని చూశ్ళేదు. చూడకూడదూను! అంచేత నన్ను పోయి చూడమని సూచించారు. మా నాన్నగారు లక్ష్మీకాంతంగారిని తోడుతీసుకుపోయి చూసి చెప్పమన్నారు. అనుకున్న ప్రకారం నేను రాజమండ్రి స్టేషనులో దిగాను. అక్కడికి నిర్ణీత సమయానికి లక్ష్మీకాంతంగారొచ్చారు. ఇద్దరం కలిసి జట్కా తీసుకుని టవున్ పోలీస్ స్టేషనుకి తీసుకుపొమ్మన్నాము. అక్కణ్ణించి మమ్మల్నెవరో ఆ అమ్మాయి ఇంటికి తీసుకుపోయే ఏర్పాటు చేశారు.

జట్కాకు రెండు వేపులా సత్యహరిశ్చంద్ర నాటకం పోస్టర్లు అతికించి ఉన్నాయి. లక్ష్మీకాంతంగారు చిరునవ్వు నవ్వారు. ఆయన ముందూ, నేను వెనకా కూచున్నాము. బండి సాగింది. జట్కావాడు గుర్రాన్ని గమ్మత్తుగా తోలుతున్నాడు. చెర్నాకోలను గాలిలో విసిరి విదిలిస్తున్నాడు. నడిరోడ్డు మీదికి వచ్చాము. బండి వేగం పుంజుకుంది. జట్కావాడు అటూ ఇటూ చూస్తూ గట్టిగా రాగం వరసలో పద్యం చదువుతున్నాడు:

**తిరమై సంపదలెల్ల వెంట నొకరీతిన్ సాగిరా వేరి కే**
**సరికేపాటు విధించెనో విధి యవశ్య ప్రాప్యమద్దాని నె**
**వ్వరు దప్పించెద రున్నవాడనని గర్వం బేరికిన్గాదు; కిం**
**కరుడే రాజగు, రాజె కింకరుడగున్ కాలానుకూలంబుగాన్.**

లక్ష్మీకాంతంగారు విభ్రమాశ్చర్యంతో వింటున్నారు. జట్కావాడు వెనక్కి తిరిగి"చూశారా-నిన్నరాత్రి వాడితస్సాదియ్యా-యేం చదివాడండి సుబ్బారావ్-హాలంతా కళ్ళనీళ్ళేనండీ - వాడి దుంపతెగా" అంటున్నాడు.

లక్ష్మీకాంతంగారి కళ్ళు ఆనందాశ్రువులతో చెమ్మగిల్లటం చూశాను. ఆయన నాతో "పద్యంలో రహస్యం అదే — హరిప్రసాదరావు చదువుతుంటే ప్రేక్షకుల్లో కొందరు ఏడుపు ఆపుకోలేక హాల్లోనుంచి వెళ్ళి మళ్ళీ వస్తుండేవారు. వీలయినంత వరకు అందరికీ అర్థం అయేలా రాశాను, మా రోజుల్లో ఉండే మర్యాదని పాటించి. వీడుకూడా పద్యం చదివి అర్థం చేసుకున్నాడంటే ధన్యులమయినట్లే. ప్రజల కవిత్వ మంటారు. అదేం కవిత్వమోయి?" అన్నారు నవ్వుతూ.

హరిశ్చంద్ర నాటకంలో నక్షత్రకుడుగా లక్ష్మీకాంతంగారు నటించే వారట. హరిప్రసాదరావుగారితో పోటీ పడటానికి తన పాత్రకి చాలా పద్యాలు రాసి పెట్టుకున్నారట.

ఇంతలోకి పోలీస్ స్టేషను వచ్చింది. మమ్మల్ని సాదరంగా అక్కడి పోలీసులు ఆహ్వానించి కుర్చీల్లో కూచోబెట్టారు. ఎంత సేపటికీ ఎవరూ మాట్లాడరు. మా కనుమానం వచ్చి ఓ పోలీసు ఆసామిని అడిగాము, మేము ఎక్కడికి పోవాలని. వాడు మాట్లాడడు. మాకు మరింత అనుమానం. ఓ ముప్పావుగంట తర్వాత మరో పోలీసు వాడొచ్చి మాకు సైగచేసి నడిపించుకుంటూ తీసుకుపోయాడు. సందులూ, గొందులూ దాటుకుని ఒక చిన్న భవంతి ముందు మమ్మల్ని ఆపాడు. వాడు లోపలికిపోయి మరో పోలీసు వాడికి అప్పగించి వెళ్ళిపోయాడు. మేమిద్దరం ఇంట్లోకి ముందున్న గదిలో కూచున్నాము. కొంచెం స్థితి పరుల కొంపలాగే ఉంది.

ఓ పది నిమిషాల తర్వాత ఒక యువతి మేము కూచున్న గదిలోకి ప్రవేశించి ఓ మూల మరో కుర్చీలో కూచుంది. మొహం మీద అద్దకం విపరీతంగా కనిపించినా కొంచెం ప్రసన్నంగానే ఉంది. అంత కురూపి కాదు. పాతికేళ్ళపైనే వయస్సు. కొంచెం స్థూలకాయం. మమ్మల్ని చూసి అతి మందహాసం చేసింది. అంతే, చలనంలేని విగ్రహంలాగుంది. లక్ష్మీకాంతం గారు ఆవిడకేసి చూస్తూ రెండు మూడు ప్రశ్నలు వేశారు, ఆవిడ రంగస్థలానుభవం గురించి. ఆవిడ చలించలేదు. అంతలోకి ఆవిణ్ణి ఉంచుకున్న ఇన్‌స్పెక్టర్‌గారొచ్చి మమ్మల్ని కుశల ప్రశ్నలు వేశారు. మళ్ళీ లక్ష్మీకాంతంగారావిడవంక చూస్తూ, రెండు మూడు ప్రశ్నలు వేశారు. ఆవిడలో చలనం లేదు. మా వంక చూస్తోంది. ఇన్‌స్పెక్టరు గారు ఆవిడకు బదులుగా జవాబు చెబుతున్నారు.

లక్ష్మీకాంతంగారూరుకోక ఆవిడతో "మీరు పాడగలరా, సంగీతం నేర్చుకున్నారా" అన్నారు. అప్పుడు ఇన్‌స్పెక్టరుగారు కలుగజేసుకొని లక్ష్మీకాంతం గారి ప్రశ్నను ఇల్లు దద్దరిల్లేట్టు అరుస్తూ ఆవిడ చెవి దగ్గర చెప్పారు. ఆవిడ మందహాసం చేసింది. లక్ష్మీకాంతం గారికి ఓపిక

చచ్చింది. లేచి నిలబడి, మదరాసుకు వెళ్ళాక రామకృష్ణారావు గారితో సంప్రదించి రాస్తామంటూ సెలవు తీసుకున్నారు. ఆవిడ ఛాయాచిత్రాన్ని తీసుకుని బయటపడ్డాము.

ఓ పోలీసు మాకు జట్కా పట్టుకొచ్చి మమ్మల్నెక్కించి, తను ముందు కూచున్నాడు. బండి నడవంగానే "అమ్మగారితో ఎలా మాట్లాడారండీ?" అని విరసంగా అడిగాడు మమ్మల్ని. "అలా ఎందుకడుగుతున్నావ"ని లక్ష్మీకాంతంగారడిగారతన్ని. పోలీసు నవ్వటం మొదలు పెట్టాడు. మా కర్థం అయింది. ఆ ఇల్లాలికి బ్రహ్మ చెముడు!

స్టేషనులో రైలింకా రాలేదు. లక్ష్మీకాంతంగారు పచారుచేస్తూ—

**మధురవాణి కాదు మంచి బధిరవాణి**
**కామకృతికి తగ్గ కాంత యిద్ది**
**రంగతల మనంగరంగ స్థలము కాదు**
**మరి తిరోగమనమె మనకు దిక్కు!**

అంటూ ఓ పద్యాన్ని ఆశువుగా పాడి మందహాసం చేశారు.

# రాయప్రోలు సుబ్బారావు

విశాఖపట్నం విప్పర్తివారివీథి. అందులో పింగళి లక్ష్మీకాంతం గారుండేవారు. ఆయన బావమరిది మోచర్ల అనంతపద్మనాభరావూ, నేనూ సహాధ్యాయులం. ఒకే తరగతిలో కూచునేవాళ్ళం. పొద్దునపూట అతనితోపాటు స్కూలుకు వెళ్ళేవాణ్ణి. పద్మనాభరావుకి లక్ష్మీకాంతం గారుండే మేడమీద ఓ మూలగది చదువుకోవటానికిచ్చారు. అది సన్నగా పొడుగ్గా ఉండేది. అందులో తలుపుల్లేని అరలున్న అల్మరా ఉండేది. దాంట్లో కొన్ని పుస్తకాలుండేవి. పద్మనాభరావు భోంచేస్తున్నప్పుడు నే నాగదిలో కూచుని ఆ పుస్తకాలు తిరగేసేవాణ్ణి. ఓ రోజున అందులో ఓ పుస్తకంలో—

**రసమో, భావమొ, జీవదర్థసుకుమార వ్యంజనామంజు శ**
**బ్ద సమాసారచనంబొ, సాధు హృదయస్పంద ప్రతిష్ఠా కథా**
**వివరంబో! సకలార్థ శూన్యమగు నీ వేగాతి వేగోక్తి దు**
**ర్వ్యసనం బేటికి? త్రిప్పుమింక జననీ! రమ్యాక్షరక్షోణికిన్**

అనే పద్యం చదివాను. ఆ రోజుల్లో నా అంతరాత్మలో అర్థం అయినా కాకపోయినా పద్యం బాగుందని తోస్తే ఆ పద్యం చటుక్కున కంఠగతమయ్యేది. అలా ఆ పద్యం నాలో హత్తుకుపోయింది. అయినా వేగాతి వేగోక్తి అనే దుర్వ్యసనం నాకూ ఉండేదిగాని ఆ పద్యం రాసిన ఆయన ఎందుకలా రాశారో నాకారోజుల్లో అర్థంకానిమాట నిజం. అదీ కాక ఆ పద్యం రాసిన శ్రీ రాయప్రోలు సుబ్బారావనే కవిని నేనప్పటిదాకా

వినలేదు. చదవలేదు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిని గురించి మా నాన్న గారు చెప్పగా ఎన్నోసార్లు విన్నాను కాని ఆయన చాటువులు తప్ప ఆయన రాసిన ఏ పుస్తకమూ చదవలేదు. వెంకటశాస్త్రిగారి శతావధాన శక్తి గురించీ, ఆశుకవితా ప్రావీణ్యం గురించీ ఎంతయినా విన్నాను. సులక్షణ సారం చదివిం తరవాత పద్యం చెప్పటమే ప్రధానంగా ప్రతీ వాక్యాన్నీ ఛందోబద్ధం చేసే అలవాటుకి లొంగిపోయాను. ఆ రోజుల్లో పద్యరచనే కవిత్వం అనుకునేవాణ్ణి. కాలానుక్రమంగా పింగళి లక్ష్మీకాంతంగారి ఇంట్లో దొరికిన రాయప్రోలు సుబ్బారావుగారి పుస్తకాలన్నీ చదివేశాను. అంతటితో ఆ చదువాగలేదు. ఆయనంటే ఒక రకమైన భక్తిభావం నాలో ప్రభావమయింది. ఆ భావంతో ఆయన పుస్తకాలను తిరిగి చదివేవాణ్ణి. వయస్సు వచ్చినకొద్దీ ఆయన గురించి మరింత తెలుసుకోవటమూ, ఆయన అభినవాంధ్ర కవిత్వంలో అగ్రగామి అని వినటమూ జరిగింది.

రాయప్రోలు సుబ్బారావుగారూ అవధానాలు చేసేవారనీ, ఆశు కవిత్వంలో ఆరితేరిన వారనీ విన్నాను. ఆయన కెందుచేతనో అవి రుచించక అవన్నీ "సకలార్థశూన్య" మని అభినవాంధ్ర కవిత్వానికి దోహదం చేశారు. ఆయన అలా ఆ రోజుల్లో అనుకోవటానికి ఎంత యినా ఆస్కారం ఉంది. నేను ఆశుకవిత్వం చెప్పేందుకు కుతూహల పడేవాణ్ణి చిన్నతనంలో. "వేగాతి వేగోక్తి" ఒక్కటే కవిత్వానికి మూల చిహ్నమని నేనూ భావించేవాణ్ణి. ఆ దురభ్యాసం ఇప్పటికీ అడపాదడపా నన్ను పీడిస్తూ ఉంటుంది. సుబ్బారావుగారి పద్యాలతో పరిచయం అయింతరవాత ఆయన్ని చూడాలని తాపత్రయపడేవాణ్ణి. ఆ రోజుల్లో పేరుపొందిన అభినవాంధ్ర కవులందరితోనూ నాకు పరిచయ మేర్పడ టమేగాక వారితో సన్నిహితం ఏర్పడింది. ఒక్క సుబ్బారావుగారే ఎక్కడా కనిపించేవారు కారు.

నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చదువుతూ ఉండగా ఆయనా, అడివి బాపిరాజుగారూ ఆంధ్రాభ్యుదయోత్సవాలకు వచ్చారు. ఆ సాయంత్రం జరిగిన సభలో సుబ్బారావుగారు ఉపన్యాసకులు. మానాన్న గారగ్రాసనాధిపతి. సుబ్బారావుగారిని పరిచయంచేస్తూ మా నాన్నగారన్నారు: "ఈయన జన్మస్థానం వెదుళ్ళపల్లి. ఈయనతోనే వంశీగానం తెలుగు కవిత్వంలో ఆరంభమయిందని నే ననుకుంటూంటాను" అని.

సుబ్బారావుగారు లేచారు. మందహాసంతో మా నాన్నగారిని ఆలింగనం చేసుకుని మైకుముందు నిలబడి——

**వంశిన్ వంచి, మృణాళమున్ మెలిచి, పక్వ ద్రాక్ష నెండించి వా**
**గంశల్ మార్దవ మాధురీ, సుభగ విన్యాసంబు జిల్కన్, దశ**
**త్రింశల్లక్ష జన ప్రసన్న రసనా దేవాలయాభ్యంతర**
**ప్రాంశు ప్రార్థన గీతమైన తెనుగుంబల్కున్ ప్రశంసించెదన్**

అని తన పద్యం చదివారు. ఆయనకు పద్యపఠనంలో తనకు తనదైన ఓ బాణీ ఉండేది. సభాసదులందరూ ఒక్కపెట్టున కరతాళ ధ్వనులు చేశారు. తరవాత అభినవాంధ్ర కవిత్వంమీద ఆయన ప్రసంగించారు. ప్రసంగం తరవాత ఆయన్ని పద్యాలు చదవమని సభికులు పదేపదే కోరటం, ఆయన కొన్ని పద్యాలు చదవటం అయింది. ఆనాటి సమావేశం కొత్తగా విశ్వవిద్యాలయంలో నిర్మించిన తిక్కవరపు రామిరెడ్డి హాలులో జరిగింది. సభానంతరం మా నాన్నగారూ, అడివి బాపిరాజుగారూ, సుబ్బారావుగారూ మరికొంతమంది విద్యార్థులూ కలిసి బయటికొచ్చారు. నేనూ వాళ్ళ వెనకనే ఉన్నాను. సభకూ్కడా సుబ్బారావుగారి పేరువల్ల అధికసంఖ్యలో ఆహూతులొచ్చారు.

నన్ను చూసి మా నాన్నగారు సుబ్బారావుగారికి పరిచయం చేశారు. నేను మందహాసం చేశాను. కాసేపయింతరవాత సుబ్బారావుగారు — "నీ పేరేమిటి-వరదా?"అన్నారు. అవునంటూ తల వూపాను. "నువ్వు కవిత్వం

చెబుతావని కృష్ణశాస్త్రికాబోలు నాతో చెప్పాడు. నిన్ను మెచ్చుకున్నాడు" అని మా నాన్నగారివంక చూస్తూ - "నీ అదృష్టం పండిందోయి - నువ్వు రాయటం మానేసి మీ వాడిచేత రాయిస్తున్నా"వన్నారు. అందరూ నవ్వారు.

ఆ మర్నాడు పొద్దునపూట సుబ్బారావుగారు మాయింటికొచ్చారు. అప్పుడు మేం వాల్తేరులో ఉండేవాళ్ళము. మా ఇల్లు వాల్తేరు పోస్టాఫీసు వెనకాలా, పోలీసుస్టేషను ఎదురుగా ఉండేది. మా ఇంటిముందే వాల్తేరు ప్రధాన రాజమార్గం పోతుంది. ఆ రోజుల్లో వాల్తేరు నందన వనంలా ఉండేది. ఎలాంటి వాడికైనా హృదయం స్పందించక మానదు. ఆ రోజుల్లో వాల్తేరులో ఓ హరిజన బాలుడుండేవాడు. వాడు బాగాపాడేవాడు. ఆశువుగా పాట లల్లేవాడు. సుబ్బారావుగారు మా ఇంటి కొస్తున్నప్పుడు ఆ కుర్రాడు బావిగట్టుదగ్గర కూచుని పాడుతున్నాడు—

**ఎన్నాళ్ళాయెనే వాన**
**ఈ వూరొచ్చి ఓ వాన**
**రావే వాన రావే వాన!**
**ఎన్నాళ్ళాయెనే వాన!**

ఆ పాట విని సుబ్బారావుగారు సమ్మోహితులయారుట. మా ఇంటి కొచ్చినప్పుడు సుబ్బారావుగారాపాట గురించి చెప్పారు. నేను ఆ కుర్రాడి కథ చెప్పాను. సుబ్బారావుగారన్నారూ, ఇలాంటిచోట ఉంటూ కవిత్వం రాయటం ఎలా మానేశావూ అని. మా నాన్నగారు నవ్వి ఊరుకున్నారు. కాస్సేపటికి మా నాన్నగారన్నారు, "సుబ్బారావుగారూ! నేనెందుకు రాయాలో నా కెవరూ చెప్పటంలేదు. అర్థంకూడా కావటంలేదన్నారు." సుబ్బారావుగారు వెళ్ళిపోతున్నప్పుడు ఆ హరిజన బాలుణ్ణి స్వయంగా వినాలనే కోరికను వెలిబుచ్చారు. ఆ మర్నాడే సుబ్బారావుగారి హైదరాబాదు ప్రయాణం. నేను ఏర్పాటు చేస్తా నన్నాను. అంతే, ఆ రాత్రే

ఆ కుర్రాడు ఓ నక్కవాతపడి పొద్దునే మరణించాడు. నేను సుబ్బారావుగారి దగ్గరికిపోయి ఆ సంగతి చెప్పాను. ఆయన తాత్త్వికంగా ఆకాశంవంక చూస్తూ—

**ఎన్నాళ్ళాయెనే వాన**
**ఈ ఊరొచ్చి ఓ వాన**

అని పాడారు. ఆయన కళ్ళు చెమ్మగిలినాయి.

*　　　*　　　*

**యుద్ధకాలంలో** మదరాసులో ఉండగా నాకోసారి రేడియోలో ప్రసంగించమని ఆహ్వానం వొచ్చింది. విషయం 'ఆధునిక వాఙ్మయంలో మైలురాళ్ళు : తృణకంకణం'. ప్రసంగ పాఠాన్ని రాసుకుని రేడియో స్టేషన్‌కు వెళ్ళేటప్పటికి బాలాంధ్రపు రజనీకాంతరావూ, మరో ఇద్దరు స్నేహితులూ కలిశారు. నా ప్రసంగం గురించి మాట్లాడుతున్నప్పుడు శివశంకరశాస్త్రిగారు 'తృణకంకణం' ఆధునిక కవిత్వానికి ఆది గ్రంథమన్నారని ఒకరన్నారు. అదెలా అవుతుందీ, వెంకట పార్వతీశ్వర కవులు 'ఏకాంత సేవ' అంతకుపూర్వమే ప్రచురించారని మరొకరన్నారు. ఇలా ఆధునికాదికావ్యంమీద రెండు పక్షాలు ఉన్నవని మొదటిసారిగా నేనప్పుడు గ్రహించాను. అందు కనుకూలంగా నా రేడియో ప్రసంగాన్ని మార్చుకుందామనుకున్నాను. అలా అని రజనీకాంతరావుకి చెప్పి, జానకీరాంగారి దగ్గర్నించి వ్రాతప్రతిని అప్పటికప్పుడే వాపసు తెప్పించాను. తీరా నేను రాసుకున్నది మళ్ళీ చదివేటప్పటికి ఎలాంటి మార్పూ అవసరం లేదనిపించింది. ప్రసంగాన్ని యథాతథంగా చేశాను. ప్రసంగంలో అప్పటిదాకా ఎవరికీ తెలియని అతిస్వల్పమైన రహస్యాన్ని ఉల్లేఖించాను. నా కిప్పుడు గుర్తులేదు. తృణకంకణం ప్రతి నా దగ్గిర ప్రస్తుతం లేదు.

అందులో ఒక పద్యం కంద మనుకుంటాను. అందులో ఒకానొక పదాన్ని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు కావ్యం చదివిం తరవాత సూచించారనీ, అంతకు పూర్వమున్న పదం దోషమనీ నేను వినటంచాత రాశాను. ప్రసంగం చివర—

"అందమైన పద్యమ్ముల నల్లు నతడు
నునుపు బోగుల పట్టు నేసిన విధాన"

అంటూ సుబ్బారావుగారిని ఆయన పద్యంతోనే ప్రశంసించాను.

ఆ తరవాత కొన్ని సంవత్సరాలకు—అంటే 1945లో నేను సర్ మీర్జా ఇస్మాయిల్‌గారితోపాటు హైదరాబాదు రావటం తటస్థించింది ఉద్యోగరీత్యా. ఆ రోజుల్లో కొన్నాళ్ళు కుందూరి ఈశ్వరదత్తుగారితో పాటు లేక్‌వ్యూ గెస్ట్‌హౌస్ ఆవరణలో ఒక ఇంట్లో ఉంటూండేవాణ్ణి. నేను వచ్చిన కొన్నాళ్ళకే కోటంరాజు రామారావుగారు అక్కడికి యాత్రా చణశీలిగా వచ్చారు. దత్తుగారూ, రామారావుగారూ, మా నాన్నగారూ సన్నిహిత స్నేహితులు. రాయప్రోలు సుబ్బారావుగారప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధ్యక్షులుగా ఉండేవారు. దత్తుగారినీ, రామారావుగారినీ చూడటానికి సుబ్బారావుగారు ఓ రోజు లేక్‌వ్యూకి వచ్చారు. ఆ సమయానికి నే నెక్కడికో పనుండి వెళ్ళాను. నేను ఇంటికి తిరిగి వొచ్చేటప్పటికి సుబ్బారావుగారు తిరిగివెళ్ళిపోబోతున్నారు. నన్ను చూసి కాస్త ఆగారు ముఖద్వారం దగ్గర. సాగనంపటానికి వచ్చిన దత్తుగారూ, రామారావుగారూ వెనక నిలుచుని ఉన్నారు.

రామారావుగారు నన్ను చూపిస్తూ "వీడు రామకృష్ణరావు కొడుకు, మీకు తెలుసా?" అన్నారు సుబ్బారావుగారితో. నే నది గమనించకుండా పరధ్యానంతో లోపలికి వెళ్ళిపోయాను.

సుబ్బారావుగారు వెనక్కి తిరిగి "రామారావుగారూ! రోజులెంత మారిపోయినయి. చూశారూ—ఇప్పటి కుర్రాళ్లూ...." అని ఇంకేదో అనబోతుండగా నేను వెనక్కివచ్చి వాళ్ళముందు నిలబడ్డాను. సుబ్బారావుగారిని గౌరవప్రదంగా పలకరించాను. నాతో మాట్లాడుతూ సుబ్బారావుగారు ఆగిపోయి పక్కనేవున్న కుర్చీలో కూచుండిపోయారు. దత్తుగారూ, రామారావుగారూ లోపలికి వెళ్ళిపోయారు.

సుబ్బారావుగారు నా వంక చూస్తూ "మీ నాన్నకూ నాకూ ఉన్న స్నేహాన్నన్నా పాటించావుకాదు - మా ఇంటికొచ్చి నన్ను చూడొద్దూ?" అన్నారు. నేనేదో పనిమీద ఉంటంచాత అందుకు పళ్లేదన్నాను.

ఆయన అన్నారూ- "నీకోరహస్యం చెబుతాను. ఒకరకంగా నేను హైదరాబాదు రావటానికి మీ నాన్నే కారణం—అదోకథ—దానికేం గాని, నువ్వేమన్నా రాసిందుంటే పట్టుకొచ్చి చూపించు. ఆనందిస్తాను" అని.

ఆ తరవాత ఆ సంగతీ, ఆయనకు బాపట్లమీదవున్న అభిమానమూ, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారితో తనూ మా నాన్నగారూ ఎంత సన్నిహితంగా సంచరించేవారో చెప్పుకొచ్చారు. మధ్యలో హఠాత్తుగా ఆగి "నీ రేడియో ప్రసంగం గురించి విన్నాను—వెంకటశాస్త్రిగారు నా పుస్తకం తప్పట్టారని నీ కెవరు చెప్పారోయి?" అని అడిగారు మందహాసంతో.

నా రేడియో ప్రసంగం ఆయనకెలా లభ్యమయిందో నా కర్థంకాలేదు. నేను తటపటాయిస్తూ "ఎక్కణ్ణో విన్నానండీ" అన్నాను.

"విన్నంతమాత్రాన రాయచ్చునయ్యా?" అన్నారు.

నేను ఊరుకోక "మా నాన్నగారోసారి చెప్పారండి" అన్నాను.

"అలా చెప్పవేం—నిజమే అది" అన్నారు.

అలా మాటాడుతున్నప్పుడు ఆయన మనస్సులో నా రేడియో ప్రసంగమే ఇంకా మెదుల్తోందిలా ఉన్నది. ఆయన అన్నారూ- "ఆధుని

కాంధ్ర కవిత్వానికి నేను ఆద్యుణ్ణని నే నెప్పుడూ చెప్పుకోలేదు. ఒకే ముహూర్తాన—కొంచెం అటూ ఇటూగా—గురజాడ అప్పారావూ, నేనూ, అబ్బూరి రామకృష్ణరావూ తెలుగు కవిత్వంలో ఒక రాచబాట వేశాం. అప్పారావుగారి ఆశయమూ మా ఆశయమూ ఒకటే—మరోమాట—ఆధునిక శకారంభానికి ఎందరో మహానుభావులు దోహదం చేశారు. అందరూ చిరస్మరణీయులే—పూజ్యులే—ఇదంతా నీకెందుకు చెబుతున్నానంటే, సభాపతి నా తృణకంకణం ఆదునిక కవిత్వానికి ఆది గ్రంథమని అభిప్రాయపడ్డంవల్ల నీకూ నీలాంటి మరికొందరికీ సందేహాలువచ్చి ఉంటాయి. భావకవిత్వాన్ని మనస్సులో పెట్టుకుని సభాపతి అని ఉంటాడు. అప్పటికీ అదికూడా కొంతవరకే నిజం. అదే ప్రాంతంలో మీ నాన్నా రాశాడు.కాబట్టి కవిత్వం గురించి మనం మాట్లాడుకోవాలి కాని ఎవరాద్యులు, ఎవరు అనుచరులు అనే వివాదం నాకు నచ్చదు" అని.

అప్పటికే చాలా కాలవ్యయం అయింది. సుబ్బారావుగారు లేచారు. నే నాయన్ని ఆయన కారుదాకా దిగబెట్టి వచ్చేశాను. ఆయన్ని చూడటం అదే ఆఖరుసారి. నలభై ఏళ్ళపైనే అన్నమాట.

నేను హైదరాబాదులో స్థిరపడినా ఆయన్ని చూడటం పళ్ళేదు. అందుకో వ్యక్తిగతకారణం కూడా ఉంది. నేనూ, రాయప్రోలు రాజశేఖరు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసు, అజంతా—కవితను స్థాపించినప్పుడు తెలుగు కవిత్వంలో శ్రీశ్రీతోపాటు మరోమలుపు తెద్దామనే ప్రయత్నం చేశాము. ఆ ప్రయత్నంలో సాయంకాలాలు విధిగా మేమందరం కలిసి గడిపేవారం—చర్చల్లో. సుబ్బారావుగారో మిత్రుడితో అన్నారుట, వరద రాజేశ్వరరావు మా రాజశేఖర్నీ తతిమ్మా వాళ్ళనీ సన్మార్గంనుంచి తప్పిస్తున్నాడని. అప్పట్నించీ ఆయన అంటే నా కెంత గౌరవం ఉండేదో అంత భయం పట్టుకుంది.

# అడివి బాపిరాజు

మేం బందరులో ఉన్నప్పుడు బాపిరాజుగారు నన్నెరుగుదురు. నే నాయన్నెరగను. విద్యానిలయంలో మా నాన్నగారూ, ఆంధ్రజాతీయ కళాశాలలో ప్రమోద్‌కుమార చట్టోపాధ్యాయ దగ్గర చిత్రకళను అభ్యసిస్తూ బాపిరాజుగారూ ఈ శతాబ్దం రెండో దశాబ్దంలో బందరులో ఉండేవారు. నేనప్పటికి పసికందును. నన్నెత్తుకుని ఆడించేవారిలో మల్లాది రామకృష్ణశాస్త్రి, పింగళి నాగేంద్రరావూ, కౌతా రామమోహన శాస్త్రి ప్రభృతులు ముఖ్యులు. ఆ రోజుల్లో బాపిరాజుగారు కూడా నన్ను లాలన చేసేవారని ఆయనే నాతో ఓసారి చెప్పారు. ఆయన నన్ను శైశవంలో బందరులో చూసిన చాలా ఏళ్ళకు, నేను విశ్వవిద్యాలయంలో చదువుతున్నప్పుడు వాల్తేరులో ఆయన్ని నేను చూశాను. ప్రథమ పరిచయంతోనే ఆయన నాకు సన్నిహితులయిపోయారు. ఆయన్ని కవిగాకాక చిత్రకారుడిగా, నవలా రచయితగా అప్పుడెరుగుదును.

విశాఖపట్నం మీద బాంబులు యాదృచ్ఛికంగా జపానువారు పడేసినప్పుడు మా కుటుంబం వాల్తేరు వదిలి కొన్నాళ్ళు నూజివీడులోను మరికొన్నాళ్ళు బెజవాడలోను ఉండటం తటస్థించింది. బెజవాడలో గవర్నరుపేటలో వెలిదండ్ల హనుమంతరావు పార్కు వెనుక ఒక ఇంట్లో తాత్కాలికంగా అద్దెకుండేవాళ్ళం. మా నాన్నగారు వాల్తేరులోనే ఉండి పోయారు. ఆ రోజుల్లో బాపిరాజుగారు బెజవాడలో ఉండేవారు.

ఓసారి ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలలో అయ్యంకి కృష్ణ మూర్తిగారిని చూడటానికి పోయినప్పుడు బాపిరాజుగారు కనిపించారు. ఆశ్చర్యంతో నన్ను పరామర్శించారు. నా యోగక్షేమా లడిగారు. మేం

ఉంటున్న ఇంటి ఆచూకీ తెలుసుకున్నారు. అంతే, ఆ సాయంకాలమే మా ఇంటికొచ్చారు. దాదాపు పది రోజులవరకూ రోజూ సాయంకాలం పూట ఆయన మా ఇంటికి రావటం, ఆయనతోపాటు నేను కృష్ణానదీతీరం దాకా షికారుపోవటం జరిగేది. దారిలో ఒకసారి తెలుగుదేశాన్నీ, భారత దేశాన్నీ, ప్రపంచాన్నీ తిరిగేసేవాళ్ళము. ఆయనకి తెలుగువాళ్ళంటే చెప్ప లేనంత అభిమానం. ఒకప్పుడది ఉన్మాదావేశాలకు దారితీసేదిగా ఉండేది. తెలుగువారే భారతీయ చిత్రకళకు ప్రారంభోత్సవం చేశారని బాపిరాజుగారి దృఢవిశ్వాసం. ఈ విశ్వాసానికి మూలకారకులు ఆయన గురువుగారైన ప్రమోద్‌కుమార చట్టోపాధ్యాయగారే. చట్టోపాధ్యాయ గారూ, మా నాన్నగారూ ప్రాణస్నేహితులు బందరులో ఉండే రోజుల్లో. చట్టోపాధ్యాయగారు శాంతినికేతనంలోని భారతీయ చిత్రకళ ప్రాభవ సిద్ధాంతంతో ఏకీభవించక టిబెట్టు మొదలైన బౌద్ధ ప్రాంతాల్లో పర్యటించి, ఆంధ్రులే భారతదేశంలో ఆది చిత్రకారులనే సిద్ధాంతాన్ని లేవదీశారని మా నాన్నగారంటూండేవారు. అలాంటి తెలుగుతనం కవిత్వంలో కూడా బాపిరాజుగా రనుసరించారు. ఆయనకు ఆవేశం ప్రధానం. కవిత్వానికి కావలసిన తతిమ్మా లక్షణాలు అంత ప్రముఖం కావు. అమాయకత్వం ఆయనకు సహజాలంకారంగా ఉండేది. కపటం తెలీని మనిషి. ఓసారి తన్ని నవ్యసాహిత్య పరిషత్తుకు అధ్యక్షత వహించమని ఇంకా అడక్కుండా సభాపతి ప్రభృతులు అన్యాయం చేస్తున్నారని నాతో అన్నారు. నేనప్పుడు ఎమ్. ఎన్. రాయిగారి అనుచరుడిగా ఉన్నాను. అంతకుపూర్వం మా నాన్నగారు ప్రారంభించిన వర్ధమాన లేఖక సంఘం ప్రాబల్యంవల్ల ప్రజామిత్ర వారపత్రికలో ఈ కవులందరి మీదా విరుచుకుపడ్డాను. బాపిరాజుగారికది తెలుసు. నవ్య సాహిత్య పరిషత్తులో కొందరు మాకన్నా దేశాభిమాను లయినట్టు మడిగట్టుకు కూచునేవాళ్ళు.

ఒకరోజున మామూలుగా సాయంకాలం కాగానే బాపిరాజుగారు మా ఇంటికొచ్చారు. నేను బయటపడ్డంతోటే, అరండల్ పేటలో ఓ కొత్త హోటలు వచ్చిందనీ అక్కడ ఫలహారం బావుంటుందనీ పోదాంపద అన్నారు. ఇద్దరం బయల్దేరాం. ఆ హోటల్లో కుర్చీలూ, బల్లలూ లేవు. పీటలున్నాయి కూచోటానికి. ముందు అరిటాకుల్లోనూ తామరాకుల్లోనూ ఫలహారం ఇస్తున్నాడో వృద్ధబ్రాహ్మణుడు. నిజానికి ఫలహారం మహారుచి కరంగావుంది. ఇవన్నీ చూసి బాపిరాజుగారు ముగ్ధులయిపోయారు. ఆయన హోటలుగురించి మాటాడుతుంటే ఆయననోట పాటలుకూడా వచ్చేట్టు న్నాయి. అంతా అయింతరవాత మొత్తం ఎంతయిందని అడిగి ఆయన జేబులో చేయి పెట్టుకుని నివ్వెరపోతున్నారు. డబ్బు తెచ్చుకోవటం మరిచి పోయారు. నా దగ్గిరా చిల్లిగవ్వలేదు. ఆయన చప్పున లేచి "వరదా, నువ్విక్కణ్ణేవుండు, నేనిప్పుడేవస్తా" నన్నారు. నాకప్పుడర్థం అయింది. "మీరుండండి, నేనింటికి వెళ్ళివస్తా" నన్నాను. ఆయన ససేమీ వొప్పు కోక బయటకుపోయి రిక్షా ఎక్కారు. అప్పుడు లాగుడు రిక్షాలుండేవి. అలాగే వాణ్ణి బుజ్జగిస్తూ తొందరగా తీసుకుపొమ్మంటున్నారు. ఈ లోపున వెర్రిమొహం వేసుకుని హోటలువారికి నేను తాకట్టు! మరో అరగం టలో బాపిరాజుగారు తిరిగొచ్చేశారు. ఆ రిక్షావాడలాగే వీథిలో ఉన్నాడు. బాపిరాజుగారున్న యింటికి తాళంవేసి ఉంది! ఇప్పుడు రిక్షావాడిక్కూడా డబ్బులివ్వాలి. బాపిరాజుగార్ని అక్కణ్ణే ఉండమనిచెప్పి నేను బయటికి కొచ్చేసరికి రిక్షావాణ్ణి మల్లాది ఫణిభూషణరావు బేరం చేస్తున్నాడు. నన్ను చూసి నా దగ్గరికొచ్చాడు. అతన్ని లోపలికి తీసుకుపోయి కాఫీ తాగించి డబ్బు చెల్లించేయమన్నాను. అప్పుడు అందరం బయటపడ్డాము. ఫణిభూషణరావు ఏదో పనుందని తన దారి తను వెళ్ళిపోయాడు. నేనూ, బాపిరాజుగారూ కృష్ణానదితీరానికి మా యాత్ర సాగించాము.

దారిలో నే నన్నాను నవ్వుతూ- "బాపిరాజుగారూ, మీ కవిత్వాన్ని ఇప్పుడిప్పుడే చదువుతున్నాను. ఇవాళ సంఘటనతో ఒక విషయం రుజువయింది. మీకు రాయడమే ప్రధానమనిపిస్తోంది" అని.

ఆయనన్నారు: "నువ్వన్నది నిజం. ఏదన్నా మనస్సుకు సాక్షాత్కరిస్తే మాటలే నాకు ప్రధానం. అవెలాతట్టితే అలా రాస్తాను. శైలితోనూ, భాషతోనూ నాకు నిమిత్తంలేదు." కాస్సేపు ఊరుకుని నవ్వేసి "నేను సహజకవిని" అన్నారు. "వాగాడంబరం నాకు సయించనిమాట నిజం. నా కవిత్వం నాది. ప్రకృతికీ, నాకూ ప్రత్యక్షసంబంధం. అసలు కవిత్వం రాయకూడదని మొదట్లో అనుకున్నాను. తరవాత తరవాత కవిత్వం ఎందుకు రాయకూడదనుకున్నాను. లలితకళ లన్నిటా ప్రావీణ్యం సాధించగలిగితే కవిత్వం అత్యంత సహజ మవుతుంది" అని ముగించారు.

మరో నాలుగయిదేళ్ళ తరవాత ఉద్యోగరీత్యా నేను హైదరాబాదు రావటం తటస్థించింది. అప్పుడు బాపిరాజుగారు "మీజాన్" అనే దిన పత్రికకు సంపాదకుడిగా పనిచేసేవారు. అందులో నవల్లు రాసేవారు. నాంపల్లిలో కురుగంటి సీతారామయ్యగారికి సన్నిహితంగా నివసించేవారు. బాపిరాజుగారూ, కుందూరి ఈశ్వరదత్తుగారూ సహాధ్యాయులు. నేనూ దత్తుగారితోపాటు పనిచేసేవాణ్ణి. మేం ముగ్గురం ఎన్నో సాయంకాలాలు కలిసి కాలక్షేపం చేశాం. అది మరోకథ. బాపిరాజుగారు స్నేహశీలి. ఆయనలోని గుప్తమోహనమైన అమాయకత్వమే అందర్నీ ఆకర్షించేది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగా రాశించినట్లు బాపిరాజుగారు విశ్వవిఖ్యాతమైన చిత్రరచనకు ఉద్యోగించారు కాదు.

# బసవరాజు అప్పారావు

ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని బెజవాడలో ప్రారంభించిన కాలం. కట్టమంచి రామలింగారెడ్డిగారూ, మా నాన్నగారూ బెజవాడ వచ్చిన రోజులు. మేము గవర్నరుపేటలో ఉండేవాళ్ళము. మా నాన్నగారు ఊరి చివర సూర్యారావుపేట ఆఖరున ఓ ఇంట్లో విశ్వవిద్యాలయానికి గ్రంథాలయం ఏర్పరిచే కార్యక్రమంలో నిమగ్నులై ఉండేవారు. ఆ గ్రంథాలయంలో ఆయనా, ఓ బంట్రోతూ ఉండేవారు. ఆయన ఇంటికొచ్చేటప్పటికి సాయంకాలం అయ్యేది. అప్పటికి మా ఇంటిముందు ఓ జట్కా, ఓ కారూ మా నాన్నగారికోసం ఎదురు చూస్తుండేవి. కారులో పాటిబండ అప్పారావుగా రొచ్చేవారు. జట్కాలో తిమ్మరాజు పూర్ణచంద్రరావుగా రొచ్చేవారు. అప్పారావుగారు న్యాయవాది. కాని కవులు. పూర్ణచంద్రరావుగారు లండన్‌లో విద్యాభ్యాసం చేసి ప్రాక్ ప్రతీచీ సంస్కృతిని ఆకళింపు చేసుకున్నవారు. వీరిద్దరికీ మా నాన్న గారంటే ఎనలేని అభిమానం. వీరిద్దరూకాక మరో ఆయన వస్తూపోతూ ఉండేవారు. ఆయన ఎవరో నాకు తెలిసేదికాదు. సన్నగా ఉండేవారు. ముతక ఖద్దరు లాల్చి, ధోవతీ ధరించేవారు. ఎప్పుడూ మందహాసంతో ఉండేవారు. ఎక్కువగా మాట్లాడే స్వభావం కాదు. పలకరిస్తే పలికేవారు. ఎప్పుడూ పరధ్యానంతో ఉన్నట్టు ఉండేవారు.

మా ఇంటివెనుక వీథిలో చాగంటి సూర్యనారాయణ మూర్తిగారు వైద్యవృత్తి ప్రారంభించారు. మా నాన్నగారూ, ఆయన స్నేహితులూ అక్కడ పోగయ్యేవారు. ఒకరోజున సూర్యనారాయణమూర్తి గారింటి దగ్గర, ఆంధ్ర విశ్వవిద్యాలయం బెజవాడ నుంచి వాల్తేరు తరలిపోయే

సమయాన మా ఇంటికి మా నాన్నగారి కోసం వచ్చే మూడోవ్యక్తి పేరు బసవరాజు అప్పారావుగారని తెలిసింది. ఆయన పేరు అప్పటికే జగ ద్విఖ్యాతం. ఆయన పాటలు ఊరేగింపుల్లో జనం పాడేవారు. గాంధీ గారి మీద ఆయన రాసిన గేయం అందరినోటా ఉండేది. పిల్లలం మేము కూడా పాడేవాళ్ళము.

కొల్లాయి గట్టితేనేమి
మా గాంధి
కోమటై పుట్టితేనేమి
వెన్నపూసా మనసు
కన్నతల్లి ప్రేమ
పండంటి మోముపై
బ్రహ్మ తేజస్సు....

ఈ పాట వందలాది జనం వీథుల్లో ముక్త కంఠంతో పాడుతుంటే- వినేవారు భక్తి గౌరవాలతో ఉత్తేజితులవుతుండటం నేను చూశాను. ఆ దృశ్యం ఇప్పటికీ నా మనస్సులో చెరగని ముద్ర.

అప్పారావుగారు కవిత్వం మీదే ఎక్కువ ధ్యానమగ్నులై ఉండే వారని తరవాత తరవాత నాకు తెలిసింది. మా నాన్నగారితో జాతీయో ద్యమం గురించి మాట్లాడుతుండటం నాకు గుర్తు. అంతకన్నా ఆవేశంగా కవిత్వం మీద మాట్లాడేవారు. మా నాన్నగారు వాదించేవారు కాదు. విని మందహాసంతో అవునంటూ తల ఊపేవారు. కవిత్వం తప్ప ఈ ప్రపం చంలో మనం బతకటానికి ఆధారం కనిపించటం లేదనేవారు. అంచాత కొందరు ఆయన మామూలు ధోరణి మనిషి కాదనే నిర్ణయానికి రావటం కూడా నాకు తెలుసు.

ఓసారి అప్పారావుగారు మా ఇంటికొచ్చినప్పుడు మా నాన్నగారింట్లో లేరు. నన్ను పలకరించి పక్కన కూచోబెట్టుకున్నారు. "నీ కెవరి మీదన్నా కోపం వస్తే ఏం చేస్తావోయ్?" అని అడిగారు.

"కాళ్ళు నరికేస్తాను - కళ్ళు పీకేస్తాను" అన్నాను అనాలోచితంగా.

"నీకన్నా వయసులో చిన్నవాళ్ళ మీద కోపం వస్తే ఏం చేస్తావు?" అని మళ్ళీ అడిగారు.

"చెవులు మెలేస్తాను - దవడ వాయిస్తాను" అన్నాను.

నన్ను రెండు చేతుల్తోనూ ఎత్తి బుగ్గలు నిమురుతూ "నువ్వు కవిత్వం రాస్తావోయ్" అన్నారు.

ఇంతలోకి మా నాన్నగారొచ్చారు. నే నన్న మాటల్ని ఆయనకి వినిపించి "మీవాడి కిప్పట్నుంచే ఛందస్సుమీద అధికారం వచ్చిందయ్యో" అని అన్నారు. కవిత్వం అనే సాహిత్య ప్రక్రియకు నాచేత శ్రీకారం చుట్టించింది బసవరాజు అప్పారావుగారేనని ఇప్పటికీ నా విశ్వాసం.

అప్పారావుగారు కవిత్వం కోసం జీవిద్దామనుకునే భ్రమతో ఉండేవారు. నిజానికి ఈ శతాబ్దం మొదటి రెండు దశాబ్దాలూ ఆధునిక కవిత్వానికి స్వర్ణయుగం లాంటివని నా కనిపిస్తూంటుంది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి సాహచర్యంవల్ల ఆధునిక కవుల్లో అగ్రగాములైన రాయప్రోలు, అబ్బూరి, బసవరాజు, నండూరి జాతీయోద్యమోపాసకులవటమే కాక, అనేక ప్రయోగాలు చేశారు. కవితా శిల్పంలో దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ప్రభావం అప్పారావుగారి మీద ఎంతైనా ఉంది. విశ్వనాథ సత్యనారాయణ గారెన్నాళ్ళకో ఓసారి అన్నట్లు 'హృదయాన్నే మాటల్లో పెట్టే' శక్తి అప్పారావుగా రొక్కరే తెలుగు కవిత్వంలో సంపాయించారు. నన్నోసారి మా ఇంటి డాబా మీదికి తీసుకుపోయి సన్నగా నాజూగ్గా-

ఏల పాడే నింక యమునా కళ్యాణి నే
లీలా మానవుడు గోపాలుడు లేడాయె?
బంగారు గనులలో
చెంగలించే వేళ
పిడుగుబోలిన వార్త
వినిపించి నారయ్యో....

అప్పారావుగారు పాడటం మొదలు పెట్టారు. అలా అచేతనంగా నిలబడి వింటున్నాను. ఆయన బుగ్గల మీద కన్నీటి చుక్కలు పడుతున్నాయి. నాకు భయంవేసింది. ఆయన చెయ్యి పట్టుకున్నాను. ఆయన పాట ఆపేశారు. ఆ గేయం గోపాలకృష్ణయ్యగారి మరణవార్త విన్నప్పటిది. యమునా కళ్యాణిలో గోపాలకృష్ణయ్య గారిది ఆరితేరిన మధురకంఠం.

బెజవాడలో న్యాయవాద వృత్తి సవ్యంగా సాగలేదు. కవిత్వాన్నే ఆరాధించిన ఆయనకి బెజవాడ అంటే జుగుప్స కలిగింది. అప్పటికి మా నాన్నగారు వాల్తేరు ప్రయాణంలో ఉన్నారు. ఉద్యోగాన్వేషణకు ఢిల్లీ పోదామనుకున్నారు అప్పారావుగారు. ఎక్కడన్నా పత్రికలో పని చేద్దామనుకున్నారు. ఆయన జీవితం పత్రికారంగంలోనే ప్రారంభమయింది ఆదిలో. ఆంధ్రపత్రిక, భారతికి ఆయన కళాశాల వదిలిం తరవాత సహాయ సంపాదకునిగా పనిచేశారు.

ఆయన 1932 లో ఢిల్లీ వెళ్ళినప్పుడు అక్కడ నవంబరు పదకొండున ఆంగ్లేయులు యుద్ధంలో హతులయిన సైనిక స్మారకోత్సవం జరుపుతున్నారు. అప్పారావుగారి జాతీయ హృదయం చివుక్కుమన్నది. కుతుబ్ మినార్ దగ్గరికి పోయారు. ఆ రోజుల్లో అదంతా నిర్జన ప్రాంతం. "ఒక ప్రక్క కుతుబ్ మినారు, ప్రక్కన అశోక స్తంభము, ఒక ప్రక్క ముసల్మాను మసీదు, ఇంకొక ప్రక్క ఆర్య దేవాలయము,

దుర్గమూ! ఇక్కడ ఆంగ్లేయుల పాలనా? భావకవి సామ్రాట్టునైన నాది కాదా ఈ ఢిల్లీ?" అలా భావిస్తూ ఓ గేయం రాశారు:

ఇది మొగల్ దివాణమా ?
ప్రళయ శివ మహా శ్మశానమా ?
ఇది విజయ స్తంభమా ?
చల విద్యుచ్చంద్ర చూడ దంభమా ?
ఇవి జీర్ణ సమాధులా ?
ప్రమధ గణ నివాస వీధులా ?
ఇది యవన వికాసమా ?
నటేశ తాండవ విలాసమా ?

అదే ఆయన ఆఖరి గేయం. మరి కొన్నేళ్లకు అప్పారావు గారి ప్రాణి దాటిపోయింది. ఢిల్లీలో ఆయనకు చిత్త స్వాస్థ్యం తప్పిందనుకున్నారు మిత్రులు. ఆయన ఆశించినట్లు-

బతుకు బరువు మోయలేక
చితికి చివికి దస్సివాడి
ఫికరు పుట్టి పారిపోయి
ఒకడనే యే తోటలోనో
పాట పాడుతుండగ నా
ప్రాణి దాటి యేగేనా ?
ప్రాణి దాటి యేగుతుండ
పాట నోట మోగేనా ?....

ఆయన అంతిమ క్షణంలో జరిగింది. ఈనాటికీ ఫలానావారు రాశారని తెలీకుండా ఆయన పాటలు తెలుగునేల నాలుగు చెరగులా పల్లె పట్టణాల్లో ఆబాల గోపాలం పాడటం అప్పుడప్పుడు మనం చూస్తుంటాం.

# మా రేపల్లి రామచంద్రశాస్త్రి

మేము వాల్తేరులో నివాసం ఏర్పరచుకున్న అనతికాలానికే మా రేపల్లి రామచంద్రశాస్త్రి గారితో నాకు పరిచయమయింది. అప్పుడు మేము వాల్తేరులో చిన్న బంగళాలో ఉంటూండేవాళ్ళము. వాల్తేరుకీ, విశాఖపట్టణానికీ మూడుమైళ్ళ దూరం. రాకపోకలకి తగిన వాహన వసతిలేని రోజులవి. పొద్దునా, సాయంకాలము ఓ బస్సు నడిచేది. అదీ సమయానుకూలంగా వుండేది కాదు. చాలామంది వాల్తేరునుంచి పట్టణం నడిచివెళ్ళేవారు. ఆ రోజుల్లో అందరికీ అంత అందుబాటులో లేని వాహనం పెట్టెబండి. అదే ఎద్దుబండి అనికూడా అనేవాళ్ళు.

ఓ ఆదివారం పొద్దునే మా ఇంటి ముందు ఓ పెట్టెబండి ఆగింది. అందులోంచి అంతకు పూర్వమే కొంచెం పరిచయమైన పురిపండా అప్పల స్వామిగారు ముందుగా దిగారు. ఆయన వెనకే మరో ఇద్దరు మధ్య వయస్సులో ఉన్నవాళ్ళు దిగారు. ఆఖరున—ఒకాయన నూరుపాళ్ళు శ్రోత్రియ పండితుడిలా ఉన్న బ్రాహ్మడు—దిగారు. ఆయన కాళ్ళకి చెప్పుల్లేవు. ముతక ఖద్దరు దోవతీ, ముతక ఖద్దరు ఉత్తరీయం, భుజాన ఖద్దరు సంచీ—గేటు తోసుకుని లోపలికి వచ్చారు. మా నాన్న గారికి అప్పలస్వామి గారు ఒక్కొక్కర్నీ పరిచయం చేశారు. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ శర్మగారూ, సబ్బవీసు సత్యకేశవరావుగారూ—కవిగారు—అనే మా రేపల్లి రామచంద్రశాస్త్రిగారు.

మా నాన్నగారిని చూడటానికి వచ్చాననీ, అప్పలస్వామికి శ్రమ కలిగించాననీ రామచంద్రశాస్త్రిగారతి వినయంగా చెప్పారు. మా నాన్న

గారు శాస్త్రిగారి గురించి అప్పటికే వినటంచాత ఆయనతో మాట్లాడేందుకు కుతూహలం కనపరిచారు.

రామచంద్రశాస్త్రిగారు అప్పుడే కారాగారం నుండి విడుదలైన వారు. విశాఖపట్నంలో వారిని అబ్బాలగోపాలం కవిగారని పిలిచేవారు. అంతేకాక, ఆయనపట్ల అపార గౌరవాన్ని ప్రదర్శించేవారు. ఆ రోజుల్లో విశాఖపట్టణం చిన్నది. అక్కడి జనం ఇరుగు పొరుగు జనంలా ఒకర్నొకరు అందరూ ఎరుగుదురు. దానికితోడు ఊరంతా అందరూ నడిచిపోయేవారు. వాహనయోగం ఏ కొద్ది మందికో ఉండేది. అంచాత కవిగారు విశాఖపట్నంలో ప్రతివారికీ సుపరిచితులు.

కవిగారు వాల్తేరులో మా ఇంటికొచ్చినప్పుడు కవితా సమితికి అధ్యక్షులుగా ఉండేవారు. చివరిదాకా ఆయనే అధ్యక్షులని నాకు గుర్తు. పురిపండా అప్పలస్వామిగారు కార్యదర్శిగా ఉండేవారు. అందులో పట్టణంలోనూ, జిల్లాలోనూ ప్రముఖులయిన యువ కవులు కొందరు సభ్యులుగా ఉండేవారు. మా నాన్నగారితో మాట్లాడుతూ కవిగారు తలపెట్టిన తెలుగునుడి కార్యక్రమాన్ని విశదీకరించారు. సంస్కృత ప్రభావం వల్ల ఎన్నో తెలుగుపదాలు అంతరించిపోయినవనీ, వాటిని తిరిగి సంపాదించాలనీ, అందుకని తన శేష జీవితాన్ని ఓ తెలుగు నిఘంటు నిర్మాణంలో వినియోగించదలిచాననీ చెప్పారు. పక్కనే కూచుని వింటున్న నేను కలగజేసుకుని, అలాచేస్తే బాగుంటుందనీ, నాలుగు దిక్కుల్లోనూ రెండు దిక్కులకు తెలుగు పేర్లు తెలియటం లేదనీ అన్నాను.

కవిగారు నావంక చూసి నన్ను దగ్గరికి లాక్కుని తలనిమురుతూ —"ఈ చిరంజీవి చూశారా, మన దుర్దశను ఎలాకనుక్కున్నాడో! నిజం నాయనా, నువ్వు చెప్పింది అక్షరాలా నిజం. నేను చేసే కృషి ఫలిస్తే ఎన్నో మాటలు బయటికి తీసుకురాగలం" అన్నారు.

కవిగారు తన నిఘంటువుకి "నుడికడలి" అని పేరు పెట్టమన్నారు. మా నాన్నగారి సహకారాన్ని అర్థించారు. మా నాన్నగారు

తనకు చేతనయినంత సహాయం చేస్తానన్నారు కానీ, అచ్చ తెలుగును ఆరాధిస్తే భాష ప్రజలకి దూరం అవుతుందేమోనన్న సందేహాన్ని వెలిబుచ్చారు. ఏ పదమయినా రూఢంగా ఉంటేనే అందరికీ అర్థం అయే అవకాశాలున్నాయన్నారు. ఏదేమయినా, కవిగారు తలపెట్టిన కార్యక్రమం హర్షదాయకమే నన్నారు. ఆ తరవాత యజ్ఞనారాయణశర్మగారితో మా నాన్నగారు నాటకరంగం గురించి కొంతసేపు చర్చ చేశారు. కవిగారూ, శర్మగారూ విశాఖ మండలంలో నాటక రంగానికి ఎనలేని సేవ చేసినవారు. ఇద్దరూ నాటక రచయితలే. కవిగారు వేషధారి కూడానూ!

ఆ తరవాత అందరూ సెలవు తీసుకుని బయటికొచ్చేశారు. వాళ్ళనిచూసి బండివాడు బండికి ఎద్దునికట్టి సిద్ధం చేశాడు. నేనూ, మా నాన్నగారూ వాళ్ళతోపాటు బండిదాకా వచ్చాము. కవిగారు చెప్పుల్లేకుండా ఉండటం మళ్ళీ చూశాను. ఆయన ఎందుకు చెప్పులు వేసుకోరని అడిగాను. మీకు భయం వెయ్యదా, రాత్రిళ్ళు చెప్పుల్లేకుండా పోవటానికని అడిగాను. ఎంచాతనంటే, ఆ రోజుల్లో వాల్తేరులో దారిపొడుగునా మండ్రగబ్బలూ, తాచుపాములూ ప్రత్యక్షమవుతూండేవి. ముఖ్యంగా రాత్రిళ్ళు వీధి దీపాలుండేవికావు.

ఆయన నవ్వుతూ, "ఎంతోమందికి చెప్పులు కుట్టించుకునే స్తోమత లేదు. నాకుమాత్రం ఎక్కడిదీ?" అన్నారు. తన్నుచూసి మండ్రగబ్బలూ, తాచుపాములూ భయపడి పక్కకి తప్పుకుంటవన్నారు. ఆయన ముఖంలో అత్యంతం ప్రస్ఫుటమయే అమాయకత్వమూ, వినయశీలమూ చూసినవాళ్ళు ఆయన చెప్పింది నిజమేనని అనుకోక మానరు. నేను మాత్రం ఆ క్షణంలో నమ్మేశాను. నాకూ్కడా అలాంటి శక్తివుంటే ఎంత బావుణ్ణనుకున్నాను.

ఓ రెండేళ్ళయింతరువాత మా చదువుల కోసం మా నాన్నగారు విశాఖపట్నంలో ఇల్లు తీసుకున్నారు. అక్కడ ఉన్నప్పుడు కవిగారితో పరిచయం సన్నిహిత మయింది నాకు.

సీతారామస్వామి ఆలయానికి ఎదురుగుండా ఘోషా ఆసుపత్రి ఉండేది. ఆసుపత్రికి పోయే ఆవరణలో ఎడం పక్కన ఓ పూరిపాక లాంటిది పెద్దది ఉండేది. అందులో కవిగారుండేవారు. దాన్నే కవిగారి ఆశ్రమం అనేవారు. అక్కడ ఓ చిన్న గ్రంథాలయం ఉండేది. అది కవి గారు సొంతంగా సంపాయించింది. నేను తరచూ అక్కడికి పోయేవాణ్ణి. అక్కడ పుస్తకాలు చదువుకుంటూ ఉండేవాణ్ణి. ఓ సంవత్సరంపాటు కవిగారు నన్ను అచ్చతెలుగు పిచ్చిలో పడేశారు. అచ్చతెలుగులో ప్రతీదీ రాయడం అభ్యాసం చేయటం ప్రారంభించాను. సాంబనిఘంటువు సంపాయించి, ఆ నిఘంటువు మీద పరిపూర్ణమైన అధికారాన్ని చేపట్టాను. నేను రాసిన రెండో, మూడో వ్యాసాలు కవిగారికి చూపించేవాణ్ణి. ఆయన నా వెన్నుతట్టేవారు. ఇలా నేను చేస్తున్నట్టు పురిపండా అప్పలస్వామి గారికి తెలియదు. ఆయనకి తెలిస్తే నన్ను వారించి ఉండేవారు- ఆయనకి అచ్చతెలుగు మీద మమకారం తక్కువ. శ్రీరంగం శ్రీనివాసరావు కసలే లేదు. అయితే, చక్కని తెలుగు పదం దొరికితే, తద్భవంకన్నా మెత్త నిది, తప్పకుండా వాడుకోవలసిందే- ముఖ్యంగా కవిత్వంలో. అచ్చ తెలుగు పిచ్చిలో పడిన నా మీద కవిగారికి మాత్రం అభిమానం మరింత ఎక్కువయింది. చిన్న చిన్న సమావేశాల్లో నన్ను దారితప్పి శ్లాఘిస్తూ ఉండేవారు.

మా తరగతిలో కొత్తగా ఓ తెలుగు మేష్టారొచ్చారు. తెలుగులో ఓ వ్యాసం రాయించారు విద్యార్థులచేత. నేను కష్టపడి అచ్చతెలుగులో రాశాను. మా తెలుగు మేష్టారు, అందరి వ్యాసాలకు తగిన మార్కు లిచ్చి తిరిగి ఎవరివి వాళ్ళ కిచ్చేశారు. నాది మాత్రం ఆయన దగ్గర ఉండి పోయింది. ఓ రోజు నాఅంతట నేనే అడిగాను. ఆయనకి కోపం వచ్చింది.

"చూడు రాజేశ్వరరావ్, నేనంటే సరిపోయింది. పరీక్షల్లో అలా రాశా వంటే సున్నా చుట్టేస్తారు. నీ భాష ఎవరికన్నా అర్థంకావాలి కనకనా?" అన్నారు. అంతే, నాకు నిజంగా భయం పట్టుకుంది!

* * *

అచ్చ తెలుగులో కవిత్వం అల్లాలని ప్రయత్నం చేశాను, కవి గారు సంతోషిస్తారు గదా అని. నేను రాసిందల్లా శ్రీరంగం శ్రీనివాస రావుకి చూపించేవాణ్ణి. కొత్తల్లో కొంత నిరుత్సాహపరిచాడు. తరవాత తరవాత మెత్తబడి, మాత్రాఛందస్సులో నేను రాస్తుంటే సహాయపడటం ప్రారంభించాడు. ఇప్పటికింకా, అలా మేము రాసిన వాటిలో నాలుగు పంక్తులు గుర్తు.

మొయిలు దారి బయలుదేరి
చెయిని పట్టి మెయిని తట్టి
చిలుకరించి చినుకుపైన
పలుకరించె వాన చాన....

అచ్చ తెలుగు మాటల పొందిక, కవిత్వంలో కొన్ని చోట్ల బాగా రాణిస్తుందని శ్రీనివాసరావు ఓసారి నాతో అన్నాడు. ఆ పద్ధతిలో అతనూ కొంత అనుకోకుండా శ్రమపడినట్లు జ్ఞాపకం. వెతగ్గా వెతగ్గా మంచి చక్కని మాటలు అచ్చతెలుగులో మాకు దొరుకుతూండేవి. దీని కంతా కారణం కవిగారి అచ్చతెలుగు ప్రచారమే. కవిగారు అనర్గళంగా ఉపన్యసించగలరు. మైకుల్లేని రోజుల్లో, వేలాది జనాన్ని తన ఉపన్యా సంతో ఆకట్టుకునే శక్తి కవిగారికుండేది. అయితే, ఆయన మొదట్నుంచీ సంప్రదాయ బద్ధులు కావటంవల్లా, జాతీయోద్యమంలో గాంధీ గారి అనుచరులవటం వల్లా యాంత్రిక నాగరికత ఆయనకి రుచించేది కాదు.

కవిత్వంలోనూ ఆధునికతని ఆయన మెచ్చిందీ లేదు. ఆధునికత రివాజయి పోవటంవల్ల ఆయన తల వంచుకొని ఒప్పుకొని కవితాసమితి అధ్యక్షులుగా ఉండేవారు.

ఆ రోజుల్లో మా నాన్నగారు కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరు. ఉద్యోగం విశ్వవిద్యాయంలో కనక పార్టీ కార్యకలాపాలన్నీ రహస్యంగా నడిపిస్తూ వచ్చేవారు. గుంటూరు నించి పార్టీ కార్యక్రమం కోసం తీసుకొచ్చిన అత్తలూరి లక్ష్మీనరసింహారావుకి కవిగారి ఆశ్రమం ఆవరణలోనే వసతి కల్పించారు. ఆ రోజుల్లో అందరూ కాంగ్రెసు కార్యకర్తల్లా ఉండేవారు. కవిగారూ నరసింహారావుని ఆప్యాయంగా చూస్తుండేవారు.

ఓసారి విశాఖపట్నంలో ఉన్న హార్బరు కార్మికుల్ని ఒక సంఘం కింద సంఘటితపరచాలనే ఆశయం మానాన్నగారికి కలిగి, కార్మికుల్లో కలిగించగలిగిన చైతన్య సాధనం కోసం అన్వేషించేవారు. అలా వారికో రాత్రి పాఠశాల నిర్వహిస్తే ఆ నెపంమీద వారిలో చైతన్యం రేకెత్తించచ్చు ననుకున్నారు. ఆ ప్రకారం కవిగారి ఆశ్రమ ఆవరణలోనే హార్బరు కార్మికుల కోసం రాత్రి పాఠశాల నిర్వహించటం ప్రారంభించారు. అదో అపురూపమైన ప్రయోగం. అది వేరే కథ.

అయితే రాత్రిళ్ళు అంతమంది పాఠశాలావరణంలో సమావేశమవటం, మా నాన్నగారు పాఠాలు చెప్పటం, పాఠాలు మెల్లిగా ఉపన్యాసాలు కావటం కొంతమంది బయట చూస్తూనే ఉన్నారు. అందులో పోలీసువారు ప్రముఖులు. ఇది పసిగట్టి మా నాన్నగారు కవిగారిని పాఠశాలకు ప్రారంభోత్సవం చెయ్యమని కోరారు. కవిగారు పెద్దమనిషి. అతివాది అయే అవకాశం సుతరామూ లేదు. కాని కవిగారికూ్కడా లోలోపల మా నాన్నగారూ, ఆయన సహచరుడైన నరసింహారావుమీద కూడా కొంత అనుమానం కలక్కపోలేదు. అప్పుడు కమ్యూనిష్టుల

పేరు అంతగా ప్రచారంలో లేనప్పటికీ, అతివాదుల ధోరణి అందరికీ తెలుసు. మా నాన్నగారు చేపట్టిన కార్యక్రమం కూడా అతివాద ధోరణికి చెందినదనే కవిగారి అనుమానం. ఎందుకంటే, మానాన్నగారు కవి గారిని రాత్రి పాఠశాల ప్రారంభోత్సవానికి ఆహ్వానించిన మరుక్షణం కవిగారు పురిపండా అప్పలస్వామిగార్ని పిలిపించి - రామకృష్ణారావు గారు రాజకీయాల్లో ఏ సిద్ధాంతానికి కట్టుబడి ఉన్నారో కనుక్కోమన్నారుట. అప్పలస్వామిగారు, అలా కనుక్కోవలసిన అగత్యం లేదనీ, రామకృష్ణారావు గారు బహుముఖ విజ్ఞాన సంపన్నులనీ, రాత్రి పాఠశాల బ్రిటిష్ కార్మిక పాఠశాలల లాంటి ప్రయోగమేననీ చెప్పారుట. అంతటితో కవిగారాగ లేదు. నన్నోసారి మెయిన్ రోడ్డులో పట్టుకుని మా నాన్నగారి గురించి తగిన ఆరా తీయటానికి ప్రయత్నం చేశారు. ఆఖరికి కవిగారు రాత్రి పాఠశాల ప్రారంభోత్సవం చెయ్యక తప్పింది కాదు. అయితే గాంధీగారి ఆదర్శాలను ఉపన్యాసంలో ఉటంకించారు. ఆయన చేతిచలవో, మా నాన్న గారి కార్యదీక్షో, పోర్టు వర్కర్సు యూనియన్ స్థాపనకు రాత్రి పాఠశాల దారితీసింది. అంతకు పూర్వం హేమాహేమీలు హార్బరు కార్మికులను సంఘటిత పరచాలని ప్రయత్నిస్తే ఫలించలేదు. అది మా నాన్నగారి విద్యా సాంస్కృతిక పథకం ద్వారా సాధ్యమయింది.

కవిగారి షష్టిపూర్తి 1933 లోనో 1934 లోనో జరిగింది. నిజంగా అదొక మరపురాని విశేషం. కవిగారిని ఆయన ఆశ్రమం నుంచి ఊరేగింపుతో సభామంటపానికి తీసుకొచ్చారు. తెన్నేటి విశ్వనాథంగారి కారులో కూచోబెట్టి కవిగారిని ఊరేగిస్తూ బయలుదేరారు అభిమానులు. సీతారామస్వామి కోవెల దాటి బురుజుపేట మీదుగా మెయిన్‌రోడ్డుకు వచ్చింది ఊరేగింపు. అంతే! విశాఖపట్టణం యావత్తూ ఊరేగింపులో పాల్గొన్నది. అలాంటి దృశ్యాన్ని విశాఖపట్టణంలో _ విశాఖపట్టణమే కాదు మరే

పట్టణంలోనూ—మళ్ళీ చూడము. ఆనందబాష్పాలు అని విన్నాను - కవిగారు సభలో ప్రసంగిస్తుంటే ఆయన చెక్కులమీద మొదటిసారిగా నేను చూశాను. సన్మానానికి ప్రత్యుత్తరంగా అంత చక్కని ఉపన్యాసాన్ని నే నింతవరకూ ఎక్కడా వినలేదు.

కవిగారు "నుడికడలి" కోసం ఎంత పరిశ్రమించినా అది ఒక కొలిక్కి రాలేదు. దానికి కారణం ఆయన పెట్టుకున్న రకరకాల వ్యాపకాలు. చివరి రోజుల్లో అచ్చ తెలుగు మీద ఆయన మమకారం మరింత ఎక్కువై ఉత్తరాల్లో అచ్చ తెలుగు తప్ప వాడేవారు కాదు. ఉత్తరం ప్రారంభించేముందు పైన "మేల్" అని రాసేవారు. తతిమ్మా జనం సంప్రదాయకంగా శుభం అని రాస్తుండేవారు. అలాగే కవిగారికి దైవభక్తి ఉండేది. అయితే దేవుడు అనే మాటకు తెలుగు పదం దొరక్కుండా పోయింది. చాలాసార్లు వెతికి వెతికి విసుగొచ్చి ఆయనే ఓ పదాన్ని సృష్టించారు - 'ఎల్లడు' అని. ఆయన ఆ మాట నాకూ, శ్రీనివాసరావుకీ, అప్పలస్వామిగారికీ మొదటిసారిగా వినిపించారు. నేను ఆయన మీద గౌరవంతో అలా ఉండిపోయాను. అప్పలస్వామిగారు "బావుంది" అన్నారు. శ్రీనివాసరావు పకాలున నవ్వేశాడు.

# నాయని సుబ్బారావు

ఆధునిక కవులందరితోనూ నాకు వ్యక్తిగతంగా సన్నిహిత పరిచయముండేది - ఒకరిద్దరితోతప్ప. ఆ ఒకరిద్దరు ప్రముఖకవులూ ఏకారణంచేతనో పరిచయం చేసుకోవడానికి నాకు తటస్థపడ్డారుకాదు. అందులో ముఖ్యులు నాయని సుబ్బారావుగారు. నాయని సుబ్బారావు గారిని కలుసుకునే అవకాశాలు వచ్చినా ఫలించలేదు.

మొదటిసారి ఆయన బందరులో మా ఇంటి కొచ్చినప్పుడు నేను పసికూనను. అప్పుడాయన అక్కడ కాలేజీలో విద్యార్థిగా ఉండేవారని విన్నాను. మా నాన్నగారు విద్యానిలయంలో ఉండేవారు. రెండోసారి ఆయన విశాఖపట్నం వచ్చినపుడు నేను ఊళ్ళోలేను. మూడోసారి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారిని ఆస్థానకవిగా బెజవాడలో ప్రతిష్ఠించే సన్మాన సభకు ఆయనా వచ్చారు. నేను హైదరాబాదునుంచి వెళ్ళాను. మా నాన్నగారూ, కృష్ణశాస్త్రిగారూ, ములుకుట్ల వెంకటశాస్త్రి, పద్మరాజూ వచ్చారు. ఓ రోజున సుబ్బారావుగారు కృష్ణశాస్త్రి విడిదికి వస్తానని కబురు చేశారు. మేమంతా అక్కడే ఉన్నాము. సాయంకాలం అయింది. ఆయన రాలేదు. వెంకటశాస్త్రి మమ్మల్నందర్నీ హోటల్‌కి తీసుకుపోయారు. అలా సుబ్బారావుగారిని చూసే ఆ అవకాశమూ పోయింది.

సుబ్బారావుగారి కవిత్వం కౌమారదశలోనే నా దృష్టికి వచ్చింది. ఆయన పద్యాలు చాలావరకు నాకు కంఠతః వచ్చేవి. రాయప్రోలు, మా నాన్నగారి తరవాత వచ్చిన కవుల్లో సుబ్బారావుగారు అగ్రశ్రేణికి చెందిన కవిగా నేను భావించేవాణ్ణి. అయితే ఆయనకు తెలుగు సాహిత్యంలో ప్రాముఖ్యం వచ్చినా, తతిమ్మావారితో పోలిస్తే తగినంత

రాలేదని నేననుకుంటాను. కానీ కవులకు తమ జీవితకాలంలో అపాదించ బడే ప్రచారానికీ, వారి కవిత్వస్థాయికీ, ఎటువంటి సంబంధం ఉండదని నా విశ్వాసం. నాలుగు కాలాలపాటు నిలిచే కవిత్వానికి సమకాలిక ప్రాధాన్యం అవసరం కాదు. అలా సుబ్బారావుగారికి ఎలాంటి నష్టం జరగలేదని నా అభిప్రాయం. ఆయన కవిత్వం అందువల్లనే నాలుగు కాలాలపాటు ఉంటుంది.

సుబ్బారావుగారి అన్నగారు నాయని నరసింహారావుగారు మా నాన్న గారి సహాధ్యాయి. నరసింహారావుగారు సాహిత్యవేత్త. అయితే మా నాన్న గారికి సుబ్బారావుగారు అన్నగారి ద్వారా పరిచయం కాలేదనుకుంటాను. సుబ్బారావుగారు కవితా క్షేత్రంలో కాలు పెట్టిన తరువాత అప్పటికే లబ్ధప్రతిష్ఠులైన మా నాన్నగారితో పరిచయం ఏర్పడిందని విన్నాను.

మేము ఢిల్లీలో చేరిన కొద్దికాలానికే సుబ్బారావుగారు ఢిల్లీ వచ్చారు. అప్పుడాయన కొడుకు దగ్గర ఉంటూండేవారని విన్నాను. ఈ విషయం ఏల్చూరి సుబ్రహ్మణ్యంగారు నాతో చెప్పారు. ఏ కారణం వల్లనో ఆయన్ని చూడటం తటస్థించింది కాదు. ఓసారి సుబ్రహ్మణ్యం గారు రమ్మన్నా పోవడానికి వీల్లేకపోయింది ఆయన్ని చూడటానికి. కుందుర్తి ఆంజనేయులు, సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసూ సుబ్బారావుగారికి సన్నిహితులేకాక అంతేవాసులుకూడా ననుకుంటాను.

ఢిల్లీలో మేము పూసా రోడ్డులో ఉండేవాళ్ళం. ఓ రోజు సాయం కాలం ఆఫీసునుంచి ఇంటికొచ్చిన తరవాత వృత్తిరీత్యా ఓ చిన్నపని పడింది. అపుడు ఓ ప్రభుత్వ సంస్థలో ముఖ్య సంపాదకుడిగా పని చేసేవాణ్ణి. అంచాత ముద్రణాలయాలతో పనిపడేది. ఆ రోజూ అలాగే మా వీథికి చివరగా జండేవాలాలో ఓ ముద్రణాలయానికి పోవలసి వచ్చింది. కిందికి దిగి ముందుగేటుదగ్గర కొచ్చాను. నా సమీపంలో మరోవ్యక్తి పోబోతున్నాడు. ఆయన నావంకచూసి మందహాసం చేసి

నాకు దారి ఇచ్చాడు. నేను బయలుదేరాను. నా పక్కన ఆయన. కొంచెం పొడుగు, సన్నగా, కోలమొహం, కొంచెంముందుకు వంగే మెడ-ఆయన విగ్రహం. ధోవతీ, లాల్చీ. అలా ఇద్దరం కాసేపు ఒకరిపక్కన ఒకరం రోడ్డుకు పక్కగా నడిచాము. ఆయన నావంక చూశ్శేదు. ఆయన వాలకం చూస్తే తెలుగుదనం కనిపిస్తోంది. నేను తలవంచుకుని నడుస్తున్నప్పుడు ఆయన నా తలమీంచి ఓరచూపుతో చూడడం గమనించాను. అలాగే ఆయన కుడివైపు ఎత్తుగాఉన్న ప్రదేశాలను చూస్తూన్నప్పుడు నే నాయనవంక చూశాను. ఆయన అచ్చం తెలుగువాడేనని నిశ్చయానికివచ్చి, "మీరు ఢిల్లీకి కొత్తగా వచ్చారా?" అని అడిగాను. ఆయన చకిత స్వరంతో 'అవునండీ' అన్నారు నావంక చూస్తూ. అంతే. నేను మాట్లాశ్శేదు. పూసారోడ్డు మొదటికొచ్చాము. అటూఇటూ పోయే కార్లను, బళ్ళనూ చూస్తూ నే నాగిపోయాను. ఆయన నా పక్కనే ఆగిపోయారు. నావంకచూస్తూనే "మీరు రోజూ ఇలా సాయంకాలం షికారుపోతుంటారా?" అన్నారు. అబద్ధమాడుతున్నానని తెలిసే 'అవునండి!' అన్నాను. మెల్లగా అవతలివేపుకి దాటుకుంటూ పోతున్నాను. ఆయన నా వెనకాతలే వచ్చారు. జండేవాలా రోడ్డుమీదకు వచ్చాము. పక్కనే ఫుట్‌పాత్‌మీద నడుస్తున్నాము. "మీరెన్నాళ్ళనుంచీ ఇక్కడ ఉంటున్నారండీ?" అని అడిగాయరాయన. మళ్ళీ అబద్ధమాడాను 'చాలా రోజుల్నుంచి!' అంటూ. ఇంతలోకి నేను పోవలసిన ముద్రణాలయందాకా వచ్చాము. 'సెలవండి:' అని పోబోతున్నాను.

"ఈ రోడ్డు ఎక్కడిదాకా పోతుందండీ?"

"కొంచెంపైన పంచకియా రోడ్డు, ఆపైన కన్నాట్ ప్లేస్! ఇంతకీ మీరెక్కడికి పోవాలి?"

"షికారుకనీ, కాలక్షేపానికనీ వచ్చాను. నేను....నేను....అజ్మల్ ఖాన్ రోడ్డుకి పోవాలి."

"అయితే ఇక్కడే రెండు నిమిషాలాగండి, నేనూ అటే పో తున్నాను. మిమ్మల్నీ దిగబెడతాను" అని నేను నా పని చూసుకుని ఓ పది నిమిషాల్లో తిరిగి వచ్చేశాను. ఆయన అక్కడే వచ్చేపోయే వాహనాల్ని, మనుషుల్ని చూస్తూ నిలబడి ఉన్నారు. మళ్ళీ కలిసి వెనక్కి బయలు దేరాం. ఈసారి సంభాషణ మారింది.

"ఇక్కడ తెలుగుపత్రికలు బాగా దొరుకుతాయా?"

"ఒకటీ రెండూ చోట్ల అమ్ముతారు. మనకున్నవికూడా ఒకటో రెండోకదా!"

"అవునండీ! సాహిత్యంలో ఆసక్తి ఉన్నవారూ, అభిరుచి ఉన్న వారూ ఏంకావాలో తెలియదండి. చక్కని పత్రికల్లేవు. మన తెలుగు వాళ్ళ ఖర్మ అనుకుంటాను. మనవాళ్ళలో సాహిత్యక్షేత్రంలో హేమా హేమీలున్నారు. ఏంలాభం? వాళ్ళు రాస్తే ప్రచురించడానికి అనువైన సాధనం లేదు."

"దీనికంతా కారణం ఏమయి ఉంటుందంటారు?"

"మాస్‌మీడియా వచ్చేసిందండి. సాహిత్యం బతకడం కష్టం. ఒకవేళ బతికినా అలా బతికిన సాహిత్యం జీవచ్ఛవంలా ఉండి మాస్ మీడియాలోని అనారోగ్య పరిణామాలకు అనువుగా ఉంటుందను కుంటాను."

"మీరు చెప్పింది నిజమేకావచ్చునండి" అన్నాను.

మేము ఆర్యసమాజ్ రోడ్డుమీద ఉన్నాము. ఆ పక్కనే అజ్మల్ ఖాన్ రోడ్డు. ఆయన్ని అజ్మల్‌ఖాన్ రోడ్డుదాకా సాగనంపి నేను సెలవు తీసుకున్నాను. నేను సెలవు తీసుకోవడం ఆయన వినిపించుకోలేదు. "పోయిందండి. చక్కని కవిత్వం వినే రోజులు పోయినవనుకుంటాను. చూద్దాం, నేనలా అనుకోవడం పొరపాటేమో! క్షమించండి, మీకు చాలా శ్రమ ఇచ్చాను" అంటూ తలవంచుకుని వెళ్ళిపోయారు.

ఆ తరవాత రెండు రోజులకి అజ్మల్ ఖాన్ రోడ్డులో ఆ వ్యక్తే ఏల్చూరి సుబ్రహ్మణ్యం గారితో నడిచిపోతూండటం చూశాను. నేను మరోపనిమీదపోతూ ఆ విషయం పట్టించుకోలేదు. ఓసారి సుబ్రహ్మణ్యం గారిని అడిగాను - ఆ వ్యక్తి ఎవరని. “నాయని సుబ్బారావు గారండి!” అని అన్నారు. ఆశ్చర్యంతో నా నోట మాటలేదు. ఆ క్రితం రాత్రే సుబ్బారావుగారు ఢిల్లీనుంచి వెళ్ళిపోయారు!

# బొడ్డు బాపిరాజు

మా నాన్నగారు నటాలి సంస్థను నిర్వహిస్తున్న కాలం. ఏలూరులో నాటక ప్రదర్శనం ఏర్పాటు చేసే ప్రయత్నం మీద నే నక్కడికి పోవలసి వచ్చింది. అప్పుడు చీరాల నుంచి తెనాలికి మకాం మార్చి నటాలిని నిర్వహించే వాళ్ళం. ఏదో కారణాంతరాలవల్ల మా నాన్నగారు మదరాసు వెళ్ళటం, ఏలూరు పోయి అక్కడ నాటక ప్రదర్శనం కోసం హాలు నిర్ణయించి నన్ను రమ్మనటం జరిగింది. తెనాలి నుంచి మరో ఇద్దరు స్నేహితులతో ఏలూరు బయలుదేరాను. సాయంకాలం ఆయిదారు గంటలకి ఏలూరులో దిగాము. స్టేషను దరిదాపులో ఉన్న ఓ చిన్న హోటల్లో గది తీసుకుని అక్కడ కార్యక్రమాన్ని నిశ్చయించుకోవాలని కూచున్నాము. నాతో వచ్చిన స్నేహితులిద్దరిలో ఒకతను కవిత్వం అంటే చెవి కోసుకునేవాడు, ఎప్పుడూ గుర్తున్న పద్యాలు చదువుతుండటం అలవాటు. అంతేకాదు, కర్మం జాలక అతనికో పద్యం నచ్చితే అది సరిగా వినమని చంపేసేవాడు. అతని పేరు జగన్నాథరావు. ఇంటి పేరు గుర్తుకు రావటం లేదు. పద్యం మాత్రం ఓ మోస్తరు చక్కగా చదివేవాడు. అతనికి నాటకాలంటే మహా ఇష్టం.

హోటల్లో చెరో కుర్చీలో కూచుని కాఫీ తాగుతున్నాము. జగన్నాథరావు కిటికీలోంచి పైకి చూస్తూ ఓ పద్యం ప్రారంభించాడు:

స్వామి పదాగ్రముల్ పవన
చాలిత బాల తమాల పల్లవ
శ్రీ మృదులమ్ములై యవత

రించె, స్వయం పరివేషవత్ ప్రస
న్నామృత కాంతి పూర్తిన సి తాంకముతో
తుహినాంశువట్లు ; ఈ
నా మనసెల్ల పాల్కడలి
నా నయనమ్ములు చంద్రకాంతముల్.

పద్యం ముగించి "ఎలా ఉందిరా?" అని అడిగాడు జగన్నాథ రావు. బాగుందన్నాను. అయితే ఆ పద్యంలోని ధారా శుద్ధి నాకు పరిచితంగా తోచింది. అలా చక్కగా పద్యాన్ని అల్లడం ఆ రోజుల్లో ఏ కొద్దిమందికో చేతనయేది. అదీకాక ఆ రోజుల్లోనే ఇంకా రసికాదరణ పొందే కాల్పనిక కవిత్వచ్ఛాయ అలాంటి పద్యాల్లోనే ద్యోతక మయేది. ఇంతకీ ఆ పద్యం ఎవర్రాశారని జగన్నాథరావుని నే నడగలేదు. నా మనస్సంతా మా నాన్నగారు నా కప్పగించిన కార్యభారం మీద ఉన్నా మధ్య మధ్య ఆ పద్యం లీలామాత్రంగా ప్రత్యక్ష మవుతుండేది. ఉండబట్టలేక "పద్యం రాసినాయన ఎవర్రా జగన్నాథరావ్?" అన్నాను.

మందహాసంతో "నువ్వు తీరిగ్గా ఉన్నప్పుడు చెబుతానులే!" అన్నాడు.

ఏలూరులో నేను చెయ్యవలసిన రెండు పనులున్నాయి. ఒకటి సోమంచి లింగయ్య గారనే న్యాయవాదిని కలుసుకోవటం. ఆయన ప్రసిద్ధ నటుడూ, రచయితా అయిన సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారి అన్నగారు. స్థానికంగా గౌరవనీయుడూ, లలితకళాభిరుచి కలవాడూను. ఆయన సహాయంతో ఏలూరులో మా నాటక ప్రదర్శనం జరగాలని మా నాన్నగారి ఆశయం.

రెండోది, ఏలూరు దగ్గర గుండుగొలను గ్రామంలో ఉన్న సురభి నాట్యమండలిలో శకుంతల అనే అమ్మాయి మా నటాలిలో

ఉండేది. ఆ అమ్మాయికి తిరిగి రమ్మని కబురు పెట్టడం. ముందుగా సోమంచి లింగయ్యగారింటికి జగన్నాథరావుని తీసుకుని బయలుదేరాను. తీరా ఆయనింటికి వెళ్ళేటప్పటికి లింగయ్యగారు లేరు. ఓ గంట తర వాత వస్తారని చెప్పారు ఇంటి దగ్గరివాళ్ళు. మేం తటపటాయిస్తూ బయటికి రావటమా అక్కడే నిరీక్షిస్తూ నిలబడటమా నిశ్చయంచుకోలేని స్థితిలో మరో యువకు డొచ్చాడు. అప్పటికి బాగా చీకటి పడింది. ఆయనా లింగయ్యగారి కోసమే వచ్చాడు. ఆ చిరుకాంతిలో ఆయన ముఖం ప్రస్ఫుటంగా కనిపించలేదు. కొంచెం చదునైన ముఖంలా ఉంది. చిరు మీసాలు, ఎడం పక్క పాపిట, ధోవతి, లాల్చీ, వెడల్పాటి అంచుగల ఉత్తరీయం. ఆయన మమ్మల్ని చూసి మేమూ లింగయ్యగారి కోసమే వచ్చామని తెలుసుకున్నాక, ఆయన అంత ఆలస్యంగా రారండీ! ఏ క్షణమయినా రావచ్చునన్నారు. నేనేం మాట్లాడలేదు. నా గొడవంతా నాపై పడ్డ కార్యభారం మీద. మర్నాడు సాయంకాలానికల్లా తెనాలి తిరిగిపోవాలి. ఈ లోపున హాలు నిర్ణయించటం, గుండుగొలను వెళ్ళి రావటం. జగన్నాథరావే మాట్లాడుతున్నాడు ఆ వచ్చినతనితో. ఓ పది నిముషాలు వీథిలో పచార్లు చెయ్యటం ప్రారంభించాము. వాళ్ళు ముందూ, నేను వెనకా. నేను ఫలానా అని జగన్నాథరావు ఆయనతో చెప్పాడు. ఆయన వెనక్కి తిరిగి నాటకం తేదీ గురించి అడిగి మా నాన్నగారు కూడా ఆ సమయానికి ఏలూరులో ఉంటారా అని అడిగారు. వస్తా రన్నాను. ఇంతలోకి కాలం వ్యర్థం అవుతోందని భావించి జగన్నాథ రావుని లింగయ్యగారింటి దగ్గర ఉంచి నేను హాలు దగ్గరికి పోయాను. జగన్నాథరావుని సరాసరి హోటలికి వచ్చేయమన్నాను. నేను హాలు దగ్గర నుంచి హోటలుకి వచ్చేటప్పటికి జగన్నాథరావు నాకోసం నిరీ క్షిస్తున్నాడు. చాలా ఉత్సాహంగా ఉన్నాడు. లింగయ్యగారు మర్నాడు మా హోటలికి వస్తానన్నారుట నన్ను చూడటానికి. ఆయన్ని చూసిం

తర్వాత గుండుగొలను బయలుదేరాలి. మేం భోజనం ముగించుకొని కూచున్నాము. జగన్నాథరావు మళ్ళీ ఓ పద్యం ప్రారంభించాడు:

ఓయి ప్రభూ! తపింతువిటు
లుర్వి ధరాగ్రము నెక్కి యెన్ని య
ధ్యాయము లేగె లోక కథ!
యంతయునుం దిలకించినావె? య
ధ్యాయము లయ్యె నేమి భవ
దీయ జగద్ధిత మార్గముల్, దయా
తోయధివౌచు కొండ దిగె
దో యొక గట్టుకు జేర్తువో భువిన్.

చదవటం అయిం తరవాత "ఈ పద్యాన్నీ సాయంకాలం చదివిన పద్యాన్నీ రాసినాయన పేరడిగావు కదూ, సోమంచి లింగయ్యగారింటి దగ్గర కనిపించాడే ఆయనేరా ఈ పద్యాలు రాశాడూ. ఆయన పేరు బొడ్డు బాపిరాజు" అన్నాడు.

నేను నిరుత్తరుణ్ణయ్యాను బొడ్డు బాపిరాజు గారంటే నా కా రోజుల్లో చాలా గౌరవం ఉండేది కవిత్వం బాగా చెప్పే కొద్దిమందిలో ఒకడని. అయన్ని ఓసారి స్వయంగా చూడాలనిపించింది. మర్నాడు వ్యవధి దొరికితే ఆయన్నోసారి పట్టుకుందాం అన్నాను జగన్నాథరావుతో. జగన్నాథరావు నవ్వుతూ మర్నాడు సాయంకాలం ఆయన దగ్గరికి నిన్ను తీసుకువస్తానని చెప్పేశా నన్నాడు. సంతోషించాను.

మర్నాడు పొద్దునే గుండుగొలను బయలుదేరాము. ఆ రోజుల్లో బస్సులు ఇంతలా ఉండేవి కావు. దారిలో ఆగుతుంటే ప్రయాణీకులను తొయ్యమనేవారు. మేం తిరిగి వచ్చేటప్పటికి బస్సు దారిలో చెడి ఆలస్యమయి మాకు రైలు టైం అయింది. తిన్నగా స్టేషనుకు వెళ్ళా

ళ్ళొచ్చింది. బాపిరాజుగారిని కలుసుకోవటం పడలేదు. మళ్ళీ నేను ఏలూరు నాటక ప్రదర్శనానికి రావటమూ పడలేదు. ఆ రోజుల్లో నిత్య ప్రచారం వల్ల కొద్ది మంది కవులే ఆధునికుల్లో తెలుగువారికి పరిచితులయ్యారు. ఎంత ప్రతిభ ఉన్నా భావ శబలత ఉన్నా పద్య కల్పనలో అత్యంత ప్రావీణ్యమున్నా బాపిరాజు గారికి రావలసినంత ప్రాశస్త్యం రాలేకపోయింది. అయితే ఆయన పద్యాలు ఈనాటికీ నాలుగుకాలాలకు నైవేద్యాలుగా ఉంటాయి.

తెలుగు కవిత్వంలో ప్రస్తుత పరిణామాన్ని ఆధారం చేసుకుని పద్యానికి భవిష్యత్తు లేదనుకునే అజ్ఞానులు అడపాతడపా మనకి తటస్థ పడుతుంటారు. భాషమీద అధికారంలేనివాళ్ళూ, ఛందస్సును సాధించలేనివాళ్ళూ, సౌందర్యాన్నీ, సృష్టి స్వరూపాన్నీ ఆరాధించలేనివాళ్ళూ ఓ అపభ్రంశ ప్రక్రియను కవితా సాధనంగా పరిగణించి అదే నిత్యమనుకుంటున్నారు. ఆ సందర్భంలో బొడ్డు బాపిరాజు గారి పద్యాలు స్ఫురణకు వచ్చాయి. ఆయనకు ప్రచారభాగ్యమూ లేదు, శిష్యవర్గమూ లేదు, బహుమానాలూ, సత్కారాలూ లేవు. 1973 లో అనుకుంటాను. ఆయనకో చిన్న అభినందన సభ చేశారు. ఆ సభలో ఉపన్యసిస్తూ కవిత్వానికి గౌరవం ప్రతిపాదించినందుకు ఆనంద పారవశ్యంతో భౌతిక జీవితానికి స్వస్తి పలికారు. అలాంటి మృత్యువు మరొకరిని ఆహ్వానించటం నేనెరుగను.

దాదాపు వెయ్యి సంవత్సరాల తెలుగు సాహిత్యంలో గణబద్ధమైనా, మాత్రాపరమైనా పద్యం అమరత్వం సాధించుకున్నది. అందుకు కారణాలు వేరు. మరో ప్రక్రియ సాక్షాత్కరిస్తుందంటే మనం చరిత్రను వితండంగా తిరస్కరించటమే కాక కేవలం ఆత్మవంచనే అవుతోంది.

# మాచిరాజు దేవీప్రసాద్

నా కుమారున కప్పుడు నాలుగేండ్లు
నిండినవొ లేవొ కాని "ఏమండి నాన్న
గారు! పుస్తకమొకటి బజారునుండి
నాకు తేవలె"నని కోరినాడు నన్ను.

ఈ పద్యం 1922 ప్రాంతాల్లో 'వానచినుకు' అనే శీర్షికకింద మా నాన్నగారు చెప్పిన ఓ డజను పద్యాల్లో ఒకటి. ఇప్పుడు నాకా పద్యాలు గుర్తులేవు. మనస్సుదాటి కంఠంవిడిచి కాలగర్భంలో కలిసిపోయినయి. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రికి మాత్రం కంఠస్థంగా ఉండేవి. అతనే మా నాన్నగారి అముద్రిత పద్యాలకూ, చాటువులకూ అపార ప్రచారం చేశాడు.

కొడుకు కోరగానే "ఓనమాలు బొమ్మలు" ఉన్న పుస్తక మొకటి తెచ్చి ఇచ్చారు నాన్నగారు. అప్పుడా అబ్బాయి "అక్షరాభ్యాస బాధా మహాబ్ధి'లో కాలు పెడుతున్నాడు. అక్షరాలెలా ఉంటాయో, ఎలా రాయాలో తెలీక తికమకపడుతున్నాడు కుర్రవాడు. 'ప్రావృడంబోధరాలు' ఆకాశాన్నంతా ఆకస్మికంగా ఆవరించినాయి. అప్పుడు-

తప్పుమనె వాన చిన్కు పొత్తమ్ము పైన!

ఆ చినుకు ఓ అక్షర రూపంలో చిత్రవిచిత్రంగా కుమారుడికి తోచటం, అక్షరాభ్యాసం అయిపోయినట్టు కుర్రవాడు ఆశ్చర్యంతో గంతులు వెయ్యటం. ఈ పద్యాలన్నీ నాకు గుర్తులేవుకాని, అవి ఓ రకమైన పేరడీ అని అందరూ ఆ రోజుల్లో అనేవారు. ఈ పద్యాల్ని రుక్మిణీ

నాథ శాస్త్రి ముఖతః పదే పదే కృష్ణశాస్త్రి గారు విని మెచ్చుకునే వారు. తను కూడా అలాంటి పద్యాలు రాస్తానని నాతో ఓసారి అన్నారు, ఆయన్ని కాకినాడలో కలుసుకున్నప్పుడు. ఆ విషయాన్ని నేనంత పట్టించుకో లేదు. మా నాన్నగారికి చెప్పనూలేదు. ఇంతలోకి పఠాభి కవిత్వం, మాచి రాజు దేవీప్రసాద్ భావకవుల్ని ఎద్దేవా చేసేట్టుగా పేరడీలు అల్లడం ప్రారంభ మయింది. అయితే, అంతకు ముందుగా రుక్మిణీనాథశాస్త్రి ఆధు నిక కవితా క్షేత్రంలో పేరడీకి ఓ విశిష్ట స్థానం కల్పించటం జరిగింది. ఆ కాలంలో - 1949 అని గుర్తు- ప్రాంతంలో కృష్ణశాస్త్రిగారు కొన్ని చక్కని పద్యాలు, అబ్బూరి, పఠాభి, దేవీప్రసాద్ పద్ధతిలో రాసి, పేరు లేకుండా, మల్లవరపు విశ్వేశ్వరరావు సహకారంతో, శ్రీరంగం శ్రీనివాస రావు ద్వారా భారతిలో అచ్చేయించారు. అందులో-

అసలు శ్రావణ మాస మధ్యమ్మునందు
కురిసి తీరాలి వర్షాలు, కొంచెకొంచె
మేని రాలాలి తుంపరలేని, కాని
ఉక్కమాత్ర మేమాత్రమూ ఉండరాదు.
ఇపుడు నా వొళ్ళు కొంతలావెక్కి సుంత
కదిలితె చెమట వానలు కక్కుతుంది
నేనె వర్షపు మేఘమైతేను, పైని
ఒట్టిపోయింది కొండపై ఉత్తమబ్బు.

ఈ పద్యాల్ని నేను చూస్తానో లేదో అన్నట్టు, నాకు రుక్మిణీనాథ శాస్త్రి స్వయంగా నకలు రాసి పంపాడు. ఈ రాతకి ప్రత్యక్షంగా తనే కారణమనీ, అబ్బూరి పద్యాలు శాస్త్రిగారి కెంతో నచ్చినవనీ ఉత్తరంలో రాశాడు. అయితే, ఈ పద్యాలు కృష్ణశాస్త్రిగారివని నా లాంటి వాళ్ళకి ఏ కొద్దిమందికో తప్ప అందరికీ తెలియదు. అప్పటి రచయితల్తో పరిచయం

ఉన్న కొద్ది మందికి, ఈ పద్యాలు మాచిరాజు దేవీప్రసాద్ రాశాడని నమ్మకం కుదిరింది. ఇంకా లబ్ధప్రతిష్ఠుడు కాకపోయినా, అతని పేరడీలు అనుశ్రుతంగా ప్రచారంలో ఉండేవి. ఇది గుర్తించి, మల్లవరపు విశ్వేశ్వర రావు మాత్రం అతి రహస్యంగా ఉంచమని-అడిగిన వాళ్ళతోనూ, అడగని వాళ్ళతోనూ భారతిలో అచ్చయిన పద్యాలు కృష్ణశాస్త్రిగారే రాశారని చెప్పేశాడు.

నిజానికి కృష్ణశాస్త్రిగారి పద్యాల్లో మనకు కనిపించే బాణీ అప్పటికే సర్వాంగ సుందరంగా, కర్ణపేయంగా మలచిన కీర్తి దేవీప్రసాద్‌కే దక్కుతుంది. అలాంటి ధోరణిని, రుక్మిణీనాథశాస్త్రి అన్నట్టు మా నాన్న గారు నిర్దేశించినా, పతాభి ప్రారంభించినా, దానికో విశిష్ట స్వరూపాన్ని ఆపాదించినవాడు దేవీప్రసాద్.

దేవీప్రసాద్‌ను మొదటిసారిగా నేను హైదరాదులో చూశాను. కవులుగా పరస్పరం అప్పటికే పరిచితులం. 1952 ప్రాంతాల్లో. ఆ రోజులు సాహిత్యాన్ని మేము సీరియస్‌గా తీసుకున్న రోజులు. ఆధునిక తెలుగు కవిత్వానికి అఖండ భవిష్యత్తు రావాలని ఆవేదన పడే రోజులు. నేనూ, రాచప్రోలు రాజశేఖర్, భాస్కరభట్ల కృష్ణారావూ, ఏల్చూరి సుబ్రహ్మణ్యం ప్రతిదినం విధిగా సాయంకాలం కలిసి తిరిగే రోజులు. ఓ రోజున మా అందరికీ అనువైన జాన్సు బారులో కూచున్నాము. ఏదో చర్చలో పడ్డాము. ఏడు గంటలు కావస్తోంది. బార్‌లోకి మరో వ్యక్తి ప్రవేశించాడు. ముఖం కనిపించలేదు. నిటారుగా నడుస్తూ మా పక్కన క్యూబికిల్‌లోకి పోయాడు.

"బాయ్" అని అరిచాడోలేదో రాజశేఖర్ గొంతు గుర్తుపట్టేశాడు.

"మాచిరాజు దేవీప్రసాద్" అన్నాడు.

పక్కకి పోయి అతన్ని కూడా తీసుకొచ్చాడు. మాకందరికీ పరిచయం చేశాడు. సుబ్రహ్మణ్యం అతనికప్పటికే సన్నిహితుడు. చాలా

నేవు కూచున్నాం. ఎక్కువగా దేవీప్రసాద్ మాట్లాడాడు. మేం వింటు న్నాము. రాత్రి పొద్దుపోయింది. ఎక్కడో నాంపల్లి స్టేషను దగ్గర ఓ హోటల్లో కృష్ణారావు మాకు భోజనం పెట్టించాడు.

ఆ తరువాత ప్రతీనెలా కనీసం ఓ రోజయినా దేవీప్రసాద్ సాయంకాలం మాతో కాలక్షేపం చేసేవాడు. అప్పుడతను వరంగల్లులో ఉండేవాడు. సాయంకాలాలు మేం బారుల్లోనే గడిపేవారం. అజంతా కూడా మాతో చేరాడు. అప్పుడప్పుడు బెల్లంకొండ రామదాసు వస్తూండే వాడు. మాకు సాహిత్యం తప్ప మరో ప్రసక్తి ఉండేదికాదు. ఆ రోజుల్లో కేవలం సాహిత్యంకోసం ఎక్కిన బారు దిగలేదు. దిగిన బారు ఎక్కలేదు.

ఓ రోజున శ్రీశ్రీ వచ్చాడు మదరాసునుంచి. అప్పుడే మతి భ్రమణం నుంచి కోలుకుంటున్నాడు. కొన్నాళ్ళు నాతో విశ్రాంతి కోసం ఉంటానన్నాడు. యథాప్రకారం సాయంకాలం జాన్సుకి పోయాము. ఆ రోజున అనుకోకుండా దేవీప్రసాదూ వచ్చాడు. అందరం ఆనందంగా ఉన్నాం. పూర్వ స్మృతులను నెమరువేసుకుంటున్నాము. ఏదో మాటమీద మాటవచ్చి శ్రీనివాసరావన్నాడూ "దేవీప్రసాద్ పేరడీలు గ్రంథస్థంచేస్తే బాగుణ్ణు!" అని.

దేవీప్రసాద్ బార్ చూరువంక చూస్తూ "పేరులేకుండా వేస్తే మరీ మంచింది. పేరెందుకు? ఏదో ముందు మీరువేస్తే అంతకన్నా మంచిది" అన్నాడు.

శ్రీశ్రీకి ముందు అర్థం కాలేదు. "పోనీ అలాగే వేద్దాం. అదో చమ త్కారం" అన్నాన్నేను.

దేవీప్రసాద్ కొంచెం కోపంగా "అప్పుడవన్నీ కృష్ణపక్షకర్త రాశాడనుకుంటారు. అందరికీ ఆనందం!" అన్నాడు.

శ్రీశ్రీ పకాలున నవ్వేశాడు. "ఇప్పుడందరికీ తెలుసు. శాస్త్రిగారు సరదాకి మరో శైలి పట్టేశారని. నా అంతట నేను భారతిలో వేయించలేదు.

శాస్త్రిగారి బలవంతం మీద చేశాను. అలాచేసిన వెంటనే నువ్వు గుర్తు కొచ్చావు. అయినా ఆ పద్యాలూ నువ్వు రాసినవే అనుకున్నారు చాలా మంది. క్రెడిట్ అంటే అదే!" శ్రీశ్రీ అన్నాడు.

"శాస్త్రిగారు దేవీప్రసాద్‌ని చిరంజీవిని చేశారు. అదన్నా మనం గుర్తించాలి" అన్నాడు రాజశేఖరు.

శ్రీశ్రీ ఓ రెండు పద్యాలు చదివాడు ప్రసంగవశంగా:

అతను ప్రియురాలిగాంచు బ్రహ్మాండమందు
అచ్చ మామెనె గాంచు ప్రత్యణువులోన
పుర్వులో నుర్వులో గాలి పర్వులోన
రెక్కలో రిక్కలో పందికొక్కులోన.

ఆ కళాంభోధి ఊహావిలోకనాన
లోల లోచనాల్విధుమండలాల కలచు
ఆమె లోలాక్షి వికచోత్పలాయతాక్షి
కాని అసలులో ఆమె కో కన్ను మెల్ల.

# చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి

**తిరుపతి** వెంకటకవులు గురించి చాలా చిన్నతనంలోనే నేను విన్నాను. ముఖ్యంగా వారి అవధాన శక్తి గురించి. అప్పటికి తిరుపతి శాస్త్రిగారు కీర్తిశేషులు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి మాటే అన్ని సాహిత్య గోష్ఠుల్లోనూ వినిపించేది. ఆయన్ని గురించి కథలూ, గాథలూ బహుళ ప్రచారంలో ఉండేవి. అవి వింటూ ఆయనలా పద్యాలల్లటం నాకూ చాతనయితే జన్మతరిస్తుందని కలలు కాసేవాణ్ణి. ఓసారి మేము బందరులో ఉన్నప్పుడు వెంకటశాస్త్రిగారింటికి నన్నెత్తుకుని తీసుకుపోయానని మల్లాది రామకృష్ణశాస్త్రిగారు చెప్పినపుడు ఆనందంతో ఉప్పొంగిపోయాను.

అయితే ఓసారి, ఆయన షష్టిపూర్తి తరవాత విశాఖపట్నం కంటి వైద్యం కోసం వచ్చి విప్పర్తివారి వీథిలో ఉన్న పింగళి లక్ష్మికాంతం గారింట్లో బసచేశారు. ప్రతి దినం లక్ష్మికాంతం గారింటికి పొద్దునో, సాయంకాలమో పోతుండేవాణ్ణి. నా కర్మం కాలి వెంకటశాస్త్రి గారిమీద ఆ రోజుల్లో ధ్యాసపోలేదు. స్కూల్లో నాటకాల గొడవలో ఉండిపోయాను. తీరా వెంకటశాస్త్రిగారు విశాఖపట్నం నుంచి వెళ్ళిపోయాక ఆయన్ని చూడలేకపోయానే నని బెంగపట్టుకుంది. ఆయన్ని చూడటం ఎన్నేళ్ళకో కాని పళ్ళేదు. ఆలోపున వెంకటశాస్త్రిగారు రాసిన ప్రతి పంక్తి సంపాయించి చదివేశాను. ఇంతలో యుద్ధం వచ్చేసింది. అన్నీ కరువే. ఆ సమయంలో శ్రీరంగం శ్రీనివాసరావు కవిత్వానికి ప్రత్యేకంగా ఓ పత్రిక నడిపిస్తానని చెపుతూ వొచ్చాడు. అప్పుడు నేను మదరాసులో ఉన్నాను.

ఆ పత్రిక ముఖపత్రం మీద వెంకటశాస్త్రి గారి చేతుల ఛాయా చిత్రాన్ని అచ్చేయిస్తానన్నాడు. ఆయన వేళ్ళు ప్రస్ఫుటంగా కనిపించాలన్నాడు. ఇద్దరంకలిసి వెంకటశాస్త్రిగారున్న కడియం పోదామనుకున్నాము. ఇద్దరి దగ్గరా తగిన డబ్బుల్లేవు. ఇంతలోకి నేను హైదరాబాదు వచ్చాను. హైదరాబాదునుంచి ఓసారి బెజవాడ పోయాను. అక్కడికి వెంకటశాస్త్రిగారు కంటి వైద్యంకోసం త్వరలో రాబోతున్నారని తెలిసింది. వెంటనే శ్రీనివాస రావుకి ఉత్తరం రాశాను, ఫలానా రోజున బెజవాడకి రమ్మని. తనకు వీలుండదనీ, వెంకటశాస్త్రిగారి ఛాయా చిత్రాలను నన్నే తీయించమనీ రాశాడు. నేను తిరిగీ బెజవాడ కొచ్చి బందరు కాలవ పక్కన వెంకట శాస్త్రిగారు విడిదిచేసిన ఇంటికి పోయాను. నాతోపాటు మల్లాది ఫణిభూషణ రావూ, నీలంరాజు వెంకటశేషయ్యగారూ వచ్చారు. మావెంట ఒక ఫోటో గ్రాఫరూ. అవీ ఇవీ మాట్లాడి మామూలుగా నాలుగైదు భంగిమల్లో ఆయన చిత్రాలు తీయించి ఆ తరవాత ఆయన చేతుల్ని దగ్గిర పెట్టి మరో అయిదారు చిత్రాలు తీయించాను. ఆయన ఆశ్చర్యపోయి "ఎవరన్నా మొహాన్ని ఫోటో తీస్తారుకాని చేతుల ఫోటో ఏమిటయ్యా?" అన్నారు నవ్వుతూ.

"శాస్త్రిగారూ! మీ కవిత్వమంతా ఈ చేతుల్తోనే కదా రాశారు. మేం పెట్టబోయే పత్రిక కేవలం కవిత్వ పత్రిక. పేరు 'ధ్వని.' సంపాదకుడు శ్రీరంగం శ్రీనివాసరావు. పత్రిక ముఖచిత్రం మీద ఈ బొమ్మ ప్రముఖంగా అచ్చేస్తాము" అన్నాను కొంచెం భయపడుతూ.

ఆయన పకాలున నవ్వి- "నన్నందరితోనూ పోల్చేస్తున్నారు. నేను కవిత్వం చెప్పాను. రాసింది తక్కువ—మీరు నిజంగా నాకు న్యాయం చేకూర్చాలంటే నా మేధస్సునీ, హృదయాన్నీ, గాత్రాన్నీ ఫోటోతీసి మీ పత్రికలో వెయ్యండి" అన్నారు.

నేను కొంచెం తేరుకుని "అలా తమరనటంలో సత్యమే ఉన్నది కాని అలా కుదరదు కనుక ఈ మార్గం అవలంబించాం" అన్నాను.

ఆ తరవాత ఆయనతోపాటు నేనూ, పణిభూషణరావూ, వెంకటశేషయ్యగారూ కలిసి ఓ ఫోటో తీయించుకున్నాము. ఆ ఛాయాచిత్రం కొన్నాళ్ళకు ఆంధ్రపత్రిక వారపత్రికలో 'చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారూ, ఆయన శిష్యులూ' అనే శీర్షికతో అచ్చయింది.

ఆ మర్నాడే శ్రీనివాసరావుకి శాస్త్రిగారన్న అంశాన్ని రాశాను. అందులో కొంత సత్యం లేకపోలేదని నా కనిపించింది. నా ఉత్తరం అందింతరవాత శ్రీనివాసరావుకీ కొంచెం అనుమానం ఏర్పడటం నాకు తెలుసు. ఆ తరవాత కొన్నాళ్ళకు మేమిద్దరం కలిసి శాస్త్రిగారిని కలుసుకున్నాం.

వెంకటశాస్త్రిగారిని నేను చూసినప్పుడు ఆయన ఆరోగ్యం అంత బాగాలేదు. వయస్సు డెబ్బయి అయిదులో పడింది. కాని చప్పున చమత్కరించడం, హాస్యస్ఫోరకంగా మాట్లాడటం, త్రుటిలో జ్ఞాపకం తెచ్చుకోవడం లాంటివి ఉండేవి. ఆయన డాక్టరు క్షీరసాగరు దగ్గర వైద్యానికి వచ్చారప్పుడు. ఫోటోలు తీయించింతరవాత మరో రెండుసార్లు ఆయన్ను చూశాను. ఆయన దగ్గరకి కవులన్నవారూ, అభిమానులన్నవారూ వస్తూ పోతూండేవారు. ఆయన ఉత్సాహంగా ఉన్నప్పుడు మెల్లిగా ఎన్నో విషయాలూ, అనుభవాలూ మాట్లాడేవారు.

ఓసారి తెనాలిలో మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రి గారు నాకోకథ చెప్పారు. వెంకటశాస్త్రిగారు బందర్లో ఉన్నప్పుడు ఆయనకో గర్ల్ ఫ్రెండు ఉండేదిట. ఆవిడకో చిన్న సైజు హోటలుండేది. వెంకటశాస్త్రిగారి శిష్యులందరూ - పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వరరావు ప్రభృతులు ఆ హోటల్లోనే ఫలహారం చేసేవారుట. అక్కడ పెసరట్టుకు సాటిలేదని చెప్పుకునేవారట. ఇది విని కోలవెన్ను రామకోటేశ్వరరావుగారూ, మరో మిత్రుడూ ఆ హోటలుకు పోయారుట పెసరట్టు విశేషం కనిపెట్టాలని. మెల్లిగా లోపలికిపోయి పెసరట్టు వేసే

వంట గదిలోకి ప్రవేశించారు. పెసరట్టు వేసేవాడు అట్లకాడ పిక్కమీద పెట్టుకుని నిలబడ్డాడుట. కాస్సేపయింతర్వాత కాలుతున్న పెసరట్టును ఆ అట్లకాడతో తిరగేసి ఆకులో వేశాడుట. వాడి పిక్కమీద తామర! రామకోటేశ్వరరావు గారు చటుక్కున హోటల్లోంచి బయటపడ్డారు. ఆ తరువాత ఆ హోటల్‌కు "సాహిత్య తామరవిలాస్" అని పేరు పెట్టారుట. మిత్రుల సముఖంలో సాహిత్య తామర ఉన్నవాళ్ళే ఆ హోటళ్లో తినుబండారాలు రుచికరంగా ఉంటాయని చెబుతారని ఊరంతా పొక్కిపోయిందట.

వెంకటశాస్త్రిగారికి కథ చెప్పాను. ఆయన ఫక్కుమని నవ్వేశారు. "ఆ రోజుల్లో నామీద అనేకం అభాండాలు వేసేవారు- అభిమానంతో కొందరూ, అసూయతో మరికొందరూ. ఓసారి ఓ సంస్థానంలో అవధానానికి పోయాము. అక్కడో చదువుకున్న వేశ్య నాకో పద్యం రాసి పంపించింది. తనూ కవిత్వం చెబుతాననీ, నేను వినాలనీ. తిరుపతిశాస్త్రి మండిపడ్డాడు. ఎక్కడికిపోయినా నీకో పేరుందని తెలిసిపోతుందన్నాడు. నిజానికి నేనెలా బాధ్యుణ్ణి ఆమె పద్యానికి?అలాంటివి బోలెడు జరిగాయిలే" అన్నారు.

మరో మూడు సంవత్సరాల తరవాత వెంకటశాస్త్రిగారిని మళ్ళీ చూడటం సంభవమయింది. 1949 సంవత్సరం అనుకుంటాను. ఆయన్ని మదరాసు రాష్ట్రంలో ఆస్థానకవిగా నియమించి గౌరవించారు. ఆ ఉత్సవానికి నేనూ వెళ్ళాను. అది బెజవాడలో జరిగింది. తెలుగునాట మళ్ళీ అలాంటి మహోత్సవ సందర్భం మనం చూడం. బెజవాడ మునిసిపల్ హైస్కూలు ఆవరణలో జరిగింది. తెలుగునేల నాలుగు చెరగుల నుంచీ సాహిత్యంతో అంతో ఇంతో సంబంధం ఉన్న వారందరూ వచ్చారు. ప్రముఖ కవి పండితులంతా వచ్చారు.

వెంకటశాస్త్రిగారిచే హైస్కూల్లో ఓ గదిలో బస చేయించారు తాత్కాలికంగా. ఆయన్ని చూడటానికి నేను ఆయన బస చేసిన గదికి వెళ్ళాను. క్రితం సారి చూసినదానికన్నా ఆయన చిక్కిపోయారు. ఎన భైలో పడుతున్నా రనుకుంటాను. ఓ మంచం మీద పడుకుని ఉన్నారు. కొంచెం దూరంగా బంధువులున్నారు. మంచం దగ్గిర ఇద్దరు వ్యక్తు లున్నారు. అందులో ఒకాయన చోడవరపు జానకిరామయ్యగారను కుంటాను. గుర్తులేదు- నేనూ వెళ్ళి అక్కడే కూచున్నాను. ఇంతలోకి ఎవరోవచ్చి సన్మానానికి ఆయన ప్రత్యుత్తరం ఏమన్నా తయారు చేశారా, ఎవరో పత్రికవాళ్ళు అడుగుతున్నారన్నారు. వెంకటశాస్త్రిగారు పద్యంలో చెబుతానన్నారు మంచంమీద పడుకునే. "మేం రాసుకుంటాం చెప్పండి" అన్నారు అ కూచున్న వాళ్ళలో ఒకరు. ఆయన మెల్లిగా చెబుతున్నారు. అందరూ రాయడం మొదలుపెట్టారు. నేనూ రాసుకుంటున్నాను.

నన్ను వృద్ధుడంచుఁ బున్నెమ్మునకు మీరు
గౌరవింతు, రేనుదారమైన
మీ సపర్య లెలమి మెచ్చి కైకొనియెదఁ
గవిని నేనుకాను, కాను కాను.

మరో మత్తేభం తరువాత

ఇరువురో మూగురో కవులుం
దురు, కబ్బమ్ములునంతె, దోషజ్ఞులు ధీ
పరమాన్యులు తితఉవులై
పరిశీలించునెడ జైకి వచ్చెడి సుకృతుల్.

మరో పద్యం

కవిత వలన బున్నెము గూడ గలిగెనేని
గలుగనిం డాపశక్యముగాదు; రామ
కోటివలె నుండు రచనలు కోవిదులకు
నచ్చ వీ రహస్యమ్ము విన్నాణి యెరుగు!

ఇంకా ఎన్నో - శాస్త్రిగారి దర్శనమే ఓ అపురూపమైన అనుభూతి! ఆయనలాంటి సాహిత్య వ్యక్తి - నభూతో నభవిష్యతి!

# మల్లాది రామకృష్ణశాస్త్రి

ఇది వరకే చెప్పాను. నా చిన్నతనంలో బందరులో రామకృష్ణశాస్త్రిగారు నన్నెత్తుకొని ఆడించేవారని. ఆ రోజుల్లో రామకృష్ణశాస్త్రి గారు బహుళ సంపన్నులయిన పురాణం సూరిశాస్త్రిగారింట అల్లుడిగా కాలు పెట్టారు. ఆయనకు స్వతహా విద్యాసక్తి విజ్ఞానాపేక్షా అపారం. అప్పటికే సంస్కృతాంధ్రాంగ్ల భాషల్లో తగిన పాండిత్యాన్ని సాధించారు. మామగారయిన పురాణం సూరిశాస్త్రిగారి ధర్మమా అని రామకృష్ణశాస్త్రి గారికి ఆధునిక కవితా క్షేత్రంలో ప్రముఖులైన వ్యక్తులు బందరులోనే ఎక్కువగా తారసిల్లటం జీవితంలో మరపురాని ఓ మలుపై కూచుంది. సూరిశాస్త్రిగారు విద్యానిలయాన్ని స్థాపించి, అందులో వివిధ కళాక్షేత్రాల్లో ఉద్దండులైన వారిని చేర్చి ఓ చర్చా వేదిక నిర్వహించటం రామకృష్ణశాస్త్రిగారి ఆశయాలకు వరప్రసాదమయింది. ఆనాటి విద్యానిలయంలో మా నాన్నగారు ప్రముఖులు. తతిమ్మా వారిలో పింగళి లక్ష్మీకాంతం, హరి నాగభూషణం ప్రభృతులుండేవారు. ఊళ్ళో కాటూరి వెంకటేశ్వరరావు, పింగళి నాగేంద్రరావు, కౌతా శ్రీరామశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ ప్రభృతులు తటస్థపడేవారు. ఒకవైపు జాతీయ కళాశాలా, మరో వైపు శారద పత్రికా, కృష్ణా పత్రికా ఉండేవి. అంతకన్నా వాంఛనీయమైన వాతావరణం మేధాభ్యుదయానికేం కావాలి? రామకృష్ణశాస్త్రిగారా వాతావరణంలో సాహిత్య కాలక్షేపం చేసేవారు. ఆయన మా నాన్నగారికి అత్యంత సన్నిహితుడుగా ఉండేవారు. మా నాన్నగారు ఒకే నవల- పిల్లలం మేము జబ్బునపడ్డప్పుడు, రాత్రి మా కోసం మేల్కొని కాలాన్ని వెళ్ళబుచ్చేందుకు రాశారు. మా నాన్నగారు చెబుతుంటే రామకృష్ణశాస్త్రి

గారు రాత్రిళ్ళు మా నాన్నగారికి తోడుగా వచ్చి కూచుని రాసిపెట్టేవారు. ఆ నవల పేరు 'మంగళసూత్రం.' అదో రకమైన అపరాధ పరిశోధక నవల. తరవాత శాస్త్రిగారా నవల గురించి ఎన్నో కథలు చెప్పేవారు నాకు. బందరులో మేమున్నప్పుడు నా చిన్నతనం వల్ల శాస్త్రిగారు గుర్తు లేరు.

చాలా ఏళ్ళ తరవాత యుద్ధకాలంలో మొదటిసారిగా బెజవాడలో కలిశాము. అప్పుడాయన ఏకాకిగా ఉండేవారు. బందరు వదిలేశారు. గుంటూరు, బెజవాడ-ఈ రెండు నగరాల్లోనూ ఆయన కాలక్షేపం చేస్తుండే వారు. బెజవాడలో గవర్నరు పేటలోని లక్ష్మీ టాకీసు కెదురుగా కృత్తి వెంటి వారి మేడ ఉండేది. అందులో ఓ మూల వెనగ్గా ఓ గది ఉండేది. ఆ గదిలో మద్దిపట్ల సూరి ఉంటూండేవాడు. శాస్త్రిగారు బెజవాడ వచ్చి నప్పుడల్లా సూరి గదిలో మకాం చేసేవారు. అప్పట్లో నేనూ గుంటూరులో ఉంటుండేవాణ్ణి మా కుటుంబంతోపాటు. తోచనప్పుడల్లా బెజవాడ కొచ్చే వాణ్ణి. బెజవాడలో ఆప్తులైన స్నేహితులెందరో ఉండేవారు. ముఖ్యంగా రెండు మూడు రోజులు శాస్త్రిగారితో తిరగటం. అదో ఎడ్యుకేషన్.

శాస్త్రిగారు అందరిలాగే కవిత్వంతో సాహిత్య క్షేత్రంలో కాలు పెట్టారు. ఏ కారణం వల్లనో ఆయన మాత్రం మా నాన్నగారి ప్రోద్బలం వల్ల అంటుండేవారు. కవిత్వం చెప్పటం మానేసి కథలల్లటం ప్రారంభిం చారు. ఆ ప్రక్రియ ఆయన చేతుల్లో చిత్రాతిచిత్రమైన విశిష్ట సాహిత్యాం శంగా ప్రఖ్యాతమైంది. ఆయనలో సునిశితమైన వ్యంగ్యం, ఎవర్నీ గాయపరచని అవహేళనా ఉండేవి. బి.గా చదువుకున్న వ్యక్తి కనక ఆయన ప్రతిపాదించే సాహిత్య విమర్శలను మేమంతా ఆమోదించే వాళ్ళము. బెజవాడలో ప్రతి సాయంకాలం ఆయనతోపాటు నలుగురైదు గురం వాహ్యాళికి పోయేవాళ్ళము. కృష్ణాతీరం దాకా నడిచి వచ్చేటప్పుడు బందరు కాలవ పక్కగా వచ్చేవాళ్ళము.

గవర్నరు పేటలో ఓ చిన్న పూటకూళ్ళ కొంపలో భోం చేసే వాళ్ళము. ఆ భోజనశాల ఓ కొట్లో ఉండేది. ఆ ఇంటావిడ వితంతువు. సకేశ. ఆరోగ్యంగా పుష్టిగా ఉండే విగ్రహం. వంట మాత్రం మహా రుచికరంగా ఉండేది. అచ్చం తెలుగు వంట. నేలమీద విస్తళ్ళముందు కూచుంటే ఆవిడ వంగి వడ్డిస్తూండేది- ఐరావత ద్విపకుంభ కుచకుంభ సంభారంతో. శాస్త్రిగారు తలవంచుకునేవారు ఆవిడ వడ్డిస్తుంటే. ఆయన పక్కన కూచున్న మేము ఆవిడ వంక చూస్తూ అన్నం తినేవాళ్ళము. వడ్డించటానికి వంగినప్పుడల్లా శాస్త్రిగారు ఎడం చెయ్యి విస్తరిమీద అడ్డంగా పెట్టి వడ్డించమనేవారు. తరవాత తరవాత మాకర్థం అయింది. ఆవిడకీ అర్థం అయింది. ఓసారి ఓనెలా రెణ్ణెల్ల తరవాత అదే భోజన శాలకు వెళ్ళాం. ఈసారి ఆవిడ మామూలుగా ఉంది. రవిక తొడుక్కొని ఉంది. శాస్త్రిగారు ఫకాలున నవ్వేశారు. అయితే ఏమిటో ఆ రోజున భోజనం బాగా లేదనుకున్నాం. శాస్త్రిగారు ఎక్కడన్నా అవకాశం ఉంటే నాలుగైదు జావళీ రూపంలోనో, కీర్తనలానో ఓ పాటలో రెండు మూడు పంక్తులు కాగితం మీద రాస్తుండేవారు సరదాకి. ఆయన ముత్యాల్లా అక్ష రాలు రాసేవారు. ఓసారి చాలా రోజుల తరువాత ఆయన కాగితాల్లో ఓ పాట ఉంది. అందులో రెండు మూడు పంక్తులే గుర్తు:

బొట్టులేని దాన
రట్టుసేయ తగున
రవిక లేనంత....

శాస్త్రిగారి నడిగాను-"ఈ పాట గవర్నరు పేట పూటకూళ్ళమ్మ దా" అని. ఆయన మందహాసంతో మాట్లాళ్ళేదు. ఆయనకి సాహిత్యం మీద నిశ్చితాభిప్రాయాలుండేవి. కవిత్వానికి హృదయ స్పందన ప్రధానం కాదు- అక్షర రమ్యతను ఆదరించాలనేవారు శాస్త్రిగారు. అంతేకాదు- చదివి వినిపిస్తే కర్ణపేయంగా ఉండాలనేవారు.

ఓసారి బెజవాడ వీథుల్లో సాయంకాలం పూట ఫణిభూషణరావూ, శాస్త్రిగారూ, నేనూ నడుస్తున్నాము. అది వేసవికాలం. మా వెనకాల పూలమ్మే వాడు వస్తున్నాడు.

చెండుకాని చెండుకాని
మల్లెపూల చెండుకాని
చెండుకాని చెండుకాని
మల్లెపూల చెండుకాని

అంటూ ఓ రాగ వరసలో పాడుతున్నాడు. ఆ రోజుల్లో బ్రిటిష్ వాళ్ళ హయాం. కనక అణాలుండేవి, అణాకు నాలుగు కాను లుండేవి. కానీకి మూడు దమ్మిడీ లుండేవి. దమ్మిడీకి పన్నెండు టోలీ లుండేవిట. నేను చూళ్ళేదు. ఓ మల్లెపూల చెండు ఖరీదు ఓ కానీ అన్నమాట. ఇంతకీ శాస్త్రిగారు అన్నదేమంటే మాట్లాడే ప్రతి మనిషికీ ఓ వ్యాకరణం స్వత స్సిద్ధంగా ఉన్నట్టే. వాడు పాడితే ఛందస్సు దానంతట అదే ఏర్పడు తుందని. మల్లెపూలమ్మే వాడి పాట చక్కని మాత్రా ఛందస్సుకు ఉదాహరణ.

*　　　*　　　*

**మేమంతా** బెజవాడలో కలిసి కాలక్షేపం చేస్తున్న రోజుల్లో సముద్రాల రాఘవాచారిగారు మదరాసు నుంచి నెలకో, రెణ్ణెల్లకో ఓసారి వచ్చిపోతూండేవారు. రాఘవాచారిగారికి బెజవాడలో దగ్గర బంధువు లుండేవారు కూడా. రాఘవాచారిగారు వచ్చినప్పుడల్లా మాతో కొంచెం సేపు సరదాగా అవీ ఇవీ మాట్లాడి వెళ్ళిపోయేవారు. అప్పుడాయన మదరాసులో సినిమాలకి మాటలూ, పాటలూ రాస్తుండేవారు. ఆయనకి మల్లాది ఫణిభూషణరావు సన్నిహితుడు. ఓసారి రాఘవాచారిగారు

ఊళ్ళోకి వచ్చినప్పుడు ఆయనకి సినిమా కార్యకలాపం బహుధా భార మయిందనీ, ఎవరన్నా తోడుగా ఉంటే బాగుంటుందని ఫణిభూషణ రావుతో అన్నారట. అంతే, మేమంతా - మద్దిపట్ల సూరీ, నేనూ శాస్త్రిగారిని మదరాసు బొమ్మని పంతం పట్టాం. రెండు, మూడు రోజుల తరువాత మా ప్రతిపాదనకు శాస్త్రిగారు సుముఖులయారు. ఈయన ఇష్టపడిన రోజునే రాఘవాచారిగారు మదరాసు వెళ్ళిపోయారు. మళ్ళీ ఆయన బెజవాడ వచ్చేదాకా వేచి ఉండాలనుకున్నాం.

అప్పుడు నేను గుంటూరులో 'గుంటూరు నాట్యసమితి' అని ఓ నాటక సంస్థను స్థాపించాను. సంవత్సరానికి నాలుగు నాటక ప్రదర్శన లివ్వటం - సాలు చందా పాతిక రూపాయల చొప్పున రెండు వందల మంది దగ్గర వసూలు చెయ్యటం జరిగింది. నాట్య సమితిని మా నాన్నగారు ప్రారంభించిన నాట్యగోష్ఠి ఉద్యమానికి అనుకూలంగా, అనుబంధంగా ప్రారంభించాను. మొదటి నాటకాన్ని హెరాల్డ్ బ్రిగ్ హౌసు ఇంగ్లీషులో రాసిన 'ది ప్రిన్స్ హు వజ్ ఎ పైపర్' అనే నాటకాన్ని అనుసరించి 'ప్రతిమాసుందరి' పేరుతో తయారుచేశాను. అందులో ఆరుగురు ఆడపిల్లలూ, ఓ రాజకుమారీ, ఓ దాదీ వెరసి ఎనిమిది మంది స్త్రీ పాత్ర లున్నాయి. ఇంత మంది ఆడపిల్ల లెక్కడ దొరుకుతారని నా స్నేహితులు గొడవపెట్టారు. అయినా నేను వినలేదు. చెలికత్తెల్నిద్దర్ని తొలగించి నాటకాన్ని ప్రదర్శించే ఏర్పాటు చేశాను. బెజవాడ నుంచి ఫణిభూషణరావు సహకారంతో చంద్రకళ అనే అమ్మాయిని రాజకుమారి వేషానికి ఎంపిక చేసి పట్టుకొచ్చాను.

గుంటూరులో రైలు స్టేషను వెనకాల ఓ చిన్న పెంకుటింట్లో ఓ గది అద్దెకు తీసుకున్నాము నాకు తోడుగా ఏకా అప్పారావు ఉండే వాడు. రిహార్సల్సు ప్రారంభించాము. ఆ సమయానికి గుంటూరులో యూనివర్సిటీ రిజిస్ట్రారుగా పనిచేస్తున్న కూర్మా వేణుగోపాలస్వామి

నాయుడుగారిని మా రిహార్సల్సుకు తీసికొచ్చాను. ఆయన మా నాన్న గారికి అప్పుడు స్నేహితుడు కూడాను. వచ్చీ రావటంతోటే చంద్రకళను చూసి ముగ్ధుడయిపోయాడు. మర్నాటి నుంచీ మేం పిలవకుండానే ఆయన అక్కడ తటస్థపడేవారు. నాకు కొంచెం ఇబ్బందిగా ఉండేది. తతిమ్మావాళ్ళు ఆయన పదవిని చూసి ఊరుకునేవాళ్ళు. ఎలాగైతేనేమి నాటకం ప్రదర్శించాం. గుంటూరులో ఆ ప్రదర్శనం ఓ సంచలనం రేకెత్తించిందనే చెప్పాలి. సంగీతాన్ని బొడ్డుపల్లి రవీంద్రనాథ్, యతి రాజులూ సమకూర్చారు. నాటక ప్రయోగంలో కొత్తదనం కొట్టొచ్చేట్టు కనిపించేసరికి ప్రేక్షకులు తన్మయులయ్యారు.

అయితే నాటకం జరుగుతుండగా గోపాలస్వామి నాయుడుగారు చీటికీ మాటికీ రంగస్థలం వెనక్కి వచ్చి ఎవరికీ సంబంధించని సూచన లిస్తుండేవారు. దానికితోడు ఆయన మదిరా తపస్వి కావటంచేత నిత్య తన్మయావస్థలో ఉండేవారు. నేనందుకు ఆక్షేపణ చెప్పాను. నాటకం అయింతరువాత నా సహచరులతో అలాంటి సంఘటనల్ని నేను సహించ ననీ, అవి తిరిగీ తలెత్తితే నేను నాట్యసమితి నుంచి తప్పుకుంటాననీ చెప్పాను. వాళ్ళు కిమ్మనలేదు. కాగా ఓ ఇద్దరు గోపాలస్వామి నాయుడు గారి పక్షంచేరి, నాటకాన్ని ఆయన దర్శకత్వం కింద చెయ్యాలన్నారు. నేను చడీచప్పుడు కాకుండా నా నాటకం వ్రాతప్రతితో సహా సమితి నుంచి నిష్క్రమించాను. మరో నాటకాన్ని అప్పుడే రాయటం మొదలు పెట్టాను కూడా. పల్నాటియుద్ధం మీద నాటకం రాయాలని పల్నాడంతా తిరిగొచ్చాను.

నేను బెజవాడకు పోగా, మా ఇంటికి ఎవర్నో పంపి నా పేరు చెప్పి 'ప్రతిమాసుందరి' వ్రాతప్రతిని గోపాలస్వామి నాయుడుగారు తెప్పించారు. 'మాయాసుందరి' అని పేరు మార్చి అదే నాటకాన్ని అన్ని చోట్లా నాట్యసమితిచేత ప్రదర్శించటం ప్రారంభించారు. అందులో

నా పేరులేదు. అప్పుడు మా నాన్నగారు ఎమ్.ఎన్. రాయిగారి పనుపున మదరాసులో మకాం పెట్టి, దక్షిణాన ఆయన పార్టీ స్థాపనకు ప్రయత్నాలు చేస్తున్నారు. గోపాలస్వామి నాయుడు గారు నాకు చేసిన అన్యాయానికి బాధపడ్డాను. నేను చెయ్యగలిగిందేమీ లేదు. ముక్కామల కృష్ణమూర్తి, వల్లభజోశ్యుల శివరామూ కలిసి మరో నాటక సంస్థ గుంటూరులో నిర్వహిస్తుండేవారు. కృష్ణమూర్తి నన్ను 'వసంతసేన' నాటకాన్ని రాసిపెట్టమని అడిగాడు, కాని నా మనస్సు పని చెయ్యలేదు. నేను పెట్టిన నాట్య సమితివల్ల నాకు జరిగిన అన్యాయమే పీడిస్తుండేది.

మనస్సు బాగుండనప్పుడల్లా బెజవాడ పోతుండేవాణ్ణి. అయితే అందరం నిస్సహాయులం. రామకృష్ణశాస్త్రి గారు మాత్రం ప్రతిమా సుందరిని అచ్చేయిస్తే, ఆ నాటకాన్ని ఏ రూపంలోనూ వేయించటానికి గోపాలస్వామి నాయుడు గారికి ధైర్యం ఉండదని అంటూండేవారు. కాని ప్రచురణ కర్త దొరకాలి కదా!

ఓ సారి సాయంకాలంపూట గవర్నరు పేటలో నడుస్తున్నాము మద్దిపట్ల సూరీ, నేనూ, ఫణిభూషణరావూ, శాస్త్రిగారూను. అక్కడ వెరైటీ ఏజన్సీస్ దుకాణం ఉండేది. సత్యనారాయణరావుగారు ఆ సంస్థ యజమాని. శాస్త్రిగారంటే విపరీత గౌరవం. మాకు స్నేహితులే. ఓ సారి నా గొడవ చూసి శాస్త్రిగారితో సత్యనారాయణరావుగారన్నారు: "మీరవు నంటే వరద రాజేశ్వరరావు 'ప్రతిమా సుందరి' అచ్చేయించేస్తాను".

శాస్త్రిగారు నవ్వి "ఓ రాత్రిలోపున అచ్చేయించగలిగితే ఒప్పు కుంటా" నన్నారు. అంతే. అన్ని ఏర్పాట్లూ చేశారు. శాస్త్రిగారు, సూరీ ప్రెస్సులో కూచున్నారు. శాస్త్రిగారు తొలిపలుకులు రాశారు. మర్నాడు పొద్దునే మొదటి ప్రతి తయారయింది. మరో రెణ్ణాళ్ళకు తెనాలి రత్నా టాకీసులో "మాయాసుందరి" నాటక ప్రదర్శన. శాస్త్రిగారు ఓ

పెద్ద మనిషికి 'ప్రతిమాసుందరి' రెండు ప్రతుల నిచ్చి తెనాలికి పంపించారు. అతను రత్నా టాకీసు యజమానికి ప్రతుల్ని చూపించి, అసలు కథ చెప్పి, నాటకం ఆపుచేయకపోతే పర్యవసానానికి అతనే బాధ్యుడవుతాడని చెప్పాడు. ఆఖరికి అనుకున్నంతా అయింది. నాటకం ఆగిపోయింది. నాకీ సంగతి శాస్త్రిగారు చెప్పలేదు. తెనాలిలో నాటకం ఆగిపోయిన రోజున శాస్త్రిగారు నన్ను గాంధీనగరంలోని భాను రెస్టారెంటుకి తీసుకెళ్ళారు. మరో ముగ్గురు మిత్రులున్నారు. "ఇవాళతో నీ మనస్సుకి శాంతి కలుగుతుం"దన్నారు.

ఆ తరవాత మా నాన్నగారి పర్యవేక్షణలో ప్రతిమాసుందరి నటాలి ఆధ్వర్యాన మూడు వందల నలభై రెండు సార్లు తెలుగుదేశం నాలుగు మూలలా ప్రదర్శితమయింది. అలా సాధ్యం కావటానికి శాస్త్రిగారే కారణమని నమ్మేవాణ్ణి.

* * *

"సాహితికి పరమసీమ, రూపక నిర్మాణం!

నాటక శిల్పి, భావచైతన్య లోకంలో మహామహుల రూపక కల్పనలు నిష్ఠతో అవగాహన చేసుకోవాలి.

ఇప్పుడైనా, రచనా విన్యాసానికి వరవడి దిగ్గంతులైన రూపక నిర్మాతలు తీర్చేత్రోవే! సంభాషణల పోహణికి మటుకు తనకు గురువు తానే!

-ఇది పరమాచార్యుల అనుశాసన రూపమైన ఉపదేశము,

నవ్యనాటకకర్తలలో ప్రథమ శ్రేణికి చెందిన విన్నాణికి, రచనా సరణికి కృతజ్ఞుడు కావటం శ్రీ 'వరద' కళా-రాసిక్యానికి బిరుదు.

'ప్రతిమాసుందరి' తెలుగుల్లో ఔచిత్యం, విచక్షణ, జిజ్ఞాసకు హాయిని కల్పించే స్థాయిలోది."

అంటూ నా నాటకాన్ని శాస్త్రిగారు 1942 లో పరిచయం చేశారు. ఆ నాటక ప్రచురణతో ఆ సంవత్సరం సమాప్తమవుతోంది. ఓ రెండు రోజులు సంతోషంగా బెజవాడలోనే పుస్తకం అచ్చయింది కదా అని కాలక్షేపం చేశాను. గుంటూరు పోతున్నా నన్నాను. శాస్త్రిగారు, సాయంకాలం పోదాం నేనూ వస్తాను. కొంచెం ఊళ్ళో పనుందన్నారు. పొద్దున మళ్ళీ ఆయన ఆచూకీ లేదు. సాయంకాలం సూరి గదిలో నిరీక్షిస్తున్నాను. మందహాసంతో మెల్లిగా వచ్చారు. 'ఇంత ఆలస్యం చేశారేం' అన్నాను. ఆయన మందహాసం మానలేదు. జరిగింది చెప్పారు. శాస్త్రిగారు సినిమా చూడాలనుకుని పోయారు. 'కన్నాంబదా' అని అడిగారు శాస్త్రిగారు. 'కాద'న్నాడు కన్నం అవతలివాడు. తిరిగొచ్చేస్తున్నారు. అప్పుడే ఆటవిడుపు-స్త్రీల గేటు పక్కన టిక్కెట్లు కొనేచోటు. స్త్రీలు గుంపులుగా వొస్తున్నారు. శాస్త్రిగారు పక్కకి తప్పుకుని నిలబడ్డారు. అందులో నించి ఓ ప్రౌఢ ముందుకొచ్చి శాస్త్రిగారి బుగ్గ పట్టుకుంది. "ఏం పంతులూ తేరగా ఉన్నామా, మామీద రాసెయ్యటానికి" అని మూతి విదిలించుకుంటూ పోయిందట. బందరులో పేరుపడ్డ వేశ్య కూతురు. శాస్త్రిగారు పకాలున నవ్వేశారు. "నా కథలు వీళ్ళూ చదువుతున్నారు-వీళ్ళ చదువులు మండిపోను" అన్నారు. శాస్త్రిగారి కలాంటి అనుభవం ఎప్పుడూ లేక పోవటంవల్ల కొంత చిరాకు పడ్డారు. బందరులో ఆయన పైలాపచ్చీసు వయస్సులోనూ, కథలు రాసినా, కథల్లో వింత ప్రయోగాలు చేసినా ఇలా ఎప్పుడూ జరగలేదు. ఎంతోమంది ప్రసిద్ధులయిన రచయితల్తో తిరిగారు సన్నిహితంగా. వాళ్ళలో కూడా ఇలాంటి సంఘటనల్ని ఎదుర్కొన్న వాళ్ళు లేరు. బందరులో ఉన్నప్పుడు శాస్త్రిగారు 'నా కవి మిత్రులు' అనే శీర్షిక కింద ఓ పది వ్యాసాలు కృష్ణా పత్రికలో రాశారు. అవి ఎవరన్నా సేకరించి పుస్తకరూపంలో వేస్తే బాగుణ్ణు. అంతచక్కని వ్యాసాలు తెలుగులో మళ్ళీ ఎవరూ రాయలేదు.

నేను గుంటూరు వెళ్ళిపోయాను. శాస్త్రిగారు నాతో రాలేదు. గుంటూరు చేరిన రోజునే నాకు మదరాసు నుంచి నార్ల వెంకటేశ్వరరావు గారు 'ఆంధ్రప్రభ' సంపాదకవర్గంలో చేరమంటూ ఒక టెలిగ్రామ్ ఇచ్చారు. వెంటనే మదరాసు వెళ్ళిపోయాను. అప్పుడు శాస్త్రిగారిని కలుసుకోలేకపోయాను. ఆతరవాత పిఠాపురం రాజావారి బంధువొకాయన- వెంకటరావుగారనుకుంటాను - మదరాసులో రినైజాన్స్ ప్రింటర్సు అనే ముద్రణాలయం ప్రారంభించారు. అప్పుడది పాండీబజారులో ఉండేది. అందులో ఉద్యోగానికి మద్దిపట్ల సూరి వచ్చాడు. మరి కొన్నాళ్ళకు శాస్త్రిగారూ మద్రాసు చేరుకున్నారు. సూరి లజ్‌కార్నర్‌లో ఓ చిన్న ఇంట్లో మేడమీద గదిలో ఉండేవాడు. చక్రపాణి మొదటిసారిగా వ్యాపారంలో దిగటానికి మదరాసు వచ్చినప్పుడు సూరి గదిలోనే ఉంచాము. శాస్త్రిగారు తిరుమూర్తి రోడ్డులో ఉండేవారు. నేను ఎలియట్సు రోడ్డులో మౌంటురోడ్డుకి దగ్గరగా ఉండేవాణ్ణి.

ఆ రోజుల్లో మదరాసులో ప్రసిద్ధ రచయితలు చాలామంది ఉండే వారు. అయినా శాస్త్రిగారు అలా అందరితోనూ కలిసి తిరిగేవారు కాదు. ఆయనా, శ్రీశ్రీ, నేనూ వారానికి కనీసం ఒక రోజన్నా కలిసేవాళ్ళం. మధ్య మధ్య శిష్ట్లా ఉమామహేశ్వరరావు, రుక్మిణీనాథశాస్త్రి వస్తుండే వారు. అందరికీ శాస్త్రిగారంటే గౌరవం ఉండేది.

అప్పుడే శాస్త్రిగారో పాట సినిమాకి రాశారు. శిష్ట్లా ఉమామహే శ్వరరావు శాస్త్రిగారు రాసిన పాట సన్నగా పాడి చాలా బావుందన్నాడు. శాస్త్రిగారి క్కోపం వచ్చింది. శ్రీనివాసరావూ ఉన్నాడు. శాస్త్రిగారి కోపానికి శ్రీనివాసరావాశ్చర్యపోయాడు.

"మనం ఇలా సరదాగా మాట్లాడుకుంటున్నపుడు సినిమాలకి రాసే మల్లాది రామకృష్ణశాస్త్రి గురించి మాట్లాడకండి. ఆ మల్లాది రామకృష్ణ శాస్త్రి ఎవడో నాకు తెలీదు. నేను మీ అందరికీ తెలిసినవాణ్ణి. అర్థం

అయిందా?" అన్నారు. ఎవరూ కిక్కురు మనలేదు. శాస్త్రిగారికి సినిమాల్లో చేసే వృత్తి మీద అంత అసహ్యం అన్నమాట. నిజానికి శాస్త్రిగారిలా సినిమాలకి పాటలు అల్లినవారు లేరు. అయినా ఆయన కా పని నచ్చిందికాదు. ఓసారి సాహిత్యం గురించి మాటాడుతూ ఆయన అన్నారూ, మెప్పుకోసం, ఉప్పుకోసం రాసింది సాహిత్యం కాదు, సాహిత్య ప్రయోజనం సాహిత్యమే-అని. అందులోని నిజం ఎవరికయినా నిలకడ మీద కాని తెలీదు.

నేను మదరాసు నుంచి హైదరాబాదు వెళ్ళిపోయాను. పోతున్నప్పుడు నన్నాశీర్వదించారు. మదరాసు మన కెప్పుడూ రాజధాని అయే అదృష్టం లేదు. కనీసం హైదరాబాదు అయితే, నువు ముందుగా వెళ్ళి పొమ్మన్నారు. అఖరికి ఆయన అన్నదే నిజమయినా, హైదరాబాదూ నిజంగా తెలుగు రాజధాని కాలేదు. హైదరాబాదులో ఉండగానే "కవిత" ప్రారంభించాము. శాస్త్రిగారు చాలా సంతోషించారు. మదరాసు నుంచి ఉత్తరాలు రాశారు. శాస్త్రిగారిని 'కవిత'కు రాసి పంపమన్నాను. అలాగే నన్నారు. 'కవిత' రెండు సంపుటాలే వొచ్చినయి. అంతలోకి నేను ఢిల్లీకి తరలిపోయాను. ఢిల్లీ నుంచి మదరాసు ఉద్యోగరీత్యా రెణ్ణెల్ల కోసారి పోతుండేవాణ్ణి. అయినా కార్యభారం వల్ల మదరాసులోని మిత్రులను కలుసుకోలేకపోయేవాణ్ణి.

ఓసారి శాస్త్రిగారిని చూడకుండా వెళ్ళిపోకూడదనుకున్నాను. అప్పుడు నాతో ద్వివేదుల నరసింగరావు ఉన్నాడు. అతనూ, అతని సతీమణి విశాలాక్షి మాకు సన్నిహితులు. నరసింగరావు శాస్త్రిగారిని చూడాల్నుందన్నాడు. అతని కారులో ఆ సాయంకాలం తిరుమూర్తివీధికి పోయాం. నాకు పరిచిత మయిన పాత ఇంటి రూపం మారిపోయింది. ఆ పల్లెటూరి వాలకమూ పోయింది. నన్ను చూసి శాస్త్రిగారు సంతో షించారు. అవీ ఇవీ మాట్లాడిం తరవాత మర్నాటి ఉదయమే ఢిల్లీ వెళ్ళి

పోతున్నానని చెప్పాను. ఓ రెండ్రోజు లుండకూడదా అన్నారు. వీలు కుదరదని చెప్పాను. మళ్ళీ వచ్చి చూస్తానన్నాను. నేనూ నరసింగరావూ సెలవు తీసుకుని కార్లో ఎక్కబోతున్నాము. శాస్త్రిగారు నన్ను కేకేసి "ఏమన్నా రాస్తున్నావా, కేవలం ఉద్యోగమేనా?" అన్నారు. రాయటానికి ప్రయత్నం చేస్తున్నాను - వరద రాజేశ్వరరావు అంత్యక్రియలు - అని ప్రారంభించా నన్నాను. నేను చమత్కరిస్తున్నా ననుకున్నారు శాస్త్రి గారు. అది గ్రహించి, "నిజం, నేను రాస్తున్నాను - ప్రతిపాదాంతంలోనూ క్రియ వచ్చేట్టు చేశాను. అంచాత 'అంత్యక్రియ' అయిం"దన్నాను. శాస్త్రిగా రానందంతో "అయితే ఒకటుంది వరదా! అంత్యక్రియలకి ముందుగా నా చేత చదివించు నాయనా!" అన్నారు.

అదే ఆఖరిసారి శాస్త్రిగారిని చూడటం.

# సాహిత్య అకాడమి

రమారమి ముప్పయి సంవత్సరాల కిందటిమాట. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన పదినెలల తరవాత- అప్పుడు నీలం సంజీవరెడ్డిగారు కొత్తగా ఏర్పడ్డ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉండేవారు. ఆయన బెజవాడ గోపాలరెడ్డిగారిని ఓడించి కాంగ్రెసు శాసన సభా నాయకుడుగా ఎన్నికై ముఖ్యమంత్రి అయినారు. ఆ తతంగంలో నేనూ ఒకమాదిరి కీలకపాత్ర వహించినవాణ్ణి.

వేసవికాలం, జూన్‌మాసం, ఇప్పటిలా అప్పుడంత ఎండలుండేవి కావు హైదరాబాదులో. మా నాన్నగారు వాల్తేరునుంచి వచ్చి ఉన్నారు. మా ఇంటికప్పుడే అల్లూరి సత్యనారాయణరాజుగారు నాతో పని ఉండి వచ్చారు. ఆ మాటా ఈ మాటా మాటాడిన తరవాత అప్పట్లో విద్యామంత్రిగా ఉన్న పట్టాభి రామారావుగారింటికి పోతున్నాననీ, నన్నూ రమ్మని పిలిచారు. అక్కడేవున్న మా నాన్నగారు ఓసారి పట్టాభి రామారావుగారిని తాను తిరిగి వాల్తేరు వెళ్ళేలోపున చూడాలని ఉందనీ, ఆయనతో చెప్పమనీ అన్నారు. పట్టాభి రామారావుగారూ, మా నాన్న గారూ చిరకాల స్నేహితులు. తీరా నేనూ, రాజూ పట్టాభి రామారావు గారింటికి పోయేటప్పటికి ఆయన లేరు. ఓ పదినిమిషాల తరవాత వచ్చారు.

ముఖ్యమంత్రి ఆయన్ని హఠాత్తుగా పిలిచారుట. రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాదుగారు ఆగష్టులో హైదరాబాదు వస్తున్నారుట. ఆయన రాక సందర్భంలో ప్రభుత్వం ఏదైనా కార్యక్రమాన్ని ఏర్పాటు చెయ్యాలని ముఖ్యమంత్రి పట్టాభి రామారావుగారిని అడిగారుట. రాష్ట్రంలో అప్పటి

దాకా అకాడమీల్లేవు. అవి ప్రారంభిస్తే ఎలా ఉంటుందనుకుంటున్న సమయంలో మా నాన్నగారి ప్రస్తావన తెచ్చాను. ఆనందంతో 'ఆయన ఇప్పుడెక్కడున్నారు? వెంటనే ఆయనతో మాట్లాడవలసిన పనుంది. కారు పంపుతా' నన్నారు పట్టాభి రామారావుగారు. హిమాయత్‌నగర్‌లో మా ఇంట్లోనే ఉన్నారని చెప్పాను. ఆయన కారు పంపారు. నేనూ, రాజూ కాన్ఫరెన్సయిపోయిన తరవాత బయట పడ్డాము.

మా నాన్నగారిని పిలిపించి అకాడమీలను ఏర్పాటు చేసేందుకు తగిన పథకాన్ని రూపొందించమని పట్టాభి రామారావుగారు కోరారు. ముందుగా సాహిత్య అకాడమీ లక్ష్యాలను రూపొందించి, దానికి నిబంధనావళిని తయారుచేశారు. దానికి వెంకట్రామశాస్త్రిగారు [కొమర్రాజు అచ్చమాంబగారి భర్త) న్యాయవాద వృత్తిలో ఉండటంచేత కొంత సహాయపడ్డారు. మా నాన్నగారిని ప్రత్యేక కార్యభారమ్మీద హైదరాబాదులో ఓ నెలరోజు లుండేటట్టు ప్రభుత్వం ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని కోరింది. అప్పుడు మా నాన్నగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లైబ్రేరియన్‌గా ఉండేవారు.

నెల రోజులు శ్రమించింతరవాత, తీరా సభ్యత్వం వ్యవహారం వచ్చేటప్పటికి- అందులో సాధక బాధకాలు మా నాన్నగారు గుర్తించి తనవల్ల కాదని పట్టాభి రామారావుగారితో చెప్పటం జరిగింది. తరవాత మా నాన్నగారు మదరాసునుంచి నార్ల వెంకటేశ్వరరావుగారిని పిలిపించమని పట్టాభి రామారావుగారిని అభ్యర్థించారు. మరో రెండు రోజుల్లో నార్ల వెంకటేశ్వరరావుగారు హైదరాబాదువచ్చి మా నాన్నగారితో పాటు అకాడమీలకు ఒక స్వరూపాన్ని సంతరించేందుకు ప్రయత్నం చేశారు. అధ్యక్షులుగా బెజవాడ గోపాలరెడ్డిగారి పేరును నార్ల వెంకటేశ్వరరావుగారు సూచించారు. అప్పుడాయన సంజీవరెడ్డి మంత్రివర్గంలో ఆర్థిక మంత్రిగా చేరారు. అయితే పట్టాభి రామారావుగారు సాహిత్య అకాడ

మీకి గోపాలరెడ్డిగారిని అధ్యక్షులుగా ప్రతిపాదించినప్పుడు సంజీవరెడ్డి గారు అభ్యంతరం చెప్పారుట. అప్పుడు నార్ల వెంకటేశ్వరరావుగారు కలగజేసుకుని, గోపాలరెడ్డిగారు ఆర్థిక మంత్రిగా ఉండడంవల్ల ఆయన పేరు ప్రతిపాదించటం జరిగిందనీ, అకాడమీలకు ఆర్థిక దోషం పట్ట కుండా ఉండేందుకు అలా సూచించటం జరిగిందనీ సంజాయిషీ చెప్పి సంజీవరెడ్డి గారి ఆమోదముద్ర వేయించారు. మా నాన్నగారూ, వెంక టేశ్వరరావుగారూ కలిసి ఉపాధ్యక్షులుగా విశ్వనాథ సత్యనారాయణ గారిని ప్రతిపాదించారు. ఆయన విషయంలో ఎటువంటి సంశయం కానీ, వివాదంకానీ తలెత్తలేదు. అయితే కార్యదర్శి పదవి వ్యవహారం చర్చకు వచ్చింది. ఆ పదవి పంపకాల ప్రకారం తెలంగాణా ప్రాంతానికి పోవాలి. మిత్రులు దాశరథి, నారాయణరెడ్డి ప్రభృతులు కాళోజీ నారాయణరావు పేరుని సూచించారు. పట్టాభి రామారావుగారూ, నార్ల వెంకటేశ్వరరావుగారూ ఆ సూచనకు ముందు సుముఖులుగా కనిపించారు. అయితే నారాయణరావుని నార్ల వెంకటేశ్వరరావు గారు కానీ, మా నాన్నగారు కానీ ఇదివరలో చూడలేదు. అతన్ని గురించి వారికి తెలియదుకూడాను. నారాయణరావును నేనెరుగుదును - సాహిత్యంలో అభిరుచి ఉన్నవాడూ, స్నేహపాత్రుడూ అని.

అయితే ఆ రోజుల్లో 'ఆంధ్ర సారస్వత పరిషత్తు' అనే సంస్థ తెలంగాణా ప్రాంతంలో తెలుగుభాషా ప్రచారానికి దోహదం చేస్తూవుండేది. వార్షికోత్సవాలు జరుపుకుంటూ ఉండేది. సారస్వతోత్సాహికులైన యువకులు కూడా ఆ సంస్థలో ఉండేవారు. 1949 ప్రాంతం అనుకుంటాను, తూపురాన్ వార్షికోత్సవం జరిగింది. ఆ సమావేశానికి హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వోన్నతాధికారి అయిన ఇల్లిందల రామచంద్రరావు గారు అధ్యక్షత వహించారు. ఆయన సాహిత్యంలో అభిరుచి ఉన్నవారు. ఆ సంవత్సరాంతంలో ఆయనకీ, పరిషత్తులో ప్రముఖ సభ్యులైన

దేవులపల్లి రామానుజరావు గారికీ అభిప్రాయభేదాలు వచ్చాయి. రామచంద్రరావుగారు ఆనాటి కాంగ్రెసునేత అయిన బూర్గుల రామకృష్ణారావుగారికి జామాత. రామానుజరావుగారు రామచంద్రరావుగారితో ఏర్పడిన అభిప్రాయ భేదాలను అస్కారంగా చేసుకుని రామకృష్ణారావు గారిమీదనూ యుద్ధం ప్రకటించారు. అంతలోకి రామకృష్ణారావుగారు వెల్లోడి ప్రభుత్వంలో విద్యామంత్రిగా చేరటం సంభవించింది. దాంతో రామానుజరావుగారికీ, ఆయన మిత్రులకీ భయాందోళనలు పట్టుకున్నాయి. పరిషత్తుకు రాగల ధనసహాయం ప్రభుత్వపరంగా లభిస్తుందో లేదోనని. అయితే రామకృష్ణారావుగారాజోలికి పోనేలేదు. ఆయన మహోదాత్త మనస్కులి. ఆ రోజుల్లో నే నాయన ఆంతరంగిక వర్గంలో ఉండేవాణ్ణి.

ఇంతలోకి ఎన్నికలు రావటం, తన్మూలకంగా హైదరాబాదులో మొదటి ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పడటం జరిగాయి. రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రి అయారు. అప్పుడు సారస్వత పరిషత్తుకి నూకల నరోత్తమరెడ్డిగారు అధ్యక్షుడనుకుంటాను. నరోత్తమరెడ్డీ నేనూ దగ్గరి స్నేహితులం. అఖిల హైదరాబాదు పత్రికా రచయితల సంఘానికి నేను కార్యదర్శిగా ఉన్నప్పుడు, నరోత్తమరెడ్డి కోశాధికారిగా ఉండేవాడు. రామకృష్ణారావు గారు ముఖ్యమంత్రిగా ఉండేరోజుల్లో సారస్వత పరిషత్తు భవన నిర్మాణం ప్రారంభించారని గుర్తు. ఓ రోజున నరోత్తమ రెడ్డి నా దగ్గరికొచ్చి, అప్పటి గృహమంత్రిగావున్న దిగంబరరావు బిందు గారితో నా మాట సహాయం కావాలన్నాడు. ఆ రోజుల్లో నేను బిందుగారికత్యంత సన్నిహితుణ్ణి. పరిషత్తు ఆవరణ కానుకుని ఒక పోలీసు నాకా ఉండేది. దాన్ని కూడా తమ పరిధిలోకి తీసుకోవాలని పరిషత్తు నిర్వాహకుల కోరిక. ముఖ్యమంత్రిగారి దగ్గరికి పోవటానికి నరోత్తమరెడ్డికీ, రామానుజరావుగారికీ భయం. అంచాత గృహమంత్రి ప్రత్యక్షంగా

ఆ నాకాను పరిషత్తుకు దత్తం చెయ్యగలరు. నరోత్తమరెడ్డిని తీసుకుని బిందుగారి చేత ఆ పని చేయించి పెట్టిన తృప్తి నాక్కలిగింది.

* * *

బూర్గుల రామకృష్ణారావుగారు హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రి అయిన కొన్నాళ్ళకు, సారస్వత పరిషత్తులో అంతర్లీనంగా ఉన్న విభేదాలు వీధిన పడ్డాయి. ఇంతో అంతో పేరు సంపాయించిన యువ రచయితలు, సారస్వత పరిషత్తులో తమ కనుకూలమైన వాతావరణం లేదని, మరో వేదిక అవసరమనీ భావించటంతో, పరిషత్తులో నిలువునా చీలిక ప్రస్ఫుట మయింది. అయితే, ఈ సందర్భంలో మనం ఓ సంగతి మరచిపోకూడదు. ఈ చీలికకు తూపురాన్ సమావేశాధ్యక్షులయిన ఇల్లిందల రామచంద్రరావుగారికీ, రామానుజరావుగారికి మధ్య పొడచూపిన విభేదాలే నాంది అయి కూర్చున్నాయని ఆ రోజుల్లో చాలా మంది అనుకునేవారు. దాశరథి, డి. రామలింగం, బి. రామరాజు, కాళోజీ నారాయణరావు, సి. నారాయణరెడ్డి ప్రభృతులు వేరే తెలంగాణా రచయితల సంఘం అనే కొత్త సంస్థను ప్రారంభించారు. ఆ సంఘానికి బూర్గుల రామకృష్ణారావు గారు ముఖ్యమంత్రిగా ప్రారంభోత్సవం చేశారు.

ఈ సంఘటనతో ఆంధ్ర సారస్వత పరిషత్తు తెలంగాణా ప్రాంతంలో చిన్నబోయింది. అయినా పట్టుదలతో పులిజాల హనుమంతరావు, నరోత్తమ రెడ్డిల సహకారంతో రామానుజరావు గారు సారస్వత పరిషత్తులో కూచున్నారు. ఇంతలోకి తెలంగాణా ప్రాంతం ఆంధ్ర రాష్ట్రంలో విలీనమై, బృహదాంధ్ర రాష్ట్రం ఏర్పడింది. అందులో ఆదిలోనే జరిగిన సాంస్కృతిక పరిణామాలలో అకాడమీల ఆవిర్భావం ఒకటి.

ఆ రోజుల్లో చీలికలవల్ల రామానుజరావుగారు, పులిజాల హనుమంతరావు నాకు కొంచెం స్నేహితులుగా ఉండేవారు. ఎంచేతనంటే,

నేను, మా మిత్రులు అజంతా, కుందుర్తి, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, రాయప్రోలు రాజశేఖర్, కవిరాజ మూర్తీ కలసి తెలుగు కవిత్వాన్ని ఉద్ధరించాలని కలలు కనేవాళ్ళం. అందుగ్గాను "కవిత" అనే సంపుట ప్రచురణ ప్రారంభించాము. అది మాకూ, మిత్రుడు దాశరథి, అతని స్నేహితులకూ మధ్య అర్థంకాని అపోహలకు దారితీసింది. రామానుజ రావుగారా సందర్భంగా మేమంటే ఆప్యాయతతో ఉండేవారు. అదీకాక రామానుజరావుగారికి నిర్వాహక శక్తి ఉందని నేను నమ్మేవాణ్ణి. అంచా తనే ఒకటి రెండు సందర్భాలలో బూర్గుల రామకృష్ణారావు గారి ముందు ఆయన్ని సమర్థించాను కూడా.

తీరా సాహిత్య అకాడమీ కార్యదర్శి పదవి ప్రస్తావన వచ్చేటప్పటికి నాకు రామానుజరావుగారే గుర్తుకొచ్చారు. ఆ రోజుల్లో ఆయన్నెవరూ పలకరించేవారు లేరు. ఆయనతోపాటు పనిచేసే ప్రముఖ రచయిత లందరూ పరిషత్తు నుంచి బయటపడ్డారు. అందువల్ల కాళోజీ నారాయణ రావు పేరు సూచించిన వెంటనే, నేను కలగజేసుకున్నాను. అప్పట్లో చదలవాడ పిచ్చయ్య ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్‌కు ప్రచార కార్యదర్శిగా ఉండేవాడు. అకాడమీ నిర్మాణంలో అతనూ ఆసక్తితో మా దగ్గరే ఉండిపోయాడు. విద్యామంత్రి అయిన ఎస్. బి. పి. పట్టాభి రామారావు గారికి కాని, నార్ల వెంకటేశ్వరరావుగారికి కానీ, మా నాన్న గారికి కానీ తెలంగాణాలో నెలకొని ఉన్న సాహిత్య వాతావరణం తెలియకపోవటం వల్ల, నన్ను సంప్రదించారు. నేను కార్యదర్శి పదవికి రామానుజరావు గారి పేరు సూచించి, అందరిచేత అంగీకారయోగ్యం చేశాను. ప్రత్యేకం రామానుజరావుగారున్న వసతి గృహానికి వెళ్ళి- ఆయన అప్పుడు నారా యణగూడలో క్రైస్తవ శ్మశాన నిలయం పక్కన ఓ మేడలో ఉండే

వారు— ఆయన్ని వెంట తీసుకుని వచ్చి మా నాన్న గారికి,నార్ల వెంకటేశ్వర రావుగారికీ పరిచయం చేశాను. అప్పుడు చదలవాడపిచ్చయ్య కూడా ఉన్నాడు. ఆ విధంగా సాహిత్య అకాడమీ ఆంధ్రప్రదేశ్ లో ఏర్పడింది.

అకాడమీని ప్రారంభించిన కొన్నాళ్ళకు కాళోజీ నారాయణరావు అసలు సంగతి తెలీక తికమకపడ్డమాట వాస్తవమే మరి. అతనే—

ఆకాశవీథి ఉన్మాదస్వామి
అంధపరదేశ స్వామితాగాధమి
రామకృష్ణ పట్టాభిరామ చైత్యం
రాష్ట్రేతర వేంకటేశ్వర మాహాత్మ్యం.
దిల్లిబాబు సంజీవిని తోడెచారు
తెలిసి తెలియక తలుపులు తెరిచినారు
పూజ పేరిట గట్టిరి మాటమ్మగుడి
పూజారుల మజా హడావుడికి దడి.

అంటూ రాసుకుపోయారు అతనికి నిజం తెలీక. అతనే కార్యదర్శి అయివుంటే? అదో పెద్ద ప్రశ్న.

అయితే మా నాన్నగారు రూపొందించిన అకాడమీ ప్రధాన లక్ష్యాలయిన - తెలుగుతో సమగ్ర నిఘంటు నిర్మాణం, వ్యాకరణ సంకలనం - మున్ముందుగా చేపట్టే ఆశయంతోనే కార్యక్రమాన్ని కూడా ఏర్పరిచారు. పదసూచికలూ, వృత్తి పదకోశాలు, మాండలిక శబ్దప్రయోగాలూ ప్రపథమంగా సమకూర్చిన తరవాత తెలుగునాడిప్పటికీ ఎరగని ఓ నిఘంటువూ, అత్యవసరమైన ఓ వ్యాకరణమూ ఏర్పడతాయి అని ఆశించారు. 1957 ఆగష్టు ఏడో తారీ కనుకుంటాను. బర్కతుపురా ఆంధ్ర యువతీ మండలిలో సాహిత్య అకాడమీకి రాష్ట్రపతి అయిన బాబూ రాజేంద్రప్రసాదుగారు ప్రారంభోత్సవం చేశారు. తెలుగునాట లబ్ధ

ప్రతిష్ఠులయిన సాహిత్యకారులందరూ ఆ సభను అలంకరించారు. సాహిత్య అకాడమీ లక్ష్యాలను విని ఆనాటి ప్రాజ్ఞులందరూ ఎంతో ఆశించారు. కొన్నాళ్ళదాకా, కొంత మౌలిక ప్రధానమయిన కార్యక్రమాన్ని చేపట్టి, రానురాను ఏ లక్ష్యాలతో అకాడమీ ఆరంభమయిందో ఆ లక్ష్యాలను విస్మరించి తతిమ్మా కార్యక్రమాలను అకాడమీ అధ్యక్షుల అధ్వర్యంలో తలపెట్టడం జరిగింది. అధ్యక్షులుగాని, కార్యదర్శిగాని, అకాడమీ తమంత తాము వదులుకోవటానికి ఇచ్ఛగించలేదు. నానా పుస్తకాల ప్రచురణ, ప్రెస్సు యజమానుల చుట్టూ తిరిగే కార్యక్రమం, శాలువాలు కప్పటం, తృణమో పణమో అమాంబాపతు రచయితలకు దానం చేయటమూ— ఆఖరికి రచయిత్రులకూ విడిగా సమావేశాలు నిర్వహించటమూ— ఇత్యాది కార్యభారంతో అకాడమీ సతమత మయింది. అకాడమీ మహోన్నతాశయాలను తలపెట్టిన ఎస్.బి.పి. పట్టాభి రామారావుగారు ఎన్నాళ్ళో పదవిలో లేరు. ఆ తరువాత లక్ష్య విరుద్ధంగా అకాడమీ ప్రవర్తించటంతో మా నాన్నగారు అందులోంచి తప్పుకున్నారు. ఆ తరువాత మరి కొన్నాళ్ళకు నార్ల వెంకటేశ్వరరావు కూడా వైదొలగారు. తెలుగు సాహిత్యంలోని ప్రస్తుత దుస్థితికి కేవలం అకాడమీ అవలంబించిన అనుచిత విధానాలే కారణం అని విశ్వసించే వారిలో నేను ఒకణ్ణి. ఆఖరికి దైవికంగా కొత్త ప్రభుత్వం ఏర్పడి అకాడమీని రద్దు చేసేదాకా తెలుగు సాహిత్యానికి ముక్తి లేకపోయింది.

అకాడమీ పరోక్షంగా తెలుగు విశ్వవిద్యాలయంలో ఒక అంతర్భాగంగా మళ్ళీ వెలిసింది. మళ్ళీ సన్మానాలు, శాలువాలూ ప్రారంభం! ఇప్పటి కయినా ఇవన్నీ మానేసి, ఏ లక్ష్యాలతో అకాడమీ ఆరంభమయిందో ఆ లక్ష్యాలను ఆచరణయోగ్యం చేసిననాడే తెలుగు విశ్వవిద్యాలయం తన విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చినట్లవుతుంది.

# సావిత్రినేని ముద్దుకృష్ణ

మేము ఆంధ్ర విశ్వవిద్యాలయంతోపాటు వాల్తేరు పోయిన అయిదార్నెల్లకు మా యింటి ముందో ఒంటెద్దు బండి ఆగింది. మరీ ఉదయం. అందులోంచి ఓ ముప్ఫయి అయిదేళ్ళ వయస్సు గల వ్యక్తి దిగి మా నాన్నగారిని చూడటానికి ఇంట్లోకి వొచ్చాడు.

ఆయన అంత సన్నం కాదు. లావూ కాదు. అంత పొడుగూ కాదు. కళ్ళకి ఫ్రేముల్లేని అద్దాలు. ఛాతీమీద ఎడమ చేతివేపు కాజాలు, గుండీలూ ఉన్న లాల్చీ, ముందునుంచి రెండంచులూ గోచీల కింద కట్టిన ధోవతీ. కొంచెం కోలమొహం. దూరం నుంచి చూస్తే మొహం గుండ్రంగా కనిపిస్తుంది. మొహం మీద రెండు కనుబొమల మధ్యా మచ్చ. చిన్నప్పుడు చిన్న బిడ్డ జబ్బు వచ్చినప్పుడు చుట్టతో కాలిస్తే అలా జీవితాంతం ఉండిపోయే మచ్చ. ఒక చేతిలో రెండు, మూడు పుస్తకాలూ, కుడిచేతిలో కాలే సిగరెట్టు. ఆయన ముద్దుకృష్ణ. తొలిసారి నే నాయన్ని చూడటం. అప్పటికే తెలుగులో ఆధునిక కవుల పద్యాల్ని ఎంపిక చేసి ఓ సంపుటంగా వెయ్యాలని ప్రయత్నం చేస్తున్నారు. మా నాన్నగారితో సంప్రదించటానికి వచ్చారు. అంతేకాదు, విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో అలాంటి కవితా సంకలనాలు ఆంగ్ల సాహిత్యంలో ఉంటే ఓసారి చూడాలనే కోరిక. ముద్దుకృష్ణ ఆ పూట మా ఇంట్లోనే భోంచేసి మా నాన్నగారితో పాటు విశ్వవిద్యాలయానికి వెళ్ళిపోయారు. మరో రెండేళ్ళ దాకా నే నాయన్ని చూడలేదు. అయితే ఆయన పేరు ముద్దుకృష్ణ అనీ, కవిత్వం అంటే అభిమానం అనీ విన్నాను. అంత

కన్నా ఆయన్ని గురించి నాకు తెలీదు. తెలుసుకోవాలని కోరికా కలగలేదు.

రెండోసారి ఆయన మా ఇంటి కొచ్చినప్పుడు ఆయనతో పాటు మరో బెంగాలీ ఆయన వచ్చారు. ఆయన అప్పట్లో కొంచెం కీర్తి సంపాయించినవాడు. ఆయన పేరు హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ. జైల్లో ఉండగా రాసిన పద్యాలు పట్టుకొచ్చారు. పద్యాలు రాయటం మానేసి దేశం నలుమూలలా నాటకాలు రాసి తనూ వేషం కట్టి ఆడించేవారు. అలాంటి నాటకాన్ని విశాఖపట్నంలో వేద్దామని ప్రయత్నం. నాటకం పేరు 'రిటర్న్డ్ ఫ్రం యబ్రాడ్'. మా నాన్నగారితో అవీ యివీ కబుర్లు చెప్పి నాటకం గురించి ప్రస్తావించారు. మా నాన్నగారు ప్రోత్సహించారు. మరో వారం రోజుల్లో విశాఖపట్నం టవున్ హాల్లో నాటకం వేశారు. కథానాయకుడిగా హరీంద్రనాథు, అతని చిన్న చెల్లెలుగా మా చెల్లెలూ నటించారు. నాటకంలో కథానాయకుడి స్నేహితుడిగా ముద్దుకృష్ణ, బట్లర్‌గా మొక్కపాటి నరసింహశాస్త్రి వేశారు. నాటకానికి ప్రేక్షకులుగా చాలా తక్కువ మంది వచ్చారు. అలా ముద్దుకృష్ణ హరీంద్రనాథుని ఆంధ్రదేశమంతా తిప్పి కవులందరికీ పరిచయం చేశారు.

ముద్దుకృష్ణ ఒకచోట అంటూ స్థిరంగా ఉండేవారు కాదు. తెలుగు దేశంలో కవులూ, సాహిత్యప్రియులూ ఉండే ముఖ్య పట్టణాల్లో నిత్యం తిరుగుతుండేవారు. స్నేహితులతోనే కాలక్షేపం చేసేవారు. పెళ్ళి చేసుకోలేదు. యౌవనంలో ఎక్కువగా కాకినాడ, రాజమహేంద్రవరాల్లో కాలం గడిపానని నాతో చెప్పారు. ఆ రోజుల్లో దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి, గుడిపాటి వెంకటచలం, మొక్కపాటి రామమూర్తి ప్రభృతులతో దగ్గరి స్నేహం. ముద్దుకృష్ణ కవిత్వం రాసేవారు. కాని ఎక్కువ అచ్చెయ్యలేదు. అయితే సాహిత్యంలో కాని, సమాజంలో కాని, పుస్తక ప్రచురణలో కాని, పత్రికా నిర్వహణలో కాని ఏదో కొత్త పుంత తొక్కాలని తెగ ప్రయత్నించేవారు. మేధావుల్లో తనకే నిర్దిష్టం కాని ఓ సంచ

లనం తేవాలని కుతూహలపడేవారు. విశాఖపట్నం వచ్చినప్పుడల్లా నేను చూస్తూండేవాణ్ణి. ఓ సారి "వైతాళికులు" అచ్చయిం తరవాత వచ్చారు. శ్రీరంగం శ్రీనివాసరావు నలుగురి మధ్యా ముద్దుకృష్ణని ఎద్దేవా చేశాడు— ఆ నలుగురిలో పురిపండా అప్పలస్వామి, పూడిపెద్ది వెంకటరమణయ్య, శ్రీరంగం నారాయణబాబూ ఉన్నారు — వైతాళికుల్లో అచ్చయిన గీతాలను ఎంపిక చేసింది కృష్ణశాస్త్రికాని, ముద్దుకృష్ణకాదని. ముద్దుకృష్ణకు కోపం వచ్చింది. శ్రీనివాసరావన్న దాంట్లో కొంత నిజం లేకపోలేదు.

ఆ రోజుల్లో ఆధునిక కవిత్వానికి కృష్ణశాస్త్రిగారు చేసి పెట్టినంత ప్రచారాన్ని మరెవ్వరూ చెయ్యలేదు. ఊరూర పర్యటించి ఆధునిక కవుల పద్యాల్నీ, గేయాల్నీ అద్భుతంగా పాడేవారు. వందలాది శ్రోతలు కృష్ణశాస్త్రిగారు సభలో పాడుతున్నప్పుడు తన్మయులయ్యేవారు. అలా ఆయన పాడే గీతాలే నూటికి తొంభై పాళ్ళు వైతాళికుల్లో చోటు చేసుకున్న మాట వాస్తవం. అది యాదృచ్ఛికమని ముద్దుకృష్ణ వాదన. పాల్‌గ్రేవ్ ఆంగ్లంలో కూర్చిన "గోల్డెన్ ట్రెజరీ"ని మనస్సులో పెట్టుకుని తెలుగులో "వైతాళికులు" ప్రకటించానని ముద్దుకృష్ణ అనేవారు. ఆయన ఉద్దేశించింది సఫలమయిందన్న తార్కాణం, వైతాళికులు ఈనాటి దాకా ప్రచారంలో ఉండటమే. ఎన్నో కవితా సంకలనాలు తరవాత వచ్చినా, ఒక్క వైతాళికులే చాలాసార్లు ముద్రణకు నోచుకుంది!

ముద్దుకృష్ణ మాత్రా ఛందస్సులో చిన్న ప్రయోగాలు చేశారు. అవెక్కడా గ్రంథస్థం కాలేదు. బెజవాడలో కొన్నాళ్ళు నా దగ్గర ఉన్నారు. అప్పుడప్పుడాయన రాతప్రతుల్ని చూసేవాణ్ణి. ఆయన అలా చేసిన ప్రయోగాల్లో ఓ రెండు పంక్తులు గుర్తు:

వేయర మగ్గం
నేయర

నేయర గుడ్డా
వేయర విత్తూ
చేయర
చేయర సేద్యం

అలాగే

కాయండి యువకులు
కాయండి భుజములు
కష్టంగ ఉంటుంది
కాని తప్పదు మనకు

ఇవన్నీ ఇప్పుడెక్కడ లభిస్తాయో తెలీదు. బెజవాడలో 'జ్వాల' పత్రిక ప్రారంభించి సామాజికంగా సారస్వతపరంగా సంచలనం లేవదీశారు. ఆ పత్రికలోనే శ్రీశ్రీ 'మరో ప్రపంచం' మొదటిసారిగా అచ్చయింది. ఆ పత్రికలోనే ఎవరన్నా అక్రమ సంబంధంవల్ల చాటుగా పిల్లల్ని కంటే ఆదుకుంటామని ప్రకటన ఓటుండేది. ఆ రోజుల్లో అదో విడ్డూరం.

ముద్దుకృష్ణ హరీంద్రనాథ్ ప్రోద్బలంవల్ల నాటకాల్లో కూడా వేలు పెట్టారు. 'అనార్కలీ', 'అశోకం' అనే రెండు నాటికలు అప్పటికే రాశారు. తరవాత మరికొన్ని రాశారు. అంతకు పూర్వమే గుడిపాటి వెంకటచలం 'హరిశ్చంద్ర'లాంటివి రాయటం జరిగింది.పౌరాణిక కథల్లో స్త్రీలను సగౌరవంగా చూడకపోవటాన్ని వ్యంగ్యంగా చిత్రించటం. అయితే వెంకటచలం నాటకాలు ఎక్కడా ప్రదర్శితం కాలేదు.

ఓసారి ముద్దుకృష్ణరాసిన 'అశోకం' అనే నాటకం గుంటూరులో వేయించారు. ఓ రంగంలో రావణాసురుడికి సన్నిహితంగా సీత రావటం లాంటిది ఉందని నాకు గుర్తు. ఆ రంగ ప్రారంభంలో ప్రేక్షకులు

రంగస్థలాన్ని ఆక్రమించుకుని రావణాసురుడికీ, సీతకీ మధ్య కూచున్నారు. అంతే. నాటకం ఆగిపోయింది. ముద్దుకృష్ణ తరవాత నాతో అన్నారు— ఈ నాటకాల్ని ప్రదర్శించకూడదు, ముందుగా జనంచేత చదివించి చూడవలసింది అని. మళ్ళీ అలాంటి ప్రయోగం ముద్దుకృష్ణ చెయ్యలేదు.

ముద్దుకృష్ణ సాహిత్య స్మృతుల్ని గ్రంథస్థం చేదామనుకుని కొంత రాశారు ఆయన నాతో ఉన్నప్పుడు. కాని ఆ కాగితాలు మాయమై పోయినాయి. తరువాత అడిగితే ముద్దుకృష్ణ అన్నారు: "మంచి పనే అయింది. నా స్మృతిలో నే నెరుగున్న కవులు చేసిన వెధవ పనులన్నీ గుర్తున్నాయి. వాటిని గ్రంథస్థం చేస్తే మనల్ని తిడుతుంటారు; వాళ్ళు రాసిన కవిత్వాన్ని మెచ్చుకుందాంలే" అని.

ముద్దుకృష్ణ కోసారి మిత్రులు సన్మానం చేస్తామన్నారు బెజవాడలో. మందహాసంతో "పెళ్ళి కానివాణ్ణి — నా కో మానం ఇప్పించండి— సన్మానం వద్దు" అన్నారు. అందరూ నవ్వేశారు.

ముద్దుకృష్ణ ముత్తాతగారు ముద్దు నరసింహంగారు చరిత్రాత్మకంగా చెప్పుకోదగ్గ వ్యక్తి. "హితసూచని" అనే గ్రంథాన్ని 1840 లో రాసి, పరోక్షంగా వీరేశలింగంగారికి మార్గదర్శకులయారు. అందులో స్త్రీ వితంతూద్వాహాన్ని సమర్థించారు. అంతేకాదు - శిష్టవ్యవహారికంలో ఆ గ్రంథాన్ని రాశారు. ఆయన రక్తాన్ని పంచుకున్న కారణంగా ముద్దుకృష్ణకు సంఘ సంస్కరణాభిలాషా, సాహిత్యంలో అపురూపమయిన అభిరుచీ కలగడం అత్యంత సహజం.

# తురగా వెంకటరామయ్య

మేము కొన్నాళ్ళు విశాఖపట్నంలో కురుపాం మార్కెట్టు కెదురుగా ఉన్న ఏ. బి. ఎస్. ప్రెస్సు భవనంలో వెనకవేపు ఓ భాగంలో ఉండేవాళ్ళము 1932-33 ప్రాంతం. విశాఖపట్నం మెయిన్‌రోడ్డు అది. ఇప్పటిలా ఆ రోజుల్లో ఇంత జనసంచారం ఉండేదికాదు. విశాఖపట్నం చాలా వరకు నిద్రపోతూ ఉండేది. నిద్ర నించి బయట పడ్డా మగతగా వుండేది. మనుషులు తాపీగా నడిచేవారు. ఇళ్ళు సులభంగా అద్దెకు దొరికేవి. విశాఖపట్నం పేరుకు పట్నం కాని, ఓ పెద్ద సైజు గ్రామంలా ఉండేది. శివాలయం వీధి నుంచి కేకేస్తే బురుజుపేటలో వినిపించేట్టుగా ఉండేది. ఎవరే వీధిలో ఉన్నా ఒకసారయినా మెయిన్ రోడ్డు మీదకి వచ్చి కనిపించక మానరు. అంచాత మేమున్న ఇంటి ముందు భాగంలో అగ్రహారపు బాపిరాజుగారి సత్యనారాయణ ప్రెస్సు ఉన్నా నిర్ణీత సమయమంటూ లేకుండా మా ఇంటికి స్నేహితుల్లాంటి వారూ, అభిమానులూ వచ్చిపోతుండేవారు.

ఓ రోజు పొద్దున్నే భాగవతుల నరసింగరావుగారు మరో పెద్ద మనిషిని వెంటబెట్టుకొని మా ఇంటి కొచ్చారు. భాగవతుల నరసింగరావుగారు విప్పర్తివారి వీధిలో శివాలయం వీధి చివర కానుకుని ఉన్న రెండో ఇంట్లోఉండేవారు. ఆయన కిట్టయ్య (అసలు కృష్ణయ్య పంతులు) పంతులుగారి పెద్ద కొడుకు. భాగవతుల నరసింగరావుగారికి ఇద్దరు సోదరులు. ఒకతను వెంకటరావు. ఆ రోజుల్లో ప్రసిద్ధనాటకాలను విశాఖపట్నంలో కాంట్రాక్టుమీద ఆడించేవాడు. మరో అతను నారాయణరావు. భాగవతుల నారాయణరావు మా కన్న వయసులో పెద్ద అయినా నాకూ,

మోచర్ల అనంత పద్మనాభరావుకీ, రాచకొండ విశ్వనాథశాస్త్రికీ పరమాప్తుడైన స్నేహితుడు. భాగవతుల నరసింగరావుగారి రెండో కొడుకు శంకరశాస్త్రి. ఆర్టిస్టు అయ్యాడు తరవాత. నరసింగరావుగారికి సాహిత్యాభిలాషులంటే అపార గౌరవం. పండితులంటే మరీను. పండితులకీ, కవులకీ తగిన సహాయం కాని, ప్రోత్సాహం కానీ లభించటంలేదని లోకాన్నంతా ఆయన ఈసడిస్తుండేవారు. నెమ్మదిగా మాట్లాడేవారు. నిత్య మందహాసం. ఆయన కెప్పుడన్నా కోపం వస్తుందా అని అనుకునేవాణ్ణి. ఆయన అవాళ మా ఇంటికి మరో పెద్దమనిషిని తీసుకొచ్చినపుడు నేను వీధి గుమ్మంలో ఉన్నాను. ఆ పెద్దమనిషి రోడ్డుమీదే నిలబడి ఉన్నారు. ఒకచేత్తో గొడుగు, నోట్లోచుట్టా, ధోవతి, షర్టుమీద ఓ పెను కాలరుకోటూ. చెప్పుల్లేవు. కోలమొహం, మీసం. నరసింగరావుగారు నన్ను గుర్తుపట్టి 'మీ ఇంటి పక్కనే ఏదన్నా ఇల్లు అద్దెకుందా' అని అడిగారు. దూరంగా నిలబడ్డాయన నా వంక చూస్తూ దగ్గరి కొచ్చి 'ఇది అబ్బూరివారున్న ఇల్లు. ఇక్కడ ఖాళీలు లేవని తెలుసు'నన్నారు నవ్వుతూ, 'అలానా' అంటూ నరసింగరావుగారు వెనక్కి తిరిగారు. అసలు కథేమిటంటే, ఎవరో తెలీకుండా, ఆ పెద్దమనిషి అద్దె కొంపకోసం వెతుక్కుంటూ నరసింగరావుగా రింటికి వెళ్ళటమూ, నరసింగరావుగా రాయన భోగట్టా రాబట్టేసి, ఆయనంటే ఆ క్షణంలోనే అభిమానించి, ఆయన్ని వెంట బెట్టుకొని ఇల్లు వెతకటమూ ప్రారంభించారు. తరవాత తెలిసింది. ఆ వచ్చినాయన పేరు తురగా వెంకటరామయ్యగారని. తురగా వెంకటరామయ్యగారి పేరు ఈనాటి తరం వినే ఉండరు. ఆ రోజుల్లో ఆయన పేరు సాహిత్యవర్గాల్లో ప్రసిద్ధంగా ఉండేది. ఆయన ఎక్కువగా గేయాల్ని రాసేవారు.

ఓసారి విజయనగరం వెళ్ళాను. అరవిందుని శిష్యులయిన తిరుపతిగారు నన్ను విజయనగరం తీసుకుపోయారు. తిన్నగా ద్వారం వెంకట

స్వామినాయుడు గారింటికి వెళ్లాము. నాయుడుగారు ఫిడేలు వాయిస్తున్నారు. ఓ పదిమంది ఆయన చుట్టూ కూచుని ఆయన సంగీతానికి ముగ్ధులైపోయి మా రాకను గమనించలేదు. వాళ్ళలో శ్రీరంగం నారాయణబాబు కూడా తాళం వేస్తూ తల ఊపుతూ కూచున్నాడు. మమ్మల్ని చూడటంతోటే నాయుడుగారు మందహాసంతో కూచోమన్నారు. ఓ రెండు నిమిషాల తరవాత నాయుడుగారు లేచి వరండాలోకి వచ్చి చుట్ట కాల్చి ఆనందిస్తూ నన్ను పలకరించారు. వెనకాలే నారాయణబాబు వచ్చాడు. అతనూ వరండాలో ఓ కూనిరాగం తీస్తూ పచార్లు చేస్తున్నాడు,

"లోకాలు నా కేలనే

కోకిలా

బాలకృష్ణుడే చాలునే"

అనే గేయాన్ని అద్భుతంగా పాడుతున్నాడు. నేను చటుక్కున వెనక్కి తిరిగాను. నారాయణబాబు నాతో "వరదా, తురగా వెంకటరామయ్యగారి గీతం ఇది- విను" అన్నాడు. ఆ తరవాత కాసేపటికి అందరం లోపలికి పోయాం. నాయుడుగారు ఫిడేలు తీసుకున్నారు. ఫిడేలుమీద 'లోకాలు నా కేలనే' అన్న గేయాన్ని వాయిస్తున్నారు. అందరూ ఆశ్చర్యచకితులయినారు. ఆయన కొంత వాయించి "నారాయణ బాబూ, తరవాత....?" అన్నారు. నారాయణబాబు తతిమ్మా చరణాలు అందించాడు. అదీ నాయుడుగారి పద్ధతి. ఎవరినన్నా ప్రశంసించాలంటే తన ప్రతిభతో సత్కరించేవారు. అలాంటి గౌరవానికి నాకు తెలిసినంతలో తురగా వెంకటరామయ్యగారే నాయుడిగారి దృష్టిలో అర్హత సంపాయించారు.

తురగా వెంకటరామయ్యగారు దార్రిద్యాన్ని అనుభవించారు. అయితే ఆయన ముఖంలో ఎల్లప్పుడూ ఓ కొంటెతనపు చిరునవ్వు తాండ

విస్తుండేది బసవరాజు అప్పారావుగారి తరువాత గేయరచనలో సిద్ధ హస్తులయినవారు వెంకటరామయ్యగారే. గేయంమీదా, గేయంలో అంత ర్లీనమయిన లయమీదా ఆయన సంపాదించిన అధికారం మరెవ్వరూ సంపాదించలేకపోయారు. శ్రీరంగం శ్రీనివాసరావు మీద కూడా వెంకట రామయ్యగారి ప్రభావం లేకపోలేదు. వెంకటరామయ్యగారి రచనలో పొల్లు కనిపించదు.

దున్నరా యీ భరత భూమిని
తొలకరించిన పుణ్యభూమిని
కరువులేనీ స్వర్గ రాజ్యపు
దొరవు నీవయ్యేదవురా

ఇలాంటి గేయాల్ని నా విద్యార్థి దశలో ఊరేగింపుల్లో పాడేవారు. అయితే వెంకటరామయ్యగారికి కీర్తికాంక్ష లేదు. ఓసారి ఖాదీభాండారులో పురిపండా అప్పలస్వామీ, శ్రీరంగం శ్రీనివాసరావూ, చెలికాని సత్య నారాయణ ప్రభృతులు కూచుని ఉన్నప్పుడు వెంకటరామయ్యగారు చూరువేపుకి చూస్తూ "ఏదో రాస్తున్నాము. ఇంత తిండి పెడుతుందా?" అని నవ్వుతూ అన్నారు. నేనప్పుడు మూడోఫారం చదువుతున్నాను. అప్పలస్వామి నా వంక చూసి "వెంకటరామయ్యగారి మీద ఓ పద్యం చెప్పూ" అన్నారు. నేను తడుముకోలేదు:

తురగా వెంకటరామయ!
కొరగాని కవిత్వ మేల కొలిచెదవయ్యా....

అని ప్రారంభించాను. అందరూ గొల్లుమన్నారు. వెంకటరామయ్య గారు నా తల నిమిరి "పద్యం బాగుండకపోయినా, నిజం చెప్పావు నాయనా!" అన్నారు.

ఆ రోజుల్లో 'జాబిల్లి' అని ఓ లిఖిత పత్రిక పిల్లలకోసం ప్రారంభించాను. ప్రారంభోత్సవ సంచికకు ముఖపత్రం మీద ఓ పద్యం ఉండాలని నా కోరిక. ఓ రోజున ఆకస్మాత్తుగా వెంకటరామయ్యగారు కనిపించారు కురుపాం మార్కెట్టు దగ్గర. ఆయన్ని పట్టుకుని వదల్లేదు. ఏమన్నా రాసి పెట్టమని ప్రాధేయపడ్డాను. ఆయన నవ్వుతూ చుట్ట ఎడమ చేతో పట్టుకుని-

**ఆడుకొనుము పాడుకొనుము**
**ఆనందముతో వత్సా!**
**తెలుగు తల్లి దీవెన లం**
**దించి మెచ్చగన్!**

అని రాసి ఇచ్చారు. గేయం ఆయనకు వశప్రాయం. ఆయన కవితాశక్తి అత్యున్నతమయింది. ఇప్పటికయినా ఎవరన్నా ఆయన కావ్య సంకలనానికి పూనుకుంటే పుణ్యాత్ములవుతారు. తెలుగు సాహిత్యాన్ని మరింత ఉన్మీలనం చెయ్యగలరు.

# పురిపండా అప్పలస్వామి

మా చిన్నతనంలో మా ఇంట్లో ఖద్దరే వాడేవాళ్ళము. ముఖ్యంగా ఉప్పుసత్యాగ్రహం ఆరంభమయిన రోజుల్లో - మా అమ్మగారు బెజవాడలో అయ్యదేవర దుర్గాంబగారి నాయకత్వం కింద సత్యాగ్రహం కూడా చేశారు. ఇంట్లో రాట్నం, తకిలీలు, తయారయి కూచున్నాయి. పిల్లలం ఎవరికి తోచినట్టు వారు నూలు వడికేవారం. కొన్నాళ్ళకు దీన్నంతా తీసుకుపోయి నేయించేవారు మా నాన్నగారు. అలా తయారైన గుడ్డ ఓ అపురూపమయిన గోనెగుడ్డలా ఉండేది. మా చొక్కాలూ, లాగులూ, దాంతోనే కుట్టించేవారు. అలా బట్టలు వేసుకుని తిరుగుతుంటే మా వీథిలో అందరికీ విడ్డూరంగా ఉండేది. మాకు మాత్రం గర్వంగా ఉండేది. అన్నిచోట్లా ఛాతీ విరుచుకుని తలెత్తి తిరుగుతూ ఉండేవాళ్ళము.

వాల్తేరు వచ్చిన కొత్త రోజుల్లో మా నాన్నగారు విశాఖపట్నంలో ఖద్దరు దుకాణం కోసం వెతకటం మొదలుపెట్టారు. అక్కడో ఖాదీ భాండారం ఉన్నదని విన్నారు. ఓ రోజు కుటుంబంతో సహా వాల్తేరు నుంచి విశాఖపట్నం బయలుదేరాం. ఓ పెట్టెబండిలో కూచుని పోగా పోగా మెయిన్ రోడ్డు అంతా గడిచిం తరవాత శివాలయం వీథి కానుకుని ఖాదీ భాండారం ఉంది. బండి ఆగింది. అందరం దిగి లోపలికిపోయాం. దుకాణం చిన్నది. అక్కడ బల్లవెనకాల ఓ ముప్ఫయి సంవత్సరాల వ్యక్తి కూచుని ఉన్నారు. ఆయనకి మీసాలు, ఎడంవేపు పాపట దువ్విన జుట్టు, కొంచెం కళ్ళు పెద్దవి. విశాలమయిన ముఖం. ఆయనే ఆ దుకాణానికి యజమాని.

ఆయన ముందు బల్లవెనక ఓ పొడుగుపాటి బల్ల ఉంది. దాని మీద ముగ్గురు, నలుగురు వ్యక్తులు కూచుని ఎదురుగా ఉన్న వ్యక్తితో మాటాడు తున్నారు. మేము దుకాణంలో ప్రవేశించగానే ఆ వ్యక్తిలేచి నిలబడి మా నాన్నగారిని లోపలికి ఆహ్వానించారు. మా నాన్నగారు అక్కడ ఉన్న గుడ్డల నన్నిటినీ చూసి చివరికి కొన్ని కొన్నారు. ఆ వ్యక్తి వాటిని ఖరీదు కట్టి బిల్లు తయారుచేశారు. మా నాన్నగారు డబ్బిచ్చేశారు. బట్టల కట్టను తీసుకుని దుకాణం నుంచి బయటికి పోతున్న సమయంలో ఆ దుకాణం ఆయన మా నాన్నగారిని వెనక్కిపిలిచి - "ఈ బిల్లుమీద తమ పేరు రాస్తే సంతోషిస్తాం" అన్నారు.

మా నాన్నగారు తడుముకోకుండా "అబ్బూరి రామకృష్ణరావు, ఆంధ్రా యూనివర్శిటీ, వాల్తేరు" అని రాశారు.

మేం బయటికొచ్చేశాం. చివరన నేను నిలబడి ఖాదీ భాండారంలో ఉన్న వ్యక్తుల్ని చూస్తూ నడుస్తున్నాను. మా నాన్నగారు రాసింది ఆ వ్యక్తి చూసి, ఎదుటకూచున్న వాళ్ళకి చూపిస్తున్నారు. ఇంతలోకి మేము బండి ఎక్కాము. ఆ దుకాణంలో ఉన్న వ్యక్తీ, అక్కడ కూచున్న వాళ్ళూ అమాంతం మా బండి దగ్గరకొచ్చి మా నాన్నగారిని పలకరించి నమస్కరించి, వాల్తేరులో మేం ఎక్కడుండేది కనుక్కున్నారు. బండి కదిలింది. తరవాత తెలిసింది. ఆ దుకాణంలో కూచున్న వ్యక్తి పురిపండా అప్పలస్వామి. ఎదురుగుండా కూచున్నవారు చెలికాని సత్యనారాయణ, పూడిపెద్ది వెంకటరమణయ్య, కాఖూరి వెంకటనరసింగరావు.

ఆ తరవాత కొన్నాళ్ళకు పురిపండా అప్పలస్వామి శ్రీరంగం శ్రీనివాసరావునూ, సబ్నవీసు సత్యకేశవరావునూ, కాఖూరి వెంకటనరసింగరావునూ వెంటబెట్టుకుని మా ఇంటికొచ్చారు. అప్పలస్వామిగారితో మా పరిచయం అలా ప్రారంభమయింది. ఆ రోజుల్లో అప్పలస్వామిగారు 'కళాపహాడు' అనే ఒరియా నాటకాన్ని తెలుగులోరాసి ప్రకటించారు. మరోటి మహమ్మదు ప్రవక్త జీవితం రాశారని గుర్తు. వావిళ్ళవారు

ప్రచురించారు. ఆయన ఆ రోజుల్లో "భావకవిత్వ" ధోరణిలో పద్యాలు రాసేవారు. ప్రణయం, విరహం, వేదనా- ఇత్యాదయః ఎక్కువగా కృష్ణశాస్త్రి ప్రభావం.

మేము వాల్తేరునుంచి విశాఖపట్నం మకాం మార్చినప్పుడు విధిగా రోజూ ఆయన్ని కలుసుకుంటూ ఉండేవాణ్ణి - ఇంట్లోకాని, ఖాదీ భాండారంలో కాని. ఇంట్లో సబ్బుపీసు సత్యకేశవరావుగారి దగ్గర ఆ వయస్సులో ఇంగ్లీషు నేర్చుకునేవారు. ఖాదీ భాండారంలో ఎప్పుడు చూసినా ఎవరో ఒకరు- రచయితలు కొలువుదీర్చి కూర్చునేవారు. నే నప్పటికే కవిత్వం రాయటం ప్రారంభించటంవల్ల అప్పలస్వామిగారు అలా వచ్చిన వారందరికీ నన్ను పరిచయం చేసి శ్లాఘిస్తూ ఉండేవారు. ఆ రోజుల్లో సాహిత్య క్షేత్రంలో అయనే నన్నెక్కువగా ప్రోత్సహించింది. ఆధునిక కవుల వివిధ రచనలు చక్కగా ఎలుగెత్తి పాడి నాకు వినిపించే వారు. అయన కొత్తగా ఏమన్నా రాస్తే ముందస్తు నాకు వినిపించ వలసిందే. నే నంటే అయనకంత అభిమానం ఉండేది.

ఆయన మెయిన్‌రోడ్డువెనక శివాలయం వీథి కెదురుగా కొల్లూరి వారింటి కానుకున్న ఓ ఇంట్లో ఉండేవారు. అప్పుడోసారి భయానక మైన వర్షం రాత్రిపూట కురిసింది. కనీవిని ఎరగని ఉరుములూ, మెరు పులూ. ఆ రాత్రి అప్పలస్వామిగారు పడుకున్న గది గోడవీథికానుకుని ఉన్నది- ఆ గోడమీద పిడుగుపడి ఓ భయంకరమైన మెరుపు ఆయన మీదుగా పోయి ఎదుటిగోడకు కన్నం వేసింది. ఆ సమయంలో ఆ అపు రూపమైన అనుభవానికి చలించక మనస్సులో ఓ గీతాన్ని అప్రయ త్నంగా కల్పన చేశారు. ఆ మర్నాడే కాగితంమీద పెట్టారు. ఇంతలో ఆ ఇంట్లో జరిగిన వైపరీత్యాన్ని ఊరుఊరంతా వచ్చి చూసింది. ఆయన రాసిన గీతం తరవాత అచ్చయింది. 'సౌదామని' అనే పేరుతో తన పద్యసంకలనాన్ని అచ్చువేయించాలని ఆయన చాలాకాలం సంకల్పిం చారు. అది కుదరలేదు.

దానికో కారణం ఉందని నే ననుకుంటాను. 'సౌదామని' కి కట్ట మంచి రామలింగారెడ్డిగారి చేత ఉపోద్ఘాతం రాయించి పెట్టవలసిందని మా నాన్నగారిని అప్పలస్వామిగా రడిగారు. మా నాన్నగారు వ్రాత ప్రతిని రామలింగారెడ్డి గారికి పంపించారు, రామలింగారెడ్డి గారను కున్నారు- రామకృష్ణరావా వ్రాతప్రతితోపాటు తన అభిప్రాయాన్ని ఎందుకు పంపలేదు- అని. అందువల్లనో దేనివల్లనో రామలింగారెడ్డిగారు ఆ వ్రాతప్రతిని తిరిగి పంపలేదు. అప్పలస్వామిగారు తన్ముద్రణ వ్యవహారాన్ని మళ్ళీ తలపెట్టలేదు. కానీ వాటిలో కొన్ని గీతాలు శ్రీరంగం శ్రీనివాసరావు ఇంగ్లీషులోకి తర్జుమా చేయగా ఓ చిన్న పుస్తకంగా అచ్చయింది.

అప్పలస్వామిగారు నిజంగా సాహిత్యానికి అంకితమయిన జీవి. ఎంతమందినో రచయితలను స్వయంగా ప్రోత్సాహించినవారు. అందులో శ్రీశ్రీ ఒకడు. అప్పలస్వామిగారు పద్యరచన మానేసి మాత్రా ఛందస్సును స్వీకరించి కొన్ని అపురూపమైన ప్రయోగాలు చేశారు. "మల్లెమడుగు" అనే గేయం నాలుగుకాలాల పాటు నిలుస్తుందని నా విశ్వాసం.

ఓ యాభయ్యేళ్ళ క్రితం విశాఖపట్నంలో కవుల ఛాయాచిత్ర ప్రదర్శనాన్ని మొదటిసారిగా అప్పలస్వామిగారు నిర్వహించారు. ఆయన స్మృతికి నివాళిగా ఆ ఛాయాచిత్రాలను, మరికొన్నిటితో కలిపి ఓ చక్కని గ్రంథరూపంలో ముద్రించవలసిన బాధ్యత ఆయన స్నేహితుల మీద ఉంది.

# నళినీ కుమార్

నేను ఇంటర్మీడియటు చదువుతున్న రోజులు. మొదటి సంవత్సరం. మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాల తరఫున వక్తృత్వపు పోటీకని విజయనగరం మరికొంతమంది సహాధ్యాయులతో వెళ్ళాను. అక్కడ మాకన్న వయసులో పెద్దవాడూ, కొంచెం ఆజానుబాహువూ అయిన ఓ వ్యక్తి ఆ ఊరి కళాశాల నుంచి పోటీకి వచ్చాడు. పోటీలో మా జట్టే గెలిచింది. ఆ సాయంకాలం అతను మా విడిదికి వచ్చాడు. అతని పేరు ఉండవల్లి సూర్యనారాయణ. అలా అతనితో పరిచయం. ఆ ఏడు మేం వెళ్ళిన ప్రతి కళాశాలావరణంలోనూ తిరిగి అతన్ని చూడటం తటస్థించింది. కాకినాడలో కృష్ణశాస్త్రిగారు భోజనానికి పిలిచారు. భోంచేసి వాకిట్లోకి వొచ్చేటప్పటికి అతను కూచుని ఉన్నాడు శాస్త్రిగారి దర్శనం కోసం. ఆ రోజుల్లో అతను ధోవతీ, షర్టూ వేసుకునేవాడు. కళాశాల వేదికమీద మాతో వాదానికి వచ్చినప్పుడు ఉత్తరీయం కూడా వేసేవాడు. అత న్నలా ఎరుగుదును.

తరవాత మళ్ళీ యుద్ధకాలంలో బెజవాడలో చూశాను. మనిషి కొంచెం మారిపోయాడు. అతనే కాని పేరు నళినీకుమార్ అన్నాడు. నా కాశ్చర్యం వేసింది. మనం విజయనగరంలో కలుసుకున్నాం కదా అన్నాను. అతను నవ్వుతూ 'అదో జన్మ' అన్నాడు. అప్పట్నించీ సూర్యనారాయణ అంతర్ధానమయిపోయాడు- ఒక్క నళినీకుమారే అందరికీ తెలుసు. అత నందరికీ సన్నిహితు డయాడు- ముఖ్యంగా కవులకూ, సాహిత్య శ్రేయోభిలాషులకూ. మధ్య మధ్య ఏవేవో వ్యాపారాలు చేస్తున్నానంటుండేవాడు. మా నాన్నగారికి చాలా ఆప్త

డయాడు. మేము మదరాసులో "నటాలి" నిర్వహిస్తున్న రోజుల్లో మాతో తిరుగుతుండేవాడు. అప్పుడు శ్రీరంగం శ్రీనివాసరావు నటాలిలో ఉద్యోగం చేసేవాడు. అంచాత ప్రతి సాయంకాలం నేనూ, అతనూ, శ్రీశ్రీ కలిసి తిరిగేవాళ్ళం.

ఆ రోజుల్లో శ్రీశ్రీ తన గీతాల్ని ఓ సంపుటంగా వెలువరించాలని కలలు గా సేవాడు. ప్రచురణకర్త దొరికేవాడు కాదు. యుద్ధపు రోజులు. డబ్బున్నా కాగితం కరువయిపోయింది. అందులో శ్రీనివాసరావుకి తన పుస్తకాన్ని ఎవరూ కనీవినీ ఎరగనట్టుగా అందంగా అచ్చు వేయించుకోవాలని ఉండేది. ఓ రోజున శ్రీనివాసరావుకి ఓ సూచన చేశాను- పుస్తకం ధర నిర్ణయించి, ముందుగా ఓ అయిదు వందలమంది దగ్గర డబ్బు వసూలు చేద్దామని. నేనూ, నళినీ, అచ్చు రహస్యం తెలిసిన మరో పెద్దమనిషీ కూచుని పుస్తకం ధర పదిరూపాయలని నిర్ణయించాం- శ్రీనివాసరావు ఒప్పుకున్నాడు. నేనూ, శ్రీనివాసరావూ కలిసి వసూళ్ళకి బయలుదేరాం. మొదటి రోజున కష్టంమీద ముగ్గురి దగ్గర వసూలు చేశాం. అయితేనేం? ఆ సాయంకాలమే ఓ బార్‌లో తగలేశాం. ఒప్పందం ప్రకారం అలా వసూలయిన డబ్బుని నళిని కిచ్చేస్తే పుస్తకాన్ని అచ్చేయించే బాధ్యత అతనవుతుందన్నమాట. మేం ముగ్గురం కలిసి, ఈ పద్ధతి బాగులేదని, ఆ కార్యక్రమానికి తిలోదకాలిచ్చాము. మరో ఆరేళ్ళకిగాని "మహాప్రస్థానం" వెలుగు నోచుకోలేదు. ఆఖరికి నళిని శ్రీనివాసరావు గీతాల్ని పుస్తకరూపంలో పట్టుకొచ్చాడు. ఈ లోపున విశ్వనాథ సత్యనారాయణగారు తమ రసతరంగిణీ ప్రెస్సులో "మహాప్రస్థానం" అచ్చువేయించి పెడదామని చూశారు. ఎలాగయితేనేం "మహాప్రస్థానం" నళిని ధర్మమా అంటూ నలుగురి చేతిలోనూ పడ్డది.

నళిని కూడా కవిత్వం అల్లాలని ప్రయత్నం చేసినవాడే. జీవితంలో ఎన్నో ఒడుదుడుకులు చూసినవాడు. తెగించి జీవితంతో

సాహసోపేతమయిన ప్రయోగాలు చేసినవాడు. ఎప్పుడూ ఏడుపు మొహం పెట్టనివాడు. మా నాన్నగారి ఛత్రచ్ఛాయ కింద వచ్చిన వాళ్ళంతా అలాంటివాళ్ళే. జీవితం వికృతి అని భావించేందుకు అలవాటుపడ్డవాళ్ళే.

నళిని తన గొంతు విప్పి పాడుకోవటానికి చాలా కాలం పట్టింది. "మహాప్రస్థానం" ప్రచురణ అనంతరం మరో ఏడెనిమిదేళ్ళ కను కుంటాను- 'పణవిపణ్ణి' అనే తన కావ్యాన్ని వెలువరించాడు. అప్పుడు నేను ఢిల్లీలో ఉండేవాణ్ణి. మొదటిసారిగా ఆ పుస్తకాన్ని విప్పి ఓ రెండు గీతాలను చదివేటప్పటికి నా మనస్సు పది పదిహేడు సంవత్సరాల క్రితపు మదరాసు నగరంవేపు పోయింది. నళినికి ఎలాంటి క్లిష్ట పరిస్థితు లలోనయినా- ముఖ్యంగా ఆర్థికపరం అయినవి మహా సులభంగా బయట పడగల నేర్పుంది.

ఓసారి నేనూ, నళినీ, వేణూ, (మావిళ్ళపల్లి వేణుగోపాలరావు- ప్రస్తుతం ఢిల్లీలో ప్రముఖ అంతర్జాతీయ వార్తా సంస్థ ప్రతినిధి) శ్రీనివాసరావూ కలిసి మౌంటు రోడ్డులో చిన్నసైజు బారులోకి వెళ్ళాం. మా దగ్గిర డబ్బుల్లేవు. నళిని నవ్వుతూనే ఏం కావాలో అది తెప్పిస్తు న్నాడు. మేం ముగ్గురం నళిని మీద భారం వేసి కూచున్నాము. కొంత సేపటికి బేరర్ బిల్లు పట్టుకొచ్చాడు. నళిని నవ్వుతూ లేచిపోయాడు- మాకు కొంచెం భయంవేసిన మాట వాస్తవం. ఎంతసేపటికీ నళిని రాడు. రెండు, మూడుసార్లు బేరర్ వచ్చి పోయాడు. మెల్లిగా నళిని ఓ కూని రాగం తీస్తూ మేం కూచున్న దగ్గరికి వచ్చాడు.

**కపట ద్యూతము జీవిత**
**కార్యకలాప మ్మంతయు-**
**ఆడెను నిషధుడు, ధర్మజు**
**డాడెను, నే నాడితిని.**

నవ్వుతున్నాడు నళిని. మొత్తం మీద మమ్మల్ని బయటపడేశాడు. అది వేరే కథ. ఆ నాలుగు పంక్తులతో ప్రారంభమయి ఉంటుంది తరవాత అతను కూర్చిన 'పణవిపణి.' పణవిపణి' ఉత్తరాధునిక కవిత్వంలో మొదటి పూర్ణకావ్యం అనేది మనం మరచి పోకూడదు. శ్రీనివాసరావు కూడా అలాంటి ప్రయత్నం చేసి మానేశాడు. 'పణవిపణి' ఒక చక్కని ప్రయోగం. చిత్తశుద్ధితో చేసిన ప్రయత్నం. శ్రీనివాసరావే 'పణవిపణి' గురించి నళినికి రాస్తూ "నీ హృదయం కొంతలో కొంత నే నెరుగుదును. అందరి ఆవేదన చక్కగా స్పష్టపరిచావు కదంతొక్కే నీ గేయాలలో. ప్రాచీన నవీన రచనా ధోరణుల మధ్య సౌష్ఠవమైన వంతెనగా నిలుస్తుంది. హృదయోద్గారి నీ కవిత!" అన్నాడు.

'పణవిపణి'లో కొన్ని చరణాలు చదివిన వారి కెవరికయినా కంఠగతం కాకపోవు.

ముండ్లు లేని గులాబీల
చెండ్లకు దారమ్ము లేదు;
క్రీనీడలు లేని వెలుగు
తానీషాలైన కనరు !

శ్రుతి కలియని పాటలతో
బ్రతుకంతయు చితికినది-
ఏనాటికి వ్రాసినదో
యీనాటికి సుఖాంతమ్ము !

యాచకులై యెంచుకొనగ
నవకాశము కోరుటెట్లు ?
జీవులెల్ల యాచకులే
జీవన మొక కబళమ్ము!

ఇలా చాలా ఉన్నాయి. ప్రచారవేదిక లేకపోవటంచేత కాబోలు నళిని గీతాలు ఎంతమంది చదివి ఉంటారు? ఆఖరిసారిగా అతన్ని 1959లో అనుకుంటాను ఢిల్లీలో మా ఇంటికొచ్చి, ఆ సాయంకాలం పన్యాల రంగ నాధరావు ఇంట్లో కావ్యగానం చేసినప్పుడు చూశాను. ఆ సాయంకాలం పాడిన వైనం ఇప్పటికీ శ్రవణ వేద్యమే!

# శ్రీరంగం నారాయణబాబు

**విశాఖపట్నంలో** కవితాసమితి వార్షికోత్సవం జరుగుతోంది. ఇప్పటికి అర్ధ శతాబ్దంపైన. టవున్‌హాల్లో గిడుగు రామమూర్తి పంతులు గారు అనర్గళంగా తెలుగు భాషానుశాసనం మీద ఉపన్యసిస్తున్నారు. సాయంకాలం. కొంచెం చీకటి పడుతుండగా పంతులుగారు కరతాళ ధ్వనుల మధ్య ఉపన్యాసం ముగించారు. ఆ తరవాత కార్యక్రమం సమావేశానికి వచ్చిన కవుల కావ్యపఠనం. ఈ లోపున కాసిని మంచినీళ్ళు తాగివద్దామని మేడ దిగి కిందికిపోయాను. కాసేపయింతరవాత మెల్లిగా మెట్లెక్కి- సభ జరుగుతున్న హాల్లోకి పోతున్నాను. ఇంకా మెట్లమీద ఉండగానే పైనించి ఒకాయన- కొంచెం పరిచిత కంఠం- పాడుతున్నాడు.

నీ చిరుపెదవుల నడుమను
పూచిన పూవుల పోలిక
దరహాసం బిసుమంతయు
తరలిపోదురా!

మెట్లమీద నిలబడి చెవులు రిక్కించి వింటున్నాను. ఆ పాట నాదే- నేను రాసిందే!

సెలయేరుల కలకలముల
చిరుగాలుల మృదుగీతల
మంజులమగు నీ పలుకులె
మదికి దోచురా!

నా ఆనందానికీ, ఆశ్చర్యానికీ అవధి లేకపోయింది. హాల్లోకి కాలు పెట్టాను. వేదికవంక కూడా చూశ్శేదు. కొంచెం సిగ్గూ, భయమూ. తల వంచుకుని నేను కూచున్న చోటికి పోతున్నాను. అప్పటికి పాట ఆగి పోయింది. కరతాళధ్వనుల మధ్య నేను చతికిలబడ్డాను.

వేదిక మీదనుంచి నా వంక చూస్తూ "ఆ కుర్రవాడే ఈ పాట రాసింది" అన్నాడు పాటపాడిన వ్యక్తి.

కవిగారు నన్ను లేచి నించోమన్నారు. నేను లేవగానే హాల్లో మళ్ళీ కరతాళ ధ్వనులు. నా పాటలు పాడింది ఓ యువకుడు. మెడ దిగజారిన జుట్టూ, చెంపలమీదికి నున్నగా దువ్వుకున్న గిరజాలూ, చిన్న చిక్కనిమీసం, కళ్ళకిజోడు, ఛాతీకి ఎడంవేపు కాజాలతో లాల్చీ, బెంగాలీ ధోవతీనూ - అతనే శ్రీరంగం నారాయణబాబు. ఆ రోజుల్లో పద్యాన్ని కానీ, గేయాన్నికానీ బాగా పాడగలడని ఆతనికి పేరుండేది. అప్పుడప్పుడు విజయనగరం నుంచి విశాఖపట్నం వచ్చిపోతుండేవాడు. కవితా సమితి వార్షికోత్సవం ముందు ఓసారి అతన్ని పురివండా అప్పలస్వామిగారి సమక్షంలో ఖాదీ భాండారంలో కలుసుకున్నాను. ఆ తరవాత నాకు చాలా సన్నిహితంగా ఉండేవాడు. అయితే అతను విశాఖ పట్నం వచ్చినప్పుడు శ్రీరంగం శ్రీనివాసరావుతో కలిసి తిరుగుతూండడం నేను మాత్రం చూశ్శేదు. విశాఖపట్నంలో దిగినప్పుడు ఒకటీ, రెండు రోజుల కన్నా ఎక్కువ ఉండేవాడు కాదు. నాకుమాత్రం ఎక్కడో అక్కడ కనిపించే వాడు. నవ్వుతూ, "ఏమన్నారాశావా?" అంటూ అడిగేవాడు. రాశానంటే చదివి వినిపించమనేవాడు.

ఓ రోజు మొసలికంటి వారి వీథిలో సాయంకాలంపూట ఒక్కడూ మెల్లిగా నడిచి వస్తున్నాడు నారాయణబాబు. నేను ఎదురు పోతున్నాను. ఎక్కడికి పోతున్నావన్నాడు. స్నేహితులింటికన్నాను. "కాదు, సముద్ర తీరానికి పోదాంపద, ఓ సంగతి చెబుతాను" అన్నాడు. దారిలో - సముద్ర తీరంలో కూచుని ఆకాశం వంకా, సముద్రం వంకా చూస్తుంటే కవిత్వం

తనంతట తనే వెతుక్కుంటూ వస్తుందని ఈ మధ్య ఓ ఇంగ్లీషు పత్రికలో చదివాను - అలా కూచుని చూదాం అన్నాడు.

బయల్దేరాం. దారిలో దుకాణం దగ్గర ఒ పెన్సిలూ, ఓ అరఠావూ కొనిపెట్టాడు. ఇద్దరం వెళ్ళి సముద్ర తీరంలో ఇసకమీద కూచున్నాము.

నారాయణబాబు నా వంకచూసి, "ను వ్వామూల ఇసక దిబ్బ పక్క కూర్చుని రాయి" అన్నాడు. నేను లేచి మరోమూల కూచున్నాను. చుట్టూ రావణాసురుడి మీసాల కంచెలు - కాలు కదిపితే గుచ్చుకుంటు న్నాయి. అలా ఓ అరగంట ఆకాశం వంక చూస్తూ సముద్రం వంక చూస్తూ కూచున్నాము. నాకు తలకాయ పనిచెయ్యలేదు. మనస్సెక్కడో ఉంది.

నారాయణబాబు లేచి నా దగ్గరకొచ్చి "ఏమన్నా పలికిందా?" అన్నాడు.

లేదన్నాను నవ్వుతూ. "పోదాం, ఇలా కూచున్న తరవాత ఇంటి కెళ్ళి రాస్తే పలుకుతుంది" అన్నాడు. "మీ సంగతి?" అన్నాను. "టయిం పడుతుంది" అంటూ "ఆకసమ్మున ఘూక మొక్కటి, ఆవలించిన అబ్ధి...." అని కూని రాగం తీయటం ప్రారంభించాడు.

ఇద్దరం ఇంటిదారి పట్టాం. మళ్ళీ ఆ విషయాన్ని నారాయణ బాబుతో నేను ప్రస్తావించలేదు. తరవాత కనిపించినప్పుడు అతనూ నాతో మాట్లాడలేదు. నేను తరవాత కొంచెం జ్ఞానం వచ్చి ఈ సంగతి గుర్తు కొచ్చినపుడు నారాయణబాబు వట్టి అమాయకు డనుకునేవాణ్ణి. కవిత్వంలో నిజంగా అంతేనని ఇప్పటికీ నా విశ్వాసం.

తరవాత కొన్నేళ్ళకు నారాయణబాబు మదరాసు వలస వెళ్ళి నప్పుడు నేనూ వెళ్ళవలసి వచ్చింది. అక్కడ తరచూ కలుసుకునే వాళ్ళం. మా నాన్నగారు "నటాలి" ప్రారంభించి నప్పుడు నీలకంఠం నాయుడుగారనే ఆయనచేత వత్తిడి తెప్పించి "నటాలి"లో ఉద్యోగానికి

ప్రవేశించాడు. మేమంతా రోజు రోజంతా కలిసి ఉండేవాళ్ళం. అప్పుడు శ్రీనివాసరావు కూడా నటాలిలో పనిచేసేవాడు. అయితే నారాయణబాబు మాతో కలిసి మెలిసి తిరిగేవాడు కాదు. ఒంటరిగా ఉండేవాడు. ఆ రోజుల్లోనే ఆంటన్ చెహోవ్ "చెరీ ఆర్చర్డు" తెలుగులో అనువదించి ప్రదర్శించాలని మా నాన్నగారు సంకల్పించారు. చేతిలో పని లేకుండా ఉన్న నారాయణబాబుకి ఈ పనిని మా నాన్నగారు వప్పగించారు. అప్పటికి అనువాద పద్ధతి ఆమూలాగ్రం, మేమందరం కూర్చుని నిర్ణయించుకున్నదే. తీరా నారాయణబాబు అనువాదం పూర్తిచేసి మా నాన్నగారికి చూపించేటప్పటికి ఆయన హతాశులైనారు. కొన్నాళ్ళ తరవాత తిరిగీ ఈ అనువాద కార్యక్రమాన్ని శ్రీనివాసరావుకీ, నాకూ వప్పగించారు. ఈ సందర్భంలో "సంపెంగతోట" అచ్చయింతరవాత నారాయణబాబు ఓ వివాదాన్ని లేవదీశాడు. నేనందులో కలుగజేసుకోలేదు. ఎంచాతనంటే నారాయణబాబు వట్టి అమాయకుడనీ తప్పుదారి తొక్కగల అవకాశం ఉందనీ నాకు తెలుసు కనక. అనవసరంగా శ్రీనివాసరావుని నోరారా ఆడిపోశాడు. వివాదానికి వేదిక కల్పించింది నీలంరాజు వెంకట శేషయ్యగారు. అప్పుడాయన "నవోదయ" వారపత్రిక నడిపేవారు.

ఇంతకీ వచ్చిన బాధ, శ్రీనివాసరావంటే ఈర్ష్య పడ్డవారంతా నారాయణబాబుని అందల మెక్కించారు. నారాయణబాబు తనుకూడా శ్రీనివాసరావుతో పాటు, అతనికంటే ఘనంగా కవితా విప్లవానికి ముందస్తు నాంది పలికినవాణ్ణని ఓ అపనమ్మకం పెంచుకున్నాడు. నిజానికి ఇదంతా అనవసరం. ఎవరి కవిత్వం వారిది. ఎవరి కవిత్వం ఆమోదయోగ్యం అవుతుందో కాలమే నిర్ణయించాలి. ఉద్యమాలూ, సిద్ధాంతాలూ, సాహిత్య అకాడమీలూ, రాజకీయ పక్షాలూ, ప్రచార సాధనాలూ నిర్ణయించే విషయం కాదు మరి.

నాకుమాత్రం నారాయణబాబు కవిత్వమీద అంత అభిప్రాయం లేనిమాట వాస్తవం. నారాయణబాబుతోనే ఆ మాట చెప్పాను. అడివి బాపిరాజుగారిలా కవిత్వంలో, నారాయణబాబుకి భాషమీద అధికారం వశ్యం కాలేదు. అదో పెద్ద లోపమని అనుకునేవాళ్ళలో నేనొకణ్ణి. అయితే నారాయణబాబు మంచి స్నేహితుడు. బాధపడ్డాడు. బాధ నైసర్గిక స్వరూపం తెలిసినవాడు. తెలుగు సంసార చరిత్రలో సాహిత్య పరంగా మొక్కపాటి రామమూర్తి, శ్రీ తిరుపతి, ముద్దుకృష్ణ, నారాయణబాబు చిరస్మరణీయులు - విశిష్ట వ్యక్తులు కనక.

# అరసావిర్భావం

ఓ అర్ధ శతాబ్దంపైన మాట. కమ్యూనిస్టులు కాకినాడలో రహస్యంగా ప్రథమ రాష్ట్ర మహాసభ జరుపుకున్న సంవత్సరం. అప్పటికింకా కమ్యూనిస్టులు బహిరంగంగా రాజకీయ క్షేత్రంలో పనిచెయ్యటం లేదు. కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరైన మా నాన్నగారూ అంతే. పార్టీ ప్రచారాన్ని పరోక్షంగా చెసేవారు ఆ కిందటి సంవత్సరమే హీరేంద్రనాథ ముఖర్జీ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రాజకీయ శాస్త్ర విభాగంలో అధ్యాపకుడుగా చేరాడు. ఆయన ఇంగ్లండులో ఉండగానే విద్యార్థి దశలో కమ్యూనిస్టు ప్రభావానికి లోనైనవాడు. ఆయన వాల్తేరు వచ్చి రావటంతో మా నాన్నగారి ప్రభావానికి గురి అయినాడు. ముఖర్జీ గారికి అఖిల భారత కమ్యూనిస్టు పార్టీతో ప్రత్యక్ష సంబంధం ఉండేది. ముఖర్జీగారి ద్వారా మా నాన్న గారిని గురించి పార్టీలో పనిచేస్తున్న మేధావులు వివరాలు తెలుసుకోవటం, ఆయన మీద గౌరవభావం ఏర్పరచుకోవటం జరిగింది. ఆ సంవత్సరమే ఆలిండియా ప్రోగ్రెసివ్ రైటర్స్ కాన్ఫరెన్స్‌ని లక్నోలో నిర్వహించాలని పార్టీ సభ్యులూ, పార్టీ శ్రేయోభిలాషులూ నిర్ణయించారు. అందులో ముఖ్యులు అహమ్మదు ఆలీ, సజ్జాద్ జహీర్.

కమ్యూనిస్టులు నిర్వహించబోయే రచయితల సమావేశానికి పూర్వం తెలుగుదేశంలో పేరుమోసిన రచయితలు కమ్యూనిస్టు ఉద్యమానికి దూరంగా ఉండేవారు. అయితే రచయితల్లో అధిక సంఖ్యాకులు జాతీయోద్యమంపట్ల సానుభూతి ఉన్నవారు. అందులో కొందరు జాతీయోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొన్న వారు కూడాను. కమ్యూనిస్టు పార్టీ

పట్ల సానుభూతి కనబరచిన వారిలో ఎక్కువ మంది యువకులూ విద్యార్థులూ ఉండేవారు. మేధావులు తక్కువ. లక్నో సమావేశం జరక్క పూర్వం కమ్యూనిస్టు రచయితల రచనలను చూసినట్లయితే అవెంత "అసాహిత్యకరంగా" ఉండేవో తెలుస్తుంది. ఈ విషయం తెలిసి సాహిత్య వ్యవహారంలో మాత్రం మా నాన్నగారు కమ్యూనిజాన్ని పట్టించుకునేవారు కాదు. అయితే ఆంధ్రదేశంలో ఆధునిక సాహిత్యోద్యమంలో అగ్రగాముల్లో ఆయన కూడా ఒకరై ఉండటం, తెలుగు సాహిత్య జ్ఞానం ఉన్న ఇతర రాష్ట్ర రచయితలు ఆయన పేరు విని ఉండటం విశేషం. అలాంటి పరిస్థితుల్లో ఇంగ్లండులో చాలాకాలం విద్యాభ్యాసం చేసి, పశ్చిమ సాహిత్య పరిణామాలతో సంపర్కం సంపాదించినవారు ఒక రచయితల సమావేశాన్ని నిర్వహించబోతున్నారని విని, మా నాన్నగారు సంతోషించిన మాట కూడా వాస్తవం. సర్వసామాన్యంగా ఆయన ఏ రచయితల సంఘంలో సభ్యులు కారు. ఆ రోజుల్లో రచయితల సంఘానికే ఆయన విముఖులుగా ఉండేవారు. అయితే రాజకీయ సిద్ధాంతపరమైన సాహిత్యక్షేత్రంలో అయన కాలు పెట్టేందుకు సంసిద్ధులయారు.

లక్నో సమావేశానికి ఆంధ్రదేశ ప్రతినిధిగా అయన్ని నిర్వాహకులు ఆహ్వానించారు. వాల్తేరు నుంచి హీరేంద్రనాథ ముఖర్జీ, మా నాన్నగారూ లక్నో బయలుదేరారు. వీరితోపాటు, మా నాన్నగారి ప్రోద్బలం మీద సోమంచి యజ్ఞన్నశాస్త్రి గారూ బయలుదేరారు.

లక్నోలో రచయితల మహాసభకు హిందీ సాహిత్య రంగంలో ప్రసిద్ధి చెందిన మున్షీ ప్రేమ్‌చంద్ అధ్యక్షత వహించారు. ఆ సభకు ఓ ఏభై మంది ప్రతినిధులూ, ముఖ్యంగా ఉత్తరాది నుంచి, మరో వంద మంది ప్రేక్షకులూ హాజరయారు. ఆ సభని కమ్యూనిస్టుల అజమాయిషీలో నిర్వహిస్తున్నట్లు చాలా మందికి తెలియదు. సామ్రాజ్యవాద వ్యతి

రేకత, బడుగు ప్రజల దోపిడి - ఇలాంటి నినాదాలు అందరికీ ఆమోద యోగ్యం కనక ఎవరూ అభ్యంతరం పెట్టరు. మున్షీ ప్రేమ్‌చంద్ తన అధ్యక్షోపన్యాసాన్ని హిందీలో రాసి చదివారు. అన్య రాష్ట్రాల నుంచి వచ్చిన ప్రతినిధుల్లో చాలా మందికి హిందీ రాకపోవడం వల్ల ఆయన ఉపన్యాసధోరణి అర్థం కాకపోయింది.

ఆ తరవాత మా నాన్నగారు ఆంగ్లంలో మాట్లాడుతుంటే, హిందీలో ప్రసంగించమని మున్షీ ప్రేమ్‌చంద్‌తో సహా కొంతమంది ప్రతినిధు లడగటంతో, మా నాన్నగారికి కోపంవచ్చి తెలుగులో మాట్లాడతానన్నా రుట. మున్షీ ప్రేమ్‌చంద్ - 'ఈ తెలుగు భాష ఎవరు మాట్లాడతారు? ఈ భాష మాట్లాడే ప్రాంతం మన దేశంలో ఎక్కడ?' అని అడిగారట. ఉత్తరాదిన అలా నెలకొన్న అజ్ఞానాన్ని కళ్ళారా చూసి మా నాన్నగారు బాధపడ్డారు. తరవాత మహాసభలో అనేక తీర్మానాలూ, ఓ మానిఫెస్టో ఆమోదించారు. ఆ మానిఫెస్టో ప్రాతిపదికగా అన్ని రాష్ట్రాల్లోనూ రచయితల సంఘాలను స్థాపించాలని తీర్మానించారు. ఆ మానిఫెస్టో పట్టుకొని మా నాన్నగారు వాల్తేరు తిరిగి వచ్చారు.

వచ్చీ రావటంతో మా నాన్నగారు శ్రీరంగం శ్రీనివాసరావుకి కబురుపెట్టి పిలిపించారు. రచయితల సంఘానికి "వర్ధమాన లేఖక సంఘం" అని నామకరణం చేశారు. శ్రీనివాసరావు తోడ్పాటుతో మానిఫెస్టోను తెలుగుచేసి రామా ప్రెస్సులో అచ్చేయించారు. వర్ధమాన లేఖక సంఘానికి అధ్యక్షులుగా మా నాన్నగారు (అబ్బూరి రామకృష్ణారావు), కార్యదర్శిగా శ్రీరంగం శ్రీనివాసరావు వ్యవహరించేందుకు నిశ్చయించారు. మరి సభ్యత్వం? రెండు మూడు గంటల తరవాత గుడిపాటి వెంకటచలం గారిని ఇంటికి తీసుకురమ్మని నన్ను పంపారు. ఆ రోజుల్లో వెంకటచలం గారు టర్నరు సత్రం ఎదురుగా ఉన్న ట్రెయినింగు స్కూల్లో పనిచేస్తూ, అక్కడే ఉంటున్నారు. ఆవేళ సాయంకాలం ఆయన మా ఇంటికొచ్చారు.

ఓ గంటసేపు ఆయనతో మా నాన్నగారు సాహిత్యపరంగా చర్చించారు. చివరికి ఆయనా, సందేహాలున్నా మా నాన్నగారితో చేతులు కలపటానికి అంగీకరించారు. వర్ధమాన లేఖక సంఘ కార్యక్రమం కింద అక్షరాస్యు లయిన ప్రజల కందుబాటులో ఉండేందుకు కథలూ, నాటకాలూ రాయ టానికని వాళ్ళు నిత్యం వాడే భాషను ముందుగా మనం నమోదు చేసుకో వలసిన ఓ పథకాన్ని రూపొందించారు. అందులో మాండలికపద సేకరణ, వృత్తిపద సేకరణ లాంటివి చోటు చేసుకున్నాయి. అంతేకాక, జానపద సాహిత్యాన్ని ఒకచోట సమకూర్చాలని కూడా ఆశించారు. వెంకటచలం గారి తరవాత మా నాన్నగారికి తగిన సభ్యులు అప్పట్లో లభించలేదు. ఈ లోపున మా ఇంటి మీదా, మా నాన్నగారి కార్యకలాపాల మీదా పోలీసు నిఘా పడింది. మానిఫెస్టో అచ్చేసిన రామా ప్రెస్సును పోలీసులు సోదా చేశారు. తాత్కాలికంగా మా నాన్నగారు వర్ధమాన లేఖక సంఘ కార్య క్రమాన్ని ఆపేశారు. శ్రీనివాసరావు కూడా సంఘ నిర్మాణంలో మా నాన్నగారాశించినంత శ్రద్ధ చూపించలేకపోయాడు. కొన్నాళ్ళకే తను విశాఖపట్నం వదిలి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకోవటం, ఈ లోపున మా నాన్నగారు కమ్యూనిస్టు పార్టీతో తెగతెంపులు చేసుకొని - ఎమ్.ఎన్. రాయిగారితో చేరి పని చెయ్యటం జరిగినాయి. ఆలిండియా ప్రోగ్రెసివ్ రైటర్సు ఎసోసియేషన్ లక్నో నుంచి "ఇండియన్ లిటరేచరు" అనే త్రైమాసిక పత్రికను ప్రారంభించింది. సంపాదకవర్గంలో మా నాన్న గారిని చేర్చుకున్నారు. రెండో, మూడో సంచికలు వచ్చిన తరవాత ఆగి పోయిందా పత్రిక.

అలా ప్రారంభమైన వర్ధమాన లేఖక సంఘం తరవాత యుద్ధ కాలంలో ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యాన 'అభ్యుదయ రచయితల సంఘం' అయింది. చదలవాడ పిచ్చయ్య ఆ సంఘ

ప్రచారంలో చరిత్రాత్మక పాత్ర వహించాడు. అమాయకులైన అనేక ప్రసిద్ధ రచయితలు, అందులోని రాజకీయ మర్మం తెలియక కాలు పెట్టడం, తరువాత తప్పుకోవటం జరిగింది. చివరికి పిచ్చయ్య కూడా తప్పుకుని 'కమ్యూనిస్టుల నగ్నస్వరూపాలు' అనే పుస్తకాన్ని ప్రచురించాడు. ఆ పుస్తకం ఇప్పుడు దొరకదు. దాన్ని తిరిగి ప్రచురించటం సాహిత్యానికి ఎంతైనా మేలవుతుంది.

వర్ధమాన లేఖక సంఘం 1936 లో తొలిసారిగా ప్రచురించిన మానిఫెస్టో చరిత్ర పరంగా మనం ఓసారి చదవాలి.

ఆంధ్ర రాష్ట్రంలో అభ్యుదయ రచయితల సంఘం-కమ్యూనిస్టు పార్టీ బహిరంగంగా కార్యక్షేత్రంలో ప్రవేశించినపుడు - అంటే ఆంధ్ర వర్ధమాన లేఖక సంఘం ప్రారంభమైన మరో ఆరేళ్ళకు - తెలుగునాట ఆవిర్భవించింది. ఆంధ్ర వర్ధమాన లేఖక సంఘ లక్ష్యాలను మా నాన్నగారు, శ్రీరంగం శ్రీనివాసరావు సహకారంతో ఇలా రూపొందించారు:

## ఆంధ్ర వర్ధమాన లేఖక సంఘం

ఆంధ్ర సంఘంలో నేడు సమూలములైన మార్పులు గోచరిస్తున్నవి. కాని ప్రతికూలశక్తులు కూడా చిట్టచివరికి నశించవలసినవే అయినా, మార్గ నిరోధాలు కల్పిస్తున్నవి.

ఆంధ్ర జీవితంలో కనబడుతూ ఉన్న మార్పులను వాఙ్మయంలో ప్రదర్శించి అభివృద్ధి ప్రయత్నాలను కొనసాగించడం ఆంధ్ర లేఖకులందరికిన్ని విహిత ధర్మం.

ప్రాచీన సంస్కృతి విచ్ఛిన్నమైన తర్వాత మన వాఙ్మయం లౌకిక జీవనంలోని వైవిధ్యాలను సమన్వయించుకోలేక, అతిలోకంగా

సంచరిస్తూ ఉంది. వ్యర్థమైన తాత్త్విక జిజ్ఞాసలలోను, నిరాధారములైన కేవల కల్పనలోను తలదాచుకొంటున్నది. ఇందుకు ఫలితంగా సాహిత్యం నీరసించి విగ్రహపుష్టి మాత్రం మిగిలి పెడసర భావాలలో మునిగి తేలుతున్నది. ఇందువల్లనే నేటి వ్రాతలలో నర్మకవితలూ, భక్తి భావాలూ, ఔచిత్యమూ, సందర్భశుద్ధి లేని ఆవేశాలూ, స్త్రీ పురుష సంబంధాలను నిష్కళంక దృష్టితో చూడలేకపోవడమూ, వివేక శూన్యతా విరివిగా కనిపిస్తూ ఉన్నవి.

ఈలాటి వ్రాతలు వ్రాసేదీ, చదివేదీ మార్పులు సహించలేని పూర్వాచార పరాయణులే. చిరకాలం నుంచీ వీరి చేతుల్లో నిలిచి ఉండడం చేతనే వాఙ్మయం ప్రజాస్వామ్యానికి అందని ప్రమాని పండయినది. అందుకనే వర్ధమాన లేఖకులు ఆంధ్ర వాఙ్మయాన్ని పునరుద్ధరించి, దాన్ని ప్రజల జీవితానికి చేరువగా కొనివచ్చి, అందులో వాస్తవ జీవితాన్ని ప్రతిఫలింపజేసి, అందరూ ఆకాంక్షించే ఉజ్జ్వల భవిష్యానికి దారితీయవలసి ఉంటుంది.

ప్రాచీనాంధ్ర సభ్యతలోని ఉత్తమ సంప్రదాయాలంటే మాకు వైముఖ్యం లేదు. కాని, వాటిని గురించి పాదుకొన్న అపోహలను ఆమూలాగ్రంగా విమర్శించి, స్వదేశ, విదేశ సాహిత్యాలలోంచి అభివృద్ధిని పెంపొందించే రసవద్ఘట్టాలను ఆంధ్ర ప్రజలకు అందజేసి, నూతన రూపంతో జన్మించబోయే భవిష్యత్సంఘానికి దారితీయగల ప్రయత్నాలన్నిటికీ తోడ్పడుతూ ఉంటాము. నేడు యావద్భారత సంసారాన్ని కలవరపరుస్తూ ఉన్న ఆకలీ, పేదరికం, ఆచారదాస్యం, పరాధీనతా ఈ నూతన వాఙ్మయానికి ప్రధాన వస్తువులు.

జడత్వం, నిర్వ్యాపారతా, హేతువాద వైముఖ్యం- వీటిని వృద్ధి నిరోధకాలని నిర్ణయించి పరిత్యజిస్తున్నాము.

మనలో విమర్శక బుద్ధిని పెంపొందించేదీ, సంస్థలనూ, ఆచారాలనూ హేతువాదంతో పరిశీలింపజేసేదీ, కార్యపరత్వానికి సహాయకమైనదీ, చిందరవందరలైన మన శక్తులన్నిటినీ ఏకముఖంగా నడిపించగలిగినదీ, మనలో సముచిత పరివర్తనం కలిగించేదీ–వీటిని వర్ధమాన మని అంగీకరిస్తున్నాము.

**ఆశయాలు :**

ప్రజల వాఙ్మయం అభివృద్ధి చెయ్యడం ఈ సంఘానికి ముఖ్యోద్దేశం. వర్ధమాన సాహిత్యం సృష్టించినవారూ, అట్టి ప్రజ్ఞ కలవారూ సభ్యత్వానికి అర్హులు. సాహిత్య వాసనలేకుండా రాజకీయాందోళనకు యత్నించదలచిన వారికి ఈ సంస్థలో చోటు లేదు.

ఈ క్రిందివి మరికొన్ని లక్ష్యాలు :

ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలలో ఈ సంఘ శాఖలు నెలకొల్పడం; సమావేశాలవల్లనూ, రచనల మూలంగానూ వేరు వేరు శాఖల వ్యవహారాలన్నీ ఏకముఖంగా కొనసాగించడం; ఈ సంఘం వారి లక్ష్యాలకు విరుద్ధంగా వర్తించని ఇతర సంస్థ లన్నింటితోనూ కలిసి పనిచేయడం;

పల్లెలలోనూ, పట్టణాలలోనూ, అధోగతిలో పడి ఉన్న జనసమూహాలకు వర్ధమాన భావాలు ప్రబోధించడం;

తెలుగులో వర్ధమాన సాహిత్యాన్ని సృష్టించడానికి తగిన అవకాశాలు కలిగించడం, ఇతర భాషలలో నుంచి అట్టి సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించి ప్రచురించడం, సభ్యుల స్వతంత్ర రచనలు ప్రకటించడం, ఈ విధంగా ప్రతికూలశక్తులను నిర్మూలించి సాంఘిక పునరుజ్జీవనానికి దారితీయడం;

వర్ధమాన లేఖకుల హక్కులను సంరక్షించడం,

పరిపూర్ణమైన భావస్వాతంత్ర్యాన్ని సాధించడం."

ఈ లక్ష్య నిర్వచనంలో కనీసం భాషా సంస్కారమన్నా గోచ రించక మానదు. ఆ తరవాత తిరిగీ తలెత్తిన అభ్యుదయ రచయితల సంఘం ప్రకటించిన లక్ష్య నివేదికలో భాషాశుద్ధి కనిపించదు. ఎంచాత నంటే, కమ్యూనిస్టు పార్టీలో లబ్ధప్రతిష్ఠులైన కవులుగానీ, రచయితలుగానీ లేరు. ఆదిలో ఒక్క మా నాన్నగారే ఉండేవారు. శ్రీనివాసరావు పార్టీ వ్యవహారమంటేనే ఎందుచేతనో దూరంగా ఉంటూ ఉండేవాడు. 1943 ప్రాంతాల ననుకుంటాను - అభ్యుదయ రచయితల సంఘం తిరిగి తలెత్తింది, తాపీ ధర్మారావుగారి అధ్యక్షతన.

1936 ఏప్రిలు మాసంలో లక్నో సమావేశం నుంచి వచ్చిం తరవాత తెలుగునాట వర్ధమాన లేఖక సంఘాన్ని ప్రతిష్ఠించే మా నాన్న గారి ప్రయత్నం దాదాపు ఆ సంవత్సరాంతంలోనే ఆగిపోయింది. కమ్యూ నిస్టు పార్టీతో సిద్ధాంత పరమైన విభేదాలు రావటంతో మా నాన్నగారా పార్టీనుంచి తప్పుకున్నారు. శ్రీరంగం శ్రీనివాసరావు ఉద్యోగ ప్రయత్నం చేస్తూ, ఈ కార్యకలాపాన్ని మరిచిపోయి మదరాసు చేరుకున్నాడు. గుడిపాటి వెంకటచలంగారు విశాఖపట్నం నుంచి మరో ఊరు బదిలీ అయారు. వెంకటచలంగారు ఊరు విడిచి వెళుతూ మా ఇంటి కొచ్చారు మా నాన్నగారి దగ్గర సెలవు తీసుకోవటానికి. ప్రసంగ వశాత్తూ వర్ధమాన లేఖక సంఘం ప్రసక్తి వచ్చింది.

"అదంతా వదులుకున్నట్లేనా?" అని వెంకటచలంగారు మా నాన్నగారిని అడిగారు.

మా నాన్నగారు నవ్వుతూ "వొదులుకోక ఏం చెయ్యగలం? వాళ్ళకి ప్రజా వాఙ్మయం కావాలిట - నూటికి తొంభై ఏడుమంది నిరక్ష రాస్యులుగా ఉండగా మనం రాస్తే వాళ్ళెలా చదవగలరో నా కర్థం కావటం లేదు. అదీకాక, మనం సాహిత్య మనుకున్నదాన్ని వారు కాదం టున్నారు. మనం నాదబ్రహ్మను ఆశ్రయిస్తే వారు నినాదబ్రహ్మను

ఆరాధిస్తా మంటున్నారు. అదీ పేచీ - మనకి కుదరని వ్యవహారం" అన్నారు. వెంకటచలంగారు మా నాన్నగారితో ఏకీభవించారు.

చదలవాడ పిచ్చయ్య నేతృత్వం కింద అభ్యుదయ రచయితల సంఘం అయిదారేళ్ళ పాటు మూడు పువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లింది. కమ్యూనిస్టు పార్టీలో రచయితల కొరత ఉంటంచాతే, నవ్యసాహిత్య పరిషత్తును అందులో దించేశాడు పిచ్చయ్య. ఊరేగింపులూ, జన సమ్మర్దం- ఈ రెండూ సమపాళంలో కలిపి లబ్ధప్రతిష్ఠులైన భావకవుల్నీ వారి అభిమానుల్నీ అభ్యుదయ రచయితల సంఘ వేదికమీదికి పిచ్చయ్య లాక్కొచ్చి కూచోపెట్టాడు. అలా వెళ్ళి కూచున్నవాళ్ళకి, 'అరసం' కమ్యూనిస్టు పార్టీ అనుబంధ శాఖ అని తెలీదు. అది తెలిసి ఆ ప్రాంతాలకు పోని వాళ్ళలో విశ్వనాథ సత్యనారాయణగారొకరు. మరొకరు తల్లావజ్ఝల శివ శంకరశాస్త్రి. అరసం కమ్యూనిష్టు వ్యవహారమే అన్న సంగతి బయట పడ్డంతో చటుక్కున అలా చేరినవారు తప్పుకోవటం ప్రారంభించారు.

ఓసారి బెజవాడ రైల్వే స్టేషనులో విశ్వనాథ సత్యనారాయణగారు కనిపించారు. నేను మదరాసు పోతున్నాను. ఆయనతో మాట్లాడు తున్నప్పుడు 'మీ సహకవులంతా అభ్యుదయ వాదులయిపోతే మీరొక్కరే విడిగా ఉన్నారేం(వి' టన్నాను-

ఆయన నవ్వుతూ-

అర సంఘమే పెద్ద
అక్షయపాత్ర!
అర్థమైన కవితే
అన్నపూర్ణాదేవి!

అన్నారు. ఆయన అలా అన్నప్పుడే కృష్ణశాస్త్రిగారు అభ్యుదయ సంఘం వార్షికోత్సవంలో అధ్యక్షోపన్యాసం చేస్తున్నారు!

# కృష్ణశాస్త్రి

విశాఖపట్నంలో మొదటిసారిగా మా నాన్నగారు నన్ను స్కూల్లో చేర్పించారు. రెండో ఫారంలో చేరాను. ఆ ఏడాది క్రిస్మస్ సెలవులకి బెజవాడ వెళ్ళాను. మామూలుగా గుడిపాటి వెంకటచలంగా రింట్లోనే దిగాను. అప్పుడు వెంకటచలంగారు గవర్నరుపేటలో ఓ పెద్ద మేడలో ఉంటూండేవారు. ఆయనకి పూర్వం, ఆ ఇంట్లో మా సన్నిహిత బంధువు వెలిదెండ్ల హనుమంతురావుగా రుండేవారని గుర్తు. హనుమంతరావుగారు వైద్య వృత్తిలో పేరు సంపాదించి, మహోన్నత స్థితిలో ఉంటూ, మహాత్ముని ఆదేశానుసారం సత్యాగ్రహంలో చేరి, కారాగారాన్ని ఆశ్రయించారు.

ఆ ఇల్లు విశాలంగా ఉండేది. ఇంటిముందు ఖాళీ జాగా— అక్కడక్కడ చిన్న చిన్న మొక్కలూ- సాయంకాలంపూట వెంకటచలంగారు స్నేహితులతో అక్కడ కుర్చీలు వేసుకుని కూచుని కాలక్షేపం చేస్తుండేవారు. ఓసారి మేడమీదినుంచి సాయంకాలం నేనూ, వెంకటచలంగారబ్బాయి సంతీ దిగి బయటికి పోదా మనుకున్నాము. తీరా కిందికి దిగి రెండు మూడడుగులు ముందుకు వేసేటప్పటికి వెంకటచలంగారూ, మరో ఇద్దరు ముగ్గురు వ్యక్తులూ దారి కడ్డంగా నిలబడి ఉన్నారు. వెంకటచలంగారు నౌకరుతో కుర్చీలు తీసుకురమ్మని చెబుతున్నారు. నేను, సంతీ వాళ్ళని దాటుకుపోతుంటే వెంకటచలంగారు— "వరదా!" అని నన్ను వెనక్కి పిలిచారు. అక్కడ మరో ఆయన్ని - పెద్ద జుట్టూ, ఎడం ఛాతీమీద గుండీలున్న లాల్చీ, ధోవతీ - అదోరకం- నాకు పరిచయం చేస్తూ "కృష్ణశాస్త్రి" అని అన్నారు. మరీ నా చిన్నతనంలో

మా ఇంటికి వచ్చే బళ్ళారి రాఘవాచారిగారూ, పిల్లలమర్రి సుందర రామయ్యగారూ, పారుపల్లి సుబ్బారావుగారూ - లాంటి నటుల్ని గుర్తుకు తెప్పించా రాయన. అప్పటికి కృష్ణశాస్త్రిగారి పేరు లీలగా తెలుసు. ఆయన కవిత్వాన్ని అంత చదవలేదు. అయితే ఆయనది ఆకర్షణీయమైన విగ్రహం - దానికితోడు మాట్లాడే తీరులో ఆప్యాయత - ఎవర్నయినా ఆయన ఆకట్టుకోగలడు. అదే ఆయన ప్రత్యేకత. నేను నమస్కారం చేసి మళ్ళీ వచ్చి కలుస్తానని చెప్పాను.

ఆయన ఊరుకోలేదు. "తొందరగా రండి. కలిసి భోంచేద్దాము. రేపు నేను నరసరావుపేట పోతున్నాను. నీ పద్యాలు వినాలి" అన్నారు.

నేను కొంచెం సిగ్గుపడి సరే నన్నాను. కాని ఆ వేళ రాత్రి నేనూ, సంతీ ఓ సినిమాకు పోయి చాలా ఆలస్యంగా ఇంటి కొచ్చాము. శాస్త్రిగారు నిద్రపోతున్నారు. మర్నాడు నేను లేచేటప్పటికి ఆయన ఊరు వెళ్ళి పోయారు. మరో సంవత్సరం దాకా ఆయన్ని మళ్ళీ చూడ్డం పళ్ళేదు. అయితే ఆయన మూర్తీ, వాచికమూ నాలో లీలగా అలా నిలిచిపోయినాయి.

ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ ఆ సంవత్సరం విజయనగరంలో నిర్వహిస్తున్నారు. మహాసభకు కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు అధ్యక్షులుగా ఎన్నికయారు. ఆయన ఆ రోజుల్లో "త్రివేణి" అనే ఆంగ్ల సాంస్కృతిక త్రైమాస పత్రికను మదరాసు నుంచి ప్రచురించేవారు. తెలుగు సాహిత్యంతోనూ, సంస్కృతితోనూ ఆయనకు ప్రత్యక్ష సంబంధం ఉండేది. అప్పుడు విద్యార్థి మహాసభలను సాంస్కృతిక సమావేశాలుగా నిర్వహించేవారు. విద్యార్థులూ, ఆహుతులూ జాతీయ వాదులే అయినా సభలో రాజకీయాల సంపర్కం ఉండేది కాదు. అంచాత విజయనగరంలో జరిగే మహాసభకు తెలుగునాడు నాలుగు చెరగుల నుంచీ కవులనూ, సాహిత్యవేత్తలనూ, కళాకారులనూ ఆహ్వానించారు.

విజయనగరం సభకు పోతూ రామకోటీశ్వరరావుగారు విశాఖ పట్నంలో మా ఇంటికొచ్చి ఓ రోజు మా నాన్నగారితో కాలక్షేపం చేశారు. మర్నాడు విజయనగరం పోతూ, కూడా నన్నూ తీసుకుపోతానని బలవంతం చేశారు. మా నాన్నగారి అనుమతితో నేను బయలుదేరాను. ముందు అధ్యక్షులకు అతిథిగా వెళ్ళాను. తీరా సమావేశం ప్రారంభ మయ్యేటప్పటికి, రాష్ట్రంలోని ఉన్నత పాఠశాలల ఏకైక ప్రతినిధిగా నన్ను గుర్తించి సమావేశంలో పాల్గొనమన్నారు నిర్వాహకులు. ఎంచాత నంటే, ఉన్నత పాఠశాలల నుంచి మరెవ్వరూ సభకు రాలేదు. సభ ప్రారంభమైన కొంతసేపటికి ఎవరో వచ్చి, నా పక్కనే కూచున్న మల్లంపల్లి సోమశేఖరశర్మగారిని "కృష్ణశాస్త్రిగారు వచ్చారా?" అని అడిగారు.

కృష్ణశాస్త్రిగారు వచ్చారని నా కప్పుడు తెలిసి ఆయన్ని చూడా లనిపించింది. ఆ ఉదయం ఆయన పత్తాలేరు. సాయంకాల సమా వేశంలో 'సాహిత్య గోష్ఠి' అన్నారు. అధ్యక్షులు కోలవెన్ను రామ కోటీశ్వరరావుగారు తమ సహజశైలిలో అతి క్లుప్తంగా తెలుగు సాహిత్య రంగాన్ని సమీక్షించారు.

చీకటి పడుతోంది. కృష్ణశాస్త్రిగారి గురించి అడిగేవాళ్ళు ఎక్కు వయ్యారు. విశ్వనాథ సత్యనారాయణగారు రాలేకపోయారు. రాలేక పోవటం కాదు. 'విశ్వనాథము సత్యనారాయణ' అని విశాఖపట్నంలోని ఓ ఉపాధ్యాయుడు పొరపాటున ఆహ్వానం తనకే ననుకొని వచ్చాడు!

ఆ రోజున ముగ్గురు ఉపన్యాసకులు. సత్యనారాయణగారు లేరు. కనక అలా ఆయన పేరుగల మరొకాయన. స్థానిక పండితులయిన గొర్తి సూర్యనారాయణ శాస్త్రిగారు. ఆ తరవాత కృష్ణశాస్త్రిగారు. సమయానికి కృష్ణశాస్త్రిగారూ కనిపించటం లేదు. ఆయన వచ్చారని

కొందరూ, ఇంకా రాలేదని మరి కొందరూ - ఎవర్ని నమ్మాలో ఎవరికీ తెలియటంలేదు.

ఉపన్యాసాలు ప్రారంభమయినాయి. ముందస్తుగా విశ్వనాథము సత్యనారాయణగారేదో స్కూలు మేస్టర్లా మాట్లాడారు. తరవాత గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారు. ఆయన అనర్గళంగా మాటాడతాడు. మాంఛి వ్యంగ్యస్ఫూర్తి, హాస్యస్ఫోరక వాక్చాతుర్యం కలవాడు. ఆ రోజుల్లో ప్రచారంలో ఉన్న ఆధునిక కవిత్వాన్ని నిశితంగా విమర్శించటం ప్రారంభించాడు. విజయనగర పౌరుల్లో సభకు వచ్చిన వారంతా సూర్యనారాయణశాస్త్రి అభిమానుల్లా కనిపించారు. విద్యార్థులు కూడాను. కాకినాడ, రాజమహేంద్రవరం, బందరు లాంటి పట్నాల నుంచి వచ్చిన విద్యార్థులు అభినవాంధ్ర కవితాభిమానులు. అయితే వారి సంఖ్య తక్కువ. సూర్యనారాయణశాస్త్రిగారు భావకవిత్వాన్ని, భావకవుల్నీ ఎద్దేవా ఎంత చెయ్యాలో అంత చేస్తున్నారు. నాలాంటి వారికి సమయానికి కృష్ణశాస్త్రిగారు లేకపోవటం ఓ పెద్ద లోపంగా తోచింది. ఆ మాటే విద్యార్థుల్లో అనుకుంటున్నారు.

విజయనగర వాసులు "కృష్ణశాస్త్రిగారు వస్తే మాత్రం ఏం చెయ్యగలరు? గొర్తి మాస్టారికి సమాధానం చెప్పగల చావ ఉండొద్దూ?" అని అన్నారు. రాయప్రోలు, వేదుల, కృష్ణశాస్త్రి ప్రభృతుల పద్యాల్నీ గ్రంథ శీర్షికల్నీ సోదాహరణంగా సూచిస్తూ సూర్యనారాయణశాస్త్రిగారు భావకవుల్ని అవహేళన పాలు చేశారు. ఆయన వాగ్ధోరణికి ముగ్ధులై సదస్యులు పదే పదే కరతాళధ్వనులూ చేశారు.

"వీళ్ళ భావకవులేమిటి, జడకుచ్చులు పట్టుకొని మూగనోములు పడతారు. తరవాత ఏడుస్తారు ఆడపిల్లల వెనక పడి - వీళ్ళ బావకవులు బాబూ!" అన్నారు సూర్యనారాయణశాస్త్రిగారు.

ఆయన ప్రసంగం అయిపోతుందనగా కృష్ణశాస్త్రిగా రెక్కణ్ణంచో సభలోకి ప్రవేశించారు. ఆయన నడకలో ఓ విధమైన ఠీవీ, హుందా తనం ఉండేవి. వేషం సరేసరి. ఆయన అనుచరులు ఆయన రావటంతోనే ఆయన చుట్టూ చేరారు. సూర్యనారాయణశాస్త్రిగారి ఉపన్యాస సారాంశం ఆయనకి చెబుతున్నారు. ఆయన వినిపించుకోక - "అబ్బూరి వారబ్బాయి ఎక్కడ చూడండి- ఇక్కడే ఉన్నాడని విన్నా" నన్నారు.

పక్కనే ఉన్న నేను నిలబడి నమస్కరించాను. ఆయన నా ప్రక్కన కూచుని— "ఈ రెండు, మూడు రోజులు నాతోనే ఉండు, ఎక్కడికిపోక" అన్నారు.

కృష్ణశాస్త్రిగారిని చూడ్డంతో సూర్యనారాయణశాస్త్రిగారు కూడా కొంచెం మెత్తబడి ఉపన్యాసం ముగించారు. అధ్యక్షులు కృష్ణశాస్త్రి గారిని ఉపన్యాసానికి ఆహ్వానించారు. ఆయన వేదికమీదికి పోయి నిలబడి నలుమూలలా పరికించి 'భావకవుల' పద్యాలు పాడటం ప్రారంభించారు. ముందు రాయప్రోలు సుబ్బారావు, తరవాత అబ్బూరి రామ కృష్ణారావు, తరవాత విశ్వనాథ, వేదుల- ఇలా.... సభ నిస్తరంగ సముద్రంలా నిశ్శబ్దమైపోయి తదేక ధ్యానంలో కృష్ణశాస్త్రిగారి కావ్య గానం వింటున్నారు.

ఆఖరికి—

నా కఠిన పాద శిలల క్రిందబడి నలిగి
పోయె నెన్నెన్నియో మల్లెపూలు మున్ను....

స్వీయకృతి ఆలపించారు.

"వీరే బావకవులు అయితే సూర్యనారాయణశాస్త్రిగారి నడుగుతాను- మీ అప్పకవులకు మా బావకవు లేమవుతారని?"

శాస్త్రిగారు వేదికనుంచి దిగిపోతుండగా సభ యావత్తూ ఒక్క-సారిగా లేచి ఆయన్ని మళ్ళీ కావ్యపఠనం చెయ్యమనీ, సూర్యనారాయణ శాస్త్రిగారిని క్షమించమనీ అడిగింది! కృష్ణశాస్త్రిగారి పద్యపఠన ప్రభావ మలాటిది!!

*　　　*　　　*

విజయనగరం విద్యార్థి మహాసభా సందర్భంగా కృష్ణశాస్త్రిగారికి నాపట్ల అభిమానం ఏర్పడింది. అక్క-డ మొదటిసారిగా నా కవిత్వాన్ని విని మెచ్చుకుని ఇతరులుకూడా మెచ్చుకునేట్లు చేశారు. తరవాత నా విద్యార్థి దశలో ఆయన్ని తరచూ చూస్తుండేవాణ్ణి. ఉన్నత పాఠశాల నుంచి కళాశాల వరకూ విద్యార్థి సంఘాల్లో నేను ప్రముఖ పాత్ర వహిస్తుండటమూ, రెండు మూడుసార్లు మా సంఘ వార్షికోత్సవాలకు ఆయన్ని కాకినాడ నుంచి పిలిపించి ఉపన్యాసాలిప్పించటమూ చేసేవాణ్ణి.

ఓసారి మా కళాశాల వార్షికోత్సవానికి ఆయన్ని ఆహ్వానిస్తూ ఉత్తరం రాశాను. తప్పకుండా వస్తారనుకుని పేరు ఆహ్వాన పత్రికల్లో వేయించాను. తీరా చూస్తే ఆయన దగ్గరనుంచి ప్రత్యుత్తరం లేదు. నేను నా ఉత్తరంలో మాత్రం ఆయన పేరు ప్రకటిస్తున్నట్లుగా రాశాను. ఇంక లాభం లేదనుకుని ఆయనతో టెలిఫోనులో మాట్లాడాలని పోస్టాఫీసుకి పోయి కూచున్నాము నేనూ నా మిత్రులూనూ. ఆ రోజుల్లో పోస్టాఫీసుకు పోయి కాకినాడలో శాస్త్రిగారి పేరూ, చిరునామా ఇస్తే కాకినాడ పోస్టాఫీసుకి ఆయన్ని పిలిపించేవారు టెలిఫోనులో మాట్లాడించటానికి. అదీ అప్పటి రివాజు. చాలా పొద్దుపోయిం తరవాత మాకు చచ్చేట్లు ఆకలేసిం తరవాత శాస్త్రిగారు టెలిఫోనులో దొరికారు.

శాస్త్రిగారు-"ఏం వరదా, ఏమిటి సంగతు"లన్నారు.

నా ఉత్తరం సంగతీ, మా వార్షికోత్సవం గురించీ చెప్పాను.

ఆయనకు వీలుండ దన్నారు.

నేను - పేరు అచ్చు వేయించాను. ఆయన రాకపోతే, నా పరువుతో పాటు ఆయన పరువూ పోతుందన్నాను.

ఆయనకి కొంచెం కోపం వొచ్చింది.

"నన్నడక్కుండా నా పేరెందుకు వేయించావు? నీ కి అధికారం ఎవరిచ్చారు?" అన్నారు.

నేను నవ్వుతూ "మీ కవిత్వం" అన్నాను తడువుకోకుండా.

అవతల కాస్సేపు నిశ్శబ్దం. శాస్త్రిగారు మెల్లిగా "సరే, వస్తాను. ఒకవేళ రాకపోతే బెంగపెట్టుకోకు. ఎల్లుండి మెయిలుకి స్టేషనుకి రా" అన్నారు.

అన్న ప్రకారం నేనూ, మరో స్నేహితుడూ వాల్తేరు స్టేషన్‌కు పోయాము. సకాలానికి రైలు వచ్చింది. రైలు చివరి బోగీలో నుంచి శాస్త్రిగారు దిగారు. ఆయ నెప్పుడూ మందహాసంతో ఉంటారు. కోపం వచ్చినపుడు అదోరకం. దగ్గరికి పోయి పలకరించి, ఆయన పట్టుకొొచ్చిన చిన్న పెట్టెని నా స్నేహితుణ్ణి మొయ్యమనియిచ్చా. ఆయన వచ్చినందుకు సంతోషిస్తూ నడుస్తున్నాం ముఖద్వారం వైపుకి. ముఖద్వారం దాటాం. నేను వెళ్ళి ఓ పెట్టిబండి వాడితో బేరం చేస్తున్నాను.

ఇంతలోకి శాస్త్రిగారు నన్ను కేకేసి, ఆ బండి ఎక్కనన్నారు. మరెలా అన్నాను.

"మనం చాలా దూరం పోవాలి. మా కాలేజి హాస్టల్ మీ విడిది" అన్నాను. ఆయన ఒంటెద్దుబండి ఉంటే చూడమన్నారు. "మరి నేను మాట్లాడేది ఒంటెద్దు బండే కదా?" అన్నాను.

ఆయనకి కించిత్తు కోపం వచ్చింది. "నా కా మాత్రం తెలుసు, నేను పెట్టిబండి ఎక్కను" అని మొరాయించారు.

నా కేం అర్థం కాలేదు. అక్కడ మరో రకమైన వాహనం లేదాయిరి. కాకినాడలో ఒంటెద్దు బళ్ళు వేరు. అవి గూడు బళ్ళు. అవి విశాఖపట్నంలో ఉండవు. ఏం చెయ్యాలో తోచలేదు. శాస్త్రిగారిని వెయిటింగ్ రూమ్‌లో కూచోమన్నాను. ఆయన ఎదురుగా నిలబడి ఉన్న పెట్టెబండి చక్రంకేసి తదేకంగా చూస్తున్నారు.

ఆ బండివాడి దగ్గరికి పోయి "బండిని కొంచెం ఎత్తి చక్రాన్ని గిరగిరా తిప్పగలవా?" అన్నారు.

బండి వా డాశ్చర్యపోయి "ఎందుకు బాబూ, అలా అడుగుతున్నా" రన్నాడు.

"నాకు అలా ఓసారి చూడాల్నుంది" అన్నారు.

నేనూ, నా స్నేహితుడూ నట్టెండలో నిలబడి ఆ సంభాషణ వింటున్నాము.

శాస్త్రిగారు జేబులో చెయ్యి పెట్టి "డబ్బులిస్తాను, ఓసారి చక్రం తిప్పు - చూడాలి" అన్నారు.

ఏం బుద్ధి పుట్టిందో ఆ బండివాడు బండి ఒక వేపుకి ఎత్తి అడ్డంగా పెద్ద రాయి పెట్టి ఒకవేపు చక్రాన్ని గిరగిరా తిప్పేశాడు.

శాస్త్రిగారు ప్రపంచాన్నే మరిచిపోయి ఆ చక్రాన్ని, ఆ చక్రం మధ్య ఉన్న ఇరుసునీ చూస్తూ నిలబడిపోయారు. ఓ నిమిషం తర్వాత "సరే" అని, వాడి చేతిలో అర్ధరూపాయి పెట్టారు. "బండి కావాలా బాబూ?" అన్నాడతను. శాస్త్రిగారు వెనక్కొచ్చేశారు.

ఆ సాయంకాలమే మా వార్షికోత్సవం. నాలుగ్గంటలవుతోంది. ఇంకా స్టేషన్లోనే ఉన్నాం. దైవికంగా ఆ సమయానికి భానోజీరావుగారు స్టేషనుకు వచ్చారు. నేను పరుగెత్తుకుంటూ వెళ్ళి నా బాధ చెప్పి, ఆయన కార్లో మా కాలేజీదాకా మమ్మల్ని తీసుకెళ్ళమని అభ్యర్థించాను.

భానోజీరావుగారి తాతగారే మా కాలేజి వ్యవస్థాపకులు. ఆయన వెంటనే, డ్రైవరుతో మమ్మల్ని కాలేజీలో దింపిరమ్మని చెప్పారు.

శాస్త్రిగారితో చెప్పి ఆయన్ని కార్లో ఎక్కించుకుని బయల్దేరాం. దార్లో ఆయన చెప్పారు. రైల్లో ఎవరో ఒకాయన, వాల్తేరు దిబ్బమీదనుంచి ఓ పెట్టిబండి బోర్లగిలా పడి అందులో ఇరుక్కుపోయిన ప్రయాణీకులకు బయటపడ్డం ఎంత కష్టమయిందీ, ఆ బండి చక్రం ఓ అరగంట దాకా ఎలా గిర్రుమని తిరుగుతూనే ఉండిపోయిందీ - ప్రత్యక్షంగా చూసి వర్ణించాడుట. రైల్లో కూచున్నంత సేపూ ఆ బండి చక్రం కళ్ళముందు గిర్రున తిరుగుతూండటం, రైలు దిగి వెనక్కి వెళ్ళిపోవాలనిపించటం కలిగిందట శాస్త్రిగారికి.

నే నన్నాను- "విశ్వనాథ సత్యనారాయణగారు వచ్చినప్పుడు, ఆయన్ని పెట్టిబండిలోనే ఎక్కించి తీసుకువెళ్ళాను. ఆయన సంతోషించారు" అని.

శాస్త్రిగారు మొహం అటు తిప్పి "విశ్వనాథ సత్యనారాయణ ఏదయినా ఎక్కగలడు" అని నవ్వారు. "అతని శక్తి నా దగ్గర్లేదు. శార్దూలాలూ, మత్తేభాలూ ఎక్కిన వాడేదయినా ఎక్కగలడు- తెలుసా?" ఇంకా నవ్వుతున్నారు. "నేనూ ఎక్కాను - చాతకాలా" అంటూంటే కాలేజీలోకి ప్రవేశించాము.

ఆ సాయంకాలం మా వార్షికోత్సవం. బహిరంగ సమావేశం. శాస్త్రిగారు సహజంగా మహావక్త. ఆయన ఆవేళ ఆధునిక సాహిత్యం మీద మాట్లాడుతూ బళ్ళమీద తనుచేసిన అనేకానేక ప్రయాణాల అనుభవాలను హాస్యస్ఫోరకంగా మధ్య మధ్య ప్రస్తావించారు. చివర తన కవిత్వ పఠనం చేశారు. ముగిస్తూ, ఆయన రాసిన-

**ప్రాణసఖుడె నా కోసమై పంపినాడు**
**పల్లకీ అన హృదయమ్ము జల్లు మనియె!**

పద్యాన్ని అత్యంత రసవంతంగా గానం చేశారు. సదస్యులు ఒక్క పెట్టున కరతాళధ్వనులు చేశారు. సభానంతరం ఆయన్ని తీసుకుని హాస్టలుకి పోతున్నాను. దారిలో "ఈసారి స్టేషనుకి పల్లకీ పట్టుకు రానా?" అన్నాను. ఆయన ఒకటే నవ్వు. ఇప్పటికీ మరిచిపోను.

*                    *                    *

ప్రసిద్ధులైన ఆధునిక కవుల్లో ఒక్క కృష్ణశాస్త్రిగారే కృష్ణశాస్త్రిగా నిలిచారు. తతిమ్మా కవులను ఇంటిపేరుతోనే గుర్తుపట్టగలం. రాయప్రోలు, అబ్బూరి, బసవరాజు, నండూరి, విశ్వనాథ, వేదుల - అలా ప్రశస్తి పొందారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిని మాత్రం కృష్ణశాస్త్రిగా వ్యవహరిస్తారు. అలా వ్యవహరించటం చేత ఆయన కేదో విశేషాన్ని ఆపాదించారేమో అనుకునేవాణ్ణి. ఓసారి కాకినాడలో ఆయన్ని కలుసుకున్నప్పుడీ సంగతి చెప్పాను. ఆయన నవ్వారు.

"ఎంచాతనో నాకు తెలీదు- నే ననుకోవటం ఒకటుంది. రాయప్రోలూ, అబ్బూరీ, విశ్వనాథ అంటే వాళ్ళ కవిత్వమే అందరికీ గుర్తుకు వస్తుంది. కృష్ణశాస్త్రి అంటే నా కవిత్వంతో పాటు, నా వేషం కూడా గుర్తుకొస్తుందనుకుంటాను" అంటూ నవ్వుతూనే అన్నారు.

కృష్ణశాస్త్రిగారి వాచికంలో హాస్యస్ఫూర్తి ఉండేది. హేళన కాకుండా అవహేళన ఉండేది. ఆధునిక రచయితల్లో నే నెరుగున్న వారందరిలో మా నాన్నగారూ, గుడిపాటి వెంకటచలంగారూ, కృష్ణశాస్త్రిగారూ ఈ ముగ్గురే ప్రతిభావంతులైన హాస్యప్రియులు. వెంకటచలంగారితో ఓ అరగంటసేపు మాట్లాడితే చాలు - నవ్వి నవ్వి ఎవరికయినా ఆకలి వెయ్యకమానదు. వెంకటచలంగారితో మాట్లాడటానికి కూచున్నప్పుడు పోలేపెద్ది సుబ్బారావుగారు రెండో, మూడో అరటిపళ్ళు

దగ్గర పెట్టుకుని కూచునేవారు. ఆ తరవాత ఆ పళ్ళ రహస్యం నా కర్థ మైంది. వెంకటచలం గారి పక్కన కూచుని నవ్వి నవ్వి అరటిపళ్ళు తినేసేవారు. ఆ అనుభవం నాకూ ఉంది. వెంకటచలంగారూ, కృష్ణ శాస్త్రిగారూ కూచుని మాట్లాడితే ఆకాశమే నవ్వేది. కృష్ణశాస్త్రిగారు, మా నాన్నగారిలా సమయస్ఫూర్తితో హాస్య ప్రతిష్ఠ చెయ్యగలరు. రిపా ర్టీలో, పన్‌లో వాళ్ళిద్దరూ సిద్ధహస్తులు. అంచాతనే అనుకుంటాను- వెంకటచలంగారూ, కృష్ణశాస్త్రిగారూ, మా నాన్నగారూ ఒకర్నొకరు అభిమానించుకుంటారు. అంతేకాదు, తెలుగుజాతికి హాస్యస్ఫూర్తి తక్కువ అని అభిప్రాయపడేవాళ్ళు. అది లేనందువల్లనే ఏ రంగంలోనూ పురోగమించలేకపోతున్నారని బాధపడేవాళ్ళు. ఇప్పుడు నా కనిపిస్తుంది- యాదృచ్ఛికమే కానీండి. వాళ్ళు ముగ్గురూ తెలుగుదేశానికి దూరంగా దివంగతులయ్యారు! వాళ్ళు ముగ్గురూ వివిధ సన్నివేశాలలో సృష్టించిన హాస్యోక్తుల్ని ఎవరూ గ్రంథస్థం చెయ్యలేదు. ఆ ముగ్గురితో సన్నిహితంగా తిరిగిన వ్యక్తులూ చాలామంది కీర్తిశేషులే. తెలుగుదేశం దురదృష్టం అనాలి. మరో దురదృష్టం కృష్ణశాస్త్రిగారి పద్య పఠనం రికార్డు కాక పోవటం. ఆయన పద్యం చదువుతుంటే వినటం అదొక విచిత్రానుభవమని చెప్పాలి.

కృష్ణశాస్త్రిగారు ఎన్నో చాటువులు చెప్పారు. అవన్నీ ములుకుట్ల వెంకటశాస్త్రిగారి దగ్గర ఉండేవి. ఓసారి కృష్ణశాస్త్రిగారితో నేను ప్రస్తా వించాను- ఆయనవీ, ఇతరాధునిక కవులవీ- అశ్లీల ప్రాయాలయిన చాటువుల్ని కలిపి ఓ పద్య సంకలనం తయారుచేస్తానన్నాను. శాస్త్రిగా రాపని చేసిపెడతానన్నారు. ఆయన చెయ్యలేదు. ఆ పద్యాలేమ య్యాయో తెలీదు. అశ్లీలప్రాయమనుకున్న పద్యాలు కూడా హాస్యస్ఫో రకంగా శాస్త్రిగారు రాసేవారు. కొన్నిట్లో 'అశ్లీలత' చూచాయగా కనిపిస్తుంది. ఆయన శ్రీ తిరుపతిగారి మీద ఓ పద్యం చెప్పారు.

ముడి యొకడు, బాహుమూలలు మరి రెండు;
దాడి యొకడు, తమిళనా డొకండు
వెరసి పంచశిఖలు తిరుపతి యోగికి
విశ్వదాభిరామ! వినురవేమ!

ఇలాంటి వెన్నో - జ్ఞాపకానికి రావు. శాస్త్రిగారోసారి నన్నడిగారు-తను రాసిన పద్యాల్లో నాకు నచ్చిన పద్యమేమిటని. నేను వినిపించాను--అప్పుడు నేను ఢిల్లీలో ఉండేవాణ్ణి.

నా కనుల క్రాగు చీకట్లు ప్రాకుచోట
లేదు నెత్తావి, మధువేని లేదు, లేదు
ప్రాణ, మొక్క లావణ్యలవమ్ము లేదు;
ఏను రుజనైతి, జరనైతి మృత్యువైతి!

"పదిహేనేళ్ళ క్రితం స్టీఫాన్ జ్వీగ్ రాసిన ఓ కథ చదివాను. ఆ కథ పేరు 'ఎ లెటర్ ఫ్రం యే నన్నోన్ ఉమన్'. ఆ ఉత్తరం రాసిన స్త్రీని తలచుకుంటే పై పద్యం చటుక్కున స్ఫురిస్తుంది. ఈ విషయం నేనోరేడియో ప్రసంగంలో రాశాను" అని అన్నాను. శాస్త్రిగారి చాత ఆ కథ చదివించాను. ఆయనా ఆశ్చర్యపడ్డారు- తన పద్యానికి ప్రతిబింబ రూపంగా ఆ కథానాయిక వర్ణితం కావటం-

చాలాకాలం క్రితం, నేను జైల్లో ఉన్నప్పటిమాట. ఓసారి చిత్రపు నాగరాజుగారూ, పాలగుమ్మి పద్మరాజూ నన్ను చూడటానికి వచ్చారు. ప్రసంగవశాత్తు కృష్ణశాస్త్రి గారు నన్ను చూద్దామనుకుంటున్నారనీ, నా యోగక్షేమాలు కనుక్కోమన్నారనీ పద్మరాజు నాతో అన్నాడు. 'చెరకాలం' రాస్తున్న రోజులు. అందులో శాస్త్రిగారి నుద్దేశించి రాసిన పద్యాలు పద్మరాజుతో పాటు శాస్త్రిగారికి పంపాను:

ఆశలే చివురించని శైశవాన
మీ కవిత్వాన్ని నేనంత మెచ్చుకొంటి
ఊర్వశీ ప్రవాసమ్మున పూర్వగతిని
కంఠపాఠ మ్మొనర్చిన గాథ కలదు।

పరమ పాశ్చాత్య కవితా ప్రభావవిధిని
కడకు శ్రీశ్రీ యవతరణ కారణమున
తమ కవిత్వమ్ము మీద ఆదరము కొంత
సడలిపోయిన మాట వాస్తవము కూడ।

మీ శిరోజాలు రోజాల రాశివోలె
మారిపోయిన ప్రాయాన మంచి మంచి
పాట లెన్నెని వ్రాసిరి నేటి దనుక
మరల నా యభిమానమ్ము తిరిగి వచ్చె।

నేడు చెరసాల మృత్యు సాన్నిధ్యమందు
నా కొరకు నా విచిత్ర దైన్యమ్ము జూచి
చెమ్మగిలు నయనమ్మెని చెంతలేదు
ఏలకో నా యెడంద మీ మ్రోల వ్రాలు।

ఆ తరవాత రెండు వారాల్లో శాస్త్రిగారు తిరిగి పద్యాలు రాసి పంపించారు. అవి పోయాయి. అవి మొత్తం అయిదా రనుకుంటాను. అందులో ఒకటి లీలగా గుర్తు:

**కారుమబ్బు వానకారు, వాగులు పొంగి**
**నిండి నదులు, వరద నింగి కెగసి**
**వానలోన నీవు, వాన కావల నేను!**
**అంతే బతుకు, చివరి కంతె, అంతె!!**

శాస్త్రిగారు లేరు. ఇప్పటికీ అనిపిస్తుంది నాకు : వానలోన నేను, వాన కావల మీరు!

# మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి

తెనాలి. యుద్ధకాలం. మేము నాజరు పేటలో ఓ పెద్ద మేడలో ఉండే వాళ్ళము. అప్పుడు మా నాన్నగారు 'సటాలి' సంస్థను నిర్వహిస్తుండేవారు. పగలల్లా పని చేసేవాళ్ళము. ప్రదర్శనలు లేనప్పుడు సాయంకాలాలు తెనాలి గాంధీచౌకులోనూ, రత్నా టాకీసు పక్కనా కాలక్షేపం చేసే వాళ్ళము.

గాంధీ చౌకు దగ్గర ఒక వేపున గుడ్‌విల్ అండు కో అనే దుకాణం ఉండేది. ఆ దుకాణంలో వివిధ క్రీడా పరికరాలు అమ్మేవారు- ముఖ్యంగా బాడ్మింటన్. ఆ దుకాణం యజమాని విష్ణుభొట్ల గోపాలకృష్ణమూర్తి గారని గుర్తు. ఆ దుకాణంలో సాయకాలం నాలుగైదు గంటలకల్లా ఒక ఆకర్షవంతమైన విగ్రహం కనిపించేది. కోరా రంగు ఖద్దరు లుంగీ, ఖద్దరు బనీనూ, ఓ చిన్న తువాలా. ఓ కుర్చీలో ఓ పక్కన ఆ దుకాణంలో కూచుని ఉండేవాడు. విశాల వదనం, పెద్ద కళ్లూ, నుదురూను. తాంబూల సేవనం వల్ల ఎర్రని నోరు- కళ్ళలో గూడా ఓ రకం అయిన ఎర్రదనం ఉండేది.

అగు నితడు స్వయం వ్యక్తుడు
భగవంతుడు గురువు, వీని పొందితి కేనో
నగుబాటుం గురువును వీ
ని గుణాఢ్యత్వము మాన నీయమ్మెందున్.

ఈ పద్యం చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిది. ఈ పద్యంలో ప్రస్తావించిన స్వయం వ్యక్తుడే ఆ దుకాణంలో కూచునే ఆయన. ఆయన

పేరు మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి.

ఆ దుకాణాని కెదురుగా గాంధీ చౌకులో మరో రెండు మందుల దుకాణా లుండేవి. ఓ దుకాణంలో అదే సమయానికి మరో వ్యక్తి వచ్చే వాడు. అతని పేరు చక్రపాణి. అసలు పేరు ఆలూరి వెంకట సుబ్బా రావు. దాని పక్క దుకాణంలోకి మరొకాయన వచ్చి పోతూండటం చూసే వాళ్ళం అదే సమయానికి. అతని పేరు ధనికొండ హనుమంతరావు.

తెనాలిలో ఉండగా, ఆ ముగ్గురితోనూ నాకు పరిచయమయింది. కాని, నాకు బుచ్చి సుందరరామశాస్త్రి గారితో వీలయినంతసేపు కాల క్షేపం చెయ్యాలని కోరిక ఉండేది. తెనాలిలో నేనున్న ఆర్నెల్లా ఊళ్ళో ఉన్నప్పుడల్లా గాంధీచౌకు వేపు ప్రతి సాయంకాలం వెళ్ళటం, అలా వెళుతూన్నప్పుడు, బుచ్చి సుందరరామశాస్త్రిగారి వేపు నేను చూడటం, ఆయన నన్ను చూసి మందహాసం చెయ్యటంతోటే నేను దుకాణంలోకి పోయి ఆయన పక్కన కూచోటం, ఆయన మాటలాడుతూంటే వినటం పరిపాటయిపోయింది.

కొన్నాళ్ళ తరవాత ఆయనా, నేనూ కలిసి కాలవ వొడ్డున నడుస్తూ మాటాడుతూ పోయేవాళ్ళం. నే నంటే ఆయనకో రకమైన అభిమానం కలగటమూ, నా చేత అదేపనిగా కవిత్వం రాయించాలని ఆయన ఆశించ టమూ కారణంగా నాతో తరచూ మనసువిప్పి మాటాడుతుండేవాడు. ఆయన కడియంలో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి దగ్గర శుశ్రూష ఎలా చేసిందీ చెబుతుండేవాడు. వెంకటశాస్త్రిగారి దగ్గరికి ఆయన చదువుకోవాలని పోలేదుట. శాస్త్రిగారిలో ఉన్న వైశిష్ట్యాన్ని పరిశీలించి అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించాడుట. వెంకట శాస్త్రిగారు కూడా బుచ్చి సుందరరామశాస్త్రిగారిలో అంతర్గతమయిన ప్రతిభను గుర్తించి ఏం మాట్లాడేవారు కాదుట. అయితే బుచ్చి సుందర రామశాస్త్రిగారు తెనాలి

మీద మమకారం వల్ల వెనక్కొచ్చేశారు.

పద్యం చదవటంలో వెంకటశాస్త్రిగారినీ, వేలూరి శివరామశాస్త్రి గారినీ, ఆఖరికి విశ్వనాథ సత్యనారాయణ గారినీ మించిన ప్రజ్ఞ కలవారని ఆనాటి సమకాలికులు చెప్పగా నేను విన్నాను. వెంకటశాస్త్రిగారు పద్యం చదివే బాణి నాకు తెలీదు. విశ్వనాథ సత్యనారాయణగారి పద్య పఠనం నేను చాలాసార్లు విన్నాను. ఆయనదో విశిష్ట ఫణితి. బుచ్చి సుందరరామశాస్త్రిగారి శైలి మనం వర్ణించలేము. విని ఆనదించవలసింది. వెంకటశాస్త్రిగారు హాస్యప్రియులు. చతురోక్తిలో అందెవేసిన చెయ్యి. బుచ్చి సుందరరామశాస్త్రిగారూ అంతే. వెంకటశాస్త్రిగారి శిష్యులలో ఒక్క బుచ్చి సుందరరామశాస్త్రిగారే సంగీత నిష్ణాతులని తెలిసినంత వరకూ నా ఊహ. ఆయన తాళం వేస్తూ పాడగలడు. హరిజనోద్యమంలో ఆయన కొన్ని పాటలు రాయటం, వాటిని ఊరేగింపుల్లో పాడటం జరిగేది. నే నోసారి ఆయన్ని ఓ పాట పాడమని అడిగాను, ఆ పాటలు ఎక్కడా లభించేవి కావు. ఆయన మెల్లగా—

**అంటరాని వా రెవరో కారు మా**

**వెంట రానివారె....**

అంటూ కూచున్న కుర్చీ మీద చేతికర్రతో తాళం వేస్తూ ఎంత మనోహరంగా పాడాడో నేను వర్ణించలేను.

నే నాయన్ని మొదటిసారిగా పరిచయం చేసుకున్నప్పుడే ఆయన ఆరోగ్యం అంత బాగుండేది కాదు. అయితే ఆ విషయం మాట్లాడేవాడు కాదు.

"తెనాలి నుంచి మరే చోటికైనా పోతే శరీరమూ, మనస్సూ ప్రశాంతి చెందుతాయేమో?" అనేవాడు. "అయితే, తెనాలిని ఈ జన్మలో వదలటం కష్టమోయ్!" అనేవాడు.

ప్రాసంగికంగా ఆయన ఎన్నో చాటువులు చెప్పేవాడు. నా కర్మ కాలి నా కొక్కటీ గుర్తుకు రావటంలేదు. అది ఆయనదే తప్పను కుంటున్నాను. ఎంచాతనంటే, ఆయనతో వాహ్యాళికి పోతూ మాట్లాడు తుంటే మధ్య మధ్య ఆయన చెప్పేది వచనమో, పద్యమో అర్థం అయేది కాదు. ఉత్సాహంగా ఉన్నప్పుడు ఆయన రసవత్తరంగా సంభాషించే వాడు. 'కవిత్వంవల్ల తెలుగునాట బతకటం కల్ల' అని స్వీయానుభవంలో గుర్తించి తపించాడాయన. ఒకరో ఇద్దరో - తమ గురువు గారితోపాటు - కవిత్వం వల్ల జీవించగలిగారు. తతిమ్మావారు తదితర వ్యాపకాలను పెట్టుకోవలసి వచ్చింది ఉదర నిమిత్తం. తమ గురువుగారు కూడా ఒకానొక నిస్సహాయ పరిస్థితిలో "బొంగు బుజాన వైచికొని పోయెద మెచ్చటికేని, ముష్టి చెంబుం గొనిపెట్టుమయ్య" అని ఓ జమీందారుని కోరక తప్పిందికా దనేవాడు. బుచ్చి సుందరరామశాస్త్రిగారి చాటువులు అసంఖ్యాకం. ఆయన హాస్యస్ఫూర్తి అనితర సాధారణం. అవన్నీ ఎవరైనా సేకరించాలి ఇప్పటికయినా.

ఆయన కవిత్వం మహోన్నతమయిందని నా అభిప్రాయం. ఆయన కవిత్వాన్ని నమ్ముకుని హతాశుడయిన మహావ్యక్తి. కవిత్వం మీద విశ్వాసం పోగానే ఆయనకి దేశం మీదా, దేహం మీదా విరక్తి పుట్టింది. దారిద్ర్యాన్ని అనుభవించాడు రుగ్మతనూ ఆకర్షించాడు. ఒకా నాక సభలో - గుంటూరులో అనుకుంటాను - అదే ఆయన ఆఖరి బహిరంగ దర్శనం - "నేను స్వర్గాన్ని కాంక్షించను. ఎందుకంటే, స్వర్గం అంటే ఎలా ఉంటుందో తెలీదు. నరకానికే పోతాను. నాకు నరకమంటే ఏమిటో తెలుసు. ఈ లోకంలో స్వానుభవం వల్ల తెలుసు" అన్నాడు. ఆ సభలోనే ఆయన ఆఖరిసారిగా గొంతువిప్పి గానం చేశాడని గుర్తు.

ఆయనకు తెనాలి మీద విపరీతమైన మమకారం ఉండేది. మాది తెనాలి కావటంవల్ల నామీద కొంచెం ఎక్కువ మోతాదులో అభిమానం చూపించేవాడు.

రసజగన్నాథ నటరాజ రంజమాన
మంజుతారాళి అద్దియె మా తెనాలి!

అంటూ ఓ చాటువులో అన్నారు. ఒసారి ఆయనా, నేనూ కలిసి తెనాలి కాలవ పక్కనుంచి నడుస్తున్నాము. ఆయనకి చెప్పుల్లేవు. అక్కడ రెండు, మూడు బొమికల్ని చూసి ఆయన చెయి పట్టుకుని ఆపాను, క్రింద చూస్తూ నడవమని. ఆయన ఓసారి కిందకి చూసి నా భుజంమీద చెయ్యి వేసి ఆకాశం వంక చూస్తూ-

చూడం జూడ మహాశ్మశాన మనిపించున్
నాకు నీ లోక, మిం
దేడన్ గాలిడబోవ నేరిపయినో
యే వేయుచున్నట్టులే
లో దక్కయ్యెడిగాని నీ మహిమ
యాలోనే నివారించి, నీ
క్రీడారంగమటన్న మాట స్మృతికిం
గీలించు మృత్యుంజయా!

అని ఉచ్చస్వరంతో ఆలాపించాడు. నాకు కాళ్ళు వణికినై. భయం వేసింది. ఆయన పద్యం అయింతరవాత గట్టిగా నవ్వాడు. "వెనక్కి పోదాం పద - జీవితంలో ఎప్పుడూ ముందుకు పోలేం" అన్నాడు.

# అబ్బూరి రామకృష్ణరావు

1919 ప్రాంతం. కలకత్తాలో బౌ బజారు వీథిలో ఒక సభా ప్రాంగణం. అక్కడ వంగ దేశీయాంధ్ర సమితి వార్షికోత్సవం జరుగుతోంది. ఆ సమితికి అధ్యక్షులు (సర్) సి.వి. రామన్‌గారు. ఉపాధ్యక్షుడొక విద్యార్థి. అలాంటి సమావేశాలకు ఆంధ్రులందు ఆదరమూ, అభిమానమూ కలిగిన ఒక ప్రఖ్యాత వంగ పండితుణ్ణి సమితివారు ఆహ్వానిస్తుండేవారు. ఆ ఏడు విఖ్యాత తర్క విద్యావేత్తా, "ఎ హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్" అనే మహా గ్రంథానికి కర్తా అయిన సతీశచంద్ర విద్యాభూషణులు అధ్యక్ష స్థానం అలంకరించారు. సి. వి. రామన్‌గారు ఓ రెండు ముక్కలు మాట్లాడారు. ఆ తరవాత ఉపాధ్యక్షుడయిన విద్యార్థి ఓ అరగంటసేపు అనర్గళంగా సంస్కృతంలో సభాసదులనుద్దేశిస్తూ ఉపన్యసించాడు. సి. వి. రామన్‌గారికి కొంచెం సంస్కృత జ్ఞానం ఉన్నది. ఉపన్యాసానంతరం రామన్‌గారు ఉపాధ్యక్షుణ్ణి భుజం మీద తట్టి, దక్షిణ భారత గౌరవాన్ని నిలబెట్టావని అభినందించారు. సదస్యులలో ఆసీనులై ఉన్న సహ విద్యార్థులు, మాగంటి బాపినీడూ, ఉప్పల లక్షణరావూ ఆనందంతో కరతాళధ్వనులు చేస్తూనే ఉన్నారు. ఆ తరవాత సతీశచంద్ర విద్యాభూషణులు ప్రసంగిస్తూ, ఆంధ్రుల ప్రాచీన వైభవాన్ని ప్రశంసిస్తూ, తెలుగు మేధావు లెంత ప్రతిభాసంపన్నులో గుర్తించాలంటే, అప్పుడే ప్రసంగించిన ఉపాధ్యక్షుడి వైదుష్యాన్ని పేర్కొనవచ్చు నన్నారు. ఉపాధ్యక్షుడి పేరు అబ్బూరి రామకృష్ణరావు- మా నాన్నగారు.

ఆ సభలో ప్రత్యేకంగా ఆహూతులైన వారిలో హేరంబ మైత్రగారున్నారు. హేరంబమైత్రగారా రోజుల్లో ప్రసిద్ధి కెక్కిన సిటీ కాలేజీలో ప్రిన్సిపాలుగా పనిచేస్తున్నారు. మా నాన్నగారక్కడ విద్యాభ్యాసం చేస్తున్నారు. హేరంబమైత్రగారు అత్యంత ప్రముఖ విద్యావేత్తగా వంగ రాష్ట్రంలో పేరుపొందినవారు. బ్రహ్మసమాజాభిమాని.

1916 సంవత్సరం దాకా ఓ రెండేళ్ళు మైసూరు సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసం చేసి కలకత్తాకు వచ్చారు మా నాన్నగారు. మైసూరులో ఉండగా రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు సంస్కృత కళాశాలలో సహాధ్యాయిగా ఉండేవారు. సంస్కృత కళాశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడే మా నాన్నగారు రాసిన 'మల్లికాంబ' ప్రచురితమయింది. కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆ రోజుల్లో మైసూరు ప్రభుత్వంలో విద్యాశాఖలో ఉద్యోగం చేస్తుండేవారు. ఓ రోజున ఓ 'మల్లికాంబ' ప్రతి ఆయన కళ్ళ పడ్డది. వెంటనే ఇంటికి తీసుకుపోయి పదే పదే చదివారుట. అనంత కృష్ణశర్మ గారికి కట్టమంచి రామలింగారెడ్డి గారితో సన్నిహిత పరిచయం అప్పటికే ఉంది. ఆ మర్నాడు శర్మగారు అతన్ని చూడటానికి వచ్చినప్పుడు రామలింగారెడ్డిగారు 'మల్లికాంబ' ప్రతిని చూపించి, తెలుగు కవిత్వానికి మాంచి భవిష్యత్తుందని గ్రహించానని చెప్పారుట. ఆ గ్రంథకర్త ఎక్కడి వారో, ఎవరో తెలుసుకోమన్నారుట. అనంతకృష్ణశర్మగారు చటుక్కున "ఆ అబ్బాయి మన కళాశాలలోనే చదువుతున్నాడండీ!" అని చెప్పటం, మరి కొన్ని రోజులకే ఆయనతో పాటు మా నాన్నగారు రామలింగారెడ్డిగారింటికి పోయి సన్నిహిత వర్గంలో ఒకరై పోవటం జరిగింది. ఆ తరవాత ఆ ముగ్గురూ కలిసి కవిత్రయం రాసిన మహాభారతాన్ని పారాయణం చేసి పునః పరిశీలించటం చేసేవారు. అప్పటికే మా నాన్నగారు కవిగా లబ్ధ ప్రతిష్ఠులు.

ఆ రోజుల్లో "ఆంధ్ర భారతి" అనే సారస్వత పత్రిక ఉండేది. అందులో గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు, మా నాన్న గారూ తమ కృతులను ప్రకటించేవారు. 'ఆంధ్ర భారతి' తరవాత 'ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వం' అనే పత్రిక వచ్చింది. అందులోనూ ఈ ముగ్గురూ రాసిన ఖండ కావ్యాలను ప్రచురించేవారు. ఆ పత్రికా సంపాదకులు అయ్యంకి వెంకట రమణయ్యగారు. ఓసారి - 1962 ప్రాంతం అనుకుంటాను - వెంకటరమణయ్యగారు నాకు బెజవాడలో కనిపించారు. నే నాయన్ను నాశైశవంనుంచీ ఎరుగుదును. ఆ మాటా, ఈ మాటా వచ్చి- ఆధునిక కవిత్వానికి గురజాడ, రాయప్రోలు, అబ్బూరి కవిత్రయం లాంటి వారన్నారు. ఆధునిక కవిత్వానికి ముగ్గురూ మార్గదర్శకులు కావటమే కాక, వారి రచనలు ఒకే కాలాన ప్రచురితం కావటం విశేషం.

మా నాన్నగారు కలకత్తాకు వచ్చేటప్పటికి ఇరవై సంవత్సరాల వయస్సు. సోదరాంధ్రులలో ఆయన పేరు అప్పటికే సుపరిచితం కావటంవల్ల ఆయన కలకత్తాలో వంగదేశీయాంధ్ర సమితికి ఉపాధ్యక్షులుగా ఎన్నికయారు. మా నాన్నగారికి పూర్వం అదే పదవిని అక్కిరాజు ఉమాకాన్తంగారు నిర్వహించారు. ఆయన ఆ రోజుల్లో నవ ద్వీపంలో సంస్కృతం అభ్యసించి పేరు సంపాయించారు.

వంగ దేశీయాంధ్ర సమితి వార్షికోత్సవం అయిన అయిదారు రోజులకి హేరంబమైత్ర మా నాన్నగారిని తన గదిలోకి పిలిపించుకుని ఆయన సంస్కృతోపన్యాసాన్ని అభినందించారుట. అంతేకాదు, అక్కడే ఉండిపొమ్మని సలహా చెప్పారుట. రవీంద్రనాథ ఠాకూరు గారితో హేరంబమైత్రగారికి సన్నిహిత పరిచయం ఉండేది. ఆ పరిచయాన్ని పురస్కరించుకుని, విశ్వభారతిలో కూడా చదువుకోవచ్చునని, ఆర్థిక సమస్యలుండవనీ సూచించారుట.

మా నాన్నగారు నవ్వి ఊరుకున్నారు. అప్పటికే తెలుగుదేశానికి తిరిగిపోవాలని తాపత్రయపడుతుండేవారు. తెలుగువారి మధ్య బతకాలనే కోరిక అనుక్షణం ఆయన్ని వెంటాడుతూండటంవల్ల ముందుగా ఆనర్సులో చేరి, తరువాత ఒక్క బి.ఏ.నే నిర్ణయించుకోవటం జరిగింది. హేరంబమైత్రగారి గది నుంచి కళాశాల ఆవరణలోకి వచ్చారు. అటూ ఇటూ ఎత్తుగా తమాల వృక్షాలు - ఆకాశం వంక చూస్తూ ఏం చెయ్యాలనే ఆలోచనలో పడి నడుస్తున్నారు. అంతలోకి తను కలకత్తాలో కాలు పెట్టగానే రాసిన పద్యాలు గుర్తుకొచ్చినాయి :

నోటినిండ భుజింపఁగ నోఁచికొనము
ఉదయగీతుల పాడ నోచెదము కాని,
కన్న తల్లుల ప్రేమమార్గమ్ముఁ గనము
లలితగతి వీణ వాయింపగలము గాని,
తొడిమ లెడసేయగా రాలి పడిన పూల
వలపులేవి? భిక్షాందేహి భవతి! భవతి!

స్వాదు కృష్ణానదీ జలస్నానములను
పులక లొలయగ వినయాంజలులు ఘటించి
నవ్యగీతాశుభాధ్యయనమ్ముఁ జేయు
సోదరకుమారకు లెదురు సూచుచుండ్రు
తడవు సేయక మాతృవాత్సల్య మింత
తిరుగు బిడ్డల కిమ్మింక, మరలి యరుగ
వలయుఁదల్లి! భిక్షాందేహి భవతి! భవతి!

*　　*　　*

మా నాన్నగారు కలకత్తా విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉన్నప్పుడే ఆయన పద్యసంకలనం మదరాసు నుంచి వెలువడింది. ఆ పుస్తకం పేరు 'ఊహాగానం- పూర్వప్రేమ." ఈ పుస్తక ప్రచురణ 1918. ఆ రోజుల్లో ఆ పుస్తకం బహుళ రసికామోదంపొంది, ఆధునికాంధ్ర కవిత్వానికి శ్రీకారం చుట్టిన కొద్ది పుస్తకాల్లోనూ ఒకటయింది. "ఊహా గానం" వ్యాకరణరీత్యా దుష్ట సమాసం. "ఊహగానం" అని ఉండాలి. అయితే శ్రవఃపేయంగా ఉండేందుకు మా నాన్నగారలా స్వతంత్రించి ఉపయోగించడంవల్లనూ, ఆయన సంస్కృత జ్ఞానాన్ని శంకించలేక పోవడంవల్లనూ, అందరికీ అంగీకారయోగ్యమై, ఒక వినూత్న రూఢ పదం అయిపోయింది. ఈ రోజుల్లో పత్రికలు వాడే పదజాలంలో కూడా చోటు చేసుకుంది.

ఈ పద్య సంకలనంలో మా నాన్నగారు తెలుగు పద్య ప్రచురణలో ఒక విప్లవాత్మకమైన పద్ధతి ప్రారంభించారు. తెలుగు వాఙ్మయంలో మొదటిసారిగా పద్యాల పేర్లు తీసిపారేశారు. ఆ రోజుల్లో అదో విడ్డూరం. తరవాత తతిమ్మాకవులు తమ పుస్తకాలు అచ్చువు తున్నప్పుడు ఈ పద్ధతినే అనుసరించారు.

ఈ సంకలనంలో ఆ కాలంలో అంతర్జాతీయఖ్యాతి పొందిన కోడి రామమూర్తి మీద మా నాన్నగారు రాసిన పద్యం ఉంది. మా నాన్న గారు కలకత్తాలో విద్యార్థిగా ఉన్నప్పుడు కోడిరామమూర్తిగారు కలకత్తాలో ప్రదర్శన లిచ్చేవారు. వరసగా ఓ రెండు, మూడు నెలలు ప్రదర్శనలు నడిచేవి. ఆయనమీద అభిమానంకొద్దీ మా నాన్నగారు "ఆంధ్ర వీర కంఠీరవ" అనే పద్యాన్నిరాసి రామమూర్తిగారికి పంపారు. రామ మూర్తిగారు వెంటనే మా నాన్నగారున్న ఇంటికివచ్చి చూసి, ఆయన అంత చిన్నవారని ఆశ్చర్యపడిపోయారట. ఆ పద్యాన్ని సిలుకు రుమా ళ్ళమీద అచ్చొత్తించి తెలుగువారికి పంచిపెట్టారుట రామమూర్తిగారు.

"నీ యశఃపారిజాతమ్ముల మాల" అనే పంక్తితో ప్రారంభమవుతుంది పద్యం. ఈ ఒక్క పంక్తినీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి తెలుగు దేశంలో ఆనాటి ప్రతికవిముందూ చదివేవాడు. "యశఃపారిజాతమ్ములు" అనే పదసందోహం ఒక్క అబ్బూరి రామకృష్ణరావుకే చేతనవుననేనాడు. మా నాన్నగారంటే శాస్త్రికెంత అభిమానం! కోడి రామమూర్తిగారు తన ప్రదర్శనల్లో ప్రత్యేకాహూతులకు వేరుగా, ముందుగా ఆసనాలు వేయించి ఉంచేవారు. ఆయన ప్రదర్శనలకు గవర్నర్లూ, మహారాజులూ, ఆంగ్లేయ ప్రముఖులూ హాజరయేవారు. అలా ఆసనాల పక్కగా మా నాన్నగారికీ, మా అమ్మగారికీ రెండు కుర్చీలు ప్రతిరోజూ కేటాయించి ఉంచేవారు. ఓ రోజున గవర్నరుగారి కుటుంబం వచ్చి మా నాన్నగారికి కేటాయించిన రెండు కుర్చీలూ తీసుకుంటామన్నారుట. రామమూర్తిగారు ఒప్పుకోక, "ఆ కుర్చీలు అలా ఉండవలసిందే, లేక పోతే ప్రదర్శన కంతరాయం కలుగుతుం"దని గవర్నరుగారి కార్యదర్శికి కబురు పెట్టారుట! మా నాన్నగారి మీద అంత గౌరవం రామమూర్తిగారికి!

కలకత్తా విశ్వవిద్యాలయంలో డిగ్రీ పుచ్చుకున్న తరవాత కొన్నాళ్ళు శాంతినికేతనంలో గడిపి ఆంధ్రప్రదేశానికి తిరిగి వచ్చారు మా నాన్నగారు. తెనాలిలో కాపురం పెట్టారు. ఆయన బాల్యస్నేహితు లైన గోవిందరాజుల సుబ్బారావు, పిల్లలమర్రి సుందరరామయ్య, పోతుకూచి శ్రీరామమూర్తి, కొడవటిగంటి వెంకటసుబ్బయ్య తెనాలిలోనే ఉన్నారు. వెంకటసుబ్బయ్య మా నాన్నగారికి సాహిత్యంలో అత్యంత సన్నిహితుడు. మా నాన్నగారి చేత కవిత్వం రాయించటమే వెంకటసుబ్బయ్య ధ్యేయం. మా నాన్నగారు పద్యాన్ని ముందుగా మనస్సులో అల్లింతర్వాత కాని కాగితం మీద పెట్టేవారు కాదు. శుద్ధప్రతి రాసినట్లు రాసేవారు. అదికూడా చెయ్యనియ్యకుండా వెంకటసుబ్బయ్య ఆ పని

తనే చేసేవారు, మా నాన్నగారిచేత పద్యాలు చదివించుకుని. వెంకట సుబ్బయ్య కూడా ప్రతిభావంతుడయిన కవి. అయితే మా నాన్నగారంటే అతనికి వెర్రి వ్యామోహం.

కలకత్తా నుంచి కొత్తగా తిరిగివచ్చిన రోజుల్లో మా నాన్నగారు చెప్పిన ఆరు పద్యాలు రాసి పెట్టాడు (ఇప్పుడు ఇందులో మూడు పద్యాలే మిగిలినయి). అచ్చుకాకపూర్వం ఈ పద్యాలు స్నేహితవర్గాల్లో బహుళ ప్రచారం పొందినయి. ఇందులో ఓ పద్యాన్ని నేను అమెరికాలో ఉన్నప్పుడు ప్రసిద్ధకవి డబ్ల్యు. హెచ్. ఆడెన్‌గారికి తతిమ్మాపద్యాలతో పాటు వినిపించటం జరిగింది. ఆయన ఆ పద్యం విని అలా ఆలోచిస్తూ కూచుండిపోయి 'ఎన్నాళ్ళయిందో ఇలాంటి పద్యానికి నా హృదయం స్పందించటం' అన్నారు.

ఈ యతిలోక మోహన మ
హీతల మందున తోడులేక పా
థేయము లేక సిగ్గిలి మదీయ
మనోహర భావపల్లవ
చ్ఛాయలలోన వ్యర్థపు వి
చారముతో ననవాప్తకామ్యముల్
రోయుచు భగ్నమాలికలు
ప్రోవులు సేయుచు సంచరించెదన్.

నేనే కాదు సమస్త భూత తతియున్
నిర్వేద భారమ్ముచే
నానా భంగుల లాలనీయ గతులన్
నా గీతమే పాడు లో

కా నీకమ్ములలోన లోన నొక హా
హాకార ముద్భూతమై
శ్రీ నారాయణ పాదనీరజ రజా
శ్లేషమ్ము కాంక్షించెడిన్.

ఇవి రాసింతరవాత ననుకుంటాను, కొన్నాళ్ళకి వెంకటసుబ్బయ్య గారికి పారమార్థిక చింతన ప్రారంభమై, హఠాత్తుగా అందరికీ దూరమై ఏ అగమ్యసీమలకో పయనమైపోయారు. మా నాన్నగారు వెంకట సుబ్బయ్యను ఆఖరిక్షణం దాకా తలుచుకుంటూ ఉండేవారు.

ఓసారి తెనాలిలో ఉన్న రోజులలో మా నాన్నగారు బజారుకని ఇంటినించి బయలుదేరారు. దారిలో కూరలమ్మే మనిషి ఓ ఇంట్లోకి వెళ్ళాడు. అతనికోసం నిరీక్షిస్తూ రోడ్డుమీద మా నాన్నగారు నిలబడి పోయారు. ఆ ఇంటికెదురింటి పక్కనున్న మరో ఇంట్లోనుంచి ఎవరో అద్భుతంగా పద్యం పాడుతూండటం వినిపించింది.

నా కాఠిన్యము నాపయిన్ విడిచి,
నగ్నమ్మైన నా ముగ్ధ వాం
ఛా కళ్యాణ పదమ్ములం జెరిపి స్వే
చ్ఛాకీరమున్ పంజర
స్వీకారమ్మున ద్రోసిపుచ్చి యిపుడే
వీధీ విటంకమ్ములన్
ద్రాకం బోయెద వీ వయోవిరహ
భార భ్రాంతి మోయించుచున్....

ఆ పద్యం మా నాన్నగారు రాసిందే! అలా పాడే దెవరా అని విస్మయంతో వింటుండగా మా నాన్నగారికి స్ఫురించింది. ఆ ఇంట్లో

సహాధ్యాయి పోతుకూచి శ్రీరామమూర్తి ఉంటున్నాడని. మెల్లిగా లోపలికి ప్రవేశించారు. శ్రీరామమూర్తిగారు నవ్వుతూ లేచి ఆ పద్యం పాడిన వ్యక్తిని మా నాన్నగారికి పరిచయం చేశారు. ఆయన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య! ఆ పరిచయంతో మా నాన్నగారి జీవితంలో ప్రారంభమైన పరివర్తనం ఇంతా అంతా కాదు.

* * *

దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి సాహచర్యంతో మా నాన్నగారి రచనా వ్యాసంగం తగ్గిపోయిందనే చెప్పాలి. ఎంచాతనంటే, గోపాల కృష్ణయ్యగారికున్న సాహిత్య ప్రీతి ఆయన ఆరాధించే దేశ విముక్తి ముందు బలహీనమై రాజకీయ కార్యరంగం ప్రముఖమయింది. మా నాన్న గారు గోపాలకృష్ణయ్యగారిని అనుసరించారు. గోపాలకృష్ణయ్య గారి దగ్గర ఎన్నో సాహిత్య గోష్ఠులు జరిగినా, రచనా వ్యాసంగం మాత్రం, ఆయన చేత ప్రభావితులైన లబ్ధ ప్రతిష్ఠులైన కవులకు అందరూ అశించి నంతగా సాగలేదు. రాయప్రోలు సుబ్బారావుగారిని సిఫారసు చేసి హైదరాబాదు పంపించేశారు. మిగిలింది మా నాన్నగారూ, బసవరాజు అప్పారావుగారూను. కేవలం గోపాలకృష్ణయ్యగారి వ్యక్తిత్వంతోనూ, ప్రతిభతోనూ, ఆయన సాహచర్యంతోనూ సంతృప్తి పడి ఎక్కువగా రాయలేదు. మా నాన్నగారికి మరో అంతరాయం ఏర్పడింది. ఆయన మనసులోనే కవిత్వాన్ని అల్లి ఎన్నాళ్ళకో కాని కాగితం మీద పెట్టేవారు కాదు. అలా ఆయన రాయదలచుకున్న గీతాలు మరో రెండు సంపుటా లయేవి. గోపాలకృష్ణయ్యగారి సాహచర్యంలో ఆయన వాటి ప్రసక్తికి మళ్ళీ పోక, రాజకీయరంగంలో పరిశ్రమించారు.

అంతకు పూర్వం ఆయన తెలుగు కవిత్వంలో చెయ్యగలిగినన్ని వినూత్న ప్రయోగాలు చేశారు. మొదటిసారిగా ఉర్దూలోని గజల్

ఛందస్సును తెలుగులో ఉపయోగించి చూశారు. రూఢిలో లేని భుజంగ ప్రయాతాన్నీ, మధ్యాక్కరనీ, రగడనీ విభిన్న ధోరణిలో ప్రయోగించారు. ఇంత చేసినా, అక్కిరాజు ఉమాకాన్తంగారు ఓ నాలుగయిదు సంవత్సరాల తరవాత అభినవాంధ్ర కవిత్వం మీద రాసిన నిశిత విమర్శ "నేటి కాలపు కవిత్వం" అనే అపురూప గ్రంథంలో మా నాన్నగారి రచనల్ని స్పృశించ లేదు. అనాడు లబ్ధ ప్రతిష్ఠులైన కవుల్నందరినీ ఆయన ఎద్దేవా చేశారు, విమర్శించారు. గంటి సూర్యనారాయణశాస్త్రి గారు ఉమాకాన్తంగారిని అడిగారుట "ఏమండీ! అబ్బూరి రామకృష్ణరావు గారి రచనల్లో ఏం లోపాలూ తమరికి కనిపించలేదా, ఆయనొక్కణ్ణి వదిలేశారే?" అని.

ఉమాకాన్తంగారన్నారుట - "అంతే - ఆయనకి చక్కని భాషా జ్ఞానమూ, అలంకార జ్ఞానమూ, కవన ప్రజ్ఞా ఉండటంవల్ల నే నెదురు చూసిన లోపాలు కనిపించటం లేదు" అని.

మా నాన్నగారు గోపాలకృష్ణయ్యగారు ప్రారంభించిన చీరాల సత్యాగ్రహంలో ఆయనకి కుడి భుజంగా నిలబడి అహోరాత్రులూ పని చేశారు. ఆ కార్య నిమగ్నతలో పిత్రార్జితానికి కర్రావుడి చుట్టేశారు. ఆ కాలంలో ఆయన రాసింది గాంధీగారిని చూట్టానికి పోయినప్పుడో శ్లోకం, జలియన్‌వాలాబాగ్ జంగం కథా (ప్రభుత్వం నిషేధించింది), చాటువులూ, అంతే. చీరాల సత్యాగ్రహం విఫలమైన తరవాత మదరాసు పోయి 'చందమామ' అనే పత్రికను బాలల కోసం ప్రారంభించే ప్రయత్నం చేశారు. ఆ పత్రిక్కి దేశంలోని అగ్ర చిత్రకారులందరూ బొమ్మలు గీసి పంపించారు. అందులో రహ్మాన్ చుగ్తాయి, గుర్రం మల్లయ్య, ప్రమోదకుమార చటర్జీ ప్రభృతులున్నారు. అయితే ఆయన ప్రత్యేకంగా విదేశాల నుంచి తెప్పించిన ఖరీదైన కాగితం ఆంధ్రపత్రికా

ముద్రాలయంలో ఉంచితే కర్మంకాలి చెదపట్టి చెడిపోయింది. ఈ పత్రిక గురించే చక్రపాణికి నేను చెప్పి చెప్పి, బి. యన్. కె. ప్రెస్సు ఆచారప్పను వీథిలో ఉన్నప్పుడు అయన చాత పిల్లల పత్రిక మరోదాన్ని ప్రారంభించేందుకు ప్రోత్సహించాను. 'చందమామ' ముఖ పత్రం - అదొక్కటే అచ్చేయించారు అప్పటికి - చాలాకాలం మా దగ్గిర ఉందది. ఆయన పెట్టిన పేర్లన్నీ జయప్రదమయేవి. 'ఈనాడు' అన్న పేరును కర్నూలు మిత్రబృందం వారు దిన పత్రికను ప్రారంభిద్దామనుకున్నప్పుడు మా నాన్న గారు సూచించి వారిచేత డిక్లరేషను తెప్పించారు. ఆ తరవాత ఆ పత్రిక ప్రారంభం కానప్పుడు మరొకరు వాడుకోవడం జరిగింది.

చీరాల, మదరాసు, తరవాత బందరు, పురాణం సూరిశాస్త్రి గారి ఆహ్వానం మీద వెళ్ళారు. బందరులో కొంత రచనా వ్యాసంగం తిరిగి చేపట్టారు. అక్కడే కృష్ణా పత్రికలో 'రసమంజరి' అనే సాహిత్య విభాగం ఏర్పరచి 'సూర్యరాజు కథలు', 'నదీ సుందరి' అనే నాటకం, కొన్ని ఖండకావ్యాలూ రాసి, ప్రచురించారు. బందరులో ఉండగానే 'మంగళసూత్రం' అనే నవల కూడా రాశారు. కొతా శ్రీరామశాస్త్రి గారు నిర్వహించిన 'శారద' అనే మాస పత్రికకు కూడా రాసేవారు. అయితే రాశి తక్కువ. ఆయన మనసెప్పుడూ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు ప్రారంభించిన నవసమాజ నిర్మాణం మీద ఉండేదని అప్పటి ఆయన సహచరులు నాతో చెప్పగా విన్నాను. అంచాతనే కేవలం రచనా వ్యాసగానికి ఆయన మనస్సు అంకితం కాకపోయింది.

అయితే మళ్ళీ ఆ స్వల్పకాలంలో ఆయన రాసినవి కొన్నే అయినా అవన్నీ ఆధునికులకు ఆరాధ్యాలై అనుసరణీయాలయినయి. ఆయన 'నదీ సుందరి' చదివిం తరవాతనే విశ్వనాథ సత్యనారాయణ గారు 'కిన్నెరసాని' రాయటం జరిగింది. ముందుగా నదీ సుందరి నాటకాన్ని కృష్ణా పత్రికలో చదివి తనెంత ముగ్ధులయారో సత్యనారాయణ

గారే నాతో ఓసారి చెప్పారు. "రామకృష్ణారావు అలాంటి మనోహరమైన కథాంశాన్ని కావ్యంగా ఎందుకు రాయలేదు? రాస్తే ఎంత బావుణ్ణు?" అని అనుకున్నారుట. అంచాతనే తను మరొక ప్రక్రియను అవలంబించి ప్రయోగం చేశారుట - ఇంచుమించు అలాంటి కథాంశాన్నే.

ఓసారి బందరులో విశ్వనాథ సత్యనారాయణగారు మా ఇంటి కొచ్చారుట. అప్పటికే పింగళి నాగేంద్రరావు, మల్లాది రామకృష్ణశాస్త్రి, కౌతా శ్రీరామశాస్త్రి గారు మా ఇంట్లో ఉన్నారు. ఆ రోజుల్లో సత్య నారాయణగారు సాహితీ సమితితో విభేదాలు వచ్చి విడిగా 'జయంతి' పత్రిక నడుపుతున్నారు. సత్యనారాయణగారు మా నాన్నగారిని ఏమన్నా రాయమనటానికి వచ్చారు. పక్కన శ్రీరామశాస్త్రి గారిని చూసి మాట్లాడ లేకపోయారు.

కొంతసేపయింతరవాత మా నాన్నగారి నుద్దేశించి "రామకృష్ణా రావుగారూ! మీరు బొత్తిగా రాయటం మానేశారు, ఈసారి ఓ బృహ త్కావ్యాన్ని రాయండి - ఆధునిక కవిత్వానికి తగినంత ప్రశస్తి లభి స్తుంది" అన్నారు.

మా నాన్నగారు చిరునవ్వు నవ్వుతూ "అసలు నేనెందుకు రాయాలి?" అన్నారుట.

"అదేమిటండీ, అలా అంటారు? చదివే వాళ్ళ కోసం కదా" అన్నారుట పింగళి నాగేంద్రరావు.

"నేను రాసింది నచ్చని వాళ్ళ సంగతీ? వాళ్ళ కోసం నేను రాయాలా? అది కాదు - నాకోసం రాసుకుంటాను. నేనెందుకు రాయా లన్నది నా సమస్య" అన్నారు మా నాన్నగారు.

మదరాసులో ఉండగా ఓసారి పింగళి నాగేంద్రరావుగారు కనిపించి "మీ నాన్న ఘటికుడయ్యా - ఒకంతట రాయడు" అంటూ ఈ సన్ని వేశాన్ని చెప్పారు.

ఆ తరవాత నేను అమెరికాలో విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో తెలుగు సాహిత్యాచార్యుడిగా వెళ్ళుతున్నప్పుడు విశ్వనాథ సత్యనారాయణ గారి చేత పద్యాలు చదివించి రికార్డు చేసి నాతో తీసుకుపోయాను.

సత్యనారాయణగారు - "మరల నిదేల రామాయణ మన్నచో" అనే సీస పద్యం చదువుతున్నారు. మధ్యలో ఈ పద్యం రాస్తున్నప్పుడు "మూడు నాలుగు దశాబ్దాల క్రితం మీ నాన్న నాతో అన్న మాటలు గుర్తు కొచ్చినయి. ఆ తాత్పర్యమే పరోక్షంగా ఈ పద్యంలో కనిపిస్తుంది. మీ నాన్న రాయవలసిన బృహత్కావ్యాన్ని నేను రాశాను" అన్నారు.

బెజవాడలో ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రారంభమైనప్పుడు మా నాన్నగారు బందరు వదిలి వచ్చేశారు. యాదృచ్ఛికం. జూన్ నెలాఖ రవుతోందనగా బెజవాడ వచ్చారు. బందరులో ఆయన రాసిన ఆఖరి పద్యం.

**రసిక హృదయము లోలలాడే**
**మనువు దినములు మరలి వచ్చెను**
**మిసిమి మబ్బులు వ్రేలు మేలిమి**
**ముసుగుతో నాకసము విచ్చెను!**
**తరలిరా, ఆషాఢ లక్ష్మి!**
**మెరపు తీవలు తొలకు రథమున,**
**మురిపెమున దిక్కాంత లలరగ**
**తరలిరా! మేఘముల పథమున!**

ఇవన్నీ ముత్యాల సరాలు. ఇందులో కూడా ఓ వినూత్న ప్రయోగం చేశారు. మళ్ళీ ఓ పాతికేళ్ళ దాకా మా నాన్నగారు కవిత్వం రాయలేదు. 'రాశా'రేమో- కాగితమ్మీద పెట్టలేదు.

* * *

బందరు నుంచి కట్టమంచి రామలింగారెడ్డిగారి ఆహ్వానం మీద బెజవాడ వచ్చేశారు మా నాన్నగారు. అక్కడ ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని అప్పుడే నెలకొల్పారు. బెజవాడలో నాలుగైదేళ్ళున్నారో లేదో విశ్వవిద్యాలయం వాల్తేరుకి తరలిపోయింది. దాంతోపాటు వాల్తేరుకు మా నాన్నగారూ మకాం మార్చవలసివచ్చింది.

బెజవాడలో ఉన్నప్పుడు అక్కడ ప్రఖ్యాతి పొందిన కళాకారులందరూ మా నాన్నగారిని చూడటానికి వచ్చేవారు. కపిలవాయి రామనాథశాస్త్రి, పారుపల్లి సుబ్బారావు, అద్దంకి శ్రీరామమూర్తి ప్రభృతులతో పాటు బసవరాజు అప్పారావుగారు తరచూ వస్తుండేవారు. శ్రీరామమూర్తిగారూ, అప్పారావుగారూ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి అభిమానులు. శ్రీరామమూర్తిగారు గోపాలకృష్ణయ్యగారు పద్యం ఎలా చదివేవారో, పాటని ఎలా పాడేవారో విని తన్మయులై, అలాగే తనూ చదవాలనీ, పాడాలనీ సాధన చేసేవారు. అలాగ శ్రీరామమూర్తిగారు సంగీత ఫణితి ఒక విశిష్టమైన బాణీగా తెలుగు నాటకరంగంలో ప్రఖ్యాతమైంది. శ్రీరామమూర్తిగారి సంగీత సాధన చాలా సార్లు మా ఇంట్లో చేసి మా నాన్నగారి ఆమోదముద్ర వేయించుకునేవారు. ఆయన మా ఇంట్లో కూచుని మా నాన్నగారి ముందు పాడుతూన్నప్పుడు జనం ఇంటి చుట్టూ పోగయేవారు.

బసవరాజు అప్పారావుగా రోసారి మా ఇంటికొచ్చినప్పుడు శ్రీరామమూర్తిగారు పాడుతున్నారు. ఆయన వచ్చి కూచున్నాడో లేదో, మా నాన్నగారు శ్రీరామమూర్తి గారిని 'యమునా కళ్యాణి'లో పాడమన్నారు ఓ శ్లోకాన్ని. అప్పారావుగారు గొంతెత్తి-

ఏలపాడే నింక యమునా కళ్యాణి, మా
లీలా మానవుడు గోపాలుడు లేడాయే
బంగారు గనులలో

చెంగలించే వేళ
పిడుగు బోలిన వార్త
వినిపించినా రయ్యో ॥ఏల॥

చెడువార్త వినగానె
చెవులు గింగిరుబోయె
ఎంత చించుకున్న
గొంతు పెగలదాయె ॥ఏల॥

ఈనాటి యీ నేస్త
మే జన్మకో తిరిగి
కన్నీళ్ళు గారవకె
కడుపు చెరువయ్యేనే
ఏలపాడే నింక యమునా కళ్యాణి, మా
లీలా మానవుడు గోపాలుడు లేడాయే

అని ఆలపించారు.

రెండు రోజుల క్రితమే దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు దివంగతులయ్యారు. గోపాలకృష్ణయ్యగారికి యమునా కళ్యాణి అంటే అత్యంతాభిమానం! చెవులు కోసుకునేవారుట! శ్రీరామమూర్తిగారు రాగాలాపన మానేసి మా నాన్నగారి వంక చూసి వలవలా ఏడ్చారుట.

మా నాన్నగారూ కన్నీళ్ళు కార్చారుట. గోపాలకృష్ణయ్యగారికి తన అభిమానులమీద అంత ప్రభావం ఉన్నదన్నమాట. ఆయన సాహచర్యంలో కవిత్వాన్ని అనుభవించేవారు. కవిత్వంలో జీవించేవారు, ఆయనా, ఆయన స్నేహితులూనూ. తెలుగుదేశ దౌర్భాగ్యం వల్ల గోపాలకృష్ణయ్యగారికి జరగవలసిన సంస్మరణ సత్కారం జరగలేదు.

అంచాతనే బసవరాజు అప్పారావుగా రా రోజుల్లోనే గోపాలకృష్ణయ్య మరణానంతరం రాసిన గీతాల్లో-

కాలచక్రము గతి గడచి తెనుంగు
భావి భాగ్యమెల్ల పండిన వెనుక
ఆనాటి కెవరైన నడుగకపోరు
గోపాలకృష్ణు డేగోష్ఠి వాడటంచు
భాగ్యవశమున భావికాలాన
అమృత తుల్యమ్ములు నతిభావభరిత
ములు నైన నా గీతముల వినినంత
గోపాలకృష్ణుని గొప్ప దీపించు

అంటూ చెప్పుకున్నారు.

మా నాన్నగారు, గుమ్మడిదల సుబ్బారావు, నడింపల్లి లక్ష్మీనర సింహారావు కలిసి గోపాలకృష్ణయ్యగారి జీవితాన్ని సమగ్రంగా గ్రంథస్థం చేయసంకల్పించారు కాని, విధి అనుకూలించలేదు.

మా నాన్నగారు బెజవాడలో ఉన్నప్పుడే గుడిపాటి వెంకటచలం గారు బదిలీ మీద రావటం తటస్థించింది. మా నాన్నగారికి మరో స్నేహితుడులా దొరికారు. వెంకటచలంగారు సాయంకాలంపూట షికారుకు పోయి నప్పుడల్లా మా ఇంటి వేపోసారి వచ్చి వెళ్ళేవారు. వెంకటచలం గారిల్లు ఓ సాహిత్య 'సత్రం'గా ఉండేది. అక్కడ కొచ్చేవాళ్ళు మా ఇంటికొచ్చి మా నాన్నగారిని చూసిపోతూండేవారు. ఆ రోజుల్లోనే ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఒకే ఒక పుస్తకం, ఒకే ఒక కుర్చీతో మా నాన్నగారు శంకుస్థాపన చేశారు! కాలక్రమేణా దేశంలోని ఉత్తమ గ్రంథాలయాలతో సమానంగా దాన్ని తీర్చిదిద్దారు. అంతేకాదు, బ్రిటిష్

పాలనలో సమస్త ప్రపంచ వామపక్ష రాజకీయ సాహిత్యం - ముఖ్యంగా మార్క్సిస్టు సాహిత్యం - ఒక్క ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయం లోనే - సమగ్ర శ్రేణి మీద చోటు చేసుకుంది. ఆ సాహిత్యాన్ని అతి మెళకువతో విదేశాల నుంచి సేకరించింది మా నాన్నగారే. యుద్ధ కాలంలో బ్రిటిష్ ప్రభుత్వం పసిగట్టి, కట్టమంచి రామలింగారెడ్డిగారు ఉపాధ్యక్షులుగా ఉన్నప్పుడు, ఆ సాహిత్యాన్ని గ్రంథాలయం నుంచి తొలగించింది.

ఆ రోజుల్లోనే బళ్ళారి రాఘవాచారిగారు మా నాన్నగారి చేత ఓ నాటకం రాయించి, వేయించాలని విశ్వప్రయత్నం చేశారు. నెల నెలా ఓ కార్డుముక్క బళ్ళారి నుంచి రాసేవారు. రాఘవాచారిగా రప్పుడు బళ్ళారిలో పబ్లిక్ ప్రాసిక్యూటరుగా ఉండేవారు. నాటక ప్రదర్శనల కోసం సర్కారు ప్రాంతాలకు వచ్చినప్పుడల్లా బెజవాడలో దిగి మా నాన్నగారిని చూసిపోయేవారు. ఆయన పోరు పడలేక 'తెలుగు సంసారం' అనే నాటకం రాయటం ప్రారంభించి ఓ అంకం మాత్రం పూర్తి చేశారు. దాని వ్రాతప్రతిని ఊరికి తీసుకుపోతూ రాఘవాచారి గారు పోగొట్టు కున్నారు. మా నాన్నగా రా నాటకం జోలికి మళ్ళీ పోలేదు. అయినా రాఘవాచారిగారి ఒత్తిడి మాత్రం తగ్గలేదు.

అదే కాలంలో ఓసారి వెంకటచలంగారు నవ్వుతూ, తనో నాటకం రాస్తున్నాననీ, వీలైతే చింతా దీక్షితులుగారి సహకారం కూడా తీసుకుంటా ననీ అంటూండేవారు. మా నాన్నగా రాయన మాట నమ్మి, ఓసారి పోలేపెద్ది సుబ్బారావుతో "ఒరే, వెంకటచలంచేత నాటకం రాయించరా, చూదాం" అన్నారు.

ఓ అయిదార్నెల్ల తరవాత సుబ్బారావు కనిపించి - "వెంకటచలం రాసేది పేరడీ - అసలు నాటకం కాదు; దానికి తోడు నీ పద్యం ఒక దాన్ని వాడేశాడు" అన్నాడు.

తరవాత కొన్నాళ్ళకు వెంకటచలంగారి రాతప్రతిని చూశారు. అందులో అప్పుడు ప్రచారంలో ఉన్న తెలుగు చాటువు లన్నిటితోనూ కలిపి ఓ హాస్య నాటికగా వెంకటచలంగారు రూపొందించారు. అందులో మా నాన్నగారు చీరాలలో ఉన్నప్పుడు ఆశువుగా చెప్పిన పద్యాన్ని - దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని సంబోధిస్తూ - వెంకటచలంగారు తమ నాటికలో వాడుకున్నారు. పండితరాయల్ని గోపాలకృష్ణయ్య పేరడీ చేస్తే, ఆయన్ని మా నాన్నగారు పేరడీ చేశారు.

ఉపమాపై పెసరట్టుపై యిడిలిపై
హుమ్మంచు చూపించు నీ
జపసంబద్ధ పరాక్రమ క్రమ కటా
క్ష శ్రేణి మన్నించు శు
భ్రపు జిల్లేబి పకోడి లడ్వగయిరా
పై కొంత రానిమ్ము శ్రీ
చపలాపాంగ సితాంగనా హృదయపా
శా పూజ్య వస్తుప్రియా!

పండిత రాయలు ఢిల్లీ దర్బారులో చదివిన శ్లోకంలో - 'లవంగీ దృగంగీ, కరోతు' అన్నారు. దాన్ని 'ఫరంగీ ఫిరంగీ దృగంగీ కరోతు' అంటూ గోపాలకృష్ణయ్య గారు పేరడీ చేశారు. దీనికి జవాబుగా పై పద్యం చివరి పంక్తి మా నాన్నగారు వాడారు.

ఇంతకీ వెంకటచలంగారి రాతప్రతిని పోలేపెద్ది సుబ్బారావు తనతో తీసుకుపోతూ పారేసుకున్నాడు!

* * *

మనసులోని యాలాపము
మాటలలో మారిపోవు
ఎత్తిన కవితాదీపము
వత్తి కుమిలి యారిపోవు!

ఎలుగులేని వెలుగు లేని
హేమంతమ్మోయి పుత్ర!
ఈ చీకటి రాజధాని
కేలా యీ దండయాత్ర?

బెజవాడనుంచి విశాఖపట్నం తరలివచ్చింతరవాత అక్కడ కవిత్వపరంగా శ్రీరంగం శ్రీనివాసరావుని మా నాన్నగారు పెంచుకున్నారు. అంచాతనే శ్రీశ్రీ తనకిద్దరు నాన్నలంటూ రాసుకున్నాడు. పై పంక్తులతన్ని ఉద్దేశించి మా నాన్నగారు రాయప్రోలు రాజశేఖరు పట్టుదల మీద రాసిన ఓ సుదీర్ఘ కవితలోనివి. ఈ కవితను, ఆయన హైదరాబాదు వచ్చినప్పుడు రాజశేఖరు రేడియోలో ఉద్యోగం చేస్తూ మా నాన్నగారిచేత పట్టుపట్టి రాయించాడు. ఒక్కగంటలో రాసిపెట్టారు. తరవాత రేడియోలో మా నాన్నగారిచేత చదివించాడు.

అప్పటికి మా నాన్నగారు కమ్యూనిష్టు పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరవటం, అందులో విశ్వాసం సడలి నవ్యమానవ వాదిగా మారిపోవటానికి రమారమి రెండు దశాబ్దాలు పట్టింది. శ్రీనివాసరావు మా నాన్నగారు ఆశించినప్పుడు కాక యుద్ధానంతరం కమ్యూనిజంలో విశ్వాసం కుదుర్చుకున్నాడు. "పొరబాటీ తిరుగుబాటు, తిరుగుబాట తిరిగి చాటు" అని మా నాన్నగారతన్ని హెచ్చరించారు. అతన్ని మళ్ళీ మంచి కవిత్వం రాసుకోమని అర్థించారు. అతను వినకపోయినా, మా నాన్నగారి కతని

మీద అభిమానం పోలేదు. మా నాన్నగారి మీద అతనికి గౌరవమూ తగ్గలేదు.

ఓసారి మా నాన్నగారు మదరాసు పోవలసి వచ్చింది. అక్కడ మా నాన్నగారు ఊళ్ళోకి వచ్చారని తెలిసి శ్రీనివాసరావు ఆయన్ని చూడ్డానికి వచ్చాడు. ఇద్దరూ కలిసి ఎక్కడో భోంచేసి సాయంకాలం సముద్రతీరానికి పోయారు. మా నాన్నగారు తన చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకుంటూపోయారు. మదరాసు ఓ విశిష్టమైన సాంస్కృతిక కేంద్రంగా ఎలా ఉండేదో, ఇప్పుడెలా మారిపోయిందో చెబుతున్నారు. శ్రీనివాసరావు నిజమే నన్నాడు. అంచాతనే తనకు తిరిగీ విశాఖపట్నం వెళ్ళి అక్కడే శేషకాలం గడపాలని ఉందనీ చెప్పాడు.

"కేవలం శేషకాలం కోసమేనా?" అన్నారుట మా నాన్నగారు.

"కాదు, నేను రాయదలచుకున్న వన్నీ అక్కడే పూర్తిచేస్తాను. ఈ ఊబిలోంచి ఎలా బయటపడాలో తెలీటంలేదు" అన్నాడు.

మా నాన్నగారప్పటికి హైదరాబాదుకి మకాం మార్చలేదు. మారుద్దామనుకుంటున్నారు.

"నాకు విశాఖపట్నంమీద మోజు తగ్గుతోంది. అక్కడా మనం ఎరిగున్న వాతావరణం లేదు. అంతా మారిపోయింది. హైదరాబాదు కూడా పోవాలనిలేదు. మరోచోటికి పోగలమేమో చూడు" అన్నారు.

శ్రీనివాసరావుకి తలకాయ పనిచెయ్యలేదు. శ్రీనివాసరావు మదరాసు వదల్లేదు. మా నాన్నగారు విశాఖపట్నం వదిలేశారు. హైదరాబాదు వచ్చినా- అక్కడ వాతావరణం సాహిత్య వ్యాసంగానికి అనుకూలంగా లేదని గ్రహించారు. అంచాతనే ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకుని-

ఏనాడో రావలసిందీ వారణపురికి మనం
ఆ విశాల వటవృక్షం నిశ్చలం నిభృతాగారం
ఇంకా నిలిచే ఉన్నది. నాడు మనకు చిన్నతనం
అల్లదుగో! స్వర్ణశిఖర దేవమందిర ద్వారం
నిన్నూ నన్నూ యెరుగరు నేటి కొత్త పూజారులు
పరిచిత కంఠస్వరాలు చెవులకు పండుగ చేయవు
అటూ యిటూ నిర్మించిన కొత్త కొత్త రహదారులు
ఆ వెనకటి సుధాస్మృతులు వేరొకటి వినసీయవు
అసంబద్ధ యశోవాంఛ పరచింతాపరాఙ్ముఖత
ప్రబలే యీ నగరంలో ఏమున్నది తుదకు ఫలం?
అంతులేని ధనపిపాస అనాగరక నాగరకత
ఈ రొదలో ఎలా మనుగడ సాగించగలం?
గతం గడిచిపోయిందని ఏలా యీ అనుతాపం?
కాలం నర్తకి, బహుశా మారుస్తున్నది రూపం!

అనే సానెటు రాశారు.

ఈ పద్యాన్ని శ్రీనివాసరావెంతో మెచ్చుకుంటూ, "అలాంటిదే నేను రాద్దామనుకున్నాను. రామకృష్ణరావు గారిలా నేను రాయలేకపోదును. ఆయన ఎంపిక చేసిన ఛందస్సు అపురూపం" అన్నాడు.

మేము "కవిత" ప్రారంభించి మొదటి సంపుటం అచ్చయిం తరవాత రుక్మిణీనాథశాస్త్రి తను ఓ పద్యం రాస్తున్నట్టూ, రాయగానే పంపిస్తున్నట్టూ ఉత్తరం రాశాడు. అందులో "మీ నాన్నగారు మరి

రాయనంటూ రాసిన గీతం ఒక్కటి చాలు - ఆయన ప్రతిభ పది కాలాల పాటు నిలిచేందుకు" అని మా నాన్నగారి గీతంలోని చివరి భాగాన్ని తిరిగి రాశాడు.

నీ వధిరోహించిన యీ అల
నిత్యం శాశ్వతము సుమా
నీ కల్పించిన యీ కల
నిజం నిజం వాస్తవికం.
అంతులేని యీ జీవన
కాంతారంతరముల నీ
చింతా దీపం బెంతటి
చిన్న చిన్న వెలుగిడినా
అంతెచాలు నంతెచాలు
అంతకన్న లేదు మేలు
ఈ యనంత పరిష్వంగ
మెచ్చటి కచ్చటి కేసరి
అజ్ఞాతా జ్ఞేయాలకు
అజ్ఞానంతో నేస్తం.
హేకవేర కుమారికా
శ్రీకర స్రోతః శీకర
లాలిత నిటలాలక ! హే
లాస్య చరణ సంచారిణి!
నందనవాసిని ! కవితా
సుందరీమణీ రమణీ!

అన్యాశ్రయములలో నీ
సన్యాసిని మరచిపొమ్ము
నీ నికుంజ సీమలలో
ని న్నారాధించే జనములు
భావుకులూ బంధువులూ
భావియనక భూతమనక
కలకాలం కలల వోలె
వెలిగింతురు నీదు తోట
అమరలోక సంవాసిని
అమృతహాసినీ! వాణీ!

ఆఖరి రోజుల్లో ఢిల్లీ వచ్చారు మా నాన్నగారు. అక్కడ ఉంటున్నప్పుడు స్నానాల గదిలో పడి కాలు విరుచుకున్నారు. అవసానదశ అంతా మంచంలోనే గడిపారు. ఆ రోజుల్లోనే మిత్రుడు పురాణం సుబ్రహ్మణ్యశర్మ వచ్చి ఆయన చాటువులన్నింటినీ పోగుచేసుకుపోయాడు. మా నాన్నగారు మంచంనుంచే సుబ్రహ్మణ్యశర్మ కోరినట్లుగా వాటిని తన పత్రికలో ప్రకటించేందుకు అనుమతించారు. ఆ అవస్థలో రోజూ ఆయనకి దినపత్రికలూ, ఆయన కోరిన పుస్తకాలూ చదివి వినిపించేవాళ్ళము. ఓసారి ఎజ్రాపౌండు జైలుజీవితం మీద ప్రకటితమైన పుస్తకాన్ని చదివించుకున్నారు. పౌండు అంటే ఆయనకి ఎనలేని గౌరవం.

మరోసారి ఆల్డస్ హక్స్లీ ఆఖరిరోజులమీద ఆయన భార్య లోరా రాసిన విపుల గ్రంథాన్ని చదివించుకున్నారు. హక్స్లీకి మన ఆధ్యాత్మిక చింతనలో విశ్వాసం ఉండేది. పరలోకం మీద ఆలోచనలుండేవి. మరణించిన వారితో మాట్లాడటం సంభవమని నమ్మేవాడు కూడాను. ఆ

పుస్తకాన్ని చదవటానికి మాకు రెండు మూడు రోజులు పట్టింది. పుస్తకం అంతా విని "హక్స్లీ కూడా ఇలాంటి వాడయితే ఏం చెయ్యగలం?" అన్నారు మా నాన్నగారు. అప్పుడప్పుడలా చెప్పినట్లే ఓ పద్యం చెప్పారు:

చచ్చిపోయి జీవి యెచ్చటి కేగునో
ఏమియగునో ఎవరి కెరుకరాదు
ఎరుకలేని వారలేమేమొ చెప్పగా
విని తపించువారు వేనవేలు!

అదే ఆయన ఆఖరి పద్యం!

# కాలదోషం

రమారమి పదమూడు వందల సంవత్సరాల తెలుగు సాహిత్య చరిత్రలో కవిత్వం ఒకే ఒక మూల సూత్రాన్ని ఆధారం చేసుకున్నదని భావించే వాళ్ళలో నే నొకణ్ణి. కవిత్వం ముఖ్యంగా కాళిదాసు చెప్పినట్లు రసనాగ్రనర్తకిలా ఉండాలి. అంటే మననానికి రావాలి. అవలీలగా కంఠగతం కావాలి. సాహిత్య ప్రసక్తి వచ్చినప్పుడు చప్పున అందులో కొన్ని పంక్తులు స్ఫురించి ఉదాహరించేటట్టుగా ఉండాలి. కవిత్వానికి కావలసిన ప్రాథమిక లక్షణం అదే. సాహిత్యం ఆవిర్భవించిన క్షణం నుంచీ అదే అనూచానంగా రూఢం అవుతోంది.

అకస్మాత్తుగా రెండో ప్రపంచ యుద్ధం సమాప్తమవుతున్న సమయంలో తిరుగుబాటు అనే నెపంతో ఛందస్సు అనే సర్పపరిష్వంగం నుంచి తప్పించుకొని కవిత్వం చెప్పేందుకు కొందరు ప్రయత్నం చేశారు. అందులో ముఖ్యులు శిష్ట్లా ఉమామహేశ్వరరావు, శ్రీరంగం శ్రీనివాసరావూను. అయితే వీరిద్దరిలో ఉమామహేశ్వరరావు భాషా జ్ఞాన లోపం వల్ల పరిపూర్ణత సంపాయించలేక, తను రాసిన ప్రతీ 'పాటా' తనకు పాడుకునేందుకు అనువుగా ఉందని తోచినప్పుడు రాశాడు. శ్రీనివాసరావు మాత్రం లక్షణబద్ధంగా, సాంప్రదాయికమయిన ఛందస్సులకు స్వస్తి చెప్పి మాత్రా ఛందస్సులను ఆశ్రయించాడు. ఆ తరవాత అతని అనుయాయులమని చెప్పుకుంటూ వచ్చిన యువకులు 'వచన కవిత' అనే కృతక ప్రక్రియసాధనలో పడ్డారు. దీనికి కారణం సాహిత్యాన్ని ప్రజల్లోకి తీసుకుపోవాలనే రాజకీయ నినాద బ్రహ్మల ఉద్యమం. అదే అభ్యుదయ రచయితల తీర్మానం అయి కూర్చుంది.

అయితే శ్రీనివాసరావు చాలావరకు 'వచన కవిత' జోలికి పోకుండా తన మానాన తను మాత్రా ఛందస్సునే ఆశ్రయించి రాసుకుంటూ పోయాడు. 'వచన కవిత' అనే ప్రక్రియ విదేశాల నుంచి దిగుమతి అయిందని మనకు తెలుసు. పాశ్చాత్య దేశాల్లో - ముఖ్యంగా ఇంగ్లీషు, ఫ్రెంచి భాషల్లో Verse libre అంటే Free verse అనే సాంప్రదాయిక ఛందస్సును విడనాడి మరో ఛందోరీతిని కవులు అనుసరించటం జరిగింది. ఫ్రీవర్సు అనే ప్రక్రియలో సాంప్రదాయిక ఛందస్సులో మనం వాడే గణం స్థానే లయబద్ధమయిన పదబంధం చోటు చేసుకుంది. లయబద్ధమయిన పదబంధాలను వాడుకోవటంవల్ల సులభంగా కంఠగతం అయే అవకాశం ఉంది. అలా అనాది నుంచీ ఆచారంలో ఉన్న కవిత్వ లక్షణాన్ని స్వేచ్ఛ పేరుతో, ప్రజల నెపంతో మన వర్తమాన కవులు విస్మరించారు. ఇలా విస్మరించటం కేవలం ఫ్రీవర్సు అనే ప్రక్రియ లక్షణం గురించిన అజ్ఞానం వల్లనే జరిగిందని నా ఊహ. ఫ్రీవర్సు లక్షణబద్ధం కాదని మనలో చాలామంది భావించి యథేచ్ఛగా ఎలా పడితే అలా రాయడమే కవిత్వ మనుకుంటూ, కవిత్వ రచన చేశారు. కవిత్వం ఒకరి సొత్తు కాదు, అందరిదీని అనే మరో ప్రభావం కూడా వీరి మీద ప్రయోక్తమయింది. అంటే- కవిత్వం రాసేందుకు యోగ్యత అనవసరమని తేల్చారు. భాషా జ్ఞానం కానీ, కంఠగత లక్షణం కాని, లయ విధానం కానీ కవిత్వానికి విరుద్ధమనే వాదాన్ని లేవదీశారు. అంచేత అందరూ రాస్తున్నారు. దీనికి నేను 'పొట్టై పొడై' కవిత అంటూ ఓసారి నామకరణం చేశాను. పొట్టి లైనూ పొడుగు లైనూ ఉంటే చాలు- అది కంటికి కవిత్వమయి కూచుంటుంది. అంతే. భావుకత అనవసరం. భాష అనవసరం. నడక అనవసరం.

ఇలాంటి పరిస్థితి మన సాహిత్య చరిత్రలో ఇంతవరకు ఇన్నేళ్ళుగా ఎప్పుడూ ఉత్పన్నం కాలేదు. జానపద కవిత్వాన్ని చూశాం. కీర్తనల్ని

చూశాం. పురాణ శ్రవణంలో దండకాల్లాంటి వచనాల్ని చూశాం. అవన్నీ ఛందోబద్ధాలే. శ్రావ్యంగా లయాన్వితంగా ఆలపించతగ్గవే. మనస్సును మరుక్షణంలో ఆకట్టుకునేట్టుగా ఉంటాయి. ఛందోరహితమూ, లయ విహీనమూ అయిన రచనల్ని మనం కంఠగతం చేసుకోవటం కష్టం. అలా మననం చేసుకోనేందుకు వీలుగా మన సాహిత్యంలో ఒక్కొ సామెతలే ఏర్పడినయి. వాటిల్లో అధికంగా ఛందస్సును మనం గమనించక పోము. కొన్నిట్లో లయనూ విస్మరించలేము. అందుకే అవి అందరికీ సమయస్ఫూర్తితో అందుబాటులో ఉంటయి.

గురజాడ, రాయప్రోలు, అబ్బూరి ప్రారంభించిన అభినవ కవిత్వం ఓ నాలుగు దశాబ్దాల పాటు తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చెయ్యటం మన మెరుగుదుం. శ్రీరంగం శ్రీనివాసరావూ, అతని సమ కాలికులైన తరువాతి తరంలోని ఓ అరడజను మంది కవులూ ఆరంభించిన మరో పరివర్తనం కొన్నాళ్ళపాటే నిలబడ గలిగింది. వారికి భాష మీదా, ఛందస్సు మీదా అధికారం కలిగి, చక్కని సమకాలీన భావుకతను వా రాపాదించగలిగారు. అదే కాలంలో సాహిత్యంలో ఉద్యమాలు తలెత్తినయి. ఉద్యమ లక్ష్యం ప్రధానం కాగా సాహిత్య లక్షణం క్షీణించింది. అలాంటి ఉద్యమాలు ఫలప్రదం కావని అందరికీ తెలియవచ్చినా, కొంత మంది మాత్రం అంగీకరించకుండా ఉన్నారు. అదే ఈనాటి దురదృష్టకర మైన పరిస్థితి.

ఏ తదుద్యను ఫలితంగా ఏర్పడిన సాహిత్య వ్యనస్థ, వ్యవస్థగానే నిలిచిపోయింది- సృజనాత్మక సాహిత్యం అగోచరమయింది. అలా వస్తున్న సాహిత్యమే, అలా వస్తున్న కవిత్వమే కవిత్వం అనుకునేట్టు ప్రచార సాధనాల ద్వారా ప్రచారం చెయ్యటం జరుగుతోంది. అంతటితో ఆగలేదు. అచ్చుపడ్డ ప్రతి వచన కవితా సంకలనానికీ ఓ ఆవిష్కరణ సభా, ఆ సభలో ఆ పుస్తకాన్ని ఆమూలం కీర్తించటం మరో పరిణామం.

అంటే తెలుగులో శాస్త్రీయమయిన నిష్పక్షపాతమయిన సాహిత్య విమర్శ అంతరించిందన్న మాట.

అంతటితో ఈ పరిణామం ఆగలేదు. ఇలా కవిత్వం చెప్పే కవులకు బహుమానాలూ, సన్మానాలూ; అంతటితో తృప్తి పడక, బిరుద ప్రదానాలూ ప్రారంభమయినాయి. తెలుగు రాజధానిలో వీటి నెలా నిర్వహిస్తారో అందరికీ తెలుసు. ఇంతగా మన సాహిత్యంలో 'కృషి' జరిగినా నాలుగు కాలాలపాటు నిలిచే యోగ్యతకి ఒక్క కవితా నోచుకోదని మాత్రం విన్నాణికి తెలుసు.

మన దేశంలో ఆదర్శ లోపమయిన జీవనం సాగిస్తున్న రచయితకి సృజనాత్మక శక్తి ఎలా ప్రాప్తమవుతుంది? ప్రతి జీవనాంశంలోనూ రాజకీయం ప్రవేశించటం, లోకాన్ని హ్రస్వదృష్టితో పరికించటం, జీవనభృతికి ఆత్మను చంపుకోవటం పరిపాటయిందీ కాలంలో.

సంస్కృతం ఎప్పుడో పోయింది. విశ్వవిద్యాద్వారమయిన ఇంగ్లీషు తనంతట తనే పోతుంది. తెలుగు హీనస్థితిలో ఉంది. ఈ పరిస్థితుల్లో ఓ రకమయిన నవ నిరక్షరాస్యత మనలో వ్యాపిస్తున్నది. వారే కవిత్వం చెబుతున్నారు. అంచాతనే సృజనాత్మక కవిత్వానికి కాలం కాదిది. కవిత్వానికి కాలదోషం పట్టింది.

21-10-1987

# ఆఖరిమాట

దాదాపు యిరవయి అయిదేళ్ల పై మాట. ఆ రోజుల్లో నేను ఒక ప్రముఖ పుస్తక వ్యాపార సంస్థలో పనిజేస్తూ ఢిల్లీలో ఉండేవాణ్ణి. ఈ వ్యాపార సంస్థకు ప్రపంచంలో ప్రసిద్ధులయిన ప్రచురణ కర్తలందరితో సన్నిహిత సంబంధాలుండేవి. నేను ఉత్తర అమెరికాలో ఓ విశ్వ విద్యాలయంలో ఆచార్యుడిగా కొన్నాళ్ళపాటు వెళ్ళవలసి వొచ్చింది. నేను అక్కడికి వెడుతున్నానని తెలిసి మా సంస్థకు సన్నిహితులయిన అమెరికన్ ప్రచురణ కర్తలూ, బ్రిటిష్ ప్రచురణకర్తలూ నన్నాహ్వానిస్తూ, తమ తమ కార్య కలాపాలను స్వయంగా పరిశీలించమని కోరడం జరిగింది. అలా లండన్‌లో- ప్రచురణకర్తల ఆహ్వానాన్ని పురస్కరించుకొని కొన్నాళ్లు ఉండవలసి వచ్చింది.

అలెన్ అండ్ అన్విన్‌కు చెందిన రేనర్ అన్విన్‌కు అతిథిగా ఉన్నాను. ఆయనే లండన్‌లో నా కార్యక్రమాన్ని రూపొందించారు. ఆ కార్యక్రమాన్ని వివరిస్తూ, మరెవ్వరినయినా చూడవలెనని ఉంటే చెప్పు, ప్రయత్నించి యేర్పాటు చేస్తానన్నారు. నాకు హోగార్త్ ప్రెస్సు స్థాపకులూ ప్రసిద్ధ రచయిత అయిన లియనార్డ్ వుల్ఫ్ గారిని చూడాలని ఉందని చెప్పాను. ఎంచాత నంటే, ఆయన ప్రారంభించిన ప్రచురణ సంస్థ ఒక అపురూపమయిన ప్రయోగం. అదీకాక, ఆయనా, ఆయన భార్య వర్జీనియా వుల్ఫ్ సాహిత్య ప్రపంచంలో ప్రసిద్ధులు.

ఓ రోజు సాయంకాలం లియనార్డ్ వుల్ఫ్‌గారు లండన్ వచ్చిన రోజున- ఆ రోజుల్లో వారానికి రెండు రోజులు లండన్‌లో వుండేవారు. ఆయన్ని చూడటానికి వెళ్లాను. అవీ యివీ మాట్లాడిం తరవాత పుస్తక

ప్రచురణ- వ్యాపారం- తదితర సమస్యలు- నాకు సాహిత్యంతో సంబంధం వుందని రేనర్ చెప్పగా జ్ఞాపకం చేసుకొని, ఇండియాలో సాహిత్య పరిణామం గురించి శ్రద్ధగా అడిగారు. నాకు తోచిందేదో చెప్పాను. నేను ఒకటో రెండో ప్రశ్నలు బ్రిటిష్ సాహిత్య రంగంలో ప్రముఖ పాత్ర వహించిన బ్లూమ్స్ బరీ గ్రూపు గురించి అడిగాను. ఆయన నవ్వుతూ, 'కొన్నాళ్లు ఓపిక పట్టు, చాలా పుస్తకాలు వొస్తున్నాయి, దాపరికం లేకుండా ఉన్నవీ లేనివీ బహిరంగంగా రాయబోతున్నారు- అవన్నీ చదువు- చాలా వరకు నాకు స్వయంగా తెలుసు- అప్పుడు మాట్లాడదాం' అన్నారు. నవ్వుతూ నమస్కరించి సెలవు తీసుకుని లేచి వచ్చాను. ఆయన అన్నట్లుగానే ఓ డజను పుస్తకాలు మరో రెండు మూడు సంవత్సరాలలో అచ్చయినయి. అన్నీ చదివాను. అందులో లబ్ధ ప్రతిష్ఠులూ, ఒక నవశకానికి నాంది పల్కిన విశ్వవిఖ్యాతి గాంచిన రచయితల గురించిన కథలూ, గాథలూ యథాతథంగా ఉన్నాయి.

మన దేశానికి తిరిగి వచ్చిం తరవాత అలాంటి పుస్తకం ఒకటి వెనుకటి సాహిత్య రంగంమీద రాయించాలని కోరిక పుట్టింది. అలా కోరిక కోరికలానే మిగిలిపోయింది. చాలా రోజుల క్రితం ముద్దుకృష్ణ నాతోపాటు బెజవాడలో కొన్నాళ్లున్నప్పుడు ఆయన రాస్తానని రాయవలసిన పుస్తకం ఆయన రాయలేదు. అలాంటి కోరికకి యీషన్మాత్రం పోలిక లేకపోయినా మా తరం నాటి సాహిత్య రంగాన్ని రేఖా చిత్రంగా రూపొందించే యాదృచ్ఛికావకాశం నాకు లభించింది.

కవన కుతూహలం యిలా పుస్తక రూపంలో అవతరిస్తుందని నేను కలలో కూడా ఊహించి ఉండలేదు. ఆంధ్రప్రభ వారపత్రికలో ధారావాహికంగా నా రచనలు ప్రారంభమయి నప్పటినుంచీ దేశం నలుమూలలనుంచీ యిలాగే నా జ్ఞాపకాలను మరిన్ని రాయాలనీ, రాసింతర

వాత గ్రంథరూపంలో తీసుకు రావాలనీ యెందరో అభిమానులు ఉత్తరాలు రాస్తుండేవారు. అయితే ఒక సంవత్సరకాలం పాటు సాగించిన యీ రచన అసంపూర్ణమే ఒక విధంగా. నాకు అత్యంత గౌరవనీయులూ సన్నిహితులూ అయిన మరెందరో రచయితలు యింకా ఉన్నారు. శ్రీ విక్రమ దేవవర్మ, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, గుడిపాటి వెంకటచలం, చింతా దీక్షితులూ, తాపీ ధర్మారావు, కొడవటిగంటి కుటుంబరావు, చక్రపాణి, సోమనాథ వెల్లటూరు, గోపీచందు, శ్రీనివాస శిరోమణి, మల్లాది విశ్వనాథ కవిరాజు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మొక్కపాటి నరసింహ శాస్త్రి, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వరరావు.... యింకా యింకా యెందరో. వారందరూ ఒకానొక మహత్తరమైన తరానికి చెందినవారు. వారి గురించిన కథలూ గాథలూ తెలుసుకోవటం చారిత్రకంగా అవశ్యాంశం. తీరిక చిక్కితే రాయాలని కోరిక మాత్రం ఉంది.

నా జ్ఞాపకాలకు అక్షరరూపం కల్పించమని పదేపదే జ్ఞాపకం చేస్తూ వచ్చింది విశ్వనాథ శాస్త్రి. తరవాత 'కవన కుతూహలం' ప్రారంభించిన అల్పకాలంలోనే ఆ శీర్షిక బహుజనాదరణకు నోచుకున్నది.

'కవన కుతూహలం' ముందుగా సంకల్పించిన పథకం ప్రకారం రాయలేదు. అంచాత ఆయా మహనీయుల కాలక్రమాన్ని నేను పాటించలేదు. పత్రికలో యెలా ప్రకటితం అయినవో అలానే యథాతథంగా పుస్తక రూపంలో వేయించడానికి అంగీకరించాను.

ఈ పుస్తకాన్ని ప్రచురించక తప్పదని మిత్రులు పంతం పట్టారు. చివరికి నేను వొప్పుకోక తప్పలేదు. ప్రచురణలో సాధక బాధకాలను మిత్రులే చేపట్టారు. అక్కడా యిక్కడా అచ్చు తప్పులకు ఆస్కారం ఉండకపోదు.

ఒక మాట.

ఈ పుస్తకం అంతా నా జ్ఞాపకాలు ఆధారంగా పెట్టుకొని చేసిన రచన. అందువల్ల కాల, స్థల విషయాల్లో యెక్కడయినా కించిత్తు పొరపాటు జరిగి వుండవచ్చు. పాఠకులు అన్యధా భావించరని విశ్వసిస్తున్నాను.

7-4-1989

# రాచకొండ విశ్వనాథశాస్త్రికి

ఆశలే చివురించని శైశవాన
అక్షరాభ్యాస బాధామహాబ్ధిలోన
కాలిడినయంత నీవె నా కంటబడితి
వా విశాఖ నగర వీథులందు మొదల।

నన్ను జూచినయంత నీ కన్నులెంత
విరిసిపోయినవో నాడు విదితమయ్యె
లోన నీలోని నిద్రాణ వాణి నీకు
తెలియరాక మేల్కొని నన్ను పలుకరించె।

నాడు నీవెరుంగవు విశ్వనాథశాస్త్రి।
నేనెరుంగుదు నీ వర్ధమానపథము
తెలుగుసాహితీ జగతి ప్రదీప్తమవును
నీవలన ముందు కాలాన నీ కలాన।

నేటి తెలుగు సాహిత్య వాణిజ్యవీథి
కేవల నిరక్షరాస్యులు, కృతకవేత్త
లెంత పెత్తనమ్మును చలాయింపగలరొ
నాడెపుడయిన తలపోసినామ మనము?

స్వీయకృతి నొకదాని చేధరించి
పదవులకయి నానామంత్రి పదములంటు
పద్యకర్తలు సాహిత్యవర్తకులును
వేనవేలు త్రిలింగదేశాన నేడు।

మున్నె ప్రవచించె నందరి కన్న మాన్యు
డాద్యుడు పరమ పూజ్యుడారాధ్యసుకవి
అద్యతన కవితామ్నాయ సద్యశస్వి
విశ్వసూక్తిగ తిరుపతి వేంకటకవి:

"కవితవలన పున్నెముగూడఁ గలిగెనేని
కలుగనిండాప శక్యమ్ముగాదు; రామ
కోటివలెనుండు రచనలు కోవిదులకు
నచ్చపీ రహస్యమ్ము విన్నాణి యెరుగు."

మనది గాంగేయవంశమ్ము కనుక మనకు
కలరు దాయాదులెందరో కవులు కథకు
లందు శిష్టా ఉమామహే వందితుండు
కడకు శ్రీశ్రీ తదుపరి నగ్నమునికలడు.

తనకు తానై అజంతా యదార్థమెరిగి
అతివిశిష్ట మార్గస్రష్టయయ్యె। 'ముక్త
కవిత' కాతడె యుగకర్త, కలుగుగాక
అతని కవితాత్మ కేనాటికైన శాంతి।

కీర్తిశేషుడు శ్రీ రామకృష్ణశాస్త్రి
నర్మపదవేత్త రుక్మిణీనాథశాస్త్రి
నాకు చిననాటి నేస్తు లేనాటికైన
అమరజీవులు మన వాఙ్మయమ్ము నందు.

దైవమన్న నమ్మినవాడు తానె దైవ
మన్న వాడును పోయిరి నిన్న మొన్న
మరియు నన్నయపోయె వేమన్న పోయె
చాలు! మనకేల వ్యర్థవిచారమిపుడు?

దేహయాత్రయె నేకు సందేహమయ్యె
దేహమెల్ల రాజక బహిర్దేశమయ్యె
ప్రస్తుతాంధ్ర సారస్వత రంగమందు
వందిమాగధులే పేరు పొందగలరు!

అల విశాఖపురీసాగరాంబు తప్త
సైకతమ్ముల బహుదిన సాంధ్యవేళ
కలువరింతల మనసార కట్టుకొన్న
గాలిమేడలే మనకు దిక్కయ్యె నేడు!

ఎక్కడేని ఆశాద్యుతి యింత విరియు
నేని మన జీవితమ్ములకెంత తృప్తి?
ఆ తరుణ గవేషణమే యీ యావదాంధ్ర
మందు సత్కళానిష్ణాతు లాశపడగ!

ఆంధ్రజ్యోతి వారపత్రిక, 22-12-78

